# కాటమరాజు చరిత్ర

(క్రీ.శ. 1217 - 1282)



డాక్టర్. కనకబండి మోహన్ రావు

# కాటమరాజు చరిత్ర
(క్రీ.శ. 1217 - 1282)

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
ఆర్థిక సహాయంతో ప్రచురితం.


రచయిత :
**డాక్టర్. కనకబండి మోహన్ రావు,**
యం.ఏ., పిహెచ్. డి.
H.No. : 8-3-148,
వైరా రోడ్, ఖమ్మం - 507 001
ఆంధ్ర ప్రదేశ్.


40

కాటమరాజు చరిత్ర : క్రీ.శ. 1217 - 1282
రచయిత : డాక్టర్ కనకబండి మోహన్‌రావు

సుధా పబ్లికేషన్స్
H.No. : 8-3-148,
వైరా రోడ్, ఖమ్మం - 507 001

ప్రథమ ముద్రణ - 1997.

ప్రతులు : 1000

వెల : రూ॥ 40/-


కవర్ పేజి డిజైన్ : స్నేహ ఆర్ట్స్

ప్రతులకు : కె. సుగుణ యాదవ్
H.No. : 8-3-148,
వైరా రోడ్, ఖమ్మం - 507 001

ముద్రణ :
శ్రీదుర్గా కంప్యూటరైజ్డ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
కొత్తగూడెం - 507 101.

**అంకితం**

నా అభ్యుదయానికి అహరహము ఆరాటపడి
అవిశ్రాంతంగా శ్రమపడి దీర్ఘ నిద్రలోకి వెళ్లినా..

నిరంతరం

నా మదిలో మెదిలే పూజనీయ తల్లిదండ్రులు
**కనకబండి కొండయ్య, శాంతమ్మ గార్ల**
దివ్య స్మృతికి అంకితం.

ప్రొఫెసర్: నాయని కృష్ణకుమారి
ఎం.ఏ., పి హెచ్.డి.
వైస్ ఛాన్సలర్

పొట్టి శ్రీరాములు
తెలుగు విశ్వవిద్యాలయం
లలిత కళాక్షేత్రం,పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్ - 500 004 (ఆం.ప్ర.)

# ఆశీస్సులు

మోహన్‌రావు "కాటమరాజు చరిత్ర" చరిత్ర పరిశోధన గ్రంథ రూపంలో వెలువడుతున్నది. జానపద విజ్ఞాన పరిశోధన, అధ్యాపనల్లో అనేక దశాబ్దాలుగా పనిచేస్తున్న వారికే కాక తెలుగు ఎం.ఏ. పాఠ్యాంశాల్లో భాగంగా జానపద విజ్ఞానం చదువుకునే విద్యార్థులకు సైతం "కాటమరాజు కథ" కరతలామలకమే. అయితే గమనించవలసిన తేడా ఇక్కడ ఒకటుంది. భాషా సాహిత్య విద్యార్థులు కాటమరాజు కథను జానపదాంశాల దృష్టితో ఒక వీరగాథగా చదువుకుంటారు. కాని ఇది ప్రధానంగా "కాటమరాజు" కథ కాదు వాస్తవమని నిరూపించే గ్రంథం. కాటమరాజు, అతని సమకాలీన చరిత్రను గురించి కనకబండి మోహన్‌రావు పరిశోధన చేసి పి హెచ్.డి. పట్టా పుచ్చుకున్నారు. తన పరిశోధనలో కాటమరాజుకు సంబంధించి తేల్చిన ఆధారాలతో మోహన్‌రావు ఈ గ్రంథం వెలువరిస్తున్నారు. దీని ప్రచురణకు మా విశ్వ విద్యాలయం తరపున కొంత ఆర్థిక సహాయం అందించగలిగినందుకు సంతోషిస్తున్నాను.

కాటమరాజు 1217 నుంచి 1282 మధ్య కాలంలో జీవించి ఉన్నాడని ఆయనకు నెల్లూరి భూపాలుడైన నల్లసిద్ధికి మధ్య యరగడ్డపాడు యుద్ధం జరిగిందని, ఆ యుద్ధంలో నల్లసిద్ధి సైన్యాధిపతిగా ఖడ్గతిక్కన పాల్గొన్నాడని ఇటువంటి అనేక విషయాలను వాస్తవాలుగా పేర్కొంటూ మోహన్‌రావు తనకు లభించిన ఆధారాలను చూపించారు.

కాటమరాజు సమకాలీనాంధ్రదేశ చరిత్రను, ఆ కాలపు పాలనా విధానం, సైనిక పద్ధతి, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులను గురించి కూడా సవివరంగా పేర్కొనడం వల్ల ఇది సమగ్ర గ్రంథంగా రూపొందింది.

నేను ముందే పేర్కొన్నట్లు ఈ కాటమరాజు గ్రంథం అటు చరిత్రకు, జానపద విజ్ఞానానికి, ఇటు భాషా సాహిత్య విద్యార్థులకు, చరిత్ర విద్యార్థులకు మధ్య చక్కని అనుబంధాన్ని నెలకొల్పుతుంది. చరిత్ర పరిశోధకులకు, విద్యార్థులకు - జానపద పరిశోధకులకు, విద్యార్థులకు అవశ్య పఠనీయం అవుతుందని విశ్వసిస్తున్నాను.. రచయిత డాక్టర్ మోహన్‌రావును మనసారా అభినందిస్తున్నాను.

నాయని కృష్ణకుమారి

ప్రొఫెసర్ సరోజిని రేగాని
ఫార్మర్ డీన్, ఫాకల్టీ ఆఫ్ సోషల్ సైన్సెస్,
ఫార్మర్ హెడ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ హిస్టరీ
ఉస్మానియా యూనివర్శిటీ
హైదరాబాద్. (ఆం.ప్ర.)

# పరిచయము

డా॥ కనకబండి మోహన్‌రావు ఎంతో శ్రమకోర్చి ఆంధ్రదేశమంతటా పర్యటించి, కాటమరాజుకు సంబంధించిన తాళపత్ర గ్రంథాలను, శాసనాలను సేకరించి "కాటమరాజు చరిత్ర" అను చారిత్రక గ్రంథమును రచించారు. ఇది ప్రామాణిక గ్రంథము కాబట్టి ఉస్మానియా యూనివర్శిటీ డా॥ మోహన్‌రావుకు పి హెచ్. డి. డిగ్రీని ప్రదానము చేశారు.

వీర గాథల్లో తరచూ వినవస్తున్న కాటమరాజు అనే వ్యక్తి అసలు ఉండేవాడా? ఉన్నట్లయితే, ఆ విషయము చారిత్రకంగా నిరూపించగలమా అను ప్రశ్న ఉత్పన్నమైన నేపథ్యంలో కాటమరాజు కథ కట్టుకథ కాదు, కాటమరాజు అనే వ్యక్తి నిజంగా ఉండేవాడు, యరగడ్డపాడు యుద్ధం నిజంగా జరిగింది అని మోహన్‌రావు నిరూపించగలిగారు.

ఆంధ్రదేశంలో వీధిగాయకులు వీరగాథలను వినిపించు సాంప్రదాయము ప్రాచీన కాలమునుండి ఉన్నది. ముఖ్యంగా పల్లెసీమల్లో ప్రజలు ఈ పాటలను చాలా ఆసక్తిగా వింటారు. సినిమాలు, టి.వి.లు రాకపూర్వము ఈ వీరగాథలు వినుట ప్రధానకాలక్షేపాల్లో ఒకటి. తెలంగాణాలో ఒగ్గుపాటలు, రుక్మాంగధర చరిత్ర, బాలనాగమ్మ కథ, కొమరెల్లి మల్లయ్య కథ, సమ్మక్క కథ, వీర కొమరయ్య కథ - మనకు తరచూ వినవస్తూ ఉంటాయి. ఆంధ్రప్రాంతములో సారంగంధర చరిత్ర, కామమ్మ కథ - వీర గాథల్లో పల్నాటి యుద్ధం, కాటమరాజు కథ, బొబ్బిలియుద్ధము గురించి పాడుతారు.

ఆంధ్రదేశములో మధ్యయుగమునాటి మండలాధీశ్వరులు, చిన్న చిన్న విషయాలలో మాట పట్టింపులు పెరిగి తమలో తాము తరచూ యుద్ధాలకు తలపడేవారు. అటువంటి యుద్ధమే యరగడ్డపాడు యుద్ధం. యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1282లో జరిగిందని మోహన్‌రావు అభిప్రాయపడుతున్నాడు. ఈ యుద్ధం 13వ శతాబ్దంలో జరిగింది. కాటమరాజు అనే యాదవరాజుకు, నెల్లూరి భూపాలుడైన నల్లసిద్ధికి పుల్లరి విషయములో అభిప్రాయ బేధాలు వచ్చి యుద్ధానికి కారణమయ్యాయి. నల్లసిద్ధి భూపాలుని ముఖ్య సైన్యాధిపతిగా ఖడ్గ తిక్కన ఈ యుద్ధంలో పాల్గొన్నాడు.

యాదవులు అసలు ఆంధ్రదేశములో పరిపాలించారా అనే ప్రశ్న ఉత్పన్నమైనది. మూడవ రాష్ట్రకూట కృష్ణుడు తన ఎల్లోరా శాసనంలో తాను యాదవుడనని చాటుకున్నాడు. మధ్యప్రదేశ్ గజటీర్‌లు, ప్రాచీన కాలం నుండి మధ్యయుగం వరకూ మధ్యదేశ ప్రాంతాలను హైహయవంశ యాదవులు, జబల్‌పూర్, విదర్భ ప్రాంతాలను చేది. శేణేయ యాదవులు పరిపాలించారని తెలుపుచున్నవి.

ఈ ప్రాంతాల నుండి కొన్ని యాదవ వంశాలు ముఖ్యంగా హైహయులు ఆంధ్రదేశానికి వలస వచ్చి పల్నాడు, అద్దంకి, అమలాపురం, రాజోలు తాలూకాల్లో మాండలీకులుగా పరిపాలించారు. పల్నాటి యుద్ధము క్రీ.శ. 1176 - 1182 మధ్యన జరిగినది. దీని వలన మనకు పల్నాటి హైహయ

రాజుల కుటుంబ కలహాలు, బ్రహ్మనాయుని సంఘ సంస్కరణోద్యమము తెలియవస్తున్నది.

కాటమరాజు పూర్వీకులు యలమంచిలి రాజులైనప్పటికీ కాటమరాజు కనిగిరిని తన స్థావరంగా ఏర్పరచుకున్నాడు. వర్షాభావము వలన కనిగిరి వదలి తన పశుసంపదను రక్షించుకొనుటకని నెల్లూరు సరిహద్దులకు వెళ్ళి నెల్లూరి రాజైన నల్లసిద్ధితో పుల్లరి ఒప్పందం కుదుర్చుకున్నాడు. చివరకు పుల్లరి విషయములో అభిప్రాయ బేధాలు వచ్చి నల్లసిద్ధితో యరగడ్డపాడు యుద్ధం చేయవలసి వచ్చింది. ఈ యుద్ధంలో నల్లసిద్ధి భూపాలుని ముఖ్య సైన్యాధిపతి ఖడ్గతిక్కన, మరియు నల్లసిద్ధి కూడా మరణించారు. ఈ యుద్ధం తరువాత కాటమరాజు పాలన మనకు ఎక్కడా కనపడదు. అందుకని, యుద్ధంలో తగిలిన గాయాల వలన కాటమరాజు కూడా మరణించాడని మనము భావింపవచ్చు. ఆనాటి రాజులు తాము సూర్య వంశీయులమని చంద్ర వంశీయులమని చెప్పుకునేవారు. అదే విధంగా కాటమరాజు పూర్వీకులు తమ వంశానికి మూల పురుషుడు శ్రీకృష్ణుని మనుమడైన వజ్రుడని చెప్పుచున్నారు.

మధ్యయుగంలో ముఖ్యంగా కాకతీయుల కాలం నుండి దేశ ఆర్థిక వ్యవస్థ వ్యవసాయంపై ఆధారపడి ఉండేది. అటువంటి పరిస్థితులలో కాటమరాజు తన పశుసంపదను కాపాడుకొనుటకు తన స్థావరమైన కనిగిరిని వదలి నెల్లూరికి వెళ్ళాడు. అంటే ఈ యరగడ్డపాడు యుద్ధం పశుసంపదకు ప్రాధాన్యమిచ్చే ఆర్థిక విధానానికి (Pastoral Economy) చిహ్నంగా ఆంధ్రదేశంలో జరిగిన చివరి యుద్ధంగా మనము భావించవచ్చు.

కాకతీయులకు, సరిహద్దు రాష్ట్రపాలకులైన దేవగిరి యాదవులకు, కంపిలి యాదవ రాయల మధ్య తరచూ యుద్ధాలు జరుగుతూండేవి. అందుకని కాకతీయులు ఎక్కువగా రెడ్డి, వెలమ నాయకులను పోషించారు. కాకతీయుల పతనానంతరము సంగమ వంశీయులైన హరిహర రాయలు, బుక్కరాయలు, ఒకప్పుడు కాకతీయ మండలాధిపతులుగా ఉన్నప్పటికీ, విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించుటకై తమ బంధువులైన కంపిలి యాదవరాయల సీమనుండి ప్రయత్నం సాగించారు.

... ...మైనప్పటికీ, డా॥ మోహనరావు తన కాటమరాజు చరిత్రలో ఆనాటి యుద్ధ నీతిని, నాటి సాంఘిక ఆచారాలను, సామాజిక పరిస్థితులను చక్కగా వివరించారు. యుద్ధం ప్రారంభం ముందు ఇరువైపుల వారు యుద్ధ నివారణకై రాయబారుల ద్వారా ప్రయత్నం చేసేవారు. ఈ రాయబారులు సాధారణంగా బ్రాహ్మణులై ఉండేవారు. ఆనాటి రాజులు, ప్రజలు కూడా దైవభక్తి, పాపభీతి కలిగి ఉండేవారు. బ్రాహ్మణుల ఎడల భక్తి శ్రద్ధలు కలిగి వారికి అగ్రహారాలు, మాన్యాలు, ధనము దానాలుగా ఇచ్చేవారు. బ్రాహ్మణులు, మంత్రులుగా అవసరాన్నిబట్టి బ్రహ్మ క్షత్రియులుగా యుద్ధాలు చేసేవారు. వీరు సర్వ సాధారణంగా వెలనాటి ఆరువేల నియోగులై ఉండేవారు. యరగడ్డపాడు యుద్ధంలో ఖడ్గతిక్కన కాటమరాజుపై యుద్ధానికి వెళ్లినపుడు కాటమరాజు సైన్యాధిపతి చల్లపిన్నమనీడు యుద్ధంలో తాను ఖడ్గతిక్కనను చంపినట్లయితే బ్రహ్మహత్యా పాతకము తనకు చుట్టుకుంటుందని సంశయిస్తాడు. అందుకని కాటమరాజు సైన్యాధికారి బ్రహ్మరుద్రయ్య అనే బ్రాహ్మణుడు ఖడ్గతిక్కనను యుద్ధంలో

ఎదుర్కొని సంహరిస్తాడు.

ప్రజల్లో జాతకాలంటే, శకునాలంటే చాలా నమ్మకం ఉండేది. దీనికి నిదర్శనము కాటమరాజు చెల్లెలు పాపనూక దయనీయ గాథ. రాచకుటుంబానికి చెందిన స్త్రీలు సతీసహగమనం పాటించేవారు. సహగమనవాటికకు వారు అలంకరించుకొని అట్టహాసంగా వెళ్ళేవారు. యుద్ధానికి వెళ్ళేముందు రాజులు ఆభరణాలను చక్కగా అలంకరించుకొని ఖడ్గము చిరుకత్తి ధరించి కర్పూర తాంబూలము సేవిస్తూ వెళ్ళేవాడు. రాజు కవచము, శిరానికి ఉక్కు అల్లిక ధరించి అశ్వారూఢుడై లేక గజారోహుడై వెళ్ళేవాడు. సేనాధిపతులు కూడా ఈ విధంగా యుద్ధానికి వెళ్ళేవారు. యుద్ధం ప్రారంభించేముందు రాజు తన సైనికులను ఉత్సాహపరచడానికి వారికి ధనము అభరణాలు ఇచ్చేవాడు.

యుద్ధంలో గజాలు, అశ్వాలు ఉపయోగించినప్పటికీ రాజులు ముఖ్యంగా కాల్బలంపై ఆధారపడేవారు. కాల్బలానికి కవచాలు ఉండేవి కావు. వీరు కత్తులు, కటారులు, ఈటెలు, కట్టెలతో యుద్ధం చేసేవారు. యుద్ధంలో మల్లయుద్ధం కూడా ఒక అంతర్భాగము ఇదిగాక బోయదళాన్ని, గోసంగుల దళాన్ని (దళితులు - హరిజనులు) కూడా ఉండేవారు. శిక్షణ యిచ్చిన ఏనుగులను, ఎద్దులను కూడా యుద్ధంలో ఉపయోగించేవారు.

గ్రామాలలో దేవాలయాల వద్ద రచ్చబండ కాడ గ్రామాధికారులు గ్రా మసమస్యలను పరిష్కరించేవారు. అవి కాక మల్లయుద్ధ నైపుణ్యాన్ని ప్రదర్శించుటకు దానిని తిలకించుటకు ముష్టిబండలు ఉండేవి. ఎంత చిన్న రాజైనప్పటికి తమ వద్దకు శరణార్థులై వచ్చిన వారిని తమ ప్రాణాలను లెక్క చేయకుండా వారికి ఆశ్రయమిచ్చేవారు. కాటమరాజు పినతండ్రి పోలురాజు జంగాలను వెట్టిచాకిరీ నుండి తప్పించుటకు చోడ రాజుతో యుద్ధం చేసి మరణించాడు.

మధ్యయుగములో మండలాధీశ్వరులలో కుల బేధాలు లేవు. కాటమరాజు పినతండ్రి భార్య సిరిదేవి రెడ్డిరాజుల బిడ్డ. కాటమరాజు పినతల్లి (తల్లి చెల్లెలు) చల్లభూపతిని వివాహమాడింది. యాదవ క్షత్రియుడైన పల్నాటి అనుగు రాజు, రెండవ గొంకరాజు పుత్రికను వివాహమాడినాడు. నన్నె చోడుడు తన తల్లి శ్రీసతి హైహయ వంశానుజ అని చెప్పుకున్నాడు. మరియొక విశేషము మనకు ఈ మధ్య యుగంలో కన్పిస్తున్నది. కాటమరాజు పినతల్లి సిరిదేవి బీర్నీడు అనే దళితున్ని తన స్వంత కుమారునిగా పెంచింది. పల్నాటి యుద్ధంలో కన్నమనీడు (దళితుడు) బాలచంద్రుని అంగరక్షకుడు. రాజు సైన్యంలో గోసంగి దళాలు కూడా ఉండేవి. అమరావతీ శాసనంలో చర్మకారుల శాసనం ఒకటి ఉన్నది. వీటిని బట్టి అంటరాని తనము మధ్యయుగంలో ఏమేరకు కఠినంగా అమలుపరిచేవారో పరిశీలించవలసి వస్తున్నది.

ఆనాటి ప్రజలు ధరించే అభరణాలు, వారి ఆటలు, వినోదాలు, తదితర ఆచారాలు, పండుగలను కూడా డా॥ మోహన్‌రావు తన గ్రంథంలో మనోహరంగా చిత్రించారు. ఈ కాటమరాజు చరిత్ర మధ్యయుగ ఆంధ్రదేశ సాంఘిక చరిత్రావగాహనకు, మనకు తోడ్పడుతున్నది. ఈ గ్రంథం తప్పక ప్రజాదరణ పొందుతుందని ఆశిస్తున్నాను.

– సరోజిని రేగాణి

6-1-275/2
పద్మారావు నగర్
సికింద్రాబాద్ - 500 025 (ఆం.ప్ర.)

# కృతజ్ఞతలు

కాటరాజు చరిత్ర రచనకు ప్రోత్సహించి సహాయ సహకారాలను అందించిన మహనీయులకు, సంస్థలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ప్రొఫెసర్. సరోజిని రేగాణి డీన్ ఫాకల్టీ ఆఫ్ సోషల్ సైన్సెస్, హెడ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ హిస్టరీ (రిటైర్డ్) ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాద్ వారి పర్యవేక్షణలో "ది హిస్టరీ ఆఫ్ కాటమరాజ అండ్ హిజ్ టైమ్స్ - బేస్డ్ ఆన్ పామ్‌లీఫ్ మాన్యు స్క్రిప్ట్" సిద్ధాంత గ్రంథాన్ని రచించి ఉస్మానియా విశ్వ విద్యాలయం నుండి పి హెచ్.డి. (చరిత్ర) డిగ్రీ 1991లో పొందాను. ప్రొఫెసర్ రేగాణి సద్విమర్శలు, చక్కని సలహాలు అందించి చరిత్ర రచనలో ఆసక్తిని కలిగించారు. వారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ప్రొఫెసర్ వై. వైకుంఠం, వైస్ ఛాన్సలర్, కాకతీయ యూనివర్శిటీ వారు నాయందు ఆదరాభిమానాలు చూపించి పరిశోధనా సమయంలో ఎంతో ప్రోత్సాహాన్ని కలిగించారు. వారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు. ప్రొఫెసర్ నాయని కృష్ణకుమారి, వైస్ ఛాన్సలర్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు ఆర్థిక సహాయాన్ని అందించుటలో సహృదయతతో సహకరించినారు, వారికి నా ధన్యవాదములు. డా॥.టి. వెంకటేశ్వరరావు, ప్రిన్సిపాల్, (రిటైర్డ్) ఎస్.వి. కాలేజి, విద్యానగర్, హైదరాబాద్ - గంగుల బాబు, సీనియర్ తెలుగు పండిత్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, సత్తుపల్లి - వారు పరిశోధనా కాలంలో నాకు అండదండలుగా నిలచి ముందుకు నడిపించారు. వారికి నా వందనాలు.

డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రి, డా॥ ఎన్. ముకుందరావు, ఎ. వెంకట నారాయణ యాదవ్, ఎన్. హరిప్రసాద్ యాదవ్, కె. లక్ష్మీనారాయణ యాదవ్, కె. శంకర్ యాదవ్, సంగంరెడ్డి సత్యనారాయణ, బోళ్ళ వెంకటేశ్వర్లు, ఎ. చక్రపాణి, కె. వెంకటేశ్వరరావ్ యాదవ్, జయ వీరరాజు, నన్నెంతగానో అభిమానించి, ప్రోత్సహించారు. వారికి నా ధన్యవాదాలు.

ఆరాధ్యుల పిచ్చయ్య యాదవ్ ; యడవూరు - యల్లావుల కోటేశ్వరరావు యాదవ్ ; హైదరాబాద్ - బొడ్డుబోయిన గంగయ్య ; వెంగళాపురం - కోటయ్య యాదవ్ ; ఒంగోలు - సతాకోటి గోపాల్‌దాస్ ; మొచ్చర్ల - రాసూరి దశరథం, శేషగిరిరావు, కొమ్ముల వారు; ముష్టిబండ - కనకబండి రంగయ్య, నూక మదారయ్య ; దనియాల గూడెం - కనక్షబండి హనుమంతరావు, సత్యనారాయణ ; భైరవుని పల్లి - మోడి చిన పాపయ్య, మోడి గంగయ్య ; యర్రబాలెం - పూజారి లక్ష్మయ్య ; గంగదొనకొండ - మద్దెబోయిన ప్రభాకర్ ; కనిగిరి - సాదం కాశయ్య ; తోకపల్లి - వారు కాటమరాజు చరిత్రకు సంబంధించిన తాళపత్ర గ్రంథాలు, ముద్రిత గ్రంథాలు అందించి నాకు ఎనలేని ఉత్సాహాన్ని కలిగించారు. వారందరికి నా హృదయపూర్వక నమఃసుమాంజలులు.

నా తల్లిదండ్రులు కొండయ్య - శాంతమ్మ కాటమరాజు చరిత్రకు సంబంధించిన కొన్ని తాళపత్ర గ్రంథాలు నాకు అందించి ఆశీర్వదించారు. వారి ఋణం తీర్చుకోలేనిది. నన్ను ప్రేమాభిమానాలతో చూచిన నా దత్తత తల్లిదండ్రులు వీరయ్య, నర్సమ్మలకు నా హృదయపూర్వక

AVIII

కృతజ్ఞతలు. ఎల్లప్పుడు నా క్షేమాన్ని కోరే తోబుట్టువులు, బంధువులు, మిత్రులందరికి నా హృదయపూర్వక అభినందనలు. నా పరిశోధనా సమయంలో ఎనలేని సేవలు చేసిన నా శ్రీమతి చుక్కమ్మకు హృదయపూర్వకమైన అభినందనలు.

కాటమరాజు చరిత్ర పరిశోధనకు ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రిసెర్చ్, న్యూఢిల్లీ వారు కాంటిన్‌జెన్సీ గ్రాంట్ ఇచ్చి ప్రోత్సహించినందుకు వారికి నా శుభాభివందనములు. స్టేట్ ఆర్కైవ్స్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియెంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ - రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ స్టేట్ సెంట్రల్ లైబ్రరీ, డైరెక్టర్ ఆఫ్ ఆర్కియాలజీ అండ్ మ్యూజియం - ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాద్ - మద్రాస్ యూనివర్శిటీ లైబ్రరీ ; మద్రాస్, శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ ఓరియెంటల్ ఇన్‌స్టిట్యూట్ ; తిరుపతి, మొదలగు గ్రంథాలయాలు సందర్శించినపుడు నా పరిశోధనకు కావలసిన సమాచారాన్ని సేకరించడానికి సహకరించిన అధికారులు, అనధికారులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. సహృదయతతో సలహాలందించిన ఎం.ఎ.సూర్యనారాయణ మూర్తి, ప్రిన్స్‌పాల్ అండ్ స్టాఫ్ ; ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పాల్వంచ వారికి నా ధన్యవాదాలు.

పరిశోధనా నిమిత్తం ఆయా ప్రాంతాలకు వెళ్ళినపుడు గంగదొనకొండ, గుండంచర్ల, అర్ధవీడు, పంచలింగాలకొండ, గుండ్లపాలెం, కనిగిరి ప్రాంతాలలోని ప్రజలు మాకు అన్ని రకాలుగా సౌకర్యాలు కల్పించి మా వెంట తిరిగి శాసనాలు, శిలా విగ్రహాలు ఉన్న ప్రాంతాలు చూపిన ఎందరో మహానుభావులు - అందరికి వందనములు. ఎంతో ఓపికతో గంటల తరబడి ఏకాగ్రతతో శుద్ధ ప్రతిని వ్రాసిన నా పుత్రుడు కృష్ణయాదవ్‌ను హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

ప్రచురణ సమయంలో అత్యంత శ్రద్ధ చూపించి తగు సలహాలనిచ్చిన బి. రామచంద్రయ్య, అడ్వకేట్ - కాటమరాజు ముఖచిత్రాన్ని చక్కగా వేసిన ఆర్టిస్ట్ డేవిడ్, పుస్తకాన్ని అందంగా అచ్చువేసి సకాలంలో అందించిన శ్రీదుర్గా కంప్యూటరైజ్డ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ ప్రొప్రయిటర్ ఆవుల కృష్ణ వారి సిబ్బంది, కొత్తగూడెం వారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

ఎంత జాగ్రత్తగా ప్రూఫ్ చూసినప్పటికీ కొన్ని అచ్చు తప్పులను నివారించలేక పోయాము. అందువలన తప్పు ఒప్పుల పట్టిక ఇవ్వడం జరిగింది. కాటమరాజు చరిత్ర ఆధారాలు ఎక్కువగా జానపద సాహిత్యంలో ఉండటం వలన చాలా అతిశయోక్తులకు అవకాశం ఉండటం వలన చరిత్ర రచనా సమయంలో అలాంటి అతిశయోక్తులను విస్మరించి వాస్తవాలనుకున్న విషయాలను ఆధారంగా చేసుకుని ఈ రచన సాగించడం జరిగినది. పరిశోధన - పరిగేరటం లాంటాది. కాటమరాజు చరిత్ర రచనలో నా దృష్టికి రాని ముఖ్యమైన విషయాలను విజ్ఞులు తెలియచేస్తే రెండవ ముద్రణలో సరిచేసి ప్రచురించగలనని సవినయంగా విన్నవించుకుంటున్నాను.

– కనకబండి మోహన్‌రావు

# విషయ సూచిక


| | | పుట |
|---|---|---|
| **పీఠిక** | : | 1 - 8 |
| Section - 1 | | |
| స్వభావము - పరిశీలన | : | 1 |
| Section - 2 | | |
| ఆధారాలు | : | 2 |
| 1. తాళపత్ర గ్రంథాలు | : | 2 |
| 2. కాగితపు ప్రతులు | : | 5 |
| 3. కైఫీయతులు | : | 5 |
| 4. శాసనాలు | : | 6 |
| 5. నాణాలు | : | 6 |
| 6. శిథిల భవనాలు | : | 7 |
| **రాజకీయ చరిత్ర** | : | 9 - 20 |
| 1. తూర్పు చాళుక్యులు | : | 9 |
| 2. యలమంచిలి చాళుక్యులు | : | 10 |
| 3. కాకతీయులు | : | 11 |
| 4. నెల్లూరు తెలుగు చోడులు | : | 13 |
| 5. తూర్పు గాంగులు | : | 16 |
| **బడుగుల వంశం పుట్టు పూర్వోత్తరాలు** | : | 21 - 24 |
| కాటమరాజు వంశావళి | : | 24 |
| **కాటమరాజు పూర్వీకులు** | : | 25 - 46 |
| 1. ఆవుల వలురాజు | : | 25 |
| 2. పెద్దిరాజు | : | 30 |
| 3. సింహాద్రి రాజు | : | 34 |
| 4. యరనూకరాజు | : | 34 |
| 5. నలనూకరాజు | : | 36 |
| 6. పోలురాజు | : | 36 |
| **యాదవ ప్రముఖులు** | : | 47 - 59 |
| 1. అయితమ రాజు | : | 47 |
| 2. కరియావుల రాజు | : | 52 |
| **కాటమరాజు : క్రీ.శ. 1217-1282** | : | 60 - 69 |


AX

కాటమరాజు తొలి జీవిత విశేషాలు : 60
కాటమరాజు వివాహం : 61
కాటమరాజు పట్టాభిషేకం : 62
కాటమరాజు పేర్లు - బిరుదులు : 62
శ్రీశైలంలో పశువుల మంద : 62
ఆవుల దొడ్డి కుడుపు : 65
పాకనాడు ప్రయాణం : 65

**యరగడ్డపాడు యుద్ధం : క్రీ.శ. 1282.** : 70 - 88
యుద్ధ కారణాలు : 70
యరగడ్డపాడు యుద్ధం - ముఖ్య ఘట్టాలు : 74
యరగడ్డపాడు యుద్ధం కాల నిర్ణయం : 79

**కాటమరాజు చారిత్రకత** : 89 - 94

**పాలనా విధానము - సైనిక పద్ధతి** : 95 - 99

**సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులు** : 100 - 114

**అనుబంధము - I** : 115 - 120
గుండ్లపాలెం శిలాశాసనం

**అనుబంధము - II** : 121 - 122
గంగదొనకొండ దేవాలయం శాసనాలు

**అనుబంధము - III** : 123
సేకరించిన తాళపత్ర గ్రంథములు

**అనుబంధము - IV** : 124 - 142
జన్నివాడ కథ (అముద్రితము)

**అనుబంధము - V** : 143 - 168
శిల్పాలు - చిత్రపటాలు

**గ్రంథముల పట్టిక** : 169 - 179

# పీఠిక

## (Section - I)

## స్వభావము - పరిశీలన

మధ్య ఆంధ్రదేశం, 12వ, 13వ శతాబ్దాల కాలం నాటి కాటమరాజు చరిత్రను తాళపత్ర గ్రంథాల ఆధారంగా రచించడానికి ఈ పరిశోధనా గ్రంథంలో ప్రయత్నం చేయడం జరిగింది.

ఈ పరిశోధనకు ముఖ్యంగా కాటమరాజు చరిత్రకు సంబంధించిన తాళపత్ర గ్రంథాలు, ప్రచురించినవి, ప్రచురింపబడనివి నిశితంగా పరిశీలించవలసి వచ్చింది. ఈ తాళపత్ర గ్రంథాలు కాటమరాజు చరిత్రతో పాటు మధ్యయుగం నాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను తెలియజేస్తున్నాయి. కాటమరాజు చరిత్రను తెలియజేసే తాళపత్ర గ్రంథాలు చాలా ఉండటం, అందులో అన్ని విషయాలు వివరించడం వలన వాటినే ప్రధానాధారాలుగా స్వీకరించి, పరిశోధన చేయటం జరిగింది. ఈ తాళపత్ర గ్రంథాలు, కాటమరాజు తాత, తండ్రుల పాలనా విషయాలు, యుద్ధాలు, ఎన్నింటినో వివరించుతున్నప్పటికి ఎక్కువగా కాటమరాజుకు సంబంధించిన విషయాలపై దృష్టి కేంద్రీకరించి కాటమరాజు చరిత్ర వరకు పరిమితం కావలసి వచ్చింది.

తాళపత్ర గ్రంథాలలోని విషయాలతో సరిపోయే శాసనాలు కూడా ఉన్నవి. ఈ పరిశోధన మరింత పటిష్టంగా ఉండటంకోసం, శాసనాలు, సమకాలీన సాహిత్యం తదితర ఆధారాలను కూడా పరిగణలోకి తీసుకోవటం జరిగింది.

ఆంధ్రదేశం, 12వ, 13వ శతాబ్దాలలోని చిన్న రాజ వంశాల చరిత్రను కొంతమంది పరిశోధకులు ప్రయత్నం చేశారు అయినప్పటికి వారు అన్ని రాజవంశాల చరిత్రలు పూర్తిగా వ్రాయలేదు. అందువలన ఈ పరిశోధనా గ్రంథంలో యాదవుల చరిత్రను, సమాజానికి వారందించిన సేవలను విపులంగా మొదటిసారిగా చర్చించే అవకాశం కలిగింది. ఆంధ్రదేశాన్ని మధ్యయుగంలో యాదవులు, యలమంచి, అద్దంకి, పానగల్, దొనకొండ, చంద్రగిరి ప్రాంతాలను రాజధానులుగా చేసికొని చిన్నచిన్న రాజ్యాలను పాలించి, శరణు అన్నవారిని రక్షించడానికి, తమ ప్రాణాలను పణంగా పెట్టి న్యాయపాలన కోసం పాటుపడ్డారు.

ఈ పరిశోధన వలన కాటమరాజు రాజకీయ చరిత్రే కాక, అతని సమకాలీన రాజకీయ చరిత్ర, ఆనాటి సాంఘిక, ఆర్థిక, మత పరిస్థితులు కూడా తెలుస్తున్నాయి.

వేటూరి ప్రభాకర శాస్త్రి పరిష్కరించిన కాటమరాజు కథలు - గ్రంథానికి పీఠిక వ్రాస్తూ మల్లంపల్లి సోమశేఖర శర్మ పుల్లరి ఒప్పందం, యరగడ్డపాడు యుద్ధానికి దారితీసిన కారణాలు, ఈ గ్రంథంలో సరిగా వివరింపబడలేదని, ఇది అసంపూర్ణంగా ఉందని అన్నారు. అందువలన కాటమరాజు చరిత్రకు సంబంధించి వ్రాసిన తాళపత్ర గ్రంథాలను సేకరించి పరిశోధన చేయాలనే పట్టుదల కలిగింది.

(Section - II)

## ఆధారాలు :

కాటమరాజు చరిత్ర రచనకు సాహిత్యము, శాసనాలు, ముఖ్యమైన ఆధారాలు, తాళపత్ర గ్రంథాలు, కైఫీయతులు, జానపద గాథలు, కట్టడాలు మొదలైన ఆధారాలు చాలా లభిస్తున్నాయి.

ఆంధ్రదేశంలోని కొమ్ముల వారు తాళపత్ర గ్రంథాలలోని కాటమరాజు చరిత్రను రసవత్తరంగా గానంచేస్తూ గ్రామాలలో ప్రచారాన్ని కొనసాగిస్తున్నారు.

కేతన, శ్రీనాథుడు, గంగుల పినయల్లయ్య, కనకబండి గట్టయ్య, పదరుప మద్దులేటి కవి, కట్టెబోయిన మారయ్య, కంగళాపురి వెంకటాద్రి, జరుగుపల్లి చెన్నయ్య మొదలైన కవులు కాటమరాజు చరిత్రను తాళపత్రాలపై లిఖించారు.

గంగదొనకొండ, పంచలింగాల కొండ, గుండ్లపాలెంలోని శాసనాలు, కాటమరాజు చరిత్రను తెలియజేస్తున్నాయి. ఇందులోని అంశాలు తాళపత్ర గ్రంథాలలోని విషయం చాలావరకు ఒకేవిధంగా ఉన్నాయి. యలమంచిలి, అర్ధవీడు, పంచలింగాలకొండ, గంగదొనకొండ, గుండంచర్ల, పాపఘటం మొదలగు ప్రాంతాలలోని కట్టడాలు, శిల్పాలు కాటమరాజు చరిత్రను తెలుసుకోవటానికి ఎంతగానో తోడ్పడుతున్నాయి.

## 1. తాళపత్ర గ్రంథాలు :

పెద్దిరాజు కథ, జన్నివాడ కథ, భక్తిరన్న కథ, పాపనూక కథ, భట్టురాయబారము, యరగడ్డపాటి పోట్లాట, పోలురాజు యుద్ధం, బల్లికురువ పోట్లాట, ఆవుల వలురాజు చరిత్ర, కాటమరాజు కథ, అగుమంచి కథ మొదలగు తాళపత్ర గ్రంథాలు కాటమరాజు చరిత్రను వివరంగా తెలుపుతున్నాయి. ఈ గ్రంథాలలోని చారిత్రిక అంశాలు -కైఫీయతులు, చాటుపద్యాలు శాసనాలలోని కాటమరాజు చరిత్రకు సంబంధించిన అంశాలతో సరిపోతున్నాయి.

## పెద్దిరాజు కథ :

ఈ తాళ పత్ర గ్రంథంలో రచయిత అర్లపెంట యుద్ధాన్ని వర్ణించాడు. కాటమరాజు తండ్రి పెద్దిరాజు, వాలికేతువ రాజుతో యుద్ధం చేస్తూ మరణించాడు. కాటమరాజు యాదవ సైన్యంతో అర్లపెంటపై దాడిచేసి వాలికేతువరాజును సంహరించాడు. కాటమరాజు తల్లి పెద్దమ్మ తన భర్త పెద్దిరాజుతో సహగమనం చేస్తుంది. సహగమన విధానాన్ని రచయిత చక్కగా వివరించాడు. ఆంధ్రదేశంలో 13వ శతాబ్దం నాటి సాంఘిక పరిస్థితులు, వస్త్రధారణ, ఆభరణాలు, కలలు వాటి ఫలితాలు యుద్ధనీతులు మొదలగు విషయాలు సవివరంగా వివరింపబడినవి.

## దక్షిణ కాండ (జన్నివాడ కథ) :

కనకబండి గట్టయ్య ఈ తాళపత్ర గ్రంథాన్ని రచించాడు. దీనిని జన్నివాడ కథ, చదరంగం కథ, దక్షిణాది ఆవుల మేపు - పేర్లతో కూడా పిలుస్తారు. గోలుకొండ కవుల సంచికలో కనకబండి గట్టయ్యను ప్రముఖమైన కవిగా తెలిపారు. ఈయన నిజాం రాష్ట్రంలోని నేలకొండపల్లి

నివాసి. ప్రస్తుతం ఈ గ్రామం ఖమ్మం జిల్లాలో ఉంది. గట్టయ్య కవి హరిశ్చంద్ర చరిత్ర, కాటమరాజు చరిత్ర, పోలురాజు యుద్ధం, కంసుని కథ మొదలైన గ్రంథాలను తాళపత్రాలపై వ్రాశాడు. దక్షిణకాండ - తాళపత్ర గ్రంథం చాలా ముఖ్యమైనది. ఇందులో మొదటి పదిహేను తాళపత్రాలలో కాటమరాజుకు నెల్లూరు పాలకుడైన నల్లసిద్ధికి మధ్య కుదిరిన "పుల్లరి" ఒప్పందానికి చెందిన విషయం సమగ్రంగా తెలియజేయబడింది. ఈ పుల్లరి ఒప్పందాన్ని ఖడ్గ తిక్కన స్వహస్తంతో వ్రాశాడు. వృష సంవత్సర కార్తీక శుద్ధ విదియ గురువారం నుండి విజయ సంవత్సర చైత్ర బహుళ పంచమి శుక్రవారం వరకు (క్రీ.శ. 16-10-1281 నుండి 27-3-1293), పన్నెండు సంవత్సరాలు పుల్లరి ఒప్పందం అమలులోనుండునట్లు ఒప్పందం కుదిరింది.

ఈ తాళపత్ర గ్రంథంలో యాదవ వంశము పుట్టుక, నెల్లూరు పట్టణం, పశువులు మేసే విధానము, వరిపంట లోని రకాలు, నల్లసిద్ది రాజు ఆస్థానము, కుందమాదేవి, నల్లసిద్ది రెండవ భార్య మనస్తత్వం, కోయబోయలు, కాటమరాజు ఆవులు - ఎద్దులను బాణాలు వేసి చంపిన విధానం, యాదవులు నెల్లూరు పట్టణంపై చేసిన దాడి, యరగడ్డపాటి యుద్ధానికి దారితీసిన పరిస్థితులు మొదలగు అంశాలను గట్టయ్య కవి విపులంగా వివరించాడు.

***భక్తిరన్న కథ :***

కాటమరాజు పినతండ్రి పోలురాజు పెద్దకుమారుడు భక్తిరన్న. ఈ తాళపత్ర గ్రంథంలో భక్తిరన్న శ్రీశైలంలో తపస్సు చేసిన విధానము, కాశీ ప్రయాణము, కాశీలో భక్తిరన్న తాత తండ్రులకు పిండాలను తర్పణంగా వదలటం, ధనకొండ వీధులలో భక్తిరన్న భిక్షమెత్తుకొనుట, కాటమరాజు చెల్లెలు పాపనూక వివరాలు, యరగడ్డపాడు యుద్ధరంగంలో చనిపోయిన యాదవవీరుల వర్ణన, యాదవ స్త్రీల సహగమనానికి సంబంధించిన విషయాలు ఇందులో వివరించబడ్డాయి.

***పాపనూక కథ :***

కాటమరాజు సోదరి పాపనూక. ఈవిడ చెడునక్షత్రంలో జన్మించిందనే నెపంతో వివాహం చేయకుండా ధనకొండ పట్టణం బయట ఒంటి స్తంభం మేడ కట్టి అందులో ఉంచారు. పాపనూక అనుభవించిన మనోవేదన తదితర అంశాలు ఈ తాళపత్ర గ్రంథంలో రాంపాక వెంకురాం విపులంగా వ్రాశాడు.

***భట్టురాయబారము :***

కాటమరాజుకు నెల్లూరు పాలకుడు నల్లసిద్ధికి యరగడ్డపాడులో యుద్ధం జరగడానికి ముందు రాయశృంగావళి అనే భట్టును పుల్లరి వసూలు చేయుటకు కాటమరాజు వద్దకు రాయబారిగా పంపుతాడు. కాటమరాజు భట్టు కొమార బంగారం, రాయశృంగావళితో వాదనకు దిగటం, పుల్లరి నెల్లూరు వారికి ఇవ్వవలసిన అవసరం లేదని వాదించడం, ఇరువర్గాల బలాబలాలు తప్పు ఒప్పులను భట్లు వాదించుకోవటం ఇందులో వర్ణింపబడినది.

***యరగడ్డపాటి పోట్లాట :***

గంగుల పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట తాళపత్ర గ్రంథ రచయిత. ఈయన విష్ణు భక్తుడు, కొమనాల గోత్రం, యదువంశానికి చెందినవాడు. ఈతని తండ్రి గంగుల యల్లయ్య, సోదరుడు సర్వన అని తెలుస్తున్నది. ఈ గ్రంథం ద్విపద సాహిత్యంలో వ్రాయబడింది.

కాటమరాజు నల్లసిద్ధికి మధ్య యరగడ్డపాడులో జరిగిన యుద్ధాన్ని గంగుల పిన యల్లయ్య చాలా చక్కగా వర్ణించాడు. కాటమరాజు తరపున చల్ల పిన్నమనీడు, అయితమరాజు, కరియావుల రాజు, భట్టావులన్న, చట్టువారి యఱ్ఱయ్య, పెయ్యల యఱ్ఱయ్య, బీరినీడు, బోడావుల చెన్నయ్య, నాచకూళ్ళ నాయుడు, నేతివారి ముద్దయ్య, పోచయ్య, ముమ్మయ్య, పుత్తమరాజు, పల్లికొండ మొదలైన వీరులు యరగడ్డపాడు యుద్ధంలో పోరాడినారు. నల్లసిద్ధి తరపున - తిరుణామల తిప్పరాజు, పెదయేగి బాపరాజు, అర్లుగొండ అచ్చిరాజు, కాళహస్తి కనకాద్రిరాజు, ప్రభగిరి పట్నం పద్మశంకరుడు, నందికనుమ నాగరాజు, నందివాడ బేతినీడు, కంచిగండ గోపాలరాజు మొదలైన వారు యుద్ధం చేశారు. ఆ రోజుల్లో కంచిని విజయగండ గోపాలుడు పాలిస్తున్నాడు. ఇతడు యరగడ్డపాటి యుద్ధంలో నల్లసిద్ధి తరపున పోరాడినాడు. నల్లసిద్ధి, విజయగండ గోపాలునికి సామంతుడుగా ఉండేవాడు. విజయగండ గోపాలుని పేరు ఈ తాళపత్ర గ్రంథంలో గండ గోపాలరాజుగా వర్ణింపబడింది.

యరగడ్డపాడు యుద్ధం చిత్రభాను సంవత్సరం, మాఘ బహుళ అమావాస్య మంగళవారం నాడు జరిగినట్లు గంగుల పిన యల్లయ్య వ్రాశాడు, కాని శక సంవత్సరాన్ని తెలుపలేదు. ఐనప్పటికి, యుద్ధకాలం నిర్ణయించటానికి ఇది ఎంతగానో ఉపయోగపడింది. ఈ యుద్ధం క్రీ.శ. 1282లో జరిగినట్లు తెలుస్తుంది. ఇప్పటికీ యరగడ్డపాడు యుద్ధరంగంలో జరిగిన సంఘటనలను కొమ్ములవారు గంగజాతర సమయాలలో గంగదొనకొండ, పంచలింగాల కొండ, తదితర ప్రాంతాలలో రాత్రులందు వీరావేశముతో గానం చేస్తూ ఉంటారు.

### *పోలురాజు యుద్ధం :*

ఈ తాళపత్ర గ్రంథం కాటమరాజు పినతండ్రిపోలురాజుకు నెల్లూరు పాలకుడు, ముక్కంటికి మధ్య చెరుకూరులో జరిగిన యుద్ధాన్ని తెలియజేస్తుంది. చెరుకూరు యుద్ధం జరగటానికి కారణాలు - దాని ఫలితాలు వివరంగా చర్చించబడినాయి. ఇందులోని అంశాలు ఆనాటి సమకాలీన చారిత్రిక సంఘటనలతో సరిపోతున్నాయి. కనకబండి గట్టయ్య దీని రచయిత.

### *బల్లికురువ పోట్లాట :*

పోలురాజు రెండవ కుమారుడు అయితమరాజుకు, ఇమ్మడక్కమరాజుకు మధ్య బల్లికురువలో జరిగిన యుద్ధ వివరాలు ఈ తాళపత్ర గ్రంథంలో వర్ణింపబడినది. అయితమరాజు అర్ధవీడు నుండి యలమంచికి సపరివారముగా తరలిపోతున్నపుడు ఈ సంఘటన జరిగినట్లు తెలుస్తున్నది. ఇందులో రచయిత పేరు తెలుపబడలేదు.

### *ఆవుల వలురాజు చరిత్ర :*

పడరుప మద్దులేటి కవి ఈ తాళపత్ర గ్రంథాన్ని రచించాడు. యలమంచి పాలకుడు ఆవుల వలురాజుకు ఖండె మొండెముల కోట రాజు, కలభూత గంగురాజుకు మధ్య జరిగిన యుద్ధాన్ని రచయిత ఇందులో వివరించాడు. గంగురాజు కుమారుని పట్టాభిషేకము, వలురాజు భార్య వల్లమ్మ సహగమనము, 13వ శతాబ్దం నాటి ఆంధ్రదేశంలోని సాంఘిక పరిస్థితులు దీనిద్వారా తెలుస్తున్నవి. ఆవుల వలురాజు కాటమరాజు తాత, పెద్దిరాజు తండ్రి.

### కాటమరాజు కథ :

శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ ఓరియంటల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్, తిరుపతి యందు ఈ తాళపత్ర గ్రంథం (నెం. డి. 2945) భద్రపరచబడింది. దీని రచయిత గంగుల పిన యల్లయ్య. ఇందులో భట్టు రాయబారము, కోటపాటి తాటి వృక్షము తెచ్చే కథ, యరగడ్డపాటి పోట్లాట ప్రముఖంగా వర్ణింపబడినది.

### అగుమంచి కథ :

ఈ తాళపత్ర గ్రంథం కూడా తిరుపతి లోని శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటి ఓరియంటల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్ నందు (నెం. పి. ఆర్. 664) భద్రపరచబడింది. జరుగుపల్లి చెన్నయ్య దీని రచయిత. ఇందులో అగుమంచి, శివరాత్రి రోజు ఉపవశించిన విధానము, కలలు వాటి ఫలితాలు, దొనకొండలోని యాదవుల ఆచార వ్యవహారాలు రచయిత వివరంగా తెలిపాడు.

## 2. కాగితపు ప్రతులు :

శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటి ఓరియంటల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్, తిరుపతి యందు చాలా కాగితపు ప్రతులు కాటమరాజుకు సంబంధించినవి ఉన్నవి. ఇందులో ముఖ్యమైనవి. వలురాజు యుద్ధం (ఆర్. నెం. 642) కరియావుల కాటమరాజు చరిత్ర (నెం. 6702) అగుమంచి చరిత్ర (నెం. 1599) వలురాజు యుద్ధం (ఆర్. నెం. 642)లో పోలురాజు చరిత్ర వివరింపబడింది. ఈ కాగితపు ప్రతులు అగుమంచి చరిత్ర, కరియావుల కాటమరాజు చరిత్రలలోని విషయాలు తాళపత్ర గ్రంథాలలోని అంశాలతో సరిపోతున్నాయి.

## 3. కైఫీయతులు :

గ్రామాలలోని కరణాల వద్ద ఉన్న కవిలెకట్టలను కైఫీయతులంటారు. వీటిని కల్నల్ మెకంజీ సేకరించి భద్రపరిచాడు. ఈ కవిలెలలో ఆకాలం నాటి గ్రామాలలోని సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు, మతవిధానం, తదితర అంశాలను వివరించారు. పట్టపురావి కెఫీయతు, సిద్దవటం కైఫీయతు, రణతిక్కన కెఫీయతులలో కాటమరాజు చరిత్రను వివరించారు. సి.పి. బ్రౌన్, యరగడ్డపాటి పోట్లాట, భట్టు రాయబారము మొదలగు ప్రతులను సేకరించాడు. ఈ కెఫీయతుల ద్వారా కాటమరాజు చరిత్ర, నెల్లూరు తెలుగు చోడవంశము చరిత్ర కొంత తెలుసుకొనుటకు అవకాశము కలుగుతుంది.

### పట్టపురావి కైఫీయతు :

నెల్లూరు లోని అడవులు, పుల్లరి ఒప్పందం, ఖడ్గ తిక్కన యాదవుల మధ్య జరిగిన యుద్ధం, ఖడ్గతిక్కన యుద్ధరంగం నుండి పారిపోవటం, భార్య, తల్లిదండ్రులు తిక్కనను అవమానించడం, తిక్కన మరణం తదితర విషయాలు పట్టపురావి కెఫీయతునందు వివరింపబడినవి.

### సిద్దవటం కైఫీయతు :

యరగడ్డపాడు యుద్ధంలో కాటమరాజు తరపున తమ ప్రాణాలను త్యాగం చేసిన యుద్ధవీరుల గురించి, ఆవుల మాలె, సంగీత పరికరాలు, ఆవుల పండుగ, ఎద్దుల తానకం, కాటమరాజు గొప్పతనం, మొదలగు అంశాలు సిద్దవటం కెఫీయతులో వివరించబడినవి.

### *రణతిక్కన కైఫీయతు :*

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి సేకరించిన తెలుగు ద్విపద సాహిత్యం డిస్క్రిప్టివ్ కేటలాగులో కాటమరాజుకు ఖడ్గతిక్కనకు మధ్య జరిగిన యుద్ధం వర్ణింపబడినది. లంకమల, నల్లమల, పాలకొండ అడవులు, కాటమరాజు పశువులు నెల్లూరు అడవులలో మేసిన విధానము, పుల్లరి ఒప్పందం, యాదవులకు నెల్లూరు సైన్యానికి మధ్య జరిగిన యుద్ధం, రణతిక్కన మరణం, తిక్కన భార్య సహగమనం, తదితర సంఘటనలు రణతిక్కన కైఫీయతులో వ్రాయబడినవి.

## *4. శాసనాలు :*

కాటమరాజు చరిత్ర రచనకు సాహిత్యపరమైన ఆధారాలే కాక, శాసనాలు, నాణాలు, శిల్పాలు, శిథిల భవనాలు ముఖ్యమైన ఆధారాలుగా తోడ్పడుతున్నాయి.

### *గుండ్లపాలెం శాసనం :*

ప్రకాశం జిల్లా, కందుకూరు తాలూకా గుండ్లపాలెం గ్రామంలోని బ్రహ్మేశ్వర స్వామి ఆలయ ప్రాంగణంలో కాటమరాజు చరిత్రకు సంబంధించిన శాసనం ఒకశిలపై తెలుగుభాషలో నాలుగు వైపులా చెక్కబడి ఉన్నది. నెల్లూరు జిల్లా శాసన సంపుటి ద్వితీయ భాగంలో ఈ శాసనాన్ని ప్రచురించారు. ఈ శాసనం మొదటిభాగం యాదవవంశం పుట్టుకను గురించి వివరించుతుంది. రెండవభాగంలో యరగడ్డపాడు యుద్ధం జరిగిన కాలం వివరాలు ఉన్నాయి. మూడవభాగం పుల్లరి ఒప్పందాన్ని గూర్చి తెలుపుతుంది. నాల్గవభాగంలో యాదవులకు నెల్లూరు తెలుగు చోడవంశం వారికి యరగడ్డపాడులో జరిగిన యుద్ధ వివరాలు లిఖించబడ్డాయి. ఈ శాసనంలోని అంశాలు చాలా వరకు తాళపత్ర గ్రంథాలలోని అంశాలతో సరిపోతున్నాయి. కాని యుద్ధం జరిగిన కాలం తాళపత్ర గ్రంథాలలో చిత్రభాను సంవత్సరముగా పేర్కొనబడితే, ఈ శాసనంలో కాళయుక్తి అని లిఖించబడింది.

### *గంగదొనకొండ శాసనం :*

ఎద్దు ముమ్మయ బగదింగరు, శక సంవత్సరం 1447లో ఈ శాసనం వేయించాడు. విజయనగర సామ్రాజ్య పాలకుడు శ్రీకృష్ణదేవరాయలు ఆస్థానంలో ఎద్దు ముమ్మయ ప్రముఖమైన పదవిలో ఉన్నట్లు తెలుస్తుంది. ఈ శాసనంలో యాదవ ప్రముఖులైన తిమ్మపనాయుడు, బోరిస బైరినినీడు, అనాగతత అవసరం బసివినీడు, మరియు కీర్తిలయ్యలను వారు నందగోపకులం, కాటమరాజు వంశమైన బడుగుల వంశానికి చెందినట్లుగా వివరించబడింది.

## *5. నాణాలు :*

కాటమరాజు వంశస్తులు కొన్ని నాణాలను కూడా ముద్రించారు. పోలురాజు కథ, తాళపత్ర గ్రంథంలో యాదవులు "నందికాసులు" అనబడే నాణాలను ముద్రించి ఉపయోగించినట్లు పేర్కొనబడింది. యాదవులు యలమంచిలోని ఒక గుట్టపై కోటను నిర్మించారు. ఆ కోట శిథిలాలలో కొన్ని నాణాలు దొరికాయి. అందులో కొన్నింటిపై నంది మరియు శ్రీచంద్రదేవ అక్షరాలు ఉన్నాయి. కాటమరాజుకు శ్రీచంద్రదేవ అనే బిరుదు ఉన్నది. కొన్ని నాణాలు తూర్పు చాళుక్యులకు సంబంధించినవి లభించాయి. యాదవులు తూర్పు చాళుక్యుల లాగానే నాణాలు వేయించారు.కనిగిరి కోటలో కాటమరాజుకు సంబంధించిన బంగారునాణాలు కొంతమంది పనివారికి దొరికినట్లు ఏప్రియల్ 1982లో ఈనాడు దినపత్రికలో ప్రకటించబడింది. కనిగిరి కోట యాదవులు నిర్మించారు.

ఈ ప్రాంతాన్ని అద్దంకినేలిన యాదవులు మరియు కాటమరాజు పాలించినట్లుగా తెలుస్తున్నది.

## 6. శిథిల భవనాలు :

విశాఖపట్నం జిల్లాలోని యలమంచిలి, ప్రకాశం జిల్లాలోని పంచలింగాల కొండ, గంగదొనకొండ, గుండంచర్ల, అర్ధవీడు, వరంగల్ జిల్లాలోని పాపఘటం తదితర ప్రాంతాలలో యాదవులు నిర్మించిన కోటలు, దేవాలయాల శిథిలాలు ఇప్పటికీ కనిపిస్తున్నాయి.

### నూకిపాప మేడ :

కాటమరాజు చెల్లెలు పాపనూక పేరుతో యాదవులు నిర్మించిన భవనం యలమంచిలి పట్టణంలోని ఒక గుట్టపై శిథిలాలుగా మారి ఉంది. స్థానిక ప్రజలు దీనిని నూకిపాప మేడ అని పిలుస్తున్నారు. ఇది విశాఖ పట్టణం జిల్లాలో ఉంది.

### పంచలింగాల కొండ :

ప్రకాశం జిల్లాలోని కనిగిరి, కందుకూరు మధ్యన పాలేరు నదీతీరాన పంచలింగాల కొండ ఉంది. ఇక్కడ ఒక గుట్టపై పురాతన శైవ దేవాలయం ఉన్నది. దీనికి సమీపములోనే కాటమరాజు కోట శిథిలాలు ఉన్నాయి. పాలేరు నది ఒడ్డున గంగ దేవాలయం ఉన్నది.

### యరగడ్డపాడు :

కాటమరాజు సైన్యం, నెల్లూరు పాలకుడు నల్లసిద్ధి సేనలకు మధ్య జరిగిన యుద్ధరంగం యరగడ్డపాడు. ఇది ప్రకాశం జిల్లాలోని పాలేరు నదీతీరాన ఉన్న సువిశాలమైన భూభాగం.

### గంగదొనకొండ :

ప్రకాశం జిల్లాలోని గంగదొనకొండలో గంగదేవాలయం ఉన్నది. గంగదేవాలయం ముందు కాటమరాజు చరిత్రకు సంబంధించిన ఐదుశాసనాలు ఉన్నవి. ఇక్కడే యరగడ్డపాడు యుద్ధంలో మరణించిన యాదవవీరుల విగ్రహాలు శిలలపై చెక్కబడి ఉన్నవి.

### పాపనూక మేడ :

గంగదొనకొండలోని గంగదేవాలయానికి అరకిలోమీటరు దూరంలో కాటమరాజు సోదరి పాపనూక పేరుతో నిర్మించిన భవనం ఉంది. ప్రస్తుతము ఇదిశిథిలమై ఒక మట్టి దిబ్బగా కనిపిస్తుంది.

### అయితమరాజు కోట :

పాపనూక మేడకు అరకిలోమీటరు దూరంలో ఒక కొండపై కోట పునాదులు కనిపిస్తున్నాయి. దీనిని అయితమరాజు కోట అంటారు. ఈ కోటకు సమీపములో కొండ దిగువ భాగాన పురాతనమైన రాజభవనాల శిథిలాలు కనిపిస్తాయి.

### సహగమన గుండం :

గంగదేవాలయం ముందు సహగమన గుండం ఉంది. యరగడ్డపాడు యుద్ధం తరువాత యాదవ స్త్రీలు ఇక్కడ నిర్మింపబడిన చంపుడు కట్టపైనుండి సహగమన గుండంలో దూకి సతీసహగమనం ఆచరించారు.

### బడుగులవారి చిహ్నం :

గంగదేవాలయం ముందు నిర్మింపబడిన మండపంలో బడుగుల వంశం వారికి చెందిన చిహ్నం ఒక రాతిపై చెక్కబడి ఉన్నది. కాటమరాజు చరిత్రకు ఆధారాలుగా శాసనాలే కాకుండా శిల్పాలు కూడా ఎంతగానో ఉపయోగపడుతున్నాయి.

### గుండంచర్ల :

ప్రకాశం జిల్లాలోని మార్కాపురం పట్టణానికి ముప్పది కిలోమీటర్ల దూరంలో గుండంచర్ల గ్రామం ఉంది. ఈ గ్రామానికి ఐదుకిలోమీటర్ల దూరంలో కాటమరాజు గుడి ఉంది. ఇక్కడ కాటమరాజు గంగ విగ్రహాలు రాతిపై చెక్కబడి ఉన్నవి. ఈ దేవాలయానికి సమీపంలోనే పెద్దబావి, పెద్దసైజులో ఉన్న నీటితొట్టెలు ఇప్పటికీ కనిపిస్తున్నాయి. కాటమరాజు నెల్లూరు ప్రాంతం పోవటానికి ముందు ఇక్కడ కొంతకాలం ఉన్నాడు. పాలకొరకు వారి వెంటున్న ఆవులు లేగలకు నీటివసతి కల్పించటానికి ఏర్పాటు చేసిన నీటితొట్టెలు ఇవి.

### అర్ధవీడు :

ప్రకాశం జిల్లాలోని కంభంకు ముప్పది కిలోమీటర్ల దూరంలో అర్ధవీడు ఉన్నది. ఈ గ్రామానికి ఒక కిలోమీటరు దూరంలో ఒక శివాలయం ఉంది. ఈ శివాలయపు ఉత్తర గోడకుఎద్దు - ఏనుగు యుద్ధం చేస్తున్నట్లు శిల్పం చెక్కబడిఉంది. ఈ దేవాలయానికి వెనుక భాగంలో ఒక స్త్రీ మూర్తి గొఱ్ఱెపోతుపై ఎక్కినట్లు శిల్పం చెక్కబడి ఉంది.

కాటమరాజు సైన్యంలోని ఆవులు, ఎద్దులు - యరగడ్డపాటి యుద్ధంలో నెల్లూరు సైన్యంలోని గుఱ్ఱాలు, ఏనుగులపై యుద్ధం చేశాయని స్థానికులు చెప్పుకుంటున్నారు. ఎద్దు - ఏనుగు యుద్ధం చేస్తున్న శిల్పం, యాదవుల ఎద్దులు, నెల్లూరు ఏనుగుల పై యుద్ధం చేశాయనే విషయాన్ని ధృవపరుస్తున్నది. పోలురాజు కథ తాళపత్ర గ్రంథంలో కాటమరాజు పినతండ్రి పోలురాజు అర్ధవీడును పాలించినట్లు ఉన్నది.

### పాపఘటం :

వరంగల్ జిల్లాలోని నర్సంపేట సమీపములో పాపఘటం ఉంది. పాపనూక పేరుతో దానిని కట్టినట్లు తెలుస్తుంది. ప్రతి సంవత్సరం పాపఘటం వద్ద యాదవులు ఉత్సవం జరుపుతున్నారు.

# 1
# రాజకీయ చరిత్ర

ఆంధ్రదేశములో 12, 13వ శతాబ్దాల నాటి రాజకీయ చరిత్ర తెలుసుకోవటము వలన కాటమరాజు చరిత్రను సమగ్రంగా అర్థం చేసుకొనుటకు వీలుపడుతుంది. అందువలన తూర్పు చాళుక్యులు, యలమంచిలి చాళుక్యులు, కాకతీయులు, నెల్లూరు తెలుగు చోడులు, మరియు తూర్పు గాంగ వంశాలకు చెందిన రాజకీయ చరిత్రను క్లుప్తంగా చర్చించటం జరిగింది.

## I. తూర్పు చాళుక్యులు :

బాదామి చాళుక్య వంశానికి చెందిన రెండవ పులకేశి క్రీ. శ. 624లో వేంగి ప్రాంతాన్ని జయించి తన సోదరుడైన కుబ్జ విష్ణువర్ధనుడిని వేంగి ప్రాంతానికి రాజప్రతినిధిగా నియమించాడు. కొంతకాలం తరువాత, కుబ్జ విష్ణువర్ధనుడు వేంగిని స్వతంత్రంగా పరిపాలించడం మొదలుపెట్టాడు. అందువలన ఈ రాజవంశానికి తూర్పు చాళుక్యులని పేరు వచ్చింది[1] వేంగి రాజ్యం కళింగలోని మహేంద్ర పర్వతాల నుండి నెల్లూరులోని మన్నేరు నది వరకు పశ్చిమదిక్కున తూర్పు కనుమల వరకు విస్తరించింది.

### రాజరాజ నరేంద్ర. క్రీ.శ. 1019 - 1061 :

తూర్పు చాళుక్య రాజవంశంలో రాజరాజ నరేంద్రుడు ప్రముఖమైన పాలకుడు క్రీ.శ. 1019[2]లో వేంగి సింహాసనాన్ని అధిష్ఠించి క్రీ.శ. 1061 వరకు పరిపాలన కొనసాగించాడు. రాజరాజ నరేంద్రుడు రాజ్యపాలన చేపట్టగానే అతని పిన తండ్రి కుమారుడైన విజయాదిత్యుడు వేంగి సింహాసనాన్ని ఆక్రమించుకొనుటకై తిరుగుబాటు చేశాడు.[3] క్రీ.శ. 1031లో విజయాదిత్యుడు వేంగి సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు. చోళ రాజేంద్రుడు విజయాదిత్యుని ఓడించి తిరిగి రాజరాజ నరేంద్రునికి వేంగి సింహాసనమును అప్పగించి తన కూతురు అమ్మంగదేవిని రాజరాజనరేంద్రునకిచ్చి వివాహము చేశాడు.[4]

కళ్యాణి పాలకుడైన మొదటి ఆహవమల్ల సోమేశ్వరుడు కొప్పం యుద్ధంలో రాజరాజ నరేంద్రుని ఓడించాడు.[5] అందువలన రాజరాజనరేంద్రుడు ఆహవమల్లుని ఆధిపత్యాన్ని అంగీకరించాడు. ఆహవమల్లుడు తన ఆస్థానంలోని ప్రముఖ మంత్రులలో ఒకడైన నారాయణభట్టును రాజరాజనరేంద్రుని ఆస్థానమునకు పంపించినాడు. రాజరాజనరేంద్రుని ఆస్థాన కవి నన్నయభట్టు భారతాన్ని తెలుగులో అనువదించే సమయంలో నారాయణభట్టు నన్నయభట్టుకు ఎంతగానో సహాయపడినాడు.[6] రాజరాజనరేంద్రుడు క్రీ.శ. 1061లో మరణించినాడు. విజయాదిత్యుడు తిరిగి వేంగి సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు. మొదటి ఆహవమల్ల సోమేశ్వరునికి సామంతుడిగా విజయాదిత్యుడు వేంగిని పాలించాడు.

### రెండవ శక్తివర్మ. క్రీ.శ. 1061 - 1062 :

విజయాదిత్యుడు తన కుమారుడైన శక్తివర్మను వేంగి పాలకునిగా చేశాడు. విజయాదిత్యుడు కళ్యాణి పాలకుడైన మొదటి ఆహవమల్ల సోమేశ్వరుని ఆజ్ఞానుసారం నలంబవాడి ప్రాంతానికి రాజప్రతినిధిగా వెళ్లాడు. రయఖి తామ్రశాసనం ప్రకారం రెండవ శక్తి వర్మ వేంగి రాజ్యాన్ని ఒక్క సంవత్సరం మాత్రమే పాలించినట్లు తెలుస్తుంది. చోళవీరరాజేంద్రుడు వేంగిని ఆక్రమించి రెండవ శక్తివర్మను సంహరించాడు.[7]

### కులోత్తుంగ (రాజేంద్ర). క్రీ.శ. 1070 - 1118 :

ఇతడిని మొదటి కులోత్తుంగ, రాజేంద్ర అనికూడా పిలుస్తారు. రాజరాజనరేంద్రుడు అమ్మంగదేవిలకు జన్మించినవాడె మొదటి కులోత్తుంగుడు. అందువలన తండ్రి తరపున వేంగి రాజ్యం, తల్లి వైపునుండి చోళ సామ్రాజ్యం ఇతనికి సంక్రమించింది.

మొదటి కులోత్తుంగుడు వేంగి రాజ్యాన్ని విజయాదిత్యునికి ఒప్పగించి చోళ సామ్రాజ్యాన్ని పాలించడం మొదలుపెట్టాడు. విజయాదిత్యుడు చోళుల ఆధిపత్యాన్ని అంగీకరించాడు. కాని క్రీ.శ. 1075లో విజయాదిత్యుడు మరణించాడు.[8] మొదటి కులోత్తుంగుని కుమారులైన రాజరాజ చోడగంగు, రాజరాజ ముమ్మడి చోడ, వీరచోడ మరియు విక్రమ చోడలు వేంగికి రాజప్రతినిధులుగా నియమింపబడినారు. అతరువాత వేంగి కాకతీయుల పాలన లోనికి వచ్చింది.[9]

వేంగి చాళుక్య వంశానికి చెందిన కొందరు యలమంచిలి, జననాథపురం, నిడదవోలు ప్రాంతాలలో రాజ్యస్థాపన చేశారు.[10]

## 2. యలమంచిలి చాళుక్యులు :

క్రీ.శ. 13వ శతాబ్దం నుండి 16వ శతాబ్దం వరకు యలమంచిలిని రాజధానిగా చేసుకొని మధ్యమ కళింగ లోని కొంత భాగాన్ని (విశాఖపట్నం జిల్లా) యలమంచిలి చాళుక్యులు పరిపాలించారు. తూర్పు చాళుక్యుల చరిత్రకు సంబంధించి వివిధ సమయాలలో యలమంచిలి ప్రముఖ పాత్ర వహించింది. కాని ఏ రాజవంశానికి చెందినవ్వారు కూడా క్రమంగా విజయవంతంగా ఈ ప్రాంతాన్ని 12వ, శతాబ్దం చివరి వరకు పాలింపలేదు.[11] ఆ తరువ్వాత చాళుక్య రాజవంశానికి చెందినవారు కొందరు క్రమంగా యలమంచిలిని పాలించారు.[12] యలమంచిలి తూర్పు కనుమలలోని శారద, వరహా నదుల మధ్యన ఉన్నది. ప్రస్తుతం యలమంచిలి విశాఖపట్టణం జిల్లాలో ఉన్నది.

### విజయాదిత్య :

క్రీ.శ. 13వ, శతాబ్దం ప్రథమ భాగంలో విజయాదిత్యుడు యలమంచిలిలో స్వతంత్ర పరిపాలన సాగించినట్లు తెలుస్తుంది. చూడాంబిక విజయాదిత్యుని భార్య.

### మల్లపదేవ : క్రీ.శ. 1228 - 1253

విజయాదిత్యుని కుమారుడు మల్లపదేవుడు, ఇతని భార్య లక్ష్మీదేవి సింహాచలంలో వేయించిన శాసనంలో వరహాపాక నాటి గట్టులోని మణప గ్రామాన్ని తన కుమారుడైన మొదటి ఉపేంద్రుని ఆరోగ్యం నిమిత్తమై నరసింహస్వామికి దానమిచ్చింది. మల్లపదేవుని గురించిన వివరాలు కొన్ని ఈ శాసనంలో ఉన్నాయి.[13]

### ఉపేంద్ర : క్రీ.శ. 1253 - 1266

తన తండ్రి మల్లపదేవుని జ్ఞాపకార్థం ఉపేంద్రుడు దాన ధర్మాలు చేసినట్లు, క్రీ.శ. 1253లో వేయించిన ద్రాక్షారామ శాసనం వలన తెలుస్తుంది. ఉపేంద్రుడు శత్రువులకు కరవాల భైరవుడు, మిత్రులకు ధరణి వరహుడు. వివిధ భోగాలకు గాను ఉపేంద్రుడు పంద్రువాడ గ్రామాన్ని దానమిచ్చినట్లుగా ద్రాక్షారామ శాసనంలో ఉన్నది. ఇతని భార్య గంగాంబ.[14]

## రెండవ మల్లప దేవుడు : క్రీ.శ. 1266 - 1283

ఉపేంద్రుని కుమారుడే రెండవ మల్లపదేవుడు. ఇతనికి కుల భూషణ, సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన అనబడే బిరుదులున్నాయి.[15]

## 3. కాకతీయులు :

తొలి కాకతీయులు కళ్యాని చాళుక్యుల సామంతులు. కళ్యాణి చాళుక్యుల ప్రాభవం తగ్గిన తరువాత తెలుగుభాష మాట్లాడే ప్రాంతాలను కాకతీయులు స్వతంత్రంగా పాలించారు. కాకతీయ రాజులలో మహాదేవుడు, గణపతిదేవుడు, రుద్రమదేవి, ప్రతాప రుద్రుడు ముఖ్యమైన వారు. కాటమ్మరాజు వంశస్తులు ఈ కాకతీయ రాజులకు సమకాలీనులు. కాకతీయుల పూర్వీకులు కందర పురం నుంచి వచ్చినట్లు తెలుస్తుంది.[17] ఇది మహారాష్ట్రలోని నాందేడు జిల్లాకు చెందిన కందహార్. రాష్ట్రకూటుల కాలంలో ఈ ప్రాంతానికి చాలా ప్రాముఖ్యత ఉండేది.[18] ప్రప్రథమంగా కాకతీయులు రాష్ట్రకూటుల అధీనంలో ఉండేవారు. కాకతీయులు "కాకతి"-దేవతను ఆరాధించారు. అందువలన ఈ వంశానికి కాకతీయ వంశంగా పేరు వచ్చినట్లు కొందరు చరిత్రకారులు తెలుపుచున్నారు. కాకతిపురం కాకతీయుల జన్మస్థానం[19] కాబట్టి కాకతి వంశం వాడుకలోనికి వచ్చినట్లు మరికొందరు చరిత్రకారులు తెలియచేస్తున్నారు.

ది కాకతీయాస్ - అనే గ్రంథంలో డా॥ పి.వి.పరబ్రహ్మశాస్త్రిగారు కాకతీయులు వృష్ణి[20] వంశస్తులైన రాష్ట్రకూట కుటుంబానికి చెందిన వారని నిరూపించారు.[21] రాష్ట్రకూటులు వృష్ణి వంశస్తులు. వృష్ణి వంశం, యాదవులలో ప్రముఖమైన తెగ.[22] సంజన తామ్ర శాసనాలలో రాష్ట్రకూటులు యదువంశానికి చెందినట్లుగా వివరింపబడింది.

## మహదేవుడు : క్రీ.శ. 1195 - 1198

దేవగిరి యాదవరాజుజైతుగి (క్రీ.శ. 1192 -1200) పాలించుచున్న కాలంలో మహాదేవుడు దేవగిరిపై దాడి చేశాడు. దేవగిరి యాదవులతో పోరాడుతూ మహాదేవుడు మరణించాడు. మహదేవుని కుమారుడైన గణపతిదేవుడిని జైతుగి బంధించాడు. ఆతరువాత జైతుగి గణపతిదేవుని కారాగారం[23] నుండి విడిపించి తన కుమార్తె రుద్రమాంబను గణపతిదేవునికిచ్చి వివాహము చేశాడు. గణపతిదేవుని సోదరి మైలాంబనునతవాడి రుద్రునికిచ్చి వివాహము చేశారు. నతవాడి రుద్రుడు కాకతీయుల కులానికి చెందినవాడు. ఈ విషయం ఖమ్మం జిల్లాలోని బయ్యారం చెరువు దగ్గర ఉన్న కాకతీయుల శాసనంలో[24] తెలియచేయబడింది. నతవాడి రుద్రుడు బుధని కుమారుడు, దుర్గరాజు యొక్క మనుమడు.

వరంగల్ జిల్లాలోని నర్సంపేట, నిడిగొండ శాసనాలల్లో[25] దుర్గ (దుగ్గరస) మరియు బుధ, నతవాడి కుటుంబానికి చెందినట్లుగా వివరించబడింది. వీరు పశ్చిమ చాళుక్యులకు[26] సామంతులుగా ఉన్నారు. నతవాడి దుర్గ రాష్ట్రకూట వంశానికి చెందినవాడని తెలుస్తుంది. ఇతని పేరుమీదుగా "దుగ్గరట్ట సముద్ర" - అనబడే చెరువుని నిర్మించాడు.[27]

## గణపతిదేవుడు : క్రీ.శ. 1199 - 1262

మహదేవుని తరువాత గణపతిదేవుడు ఓరుగల్లు రాజ్యానికి రాజైనాడు. కాకతీయ రాజులందరికంటే గణపతిదేవుడు గొప్పవాడు. రేచర్ల రుద్రుని సహాయంతో తిరుబాట్లను అణచివేసి ఓరుగల్లు రాజ్యంలో సుస్థిరతను కలుగచేశాడు. చోళ, వెలనాటి, అయ్య వంశస్తులను ఓడించి తెలుగుభాష మాట్లాడే ప్రాంతాలను అన్నింటిని తన స్వాధీనం చేసుకున్నాడు.

గణపతిదేవుడు క్రీ.శ. 1207లో ఆంధ్రదేశము తీరప్రాంతాల పై దాడి చేశాడు. కాకతీయుల సామంతులైన కోట, నతవాడి, మల్యాల వంశస్తులు గణపతిదేవునకు సహాయముగా వచ్చారు. గణపతిదేవుడు బెజవాడను ఆక్రమించుకొని, ఆ తరువాత దివిపై దాడి చేసి అయ్యపినచోడిని ఓడించాడు.

కాటమరాజు పినతండ్రి ప్రోలురాజు గణపతిదేవుని పాలనాకాలంలో నెల్లూరు పాలకుడైన ముక్కంటి (చోడతిక్క - 1) తో పోరాడి చెరుకూరు యుద్ధంలో మరణించాడు.[28]

గణపతిదేవుడు దివి పాలకుడైన అయ్యపిన చోడి కుమార్తె లునారాంబ, పేరాంబలను వివాహమాడాడు. అయ్యపిన చోడి కుమారుడు జాయపసేనుని[29] కాకతీయ సేనలో గజసాధకునిగా నియమించాడు.[30] జాయపసేనుడు సంస్కృతభాషలో "నృత్తరత్నావళి"[31] నాట్య శాస్త్రాన్ని రచించాడు. రామప్ప దేవాలయంలోని శిల్పాలు జాయ్యపసేనుని[32] నాట్య శాస్త్రాన్ని ఆధారంగా చేసికొని చెక్కబడినవి. జాయపసేనుడు గీతరత్నావళి, వాయిద్య రత్నావళి[33] అను రెండు గ్రంథాలను కూడా రచించాడు. ఇవి ఎక్కడ కనిపించడం లేదు.

వెల్నాటి పృథ్వీశ్వరుడు తన రాజధానిని చందవోలు నుండి పిఠాపురంకు మార్చాడు. దివి తదితర ప్రాంతాలను స్వాధీనం చేసుకొనుటకు దండయాత్ర జరిపాడు. కాని కాకతీయ ప్రభువు గణపతిదేవుడు, పృథ్వీశ్వరుని దాడిని ఎదుర్కొన్నాడు. పృథ్వీశ్వరుడు యుద్ధంలో మరణించాడు.[34] పృథ్వీశ్వరుని మరణంతో వెలనాడు ప్రాంతము కాకతీయుల ఆధీనంలోకి వచ్చింది. చందవోలు, పిఠాపురం, దివి, ద్రాక్షారామం నుండి శ్రీకూర్మం వరకు ఉన్న ప్రాంతం వెలనాడు రాజ్యంగా గుర్తింపబడింది.[35]

గణపతిదేవుడు గొప్ప యుద్ధవీరుడు, మంచి పరిపాలనాదక్షుడు. ఇతని కాలంలో కాకతీయ సామ్రాజ్యము, సముద్రతీర ఆంధ్రప్రాంతము, దక్షిణ ఆంధ్ర, కళింగ, కొలను, దాదాపు తెలుగు మాట్లాడే ఆంధ్ర ప్రాంతమంతా విస్తరించింది. గణపతిదేవుని కాలంలో తెలుగు ప్రాతం రాజకీయ, సాంస్కృతిక ఐక్యత సాధించింది.

## రుద్రమదేవి : క్రీ.శ. 1262 - 1289

గణపతిదేవుని తరువాత అతని కుమార్తె రుద్రమదేవి, కాకతీయ సామ్రాజ్యాధికారాన్ని స్వీకరించింది. సమర్ధవంతమైన పాలకురాలు. గణపతిదేవుని పాలనాకాలంలోనే రుద్రమదేవి సైనిక, పాలనా విషయాలలో శిక్షణ పొందింది. రుద్రమదేవి స్త్రీ అనే కారణంతో కొందరు సామంతులు, సరదారులు తిరుగుబాటు చేశారు. కాకతీయ సామ్రాజ్యం తిరుగుబాట్ల సంక్షోభానికి గురైంది. కాని రుద్రమదేవి ధైర్యసాహసాలతో శత్రువులను అణచివేసింది.

రుద్రమదేవి నిడుదవోలు ప్రాంతమువాడైన తూర్పు చాళుక్య వంశానికి చెందిన వీరభద్రుని వివాహమాడింది. ఓరుగల్లు సమీపంలోని కొలనుపాక ప్రాంతానికి వీరభద్రుని రాజప్రతినిధిగా నియమించారు. వీరభద్రుడు క్రీ.శ. 1266లో మరణించినట్లు తెలుస్తుంది.[36] కాయస్థ వంశానికి చెందిన జన్నిగదేవుడు, త్రిపురారి దేవుడు, అంబదేవుడు, రేచర్ల ప్రసాదిత్య, గోనగన్నారెడ్డి మొదలగు వారు మొదట రుద్రమదేవికి తమ సహకారాన్ని అందించారు.

రుద్రమదేవికి ముగ్గురు కుమార్తెలు జన్మించారు. పుత్ర సంతానము లేదు. పెద్దకుమార్తె ముమ్మడమ్మను[37] కాకతీయ వంశానికి చెందిన్న[38] మహాదేవునికి, రెండవ కుమార్తె రుద్రమ్మను యాదవ వంశానికి చెందిన యల్లన దేవునికి, మూడవ కుమార్తెరుయ్యమ్మను బ్రాహ్మణుడైన ఇందులూరి అన్నయ్యదేవునికి ఇచ్చి వివాహం చేసింది.[39] మమ్ముడమ్మకు క్రీ.శ. 1254లో

ప్రతాపరుద్రుడు జన్మించాడు.[40] రుద్రమదేవికి పుత్ర సంతానం లేనందువలన ప్రతాపరుద్రుని దత్తత తీసికొని యువరాజుగానియమించింది.[41] ప్రతాపరుద్రునికి పదహారు సంవత్సరాల వయస్సులో విశాలాక్షితో వివాహం జరిగింది.

ప్రతాపరుద్రుని కాలంలో కాటమరాజు ముప్పదిరెండు సంవత్సరాలు పరిపాలించినట్లుగా గుండ్లపాలెం శాసనంలో వివరింపబడింది.[42] కాటమరాజు రుద్రమదేవికి ప్రతాపరుద్రునికి సమకాలికుడు. ప్రతాపరుద్రుడిని ఓరుగల్లు రాజ్యాధికారం చేపట్టిన తరువాత కూడా కుమార రుద్రదేవుడుగనే శాసనాలలో లిఖించారు. దీనిని బట్టి రుద్రమదేవి పాలనా కాలంలో ప్రతాపరుద్రుడు యువరాజుగా సమస్త అధికారాలను చలాయించినట్లుగా తెలుస్తుంది.

రుద్రమదేవి పాలనా కాలంలో దేవగిరి యాదవరాజైన మహాదేవుడు ఓరుగల్లుపై దాడి చేసినట్లు ప్రతాపచరిత్ర ద్వారా తెలుస్తున్నది.[43] కాకతీయ సైన్యం రుద్రమదేవి నాయకత్వంలో దేవగిరి యాదవసైన్యంతో పదిహేను రోజులు యుద్ధం చేసి విజయం సాధించింది.[44] మహాదేవుడు రుద్రమదేవితో సంధి చేసికొని కోటి బంగారు నాణాలు యుద్ధ నష్ట పరిహారంగా చెల్లించాడు. ఈ యుద్ధం తరువాత దేవగిరి యాదవ వంశానికి చెందిన సారంగపాణి దేవుడు కాకతీయుల ఆధిపత్యాన్ని అంగీకరించి వారితో చేరిపోయాడు.[45]

అంబదేవుడు మాత్రం రుద్రమదేవి అధికారాన్ని ధిక్కరించి కాకతీయ సామ్రాజ్యంలో చాలా ప్రాంతాలను ఆక్రమించాడు. రుద్రమదేవి, కాకతీయ సేనాధిపతి మల్లికార్జున నాయకుడు, అంబదేవునిపై యుద్ధం చేస్తూ క్రీ.శ. 1289లో చనిపోయినట్లు నల్లగొండ జిల్లాలోని చందుపట్ల శాసనం ద్వారా తెలుస్తుంది.[46] రుద్రమదేవి మరణించేనాటికి ఆమె వయస్సు ఎనభై సంవత్సరాలు.

రుద్రమదేవి గొప్ప పరిపాలనాదక్షురాలు. యుద్ధరంగంలో స్వయంగా సైన్యాలను నడిపించిన వీరవనిత. ఆమె పాలనా కాలంలో ఆర్థికంగా సామ్రాజ్యం అభివృద్ధి పొందింది.

### ప్రతాపరుద్రుడు : క్రీ.శ. 1289 - 1323

రుద్రమదేవి తరువాత ఆమె మనుమడు ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1289లో కాకతీయ సింహాసనాన్ని అధిష్ఠించాడు.[47] కాటమరాజు నెల్లూరు పాలకుడైన నల్లసిద్ధితో యరగడ్డపాడు యుద్ధం జరుపుతున్న రోజుల్లో ప్రతాపరుద్రుడు యువరాజుగా ఉండి మంచి పరిపాలనాదక్షుడుగా పేరు తెచ్చుకున్నాడు. ప్రతాపరుద్రుడు అంబదేవుని ఓడించి దక్షిణదిక్కుగా ములికినాడు వరకు వెనక్కు పంపించాడు.

ప్రతాపరుద్రుని కాలంలో నెల్లూరు పాలకుడైన మనుమగండ గోపాలుడు కాకతీయులపై తిరుగుబాటు చేశాడు.[48] క్రీ.శ. 1290లో కాకతీయ సైన్యాలు నెల్లూరుపై దాడి చేసి మనుమగండ గోపాలుని యుద్ధరంగంలో చంపివేశారు. రాజగండగోపాలుడు నెల్లూరు సింహాసనం అధిష్టించాడు. కొద్దికాలానికే రాజగండ గోపాలుడు పాండ్యులతో చేతులు కలిపి కాకతీయులతో కయ్యానికి దిగాడు. చివరకు కాకతీయులు రాజగండ గోపాలుని ఓడించి నెల్లూరును కాకతీయ సామ్రాజ్యంలో కలిపివేశారు.[49]

మహమ్మదీయుల దండయాత్రల వలన కాకతీయ సామ్రాజ్యం ప్రతాపరుద్రుని కాలంలో పతనం చెంది ఢిల్లీ సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్ స్వాధీనంలోకి పోయింది.

## 4. నెల్లూరు తెలుగు చోడులు :

### చోడతిక్క I : క్రీ.శ. 1209 - 1248.

కంచి, వరద రాజస్వామి ఆలయం లోని శాసనం ప్రకారం తెలుగు చోడుల

విజయగండ, వీరగండ. రాజగండ మొదలైన పేర్లున్నట్లు తెలుస్తుంది. వీరిలో చాలామంది చోళరాజుల సామంతులుగా ఉన్నారు.[50]

చోడతిక్క-I రాజును నిర్వచనోత్తర రామాయణంలో తిక్కన కవి చాలా గొప్ప రాజుగా కీర్తించాడు.[51] ఇతడు చోళరాజైన మూడవ రాజేంద్రునికి సామంతునిగా ఉన్నాడు. చోడతిక్క-I రాజుకు - మధురాంతక పొత్తపి చోళన్ మనుమసిద్ధరసన్ తిరుకాళట్టి దేవన్ - గండ గోపాల అను బిరుదు ఉన్నది.[52]

నెల్లూరును పాలించిన తెలుగు చోడ వంశము రాజులలో చోడతిక్క-I చాలా గొప్పవాడు. ఇతడు క్రీ.శ. 1209 నుండి 1248 వరకు నెల్లూరును కాకతీయ గణపతిదేవుని సహాయంతో పరిపాలించాడు.[53] చోడతిక్క -I కర్ణాటక ప్రభువైన సోమేశ్వరుని ఓడించి చోళరాజుకు రాజ్యాధికారం కల్పించాడు. అందువలన చోడతిక్క-I కు చోళస్థాపనాచార్య అనే బిరుదు వచ్చింది. కాటమరాజు పినతండ్రి, ప్రోలురాజు చోడతిక్క-I పై యుద్ధం చేసి చెరుకూరు యుద్ధంలో క్రీ.శ. 1223లో వీరమరణం పొందాడు.[54] చోడతిక్క-I కు మనుమసిద్ధి, గండగోపాల, ముక్కంటి - మొదలైన పేర్లున్నట్లు తాళపత్ర గ్రంథాలు, శాసనాల ద్వారా తెలుస్తుంది.

చోడతిక్క-I వరదరాజ పేరుమాళ్ళ స్వామి భక్తుడు. "గండగోపాల సంధి"-ని దేవుని సేవకొరకు ఏర్పాటు చేశాడు. ఈ దేవళములోని శాసనము చోడతిక్క-I వంశావళిని వివరించుతున్నది. విజ్జన-మనుమసిద్ధి (శ్రీదేవి)- గండగోపాల - ఈ గండగోపాల రాజే. చోడతిక్క-I నెల్లూరు ప్రభువు.[55]

## మనుమసిద్ధి : క్రీ.శ. 1248 - 1263

ఈ మనుమసిద్ధి రాజును వీరగండగోపాల అని కూడా అంటారు. ఇతని పాలనా కాలంలో నెల్లూరు రాజ్యం చాలా ఒడిదుడుకులకు లోనైంది. తిక్కన, బయ్యనలను వారు మనుమసిద్ధిపై తిరుగుబాటు చేసి నెల్లూరు సింహాసనాన్ని ఆక్రమించారు.[56] మహాభారతాన్ని తెలుగులో వ్రాసిన కవి తిక్కన మనుమసిద్ధి తరపున ఓరుగల్లు వెళ్ళి కాకతి గణపతిదేవుని సహాయం కోరాడు. గణపతిదేవుడు తిక్కన-బయ్యనలను ఓడించి మనుమసిద్ధికి నెల్లూరు రాజ్యం తిరిగి ఇప్పించాడు.[57]

అద్దంకిని పరిపాలించిన యాదవ రాజులలో సారంగధరుడు చాలా గొప్పవాడు. ఇతడు క్రీ.శ. 1256లో నెల్లూరుపై దాడి చేశాడు. కవి తిక్కన తన నిర్వచనోత్తర రామాయణంలో మొదటి తిక్కరాజు కుమారుడైన మనుమసిద్ధి, అద్దంకి యాదవులపై యుద్ధం చేసినట్లు వ్రాశాడు.[58] కాకతీయులు అద్దంకి పాలకుడైన సారంగధరుని సమర్థించారు. అందువలన నెల్లూరు తెలుగుచోడులు అద్దంకి యాదవులను ఓడించలేకపోయారు. బహుశా నెల్లూరు తెలుగు చోడులు కాకతీయులతో, అద్దంకి యాదవులతో సంధి ఒప్పందం కుదుర్చుకుని ఉండవచ్చు.

మనుమసిద్ధి రాజు పాండ్యులతో యుద్ధం చేయలసిన పరిస్థితి ఏర్పడింది. పాండ్యరాజైన జటావర్మ సుందరపాండ్యడు నెల్లూరును ఆక్రమించాలని పథకం వేశాడు. మనుమసిద్ధి మూడవ రాజేంద్రచోళునికి సామంతునిగా ఉండేవాడు.[59] పాండ్యులకు, చోళరాజులకు సఖ్యతలేదు. అందువలన పాండ్యులు మూడవ రాజేంద్రచోళుని, అతని మిత్రుడు కంచిని పాలించే విజయగండగోపాలుని కూడా ఓడించాలనుకున్నారు.

పాండ్యులు మొదట విజయగండ గోపాలుని, అతని స్నేహితుడైన కాడవ అధిపతి కొప్పెరుంజగునిపై దాడి చేశారు. పాండ్య సేనలు కంచి, కాడవ పాలకులను ఓడించాయి. విజయగండ గోపాలుడు, కొప్పెరుంజగుడు పాండ్యులకు లొంగి పోయారు. అతరువాత వీరు

పాండ్యుల తరపున నెల్లూరు దాడికి బయలుదేరారు. మనుమసిద్ధి రాజు, కాకతి గణపతిదేవుని, దేవగిరి యాదవులను బాణపాలకుల సహాయం కోరాడు. గణపతిదేవుడు. కొప్పెరుంజగుని ఓడించాడు. కాని జటావర్మ సుందర పాండ్యుడు తన సైన్యంతో నెల్లూరుపై దాడి చేసి మనుమసిద్ధి (వీరగండగోపాల)ని ముత్తుకూరు వద్ద క్రీ.శ. 1263లో చంపివేశాడు.[60] మనుమసిద్ధికి సహాయంగా వచ్చిన కాకతీయులు, దేవగిరి యాదవులు, బాణపాలకులు పాండ్యుల దాటికి నిలువలేక పారిపోయారు. నెల్లూరు, కంచి ప్రాంతాలను పాండ్యులు తమ రాజ్యంలో కలుపుకున్నారు. జటావర్మ సుంద్దర పాండ్య విజయసూచికంగా నెల్లూరు, కంచి ప్రాంతాలలో వీరాభిషేకము జరుపుకున్నాడు.[61]

## నల్లసిద్ధి : క్రీ.శ. 1276 - 1282

మనుమసిద్ధి (వీరగండ గోపాల) మరణం తర్వాత నెల్లూరు కంచి ప్రాంతాలు పాండ్యుల పాలనలోకి వచ్చాయి. చోళ రాజైన వీర రాజేంద్రుడు పాండ్యులకు సామంతుడై నెల్లూరును క్రీ.శ. 1263 నుండి 1268 వరకు పాండ్యుల తరపున పాలించాడు. ఆతరువాత చోళ రాజైన వీర రాజేంద్రుని కాకతీయుల సేనాధిపతి నాగదేవ మహారాజు ఓడించి నెల్లూరును ఆక్రమించాడు.[62] క్రీ.శ. 1268 నుండి 1276 వరకు నెల్లూరు నాగదేవ మహారాజు పాలనలో ఉన్నది. క్రీ.శ. 1276 తర్వాత మనుమసిద్ధి (వీరగండ గోపాల) కుమారుడైన నల్లసిద్ధి - పాండ్యులు, కంచిపాలకుడైన విజయగండ గోపాలుని సహాయంతో నెల్లూరు సింహాసనాన్ని అధిష్టించాడు.[63]

ఈ నల్లసిద్ధి ప్రసక్తి కంచి వరదరాజస్వామి దేవాలయంలోని శాసనంలో వివరించబడింది.[64] కాటమరాజు క్రీ.శ. 1282లో యరగడ్డపాడులో యుద్ధం చేసింది ఈ నల్లసిద్ధి రాజుతోనే. ఈ శాసనంలో - కంచి పాలకుడైన త్రిభువన చక్రవర్తి విజయగండగోపాలుడు క్రీ.శ. 1250లో రాజ్యానికి వచ్చినట్లు తెలుపుతుంది. ఇతడు తెలుగు చోడవంశానికి చెందినవాడు.[65] ఇతడు గండ గోపాల మాడ - అను పేరుతో నాణాలను ముద్రించాడు ఇతనికి నల్లసిద్ధి రాజు అనునతడు సామంతుడుగా ఉన్నాడు. ఈ నల్లసిద్ధి రాజుకు మహారాజాధి రాజు,[66] రాజ పరమేశ్వర,[67] పల్లవకుల తిలక,[68] ముక్కంటి కాడువెట్టి వంశావతార,[69] తిరుకాలట్టి దేవ (ఇరుముడి తిరుకాలట్టి దేవ) మొదలైన బిరుదులున్నాయి.ఇందులో నల్లసిద్ధి రాజును వర్ణించిన విధానమే నెల్లూరును పాలించిన నల్లసిద్ధిని తాళపత్ర గ్రంథాలలో వర్ణించిన దానికి సరిగా సరిపోతుంది. ముఖ్యంగా యరగడ్డపాటి పోట్లాట[70] దక్షిణాది ఆవుల మేపు మరియు భట్టు రాయబారం మొదలగు తాళపత్ర గ్రంథాలలో నెల్లూరు నల్లసిద్ధిని కవులు వర్ణించారు. ఈ నల్లసిద్ధిరాజు పుల్లరి విషయమై కాటమరాజుతో యుద్ధం చేసి యరగడ్డపాడులో క్రీ.శ. 1282లో మరణించాడు.[71]

## మనుమగండ గోపాల : క్రీ.శ. 1282 - 1290

నల్లసిద్ధి మరణం తర్వాత అంబదేవుని సహాయంతో మనుమగండ గోపాలుడు నెల్లూరు రాజ్యాన్ని ఆక్రమించాడు.[72] యరగడ్డపాడు యుద్ధం తరువాత నెల్లూరు తెలుగు చోడవంశంలో సింహాసనం కొరకు అంతఃకలహాలు జరిగి ఉండవచ్చు. అందువలన అంబదేవుడు మనుమగండ గోపాలునికి సహాయం చేసి నెల్లూరు సింహాసనం అప్పగించాడు.[73] కాకతీయ సేనాధిపతి ఆడిదంమల్లు నెల్లూరు పై దాడి చేసి మనుమగండ గోపాలుని క్రీ.శ. 1290లో చంపి వేశాడు. ఆడిదంమల్లు మనుమగండ గోపాల శిరఃఖండన బిరుదు తీసుకొన్నాడు.

## రాజగండ గోపాల : క్రీ.శ. 1291 - 1310

నెల్లూరు సింహాసనాన్ని రాజగండ గోపాలుడు క్రీ.శ. 1291లో అధిష్టించాడు. ఇతడు

పాండ్యులను సమర్థించి కాకతీయులను వ్యతిరేకించాడు. కాకతీయ ప్రతాపరుద్రుని అనుమతితో బొలియ నాయకుడు నెల్లూరుపై దాడి చేసి రాజగండ గోపాలుని ఓడించి, ప్రతాపరుద్రుని అధికారం అంగీకరించునట్లు చేశాడు. ఓరుగల్లుపై మాలిక్ కపూర్ దాడి చేసినపుడు రాజగండ గోపాలుడు నెల్లూరులో స్వాతంత్ర్యం ప్రకటించుకొన్నాడు. కాని కాకతీయ సేనాధిపతి ముప్పిడి నాయకుడు, అతని కుమారుడు పెదరుద్ర సేనాని, రాజగండ గోపాలుని ఓడించి నెల్లూరును కాకతీయ సామ్రాజ్యంలో కలిపి వేశారు.[74]

## 5. తూర్పు గాంగులు :

కళింగ ప్రాంతాన్ని క్రీ.శ. 5వ శతాబ్దం నుండి తూర్పు గాంగ వంశానికి చెందిన రాజులు పరిపాలించారు. ఈ రాజవంశాన్ని తొలి తూర్పు గాంగ వంశము, మధ్య తూర్పు గాంగ వంశము, అనంతర తూర్పు గాంగ వంశము అను మూడు భాగాలుగా విభజించవచ్చు. కళింగ నగరం గాంగ వంశ రాజుల రాజధాని నగరం. వీరికి త్రి కళింగాధిపతి అని బిరుదు ఉన్నది. తామ్రశాసనాల ద్వారా తూర్పు గాంగ వంశపు రాజుల చరిత్ర ఎక్కువగా తెలుస్తుంది. దక్కన్‌లోని చాళుక్యులు, మైసూర్‌లోని పశ్చిమ గాంగ వంశము వారు వారి శాసనాలలో శక సంవత్సరాలను ఉపయోగించగా - తూర్పు గాంగ వంశంవారు మాత్రం "గాంగేయ సంవత్సరాన్నే"[75] ఉపయోగించారు. ఇది వారి స్వతంత్ర ప్రతిపత్తిని తెలియజేస్తుంది.

మూడవ వజ్రహస్తుడు తన శాసనాలలో తనను తన పూర్వీకులను త్రికళింగాధిపతులుగా వర్ణించుకున్నాడు. తుర్పు గాంగ వంశం వారికి మధ్యమ కళింగ (యలమంచిలి) పై క్రీ.శ. 1070 నుండి 1197 వరకు ఆధిపత్యం లేదు.[76]

### మూడవ వజ్రహస్తుడు : క్రీ.శ. 1038 - 1070

ఇతడు అనంతర తూర్పు గాంగ వంశానికి మూల పురుషుడు. మదుకమార్ణవ, వినయమహాదేవి, మూడవ వజ్రహస్తుని తల్లిదండ్రులు. అనంతవర్మ పరమ మహేశ్వర, పరమ భట్టారక, రాజాధిరాజ, మరియు త్రి కళింగాధిపతి, ఈయనకున్న బిరుదులు. వజ్రహస్తుడు మధ్యమ కళింగను పాలించినట్లు ఆధారాలు లేవు.[77] ఇతని కాలంలో కళింగ నగరం, దంతపురం రెండు రాజధానులు కలవు. తూర్పు గాంగ వంశము రాజులలో అంక పద్ధతిలో శిలాశాసనాలు వేయించిన మొదటి రాజు, చోళ రాజైన వీర రాజేంద్రుడు, కళింగ పై దాడి చేసి క్రీ.శ. 1069లో మూడవ వజ్రహస్తుడిని ఓడించాడు.

### రాజరాజ దేవేంద్రవర్మ : క్రీ.శ. 1070 - 1078

ఇతడు మూడవ వజ్రహస్తుని కుమారుడు. కళింగ రాజ్యాన్ని ఎనిమిది సంవత్సరాలు పరిపాలించాడు. త్రికళింగాధిపతి బిరుదు వహించాడు. మధ్యమ కళింగ మాత్రం ఇతని అధికారంలో లేదు. చోళ రాజేంద్రుడు కళింగపై దాడి చేశాడు. కాని రాజరాజదేవేంద్రవర్మ చోళ రాజేంద్రుని ఓడించాడు. చోళరాజేంద్రుడు తన కూతురు రాజ సుందరిని రాజరాజ దేవేంద్రవర్మకు ఇచ్చి వివాహము జరిపించాడు. ఈ వివాహము ద్వారా ఇరువురి మధ్య శాంతి సంధి జరిగింది. ఇతనికి బణపతి అను ప్రధాన మంత్రి ఉన్నాడు. గొప్ప యుద్ధ వీరుడు, బణపతి చోళ, చాళుక్య, ఉత్కళ, కోసల, కిమిడి, సిద్రి, సింగి మొదలైన రాజులను ఓడించాడు. దణార్ణవుడు కూడా బణపతి చేతిలో పరాజయం పొందాడు.

### అనంతవర్మ చోడగంగ దేవ : క్రీ.శ. 1078 - 1162

ఇతుడు రాజ్య విస్తరణ కార్యక్రమానికి పూనుకున్నాడు. ఉత్కళ ప్రాంతాన్ని జయించాడు. ద్రాక్షారామంలోని శాసనం ప్రకారం అనంతవర్మ చోడగంగ దేవుడు దక్షిణ కళింగను తన

అధీనంలోనికి తెచ్చుకుని రాజ్యాన్ని సింహాచలం నుండి గౌతమి నది వరకు విస్తరింపచేశాడు. రాజధానిని కళింగ నగరం నుండి కటకంకు మార్చివేశాడు.[78] విక్రమగంగ, ప్రతాప గంగ మహారాజాధి రాజ, రాజాధి రాజ, రాజపరమేశ్వర మొదలగు బిరుదులు కలవు.

## కమార్ణవ : క్రీ.శ. 1147 - 1156

అనంతవర్మ చోడగంగదేవుని కుమారుడు కమార్ణవుడు. వెల్నాటి పాలకుడు రెండవ గొంకరాజు క్రీ.శ. 1154లో కళింగ పై దాడి చేసి దక్షిణ కళింగను స్వాధీనం చేసుకున్నాడు. ఈ ప్రాంతానికి యలమంచిలిని రాజధానిగా చేసి కొంతకాలం పరిపాలించారు.

## రాఘవ : క్రీ.శ. 1156 - 1170

కమార్ణవుని సోదరుడు రాఘవ. క్రీ.శ. 1156లో సింహాసనం అధిష్టించాడు. సేనదేశాధిపతి విజయసేనుడు కళింగపై దాడి చేసి రాఘవుని ఓడించాడు. ద్రాక్షారామ శాసనము ప్రకారము వెల్నాడు, పాలకుడు రెండవ రాజెంద్ర కులోత్తుంగ చోళుడు క్రీ.శ. 1156లో కళింగపై దాడి చేశాడు. కళింగ శాసనంలో రాఘవుని పేరు అనంతవర్మ దేవిదాసు, రణరంగ రాఘవ. అని పేర్కొనబడింది.

## రాజరాజ II : క్రీ.శ. 1170 - 1190

రాఘవుని సోదరుడు రాజరాజు. ఇతనికే అనంతవర్మ అని మరో పేరున్నది. రాజరాజ సింహాచలం దక్షిణ ప్రాంతాన్ని ఆక్రమించి గౌతమి నది వరకు విస్తరింపచేశాడు. రెండవ గొంకరాజు కోనసీమ, పిఠాపురం, పీరగొట్టం, కళింగ నగరాన్ని క్రీ.శ. 1188లో ఆక్రమించాడు. రెండవ రాజరాజ, రెండవ గొంకరాజుకు సామంతుడుగా ఉన్నాడు.

## అనియంక భీమ - II : క్రీ.శ. 1190 - 1198

రెండవ రాజరాజ సోదరుడు అనియంక భీముడు. స్వప్నేస్వరుడు ఇతని ఆస్థాన కవి. గోవిందుడు మంత్రి. స్వప్నేశ్వరుడు, గోవిందుడు - స్వప్నేశ్వర, చాటేశ్వర దేవాలయాలను కట్టించారు.

## రాజరాజ III : క్రీ.శ. 1198 - 1211

అనియంక భీముని కుమారుడు రాజరాజ–III ఇతనికి అనంతవర్మ అను మరో పేరున్నది. యలమంచి చాళుక్య వంశానికి చెందిన మంకుణదేవి (మల్లనదేవి - సద్గుణదేవి)ని వివాహమాడాడు. కాకతి గణపతిదేవుడు వెల్నాటి పృధ్వీశ్వరుని ఓడించిన తరువాత కళింగ వరకు దాడి చేసి విజయం సాధించాడు.[79]

కాటమరాజు తాత యలమంచి పాలకుడు అవుల వలురాజు ఓరుగల్లు పాలకుడైన కాకతి గణపతి దేవునికి సమకాలికుడు.[80]

12వ శతాబ్దం ప్రారంభం నుండి తీరప్రాంతాలు తూర్పు చాళుక్యులు, అనంతర చాళుక్యులు, కాకతీయులు, నెల్లూరు తెలుగు చోడులు, తూర్పుగాంగ వంశము మరియు యాదవుల పాలనలో ఉన్నాయి.

# నోట్స్ అండ్ రిఫరెన్సు


1. డా॥ యస్. రమేషన్ : ది ఈస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి, 1975; పుట : 9
2. ఇదే పుట : 33
3. యాజదాని; సం॥ : ది ఎర్లీ హిస్టరీ ఆఫ్ డక్కన్ భాగములు VII-XI 1960 పుట : 490
4. డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు: ఆంధ్రుల చరిత్ర ; 1983 ; పుట : 177
5. రమేషన్ : పుట : 34
6. యాజదాని : పుట 492
7. రమేషన్ : పుట : 35
8. యాజదాని : పుట : 496
9. రమేషన్ : పుట : 38
10. కొల్లూరు సూర్యనారాయణ : హిస్టరీ ఆఫ్ ది మైనర్ చాళుక్యా ఫామిలీస్ ఇన్ మిడివల్ ఆంధ్రదేశ 1986 - ప్రిపేస్ పుట : XVIII
11. ఇదే పుట : 118
12. ఇదే
13. సూర్యనారాయణ : పుట : 123
14. ఇదే పుట : 123
15. ఇదే
16. డా॥ పి.వి.పరబ్రహ్మశాస్త్రి : ది కాకతీయాస్ ; 1978 పుట : 23
17. ఇదే
18. ఇదే
19. ఇదే పుట : 23
20. ఇదే పుట : 26
21. మున్షి కె.ఎం. : ది మాజిక్ ఫ్లూట్ కృష్ణావతార - 1 ; 1972, పుట : 3
శ్రీ మహా భాగవతము సం॥, ఆచార్య రాయప్రోలు సుబ్బారావు మరియు తదితరులు,
బమ్మెర పోతవ : భాగము - II, 1987; నవమస్కందము పుట : 291
22. ఆర్.సి. ముజుందార్ మరియు
కె.కె.దాస్‌గుప్త, సం॥ ఎ కాంప్రహెన్సివ్ హిస్టరీ ఆఫ్ ఇండియా, భాగము -III ; 1981
దీ రాష్ట్రకూటాస్ ; పుట : 440-41
23. ఖండవల్లి లక్ష్మీరంజనం, సం॥ శ్రీ సిద్ధేశ్వర చరిత్రము - కాసె సర్వప్ప, 1960; పుట : 113.
24. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ రిపోర్ట్ ఆన్ ఎపిగ్రఫి ఫర్ 1965 ; 1968 : పుట : 47
25. ఇదే పుట : 99.
26. ఇదే

27. ఇదే
28. ది హిస్టరీ ఆఫ్ ఆంధ్ర కంట్రీ (1000 క్రీ.శ. నుండి 1500) చాప్టర్ ది యాదవాస్ : యశోదాదేవి, జె.ఎ.హెచ్.ఆర్.ఎస్. భాగము - XXIII జులై 1954 నుండి ఏప్రియల్ 1956 — పుట : 12
29. పరబ్రహ్మశాస్త్రి — పుట : 168
30. ఇదే
31. ఇదే
32. ఇదే
33. ఇదే
34. ఇదే — పుట : 108
35. ఇదే
36. కాసే సర్వప్ప, శ్రీ సిద్ధేశ్వర చరిత్రము - ప్రీ పేస్ ; — పుట : lxiii
37. పరబ్రహ్మశాస్త్రి — పుట : 128
38. ఇదే
39. ఇదే.
40. కాసే సర్వప్ప, ప్రీఫేస్ — పుట : lxix
41. ఇదే — పుట : lxvi
42. ఆలన్ బట్టర్ వర్త్ మరియు వేణుగోపాలశెట్టి, సం॥ నెల్లూరు డిస్ట్రిక్ట్ ఇన్స్క్రిప్షన్స్ భాగము - 11, 1905, — పుట : 527 - 30
43. డా॥ సి.వి.రామచంద్రరావు - సం॥ ప్రతాప చరిత్ర - ఏకామ్రనాథ ; 1984, — పుట : 35
44. ఇదే
45. పరబ్రహ్మ శాస్త్రి — పుట : 169
46. ఇదే
47. ఇదే — పుట : 129
48. ఇదే — పుట : 130
49. ఇదే — పుట : 131
50. ఆంధ్రప్రదేశ్ యాన్యువల్ రిపోర్టు ఆన్ ఎపిగ్రఫి : 1919-20 — పుట : 116
51. డా॥ పాటిబండ్ల మాధవశర్మ, సం॥ నిర్వచనోత్తర రామాయణం - తిక్కన ; 1968, — పుట : 6
52. ఎ.ఆర్.ఇ. - 1967 — పుట : 9.
53. వి. యశోదాదేవి - జె.ఎ.హెచ్.ఆర్.ఎస్. — పుట : 9

54. యాదవకింగ్ ఎల్లనదేవ, డా॥ టి.వెంకటేశ్వరరావు ; ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ ప్రొసీడింగ్స్ ; 1985 - పుట : 42

55. ఎ.ఆర్.ఇ. 1919 - 20 క్రీ.శ. పుట : 116 - 117

56. హనుమంతరావు పుట : 231 - 232

57. ఇదే పుట : 232

58. తిక్కన నిర్వచనోత్తర రామాయణం పుట : 9

59. ఎ.ఆర్.ఇ. 1919-20 పుట : 116

60. హనుమంతరావు ; పుట : 233

61. ఇదే

62. ఇదే

63. ఇదే

64. ఎ.ఆర్.ఇ. 1919-20 పుట : 118

65. ఎ.ఆర్.ఇ. 1900 పుట : 117

66. ఎ.ఆర్.ఇ. 1919 - 20 పుట : 118

67. ఇదే

68. ఇదే

69. ఇదే

70. వేటూరి ప్రభాకరశాస్త్రి - సం॥ కాటమరాజు కథ - 1953, గంగుల పిన యల్లయ్య పుట : 159

71. గంగుల పిన యల్లయ్య - ఎరగడ్డపాటి పోట్లాట, తా.ప.గ్రం. తా.ప.నెం. 41

72. యాజదాని పుట : 631

73. ఇదే

74. హనుమంతరావు పుట : 234

75. ది ఈస్టర్న్ గంగాస్ ఆఫ్ కళింగ ; ఎన్. రమేషన్, కాపర్ ప్లేట్ - ఇన్స్‌క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ మ్యూజియం, భాగము - 1, 1962 పుట - 128

76. డా॥ ఎన్. ముకుందరావు, కళింగ అండర్ ది ఈస్టర్న్ గంగాస్-పి.హెచ్.డి.థీసిస్ 1988, పుట : 58

77. ముకుందరావు పుట : 58

78. కాపర్‌ప్లేట్ ఇన్స్‌క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ మ్యూజియం, హైదరాబాద్, పార్టు - 1, పుట : 133

79. ఇదే పుట : 93.

80. డా॥ టి. వెంకటేశ్వరరావు ఎ.పి.హెచ్.సి. ప్రొసీడింగ్స్ ; పుట : 42-43.


---

# 2

# బడుగుల వంశం పుట్టు పూర్వోత్తరాలు

ఆంధ్రదేశం తీర ప్రాంతాలలో పరిపాలన సాగించిన యాదవరాజుల గురించి జన్నివాడ కథ, కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు, పెద్దిరాజు కథ, మరియు పోలురాజు కథ, తాళపత్ర గ్రంథాలు తెలుపుతున్నాయి. ఈ తాళపత్రాలలో వివరించిన విషయాలు కొన్ని శిలాశాసనాలలో కుడా తెలుపబడినాయి![1] కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు - తాళపత్ర గ్రంథంలో కాటమరాజు కుటుంబాన్ని బడుగుల వారిగా వర్ణించటం జరిగింది. గుండ్లపాలెం, గంగదొనకొండ శాసనాలలో కూడా కాటమరాజు వంశీయులను బడుగుల వారిగా పేర్కొన్నారు.[2]

కవులావుల గంగురాజు బడుగుల కుటుంబానికి మూల పురుషుడని జన్నివాడ కథ తాళపత్ర గ్రంథం ద్వారా తెలుస్తున్నది.[3] ఆవుల భూపతి[4] మరియు ఆవుల అమృతయ్య[5] ఈ కుటుంబములో ప్రముఖమైన వారు. వీరిని గురించిన వివరాలు పూర్తిగా తెలియటం లేదు. కాటమరాజు తాత ఆవుల వలురాజుకు అయిదుగురు కుమారులు - సింహాద్రి రాజు, పెద్దిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు మరియు ఒక కుమార్తె. ఆమె పేరు కొమరమ్మ.[6] కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు తాళపత్ర గ్రంథం బడుగుల కుటుంబం యొక్క పుట్టుపూర్వోత్తరాల గురించి ఈ విధంగా తెలియచేస్తున్నది.[7]

ఒకానొక కథ ప్రకారము - శంకరుడు, కాముడు ఒకరినొకరు ఓడించుకొనుటకు పందెం కాస్తారు. ఆ సందర్భంలో దేవతలు శంకరుని దర్శనం కోసం వస్తారు. కాని శంకరుడు వారికి కన్పించలేదు. దేవతలు శంకరుని కొరకు విపరీతంగా వెతుకుతారు. వెతకి వెతకి అలసిపోయారు. చివరకు దేవతలంతా అంభోజబిలం వద్దకు చేరుకుంటారు. అక్కడ "ఆవులరాజు" అధికారంలో ఉంటాడు. అతడికి గొప్ప పశు సంపద ఉన్నది. ఆవులను కాపలా కాయడానికి కొంతమంది గోపాలకులను నియమించాడు. ఆ రాజు గోపాలకులు పెరుగును త్రాగి మిగిలినది కడవలో భద్రపరిచి జాగ్రత్తగా పొదచాటున దాచి పశువులను మేపుటకు వెళ్లారు. శంకరుని కోసం వెతకి అలసిపోయిన దేవతలు ఆకలి, దాహంతో అలమటించిపోతున్నారు. గోపాలకులు దాచిన పెరుగుకుండ అనుకోకుండా దేవతలకంట పడింది. వెంటనే దేవతలంతా ఆ పెరుగుకుండ చుట్టూ గుమిగూడి పెరుగు త్రాగటం మొదలుపెట్టారు.

ఈ తతంగమంతా ఒక గోపాలుడు కనిపెట్టాడు. వెంటనే అక్కడికి వచ్చి తన చేతి కర్రను పైకెత్తి కొట్టబోయాడు. దేవతలు అది గమనించి తాము దేవతలమని తమను తాము పరిచయం చెసుకున్నారు. అంతట గోపాలుడు విచారం ప్రకటించి, ఆ పెరుగును కొంత తాము త్రాగామని, అందువలన అది ఎంగిలి పడిన పెరుగని తెలియజేస్తాడు. అయినా దేవతలు తప్పులేదని ఆ పెరుగును పూర్తిగా త్రాగి అలసట తీర్చుకుంటారు. దేవతలు ఆ ప్రాంతపు 'ఆవులరాజు'ను - బడుగులరాజుగా వర్ణించి ఆశీర్వదించారు. ఆరోజునుండి ఆవుల రాజు కుటుంబాన్ని బడుగుల కుటుంబంగా పిలుస్తున్నారు. కాటమరాజు ఈ బడుగుల కుటుంబానికి చెందినవాడు. కాటమరాజు పూర్వీకులు అమరావతి, ద్వారావతి, పెదగవిలిపట్నం, పినగవిలిపట్నం మరియు యలమంచిపట్నం[8] పరిపాలించినట్లు పెద్దిరాజు కథ - తాళపత్ర గ్రంథంలో వివరించబడింది.

ప్రస్తుతం అమరావతి మరియు యలమంచి ఆంధ్రదేశంలోని గుంటూరు, విశాఖపట్టణం జిల్లాలో ఉన్నాయి. ద్వారావతి, పినగవిలిపట్నం, పెదగవిలిపట్నం ఆంధ్రదేశంలో ఎక్కడ ఉన్నది

సరిగా తెలియదు. బహుశా ద్వారావతి గుజరాత్ రాష్ట్రంలోని ద్వారక అయి ఉండవచ్చు. శ్రీకృష్ణుడు ద్వారకను పరిపాలించాడు. ఆ పేరుతో కోస్తా ఆంధ్రదేశంలో పూర్వం ఏదైనా ప్రాంతం ఉండి ఉండవచ్చు. పినగవిలిపట్నం, పెదగవిలి పట్నం ఈ రెండు కూడా కోస్తా ఆంధ్రలో ఉండే అవకాశం ఉన్నది.

శ్రీ కృష్ణుడుకు ఎనిమిది మంది భార్యలు.[9] ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దిపతమద్భానుడు, సాంబుడు, మిత్ర, బృహత్‌బాను, మిత్రవిశుడు, వృక్ళ, అరును, పుష్కర, దేవభాను, శృతదేవ, సునందన, చిత్రభాను, వరుధ, కవి, న్యాయగ్రోధ్రు, ఉపస్తక మొదలైనవారు శ్రీకృష్ణుని పుత్రులలో ప్రముఖులు.[10] ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు.[11] ఇతని కుమారుడు వజ్రుడు.[12] శ్రీకృష్ణుని మనుమడు[13] వజ్రుడు కలియుగంలో మథురను పరిపాలించాడు.[14] మథుర నుండి కొందరు యాదవులు దక్షిణదేశం వైపు తరలివచ్చి మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్ర ప్రాంతాలలో నివాసమేర్పరచుకొని పరిపాలన సాగించారు.

కాకతీయ వంశానికి చెందిన రుద్రమదేవి రెండవ అల్లుడైన యాదవయల్లన దేవుడు శక సంవత్సరం 1186 (క్రీ.శ. 1264)లో వేయించిన ఆలపాడు శాసనంలో యాదవ వంశానికి చెందిన శ్రీకృష్ణదేవుని కుమారుడైన శ్రీకృష్ణ కన్నర వరహదేశంలోని వర్ధమానపురంను పరిపాలించినట్లు తెలుపుతుంది. వరహానదికి ఇరుప్రక్కలనున్న ప్రాంతమును వరహదేశమంటారు.[15] దీనినే 'వరహవిషయ' లేక వరహదేశమని అంటారు. ఇది ప్రస్తుతం విశాఖపట్టణం - విజయనగరం - శ్రీకాకుళం జిల్లాలుగా విభజింపబడి ఉన్నది. యాదవులు ఆంధ్రదేశంలో వర్ధమానపురం నుండి అధికారం చలాయించారు.[16] అందువలన వర్ధమాన పురాదీశ్వరులని బిరుదు తీసికొన్నారు. తరువాత యలమంచి ప్రాముఖ్యతను పెంచుకొని వరహదేశంలో యాదవులకు రాజధానిగా కొంతకాలం విరాజిల్లింది.[17]

ఈ వరహదేశంలో - మద్గోల్ ప్రాంతమందు గొల్లరాజులు కోటలు కట్టి పరిపాలన చేసినట్లు ప్రజలు కథలు కథలుగా చెప్పుకుంటున్నారు. మద్గోల్ ప్రాంతంలోని కొండలను గొల్లకొండలని పిలుస్తున్నారు. యాదవులకు పశుసంపద ఎక్కువగా ఉండేది. ఈ గొల్ల కొండల ప్రాంతమంతా ఆవుల వలురాజు పాలనలో ఉన్నది.[18]

యలమంచిని పాలించిన రాజులలో బడుగుల కుటుంబానికి చెందిన ఆవుల వలురాజు ప్రముఖమైనవాడు. అతనికి అయిదుగురు కుమారులు, ఒక్కతే కూతురు.[19] వారు సింహాద్రిరాజు, పెద్దిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు మరియు కొమరమ్మ. పెద్దిరాజు కొడుకు కాటమరాజు,[20] కూతురు పాపనూక.[21]

---

# నోట్స్ అండ్ రిఫరెన్సు


| | | | |
|---|---|---|---|
| 1. | ఎస్.ఓ.ఐ. - భాగము , II | | పుట : 527 |
| 2. | ఇదే | భాగము , I | పుట : 318 |
| 3. | కనకబండి గట్టయ్య | జన్నివాడ కథ, తాళపత్రగ్రంథం | తా.ప.నెం. : 22 |
| 4. | ఇదే | | |
| 5. | ఇదే | | |
| 6. | ఇదే | | తా.ప.నెం. : 23 |
| 7. | డా. తంగిరాల వెంకట సుబ్బారావు, సం॥ వీరగాథలు - II, కాటమరాజు కథలు, 1978; కాటమరాజు ఉత్తరాది అవుల మేపు; తా.ప.గ్రం. | | పుట : 21 |
| 8. | రచయిత పేరు తెలియదు | పెద్దిరాజు కథ; తా.ప.గ్రం. | తా.ప.నెం. : 7 |
| 9. | బత్తుల లక్ష్మయ్య | రాజవంశ ప్రదీపిక, 1958, | పుట : 84 |
| 10. | ఇదే | | |
| 11. | ఇదే | | పుట : 84 |
| 12. | ఇదే | | పుట : 85 |
| 13. | ఇదే | | |
| 14. | ఇదే | | |
| 15. | కాపర్‌ప్లేట్ ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, గవర్నమెంట్ మ్యూజియం, భాగము-I | | పుట : 111 |
| 16. | విశాఖపట్నం, పాలకొండ తాలూకాలోని వడమ గ్రామమే వర్ధమానపురం కుందూరు ఈశ్వరదత్తు ; | ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం | పుట : 290 |
| 17. | డా. టి.వెంకటేశ్వరరావు, | ఎ.పి.హెచ్.సి. ప్రొసీడింగ్స్ | పుట : 40 |
| 18. | ఇదే | | పుట : 41-42 |
| 19. | పడరుపమద్దులేటి కవి ; | అవుల వలురాజు చరిత్ర; తా.ప.గ్రం. | తా.ప.నెం. : 32 |
| 20. | పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం. | | తా.ప.నెం. : 11 |
| 21. | ఇదే | | తా.ప.నెం. 1. |

## కాటమరాజు వంశావళి

కవులావుల గంగురాజు (గంగమ్మ)

- అవుల వలురాజు (వల్లమ్మ)
  - సింహాద్రిరాజు (సింహాద్రి సీత)
    - కరియావుల రాజు (కరియావుల నాగ)
    - చిటినూక (కల్లందుల పొలినీడు)
  - పెద్దిరాజు (పెద్దమ్మ)
    - కాటమరాజు (వీరగంగ)
    - పాపనూక
  - యరనూకరాజు (యరనూకసీత)
    - భట్టావులన్న లేక భట్టావుల వల్లభన్న (సూరాంబిక)
    - నాగమ్మ
  - నలనూకరాజు (నలనూక సీత)
    - పెయ్యల యఱ్ఱయ్య (బయ్యాంబిక)
    - పొట్టినూక
  - పొలురాజు (సిరిదేవి లేక నూకాంబ)
    - భక్తిరన్న (నల్లమాంబ)
    - అయితమరాజు (నేతివారి పోతు)
      - అల్లుదాడెన్న
      - సిరిగిరెమ్మ (పొచయ్య)
    - ముమ్మయ్య (చినమల్లు)
    - అగుమంచి (పుత్తమరాజు)
  - కొమరమ్మ (పందుముల పాపినీడు)
    - పల్లికొండ
    - పుత్తమరాజు
    - చట్టువారి యఱ్ఱయ్య
    - నాచకూళ్ల నాయుడు
    - పుల్లావుల కేశవయ్య
- హరిపాల
- నందగోపాల
- గోవర్ధన



# 3

# కాటమరాజు పూర్వీకులు

## I. అవుల వలురాజు : క్రీ.శ. 1170 - 1195

కాటమరాజు తాత వలురాజు రాజకీయ జీవిత విశేషాలను పడరుపమద్దులేటి కవి తన అవుల వలురాజు చరిత్ర తాళపత్ర గ్రంథంలో వివరించాడు.[1]

బడుగుల కుటుంబంలో కవులావుల గంగురాజు ప్రముఖుడు. క్రీ.శ. పన్నెండవ శతాబ్దంలో ఇతడు యలమంచి ప్రాంతాన్ని పరిపాలించాడు. కవులావుల గంగురాజు భార్య గంగమ్మ శివభక్తురాలు. వీరికి వలురాజు, హరపాలుడు, నందగోపాలుడు మరియు గోవర్ధనుడు అను నలగురు కుమారులు జన్మించారు.[2]

కవులావుల గంగురాజు తర్వాత అతని పెద్ద కుమారుడు అవుల వలురాజు రాజ్యాధికారం స్వీకరించాడు. వలురాజు ఎప్పుడు యలమంచి సింహాసనం అధిష్టించింది సరిగా తెలియదు. కాని తాళపత్ర గ్రంథాలు, శాసనాల ఆధారంతో కొంత వరకు వలురాజు కాలాన్ని క్రీ.శ. 1170-1195 మధ్య నిర్ణయింపవచ్చు. తిరుమందుల తరిముత్తరాజు, వలురాజుకు ముఖ్యమంత్రి.[3] వలురాజు భార్య వల్లమ్మ భక్తిపరురాలు. ఆమెకు ఐదుగురు కుమారులు ఒక కుమార్తె కలిగారు. వారు సింహాద్రి రాజు, పెద్దిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు మరియు కొమరమ్మ.[4]

యలమంచి పట్టణానికి ఉత్తర దిశలో ఖండె మొండెముల కోట ఉన్నది. కలభూత గంగురాజు దీని పాలకుడు.[5] ప్రస్తుతము దీనిని మొండెంకల్‌గా పిలుస్తున్నారు. ఇది శ్రీకాకుళం జిల్లాలో ఉన్నది. కలభూత గంగురాజుకు ఆరుగురు మంత్రులు ఉన్నారు. వారు - అయ్యలరాజు, శివరామరాజు, భాస్కరరాజు, వీరమరాజు, దత్తమరాజు, మరియు కన్నమరాజు.[6] ఈ మంత్రులు ప్రభుత్వ ధనాగారం నుండి పన్నెండు లక్షల వరహాలను కాజేసినారు.[7] ఈ విషయం భీమరాజు[8] అను మహామంత్రి తెలుసుకొని కలభూత గంగురాజుకు ఫిర్యాదు చేశాడు. రాజు కోపగించి వెంటనే పన్నెండు లక్షల వరహాలను రాజధనాగారానికి చెల్లించవలసినదిగా మంత్రులను ఆజ్ఞాపించాడు. ఆ ధనాన్ని తిరిగి చెల్లించటానికి ఒక సంవత్సర కాలంపాటు గడువు ఈయవలసిందిగా రాజును వేడుకున్నారు. కలభూత గంగురాజు మంత్రుల కోర్కెను మన్నించి సంవత్సర కాలం గడువు ఇచ్చాడు.

ఖండెమొండెముల కోట మంత్రులు, సంవత్సర కాలంలో పన్నెండు లక్షల వరహాలు చెల్లించలేమని అనుకొని యలమంచి పాలకుడైన వలురాజును రక్షణ కోరాలని తలంచారు. ఒకనాటి అర్ధరాత్రి భార్యాపిల్లలతోసహా ఖండెమొండెముల కోటను వదలి ఆరుగురు మంత్రులు యలమంచి పట్టణం చేరుకున్నారు.

వలురాజు కొలువు తీర్చి ఉన్నాడు. పందుమల రఘుపతి, పల్లికొండ,[9] వలురాజు సలహాదారులు - తరిముత్తరాజు ముఖ్యమంత్రి - తరి శంకరయ్య, అచ్చుతుడు, దామసాని వెంగళయ్య మంత్రులు - దండెబోయిన, గుండెబోయిన, శంకరి కుటుంబాలు, రాజు ప్రముఖులు - భూమాడి శంకరయ్య, పులిముద్దు చన్నయ్య, కార్యము హనుమంతు, చల్ల భూపతి, బండారుమల్లు,[10] కల్లందుల అయ్యన్న, గంగుల రాజు, సర్దార్ దండి, ఉల్లవన్న, అసినిపాక రక్షణ

దళాధిపతులు[11] - సమావేశమై ఉన్న సమయములో ఖండెమొండెముల కోట మంత్రులు వచ్చి వలురాజును శరణు వేడుకున్నారు.[12] వలురాజును రాజాధిరాజ, భోజవంశాంబుధి, పూర్ణచంద్ర, చండమార్తాండ, ప్రచండ రణవీర - అని రకరకాలుగా పొగిడారు. కష్టాలలో ఉన్నాము కాపాడండి వలురాజా అని ప్రార్థించారు. కలభూత గంగురాజు తమను పెక్కు ఇక్కట్లకు గురిచేసినందున భార్య, పిల్లలతో సహా వచ్చామని వేడుకున్నారు. వలురాజు - ఆరుగురు మంత్రులను రక్షించుతామని అభయం వెంటనే ఇచ్చాడు.[13] అభయం ఇచ్చేముందు మంత్రి వర్గాన్ని, సలహాదారులని ఎవ్వరినీ సంప్రదించ లేదు. రక్షణ కోరి వచ్చిన మంత్రులు బ్రాహ్మణులు. ఆనాటి ధర్మం ప్రకారం బ్రాహ్మణులను రక్షించవలసిన బాధ్యత క్షత్రియుల పైన ఉన్నది. అందువలన వలురాజు బ్రాహ్మణ మంత్రులకు వెనకముందు ఆలోచన లేకుండా అభయం ఇచ్చాడు. కలభూత గంగురాజును మోసగించిన మంత్రులకు రక్షణ కల్పించటం మంచిది కాదని పల్లికొండ సలహా ఇచ్చాడు. ఖండె మొండెముల కోట - యలమంచి మధ్య తగాదాలు వస్తాయని సూచించాడు.[14] కాని వలురాజు పల్లికొండ సలహాను పాటించలేదు. వలురాజు ఆరుగురు మంత్రులను రక్షించటానికే నిర్ణయించుకున్నాడు. కష్టాలలో ఉన్నవారిని రక్షించడం క్షత్రియ ధర్మం - ఆడిన మాట తప్పటం ధర్మ విరుద్ధం అన్నాడు. ఖండెమొండెముల కోట మంత్రుల కుటుంబాలకు సకల సౌకర్యాలు కల్పించి రక్షణ యేర్పాటు చేయవలసిందిగా తన మంత్రి వర్గాన్ని ఆదేశించాడు.[15]

కలభూత గంగురాజు తన మంత్రులు యలమంచి ప్రభువైన వలురాజు రక్షణలో ఉన్నారని తెలుసుకొన్నాడు.[16] తన ఆజ్ఞలను దిక్కరించి యలమంచికి పారిపోయిన ఆరుగురి మంత్రులపై పగతీర్చుకోవాలని నిర్ణయించుకున్నాడు. అందువలన కలభూత గంగురాజు తన సేనాధిపతి సర్దార్ నరహరిని యలమంచికి పోయి ద్రోహులైన తన మంత్రులను బంధించి తీసుకరమ్మని ఆజ్ఞాపించాడు.[17]

సర్దార్ నరహరి వెయ్యిమంది అశ్వికదళంతో యలమంచి పట్టణం చేరుకున్నాడు. ఖండెమొండెముల మంత్రులను తనకు అప్పగించమని సర్దార్ నరహరి వలురాజును ప్రార్థించాడు.[18] కాని యలమంచి ప్రభువు అందుకు నిరాకరించాడు. కష్టాలలో ఉన్నవారిని రక్షించడం తన ధర్మమని సర్దార్ నరహరికి చెప్పాడు. తరి ముత్తరాజు-నరహరుల మధ్య మాటలు పెరిగాయి. మంత్రులను అప్పగించకపోతే ఖండెమొండెముల కోట గజబలం, అశ్వికదళం యలమంచి రాజ్యాన్ని పతనం చేస్తాయని నరహరి హెచ్చరించాడు. వలురాజు కుస్తీ పట్టుటలో మహా యోధుడైన బండారుమల్లును రప్పించి నరహరిపై చర్య తీసుకొమ్మని ఆజ్ఞాపించాడు. బండారుమల్లు, యలమంచి సైన్యం, నరహరి అతని అశ్వికదళాన్ని ఓడించి పంపివేశారు.

సర్దార్ నరహరి ఖండెమొండెములకోటకు తిరిగిపోయి జరిగిన విషయమంతా రాజుకు వివరించాడు. కలభూత గంగురాజు తన సోదరులైన రంగదామరాజు, రఘురామరాజు, చినగంగురాజులను యలమంచిపై దాడి చేసి వలురాజుకు గుణపాఠం చెప్పవలసిందిగా ఆదేశించాడు.[19]

ఖండెమొండెముల కోట గజబలం, అశ్విక దళం, కాల్బలం, యలమంచి వైపు కదలి వెళ్ళాయి.[20] కలభూత గంగురాజు సోదరులు యలమంచి సరిహద్దులు చేరగానే సామాన్య ప్రజలను బంధించి హింసించడం మొదలు పెట్టారు. స్త్రీలు, పిల్లలను కూడా ఇబ్బందుల పాలు చేశారు. ఆవులు తదితర పశువులను ఖండెమొండెముల వైపు తరలించుకొని కొంతసైన్యం వెళ్ళింది.[21] వలురాజు తన గూఢచారుల ద్వారా విషయమంతా తెలుసుకొని,[22] వెంటనే తన మంత్రి వర్గాన్ని, సోదరులను సమావేశ పరచి కలభూత గంగురాజును ఎదుర్కొనే విషయమై చర్చించి సలహా

తీసుకున్నాడు. వలురాజు సోదరులు, నందగోపాలుడు, హరిపాలుడు, గోవర్ధనుడు ముగ్గురు - ఖండెమొండెముల సైన్యాన్ని ఎదుర్కొనటానికి అనుమతించమని వలురాజును వేడుకున్నారు.[23] యలమంచి సైన్యం 'చెరువుటేకుమెట్ట[24]' యుద్ధభూమిలో కలభూత గంగురాజు సైన్యాన్ని ఎదుర్కొనేందుకు బయలుదేరి వెళ్ళింది.

యుద్ధం జరగటానికి ముందు కలభూత గంగురాజు తమ్ముడు రంగధామరాజు ఒక ప్రతిపాదన చేశాడు. రాజును మోసగించి ధనాన్ని అపహరించిన ఆరుగురు మంత్రులను ఖండెమొండెముల కోటకు తిరిగి పంపిస్తే యుద్ధం ఆగుతుందని, అంతకుముందు బంధింపబడిన ఆవులు, స్త్రీలు, పిల్లలను విడిచిపెడతామని యాదవులతో చెప్పారు.[25] వలురాజు సోదరుడైన గోవర్ధనుడు ఒక ప్రతిపాదన సూచించాడు. మొదట ఖండెమొండెముల కోట ప్రభువైన కలభూత గంగురాజు, యలమంచి పాలకుడైన వలురాజు కొలువుకు వచ్చి క్షమాపణ చెప్పాలి.[26] ఆ తరువాత యలమంచి గోవులను, స్త్రీలను, పిల్లలను నిర్బంధించి బాధించినందుకు ఒక లక్ష వరహాలను వలురాజుకు నష్టపరిహారంగా చెల్లించాలి.[27] యలమంచి యాదవుల ప్రతిపాదనలను కలభూత గంగురాజు సోదరులు తిరస్కరించారు.

యుద్ధం తప్పనిసరి జరగవలసిన పరిస్థితి ఏర్పడింది. యలమంచి మంత్రులైన పులిముద్దురామన్న, దామసాని వెంగన్న, బండారు మల్లు, ఖండెమొండెముల కోటకు చెందిన మంత్రులు, రామలింగన్న, రాజగోపాల, సరదార్ పాపన్నలతో తలపడ్డారు. వలురాజు సోదరులు, హరిపాల, నందగోపాల, గోవర్ధనులు, గంగురాజు తమ్ములైన రంగదామరాజు, రఘురామరాజు, చినగంగురాజులతో యుద్ధం చేశారు.[28] ఆనాటి యుద్ధ ధర్మం ప్రకారం ఒక్క యుద్ధ వీరుడు శత్రు సైన్యంలోని ఒక్క యుద్ధ వీరునితోనే పోరుసాగించాలి.

ఈ యుద్ధంలో వలురాజు ముగ్గురు సోదరులు వీరమరణం పొందారు. కలభూత గంగురాజు సోదరులతో పాటు పెక్కు ఏనుగులు, గుఱ్ఱాలు, కాల్బలము, యుద్ధభూమిలో ప్రాణాలు కోల్పోవటం జరిగింది. వలురాజు సోదరుల శవాలను పల్లకీలలో యలమంచి పట్టణంలోకి తీసుకొని వచ్చారు. తన సోదరుల శవాలు చూచి వలురాజు విచారపడ్డాడు.[29] ఖండెమొండెముల కోటను నేటమట్టం చేయాలని నిర్ణయించుకున్నాడు. వలురాజు మంత్రి పల్లికొండ ఇకనైనా యుద్ధంఆపమని వేడుకున్నాడు. కాని వలురాజు పగసాధించకుండా యుద్ధం ఆపే ప్రసక్తి లేదన్నాడు. మంత్రుల సలహాను పెడచెవిన పెట్టాడు.[30] ఖండెమొండెముల కోటపై దాడికి పల్లికొండ తమ బంధువులు, కనకనందుల, చల్లా, పల్లెబోయ్ని మొదలగు కుటుంబాల వారిని, స్నేహితులను తరలి రావలసిందిగా ఆహ్వానించాడు.[31] యలమంచి పట్టణం వెలుపల గుడారాలు వేశారు. సహాయంగా వచ్చిన సైన్యాలకు, బంధువులకు, స్నేహితులకు ఈ గుడారాలలో వసతి కల్పించారు. యుద్ధరంగానికి తరలి వెళ్ళటానికి ముందు వలురాజు పల్లికొండ సలహాతో తన రెండవ కుమారుడైన పెద్దిరాజును యలమంచి రాజ్యానికి రాజుగా ప్రకటించాడు.[32] వలురాజు ముందు జాగ్రత్త చర్యగా ఈ విధంగా చేశాడు. ఒకవేళ యుద్ధంలో వలురాజు మరణించితే ? - సింహాసనానికై కుమారుల మధ్య తగాదా వచ్చి అంతర్యుద్ధం జరగవచ్చు. ఆ విధంగా జరిగితే బడుగుల కుటుంబం బలహీనపడుతుందని తలచి పెద్దిరాజును రాజుగా ప్రకటించాడు. ఇక్కడ మరొక ధర్మ సందేహం కలుగుతుంది. సింహాద్రి రాజు పెద్దవాడు ఉండగా, రెండవ కుమారుడైన పెద్దిరాజుకు ఎందుకు రాజ్యాధికారం కల్పించినట్లు ? వలురాజు కుమారులందరిలో పెద్దిరాజు సమర్ధుడు, పరిపాలనా దక్షుడు. అందువలన పెద్దిరాజుకు అధికారం ఇవ్వవలసిందిగా పల్లికొండ వలురాజుకు సలహా ఇచ్చాడు.

యలమంచి మంత్రివర్గం యుద్ధానికి అన్ని సిద్ధం చేశారు. వలురాజు తన భార్య వల్లమ్మతో జరుగబోయే యుద్ధాన్ని గురించి వివరంగా చెప్పాడు. నూతన వస్త్రాలు ధరించి బంగారు ఆభరణాలను అలంకరించుకొని, పల్లకీలో కూర్చుని, తరిముత్తరాజు, పల్లికొండ ఇద్దరు అశ్వాలు ఎక్కి చెరోప్రక్క నడుస్తుండగా యలమంచి పాలకుడు సైన్యసమేతంగా ఖండెమొండెముల కోట పైకి దండు వెడలాడు.[33]

వలురాజు సైన్య సమేతంగా ఖండెమొండెముల కోటపైకి దాడి చేయటానికి వస్తున్నట్లు లేఖ వ్రాసి గంగురాజుకు పంపించాడు.[34] వలురాజుతో యుద్ధానికి ఖండెమొండెముల పాలకుడు అంగీకారం తెలిపాడు.

యుద్ధం జరగటానికి ముందు వలురాజు తన సైనికాధికారులకు తగు సూచనలు ఇచ్చాడు. ప్రముఖులనుకున్న యుద్ధవీరులకు స్వయంగా నుదుటన కుంకుమ, మెడకు గంధం పూసి తమలపాకు ఇచ్చి గౌరవించాడు. వలురాజు స్వయంగా యుద్ధం నడిపించదలచాడు. అందువలన యుద్ధ దుస్తులను ధరించి ఆయుధాలనుచేతపట్టుకొని "పంచకళ్యాణి" - పేరుగల అశ్వాన్ని ఎక్కి యుద్ధభూమికి వెళ్ళాడు. ఖండెమొండెముల కోట చుట్టూ త్రవ్వబడిన కందకాలను యాదవ సైన్యం దాటి కోటను ఒకేసారి నాలుగువైపుల ముట్టడించారు.[35] బాణాలను ఎక్కుపెట్టి వేగంగా కోటలోనికి వదులుతున్నారు. కలభూత గంగురాజు సైనికులు కోట గోడల పైనుండి పెద్దపెద్ద రాళ్ళను క్రిందికి దొర్లించారు. యాదవ సైన్యం చాలా ఇబ్బందులకు గురైంది. వలురాజు తన సైనికులను ఉత్సాహపరిచాడు. ఇరువర్గాల సైనికులు వీరోచితంగా పోరాడారు. చివరకు వలురాజు - గంగురాజు ద్వంద్వ యుద్ధానికి తలపడి భీకర పోరాటం సాగించారు. వలురాజు గంగురాజును చంపివేశాడు.[36] ఈ వార్త సుడిగాలిలా సైనిక వర్గాలకు చేరింది. ఖండెమొండెముల కోట సైనికులు నిరాశ చెందారు. వలురాజు విజయం సాధించాడు.[37] యుద్ధం ఆగిపోయింది.

యలమంచి సైనికులంతా ఖండెమొండెముల కోట చుట్టు "గోవిందా" అనుకుంటూ తిరిగారు. పల్లికొండ, తరిముత్తరాజు, తదితర మంత్రులు, సర్దార్లు, యుద్ధవీరులు, సైనికులు వలురాజుకు గౌరవసూచకంగా నమస్కరించారు. మంగళవాయిద్యాలతో సైనికులు వెంట నడువగా వలురాజు ఖండెమొండెముల కోటలోనికి ప్రవేశించాడు. మొదట వలురాజు గంగురాజు సింహాసనం పై కూర్చుని కొద్దిసేపైన తర్వాత లేచాడు. ఇలా చేయడం విజయానికి చిహ్నంగా భావిస్తారు.[38]

గంగురాజు భార్యలు తెరవెనుక నిలువబడి తమ కుమారుణ్ణి కాపాడమని వలురాజును ప్రార్థించారు.[39] గంగురాజు కుమారుడు చిన్నవాడు, మైనారిటి దాటనివాడు. వారు ఆపిల్లవానిని తీసికొని వచ్చి వలురాజు పాదాల చెంత వదిలారు.[40] వలురాజు దయార్ద్రహృదయుడు. అతడు గంగురాజు కుమారుని ఎత్తుకొని ముద్దాడి అతణ్ణి రక్షించుతానని కలభూత గంగురాజు భార్యలకు హామి ఇచ్చాడు. వలురాజు ఖండెమొండెముల కోటను జయించినప్పటికి, గంగురాజు కుమారునికి ఆ కోటను తిరిగి ఇచ్చివేసినట్లు ప్రకటించాడు. వలురాజు ఆ బాలుని ఆశీర్వదించి, ఆరుగురు బ్రాహ్మణ మంత్రులకు తిరిగి అధికారం అప్పగించవలసిందిగా కోరాడు.[41] ఆ తురవాత వలురాజు ఆరుగురు మంత్రులకు హితవు చెప్పి స్వామి ద్రోహానికి పాల్పడవద్దని హెచ్చరించాడు.[42]

వలురాజు విజయం సాధించినప్పటికి యుద్ధంలో విపరీతంగా గాయపడినాడు. తాను ఎంతోసేపు జీవితంతో ఉండలేనని పల్లికొండకు చెప్పాడు. తనకున్న పదిలక్షల పశుసంపద, బంగారం, వజ్రాలు, ముత్యాలు, వివిధరకాలైన ధాన్యాగారాలు, మరియు రాజకుమారులను జాగ్రత్తగా చూచుకొమ్మని పల్లికొండను కోరాడు.[43] పల్లికొండలాంటి వాడు తనకు మంత్రిగా

లభించినందుకు[44] ఎంతో గర్వంగా ఉందని చెప్పి - పల్లికొండ చేతిని వలురాజు పట్టుకొని ప్రాణం విడిచాడు.

వలురాజు పల్లికొండను అమితంగా ప్రేమించేవాడు. పల్లికొండను వలురాజు ఏకైక పుత్రిక కొమరమ్మ పెంచి పెద్ద చేసింది.[45] ఇతడు చాల తెలివైనవాడు. అందువలన పల్లికొండను మంత్రిగా నియమించాడు. సింహాద్రిరాజు, పెద్దిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజులు పల్లికొండను మేనల్లుడని పిలిచేవారు. కాటమరాజు పల్లికొండను బావ అని పిలిచేవాడు. పల్లికొండ వలురాజు, పెద్దిరాజు, పోలురాజు, కాటమరాజులకు మంత్రిగా సేవలు చేసినాడు.

వలురాజు ధరించిన ఆభరణాలు, యుద్ధంలో ఉపయోగించిన ఆయుధాలు, మరియు రాజముద్రికను పల్లకిలో ఉంచి - పల్లికొండ ముందు, తరిముత్తరాజు వెనుక నడువగా యాదవసేనలు యలమంచికి చేరుకున్నాయి.[46] ఆ సమయంలో పెద్దిరాజు, యరనూక రాజు, నలనూకరాజు, పోలురాజాదులు సాధన గరడీలో ఉన్నారు. సైనికులు వస్తున్న చప్పుడు విని తమతండ్రి వలురాజు ఖండెమొండెముల కోటపై విజయం సాధించి తిరిగి వస్తున్నాడని అనుకొన్నారు. అందరూ సాధన గరడి నుండి బయటకు వచ్చారు. పల్లికొండ, పెద్దిరాజు దగ్గరకు వెళ్ళి సవినయంగా నమస్కరించాడు. వలురాజు ధరించిన ఆభరణాలు, ఆయుధాలు, రాజముద్రికలను పెద్దిరాజుకు అప్పగించాడు.[47] వలురాజు ఖండె మొండెముల కోటపై దాడి చేసిన విధము , యుద్ధం జరిగిన క్రమము యుద్ధ రంగంలోవలురాజు పరాక్రమము - గంగురాజును చంపి ఖండెమొండెముల కోటను స్వాధీనం చేసుకున్న తీరును సవివరంగా పెద్దిరాజుకు తెలియజేశాడు, పల్లికొండ.[48] పెద్దిరాజు అతని సోదరులు తమ తండ్రి, కలభూత గంగురాజును ఓడించి విజయం సాధించినందుకు చాలా సంతోషించారు. వలురాజు యుద్ధభూమిలో వీరమరణం పొందినందుకు గర్వించారు.

వలురాజు చరిత్రకు సంబంధించిన విషయమంతా "వలురాజు చరిత్ర" - తాళపత్ర గ్రంథంలో వివరింపబడింది. కాటమరాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని సమకాలికుడనే విషయం గుండ్లపాలెం శాసనంలో వివరింపబడటం వలన ఈ తాళపత్ర గ్రంథంలోని విషయాలకు చారిత్రిక బలం కలుగుతుంది.

వలురాజు పాలించిన యలమంచి తూర్పు కనుమలలోని శారద - వరహా నదుల మధ్యన ఉన్నది.[49] ప్రస్తుతం ఈ ప్రాంతం విశాఖపట్టణం జిల్లాలో ఉన్నది. దానిని ఇప్పుడు యలమంచిలి అని పిలుస్తున్నారు. ఈ పట్టణానికి మధ్యలో ఒక కొండ ఉన్నది. దానిపై కూలిపోయిన కోట శిథిలాలు ఉన్నవి. ఇది యలమంచిని పాలించిన యాదవులు కట్టిన కోటగా ప్రజలు భావిస్తున్నారు. దీనిని నూకిపాప గుట్టగా పిలుస్తున్నారు.[50] పాపనూక కాటమరాజు చెల్లెలు. ఆమె పేరున కట్టించిన భవన శిథిలాలని ప్రజల వాడుకలో ఉన్నది.

కలభూత గంగురాజుచే పాలింపబడిన ఖండెమొండెముల కోట ప్రస్తుతము శ్రీకాకుళం జిల్లాలో ఉన్నది. దీనిని ఇప్పుడు మొండెంకల్‌గా పిలుస్తున్నారు. దీని చుట్టుప్రక్కల వల్లా పురము, పెద్దపాడు, యలమంచిలి, వీరగట్టం పేర్లు గల గ్రామాలు ఉన్నవి.[51] మొదటి రెండు గ్రామాలు వలురాజు, పెద్దిరాజుల జ్ఞాపకార్థం కట్టి ఉండవచ్చు. వీరగట్టం, యలమంచిని బడుగుల కుటుంబం వారు పరిపాలించి ఉండటం వలన ఆ ప్రాంతాల జ్ఞాపకార్థం కట్టిఉండవచ్చు.

మధ్యయుగంలో యలమంచిని తూర్పు చాళుక్యులు, తూర్పు గాంగ వంశము వారు పరిపాలించారు. యాదవ పాలకులు కవులావుల గంగురాజు, ఆవుల వలురాజు, పెద్దిరాజు యలమంచిని

పన్నెండవ శతాబ్దంలో పరిపాలించారు. యలమంచి యాదవులు, కలభూత గంగురాజు, కళింగను పరిపాలించిన తూర్పు గాంగ వంశీయులకు సామంతులుగా ఉన్నారు.

## 2. పెద్దిరాజు : క్రీ.శ. 1195 - 1223

మద్దులేటి కవి రచించిన[52] ఆవుల వలురాజు చరిత్ర తాళపత్ర గ్రంథం ఆధారంగా వలురాజు కుమారుడు పెద్దిరాజు యలమంచిని క్రీ.శ. 1195 - 1205 మధ్యకాలంలో పాలించినట్లు తెలుస్తుంది.[53] పెద్దిరాజు పాలనాకాలంలో ఆతని సోదరులు పూర్తి సహాయ సహకారాలను అందించారు. పెద్దిరాజు సహోదరులు నలుగురు. వారు సింహాద్రిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు. యలమంచిలో ఉండగా వారి తండ్రి వలురాజు ఖండెమొండెముల కోట యుద్ధం తర్వాత చనిపోవటం, తల్లి వల్లమ్మ సహగమనం చేయుటం, వలన వారు యలమంచిని వదలి పంపాద్రిలో నగరం నిర్మించి రాజధానిని మార్చారు.[54]

పెద్దిరాజు పాలనా కాలంలో పంపాద్రి ప్రాముఖ్యత పెరిగింది. ఇచ్చట రాజభవనాలు, తదితర ప్రముఖుల గృహాలను నిర్మించటం వలన నగరానికి అందం చేకూరింది. ఆటస్థలాలు, సాధన గరడీలు, విలాస భవనాలు, సత్రాలు, దేవాలయాలు, నిర్మించబడినాయి. వర్ణాశ్రమ ధర్మం ప్రకారంగా గృహాలను నిర్మించి వీధులు ఏర్పాటు చేశారు. పంపాద్రిలో మరియు దాని చుట్టు ప్రక్కల ప్రాంతాలలో చెరువులు, బావుల నిర్మాణం త్వరితగతిలో జరిగింది.[55] రకరకాల పండ్ల తోటలను కూడా పెంచారు. ఏడు సంవత్సరాల కాలం ఎలాంటి సమస్యలు లేకుండా ప్రజలు పెద్దిరాజు పాలనలో సుఖంగా జీవితం గడిపారు.[56]

పంపాద్రికి రాజధాని మార్చిన తర్వాత యేడవ సంవత్సరంలో సంతానము కొరకై పెద్దిరాజు అతని సోదరులు వారివారి భార్యలతో కలసి పంపాద్రి బసవనికి పూజలు చేశారు.[57] పెద్దిరాజు - పెద్దమ్మలకు తప్ప మిగిలినవారు - సింహాద్రిరాజు- సింహాద్రి సీత, యరనూకరాజు- యరనూక సీత, నలనూకరాజు - నలనూక సీత మరియు పోలురాజు - సిరిదేవిలకు సంతానం కలిగింది. అందువలన పెద్దిరాజు భార్య పెద్దమ్మ కళ్యాణములోని సోమప్ప దేవుణ్ణి పూజించిన సంతానం కలుగుతుందనే నమ్మకంతో కళ్యాణం పోవాలని తలచింది. పంపాద్రిని వదలి కళ్యాణం పోవాలని తనభర్త పెద్దిరాజును బలవంత పెట్టింది.

పెద్దిరాజు పంపాద్రి వదలి కళ్యాణానికి పోవటానికి సిద్దపడిన సమయంలో కాటమరాజు పినతండ్రి అయిన పోలురాజుకు ఒక్కనికి మాత్రమే సంతానము ఉన్నట్లు ఆరాధ్యుల పిచ్చయ్య "పెద్దిరాజు కథ" - తాళపత్ర గ్రంథానికి వ్రాసిన పీఠికలో తెలియజేశారు.[58] పెద్దిరాజు సోదరులైన సింహాద్రిరాజు, యరనూకరాజు, నలనూకరాజులకు సంతానం లేనట్లు ఆరాధ్యుల పిచ్చయ్య తెలియజేశారు.[59] కాని గోవుల నాగేశ్వర కవి తను రచించిన మదనకుంభిణి యుద్ధంలో, ఒక్క పెద్దిరాజు-పెద్దమ్మలకు తప్ప మిగిలిన సహోదరులకు సంతానం ఉన్నట్లు తెలిపారు.[60] సింహాద్రి రాజుకు కరియావుల రాజు, యరనూకరాజుకు భట్టావులన్న, నలనూకరాజుకు పెయ్యల యర్రయ్య, పోలురాజుకు భక్తిరన్న - అయితమరాజు - ముమ్మయ్యలు కలిగినట్లు పేర్కొన్నారు.[61] పెద్దిరాజును తమ కుమారులలో ఒకని దత్తు తీసుకొమ్మని మిగతా సోదరులంతా కోరినారు. కాని పెద్దమ్మకు ఇతరులను దత్తత తీసుకొనటం ఇష్టం లేదు. తన కడుపున పుట్టిన బిడ్డలే కావాలని ఆమె ఆకాంక్ష. అందువలన పెద్దిరాజు-పెద్దమ్మలు పంపాద్రిని వదలి కళ్యాణం వెళ్ళవలసి వచ్చింది.

తమ ఆస్తిని ఐదు సమాన భాగాలు పంచి, కళ్యాణం పోవటానికి యేర్పాట్లు చేయమని పెద్దిరాజు, పల్లికొండను కోరాడు.[62] పెద్దిరాజు కోరిక ప్రకారం పల్లికొండ పశువుల మందను,

బంగారం , వజ్రాలు, తదితర విలువైన వస్తువులు ఐదు సమభాగాలుగా చేసి కొంత మేరకు బంగారం, వజ్రాలు, పశువులను పెద్దిరాజు సోదరి కొమరమ్మకు అరణము క్రింద[63] ఇచ్చారు.

పెద్దిరాజు కళ్యాణానికి తరలి వెళ్ళటానికి ముందు తమ సహోదరులలో అందరి కంటె చిన్నవాడైన పోలురాజుకు పంపాద్రి నగరపాలనను అప్పగించాడు. అందరి సమక్షంలో పోలురాజుకు పట్టాభిషేకం జరిగింది. పల్లికొండ పోలురాజుకు ప్రధాన సలహాదారునిగా నియమింపబడ్డాడు. కల్లందుల మారినీడు పోలురాజుకు మంత్రి అయ్యాడు.[64] ఈ అధికార మార్పిడిని "ఆవులపట్టం' ' అని కూడా అంటారు.

ఆరాద్యుల పిచ్చయ్య సంపాదకత్వంలో ప్రచురింపబడిన తాళపత్ర గ్రంథం "పెద్దిరాజుకథ"లో పోలురాజుకు "ఆవులపట్టం" కట్టిన విషయం ప్రస్తావించలేదు. కాని పంపాద్రి కథ - తాళపత్ర గ్రంథం, మల్లయ్యచే రచించబడి డాక్టర్. తంగిరాల వెంకటసుబ్బారావు సంపాదకత్వంలో ప్రచురింపబడిన దానిలో పోలురాజుకు జరిగిన ఆవుల పట్టం సవివరంగా వివరింపబడింది. ఆవులపట్ట మనగా - పశుసంపదకు అధికారిగా చేయుటం. పెద్దిరాజు తరువాత పోలురాజు కడు సమర్ధుడని అతనికి అధికారం ఇవ్వడం జరిగింది.

పెద్దిరాజుతో పాటుగా యాదవ ప్రముఖులైన పెయ్యావుల పాపన్న, చెవుల గోపాలుడు, నేతివారి వీరన్న, కవులావుల గంగన్న, యల్లావుల గంగన్న, గోవుల కొండయ్య, దండెబోయ్ని ధర్మరాజు, బండారు గోపన్న, ఆవు పువ్వుల హనుమంతు, మరియు కొండయ్య మంత్రి కళ్యాణానికి బయలుదేరారు.[65] కళ్యాణం పొయ్యే మార్గంలో పల్లెవాగు, వీరగట్టం, కోటిలింగాల, ధార్మాపురం, దుప్పుల కుంట, పార్వతీ పట్నం, మహేశ్వరముల మీదుగా కొల్హాపురం[66] పోయి అక్కడి నుండి కాటకోటేశ్వరం[67] చేరుకున్నారు. ఇక్కడ పెద్దిరాజు - పెద్దమ్మలు కాటకోటేశ్వరుని సంతానం కోసం ప్రార్థించారు. కాట కోటేశ్వరంలో కొంతకాలానికి పెద్దమ్మకు క్రీ.శ. 12-2-1217న మగపిల్లవాడు జన్మించినాడు.[68] కాటకోటేశ్వరుని వరాన పుట్టటం వలన ఆ బాలునికి కాటమరాజు అని నామకరణం చేశారు.

కాటమరాజు జన్మించిన యేడు సంవత్సరాలకు చిత్రభాను సంవత్సరం ఫాల్గుణ మాసం బహుళ అమావాస్య, జ్యేష్ఠా నక్షత్రం, బుధవారం నాడు పెద్దమ్మకు పాపనూక జన్మించింది.[69] (క్రీ.శ. 1-3-1223). పెద్దిరాజుకు కళ్యాణ నగరం చూడాలని మహా కోరికగా ఉండటం వలన తన సహచరులతో కలసి కాటకోటేశ్వరం వదలి కళ్యాణం వెళ్ళాడు. కళ్యాణ పట్టణానికి బయట "వెల్లవేముల"[70]- అను ప్రదేశంలో గుడారాలను నిర్మించారు. ఆ తరువాత కళ్యాణ పాలకుడైన మారాచ గంగురాజు కబురు పంపించాడు.[71] మారాచ గంగురాజు రాజలాంఛనాలతో పెద్దిరాజు కు స్వాగతం పలికాడు.[72] అప్పటినుండి మారాచ గంగురాజు, పెద్దిరాజు మంచి స్నేహితులయ్యారు. కళ్యాణ పాలకుడు - పెద్దిరాజు, అతని అనుచరుల నివాసార్థం సకల సౌకర్యాలతో గృహాలను నిర్మించి దానికి "కనక రేపల్లె"[73]- అని పేరుపెట్టారు.

కళ్యాణ ప్రభువైన మారాచ గంగురాజు - అర్లపెంట పాలకుడు వాలికేతువ రాజుల మధ్య తగాదా వచ్చింది.[74] యాదవులు మారాచ గంగురాజుకు మద్దతు ప్రకటించారు. పెద్దిరాజు స్వయంగా యుద్ధరంగానికి వెళ్ళటానికి నిర్ణయం తీసుకున్నాడు.[75]

యుద్ధభూమికి పోవటానికి ముందు పెద్దిరాజు కాటమరాజుతో - "ఒక వేళ నేను యుద్ధంలో చనిపోయినట్లైయితే నీవు మన పశుసంపద, యాదవ సపరివారంగా పంపాద్రికి పోయి అందరిని సమానంగా చూచుకో" అని అన్నాడు.

కాటమరాజు పూర్వీకులు

వాలికేతువరాజు, అర్లపెంట చుట్టు ఏడు ప్రాంతాలలో- మదన, వీర, విజయ, కంచు, గాజు, రాయ, రత్నకుంభిణిలను వరుసగా హనుమంతు భీముడు, కృతాంగ, వీరకేతు,కాలకేతు, గోపాలరాజు, రాజశేఖర మరియు విజయ ప్రతాపుల నాయకత్వంలో ఉంచాడు. ఈ ప్రాంతాలను ఎడు కుంభినులు అని అంటారు.[76]

ప్రథమంగా మారాచగంగురాజు, పెద్దిరాజు, వారి వారి సైన్యాలతో మదనకుంభినిలోని కనకదుందుముల కోటపై దాడి చేశారు. నాలుగువైపుల నుండి కళ్యాణి సైన్యము కోటను ముట్టడించారు. ఈ యుద్ధంలో వాలికేతువరాజు ప్రతినిధి అయిన హనుమంతు భీముడు ప్రాణాలు కోల్పోయినాడు. ఆ తరువాత వరుసగా కృతాంగుడు, వీరకేతువు, కాలకేతువు, గోపాలరాజు, రాజశేఖర మరియు విజయ ప్రతాపులను ఓడించారు. వాలికేతువరాజు గజబలం, అశ్వదళం, సైనికులు చాలామంది యుద్ధంలో మరణించటం జరిగింది.[77]

## అర్లపెంట యుద్ధం : క్రీ.శ. 1222 - 1223

గంగురాజుకు సహాయంగా పెద్దిరాజు, తన సైనికులతో వాలికేతువరాజు పైకి యుద్ధానికి బయలుదేరాడు. పెద్దిరాజు సైనికులకు యుద్ధనీతులు బోధించాడు. యుద్ధంలో బ్రాహ్మణులను, స్త్రీలను, పిల్లలను, గోవులను చంపకూడదు. యుద్ధం నుండి పారిపోయి చెట్టు ఎక్కిన వారిని, పొదల చాటున దాగిన వారిని, నోటిలో గడ్డిపరకలు పెట్టుకున్న వారిని, చేతులు పైకి ఎత్తిన వారిని, నీటిలో నిలువబడినవారిని, చనిపోయినట్లుగా పడుకున్న వారిని చంపరాదని సైనికులను హెచ్చరించాడు.[78] అర్లపెంట యుద్ధభూమిలో దండెబోయ్ని మాధవ, దామసాని పోతన, జట్టెబోయ్ని మాధవ, బండారు నాగన్న, సంగమేశుని మారయ్య మొదలగు వారు వీరమరణం పొందారు. పెద్దిరాజు - వాలికేతువరాజుతో తలపడ్డాడు. వాలికేతువరాజు తన బరిసెతో పెద్దిరాజును పొడిచాడు. పెద్దిరాజు నేలకొరిగాడు.[79]

అంగిరేకుల మారన్న, చెవుల కేశవన్న, తదితర యాదవ వీరులు పెద్దిరాజు ఆభరణాలు తీసుకొని కనకరేపల్లెకు వచ్చి కాటమరాజుకు ఆభరణాలు అందచేశారు. కాటమరాజు విషయం గ్రహించాడు. చిరునవ్వుతో ఆభరణాలను అందుకొన్నాడు. అక్కడ ఉన్న కాటమరాజు స్నేహితులు ఆశ్చర్యపోయారు. తండ్రి మరణ వార్త విని దుఃఖించటానికి బదులు, నవ్వుతున్నావెందుకని మిత్రులు కాటమరాజును ప్రశ్నించారు.[80] తన తండ్రి యుద్ధ రంగంలో పోరాడి వీర మరణం పొందాడు - తాను వాలి కేతువ రాజును సంహరించి పగతీర్చుకొనే అవకాశం వచ్చింది. అందుకు గర్విస్తున్నానని మిత్రులతో చెప్పాడు.

కాటమరాజు తన తల్లి నివాసమైన "నందుల దివాణము"నకు వెళ్లాడు.[81] కొమ్ములు, వీరణాలు, భేరీలు, మొదలైన పంచవాయిద్యాలు, రాజభవనం ముందు మ్రోగించారు. భట్లు పెద్దిరాజు సాహసకృత్యాలను పొగిడిన్నారు.[82] వారంతా అర్లపెంట రణరంగంలో జరిగిన యుద్ధ విషయాలు పెద్దమ్మకు వివరించారు.[83] అన్ని విన్న తరువాత తన సహగమనానికి ఏర్పాట్లు గావించమని కాటమరాజును కోరింది. అర్ల పెంట యుద్ధ భూమినుండి పెద్దిరాజు[84] శవాన్ని తేవటానికి అనుమతి ఇవ్వవలసిందిగా కాటమరాజు పెద్దమ్మను ప్రార్థించాడు. ఐదు రోజులలో తన తండ్రి శవాన్ని తీసుకొస్తానని ప్రతిజ్ఞ చేశాడు. కాటమరాజు చిన్నవాడు కావటం వలన మొదట పెద్దమ్మ ఒప్పుకోలేదు. కాని కాటమరాజు పట్టు వదలలేదు. చిట్టచివరకు పెద్దిరాజు శవాన్ని[85] అర్లపెంట యుద్ధ భూమి నుండి తేవటానికి పెద్దమ్మ కాటమరాజుకు అనుమతి ఇచ్చింది.

అర్లపెంటపై దాడి చేయటానికి సైన్యాన్ని సిద్ధం చేయవలసిందిగా కాటమరాజు

సేనాధిపతులను ఆజ్ఞాపించాడు. యుద్ధ కార్యక్రమాలు అన్ని చురుకుగా సాగాయి. కాటమరాజు "రణవిజయము"[86] అనే అశ్వాన్ని ఎక్కి ముందుగా సోమప్ప దేవాలయానికి వెళ్ళి తనకు విజయం చేకూర్చాలని భగవంతుడిని ప్రార్థించాడు. - కాటమరాజు తన సైన్యం వెంట నడువగా అర్లపెంటకు బయలుదేరాడు.

కాటమరాజు సైన్య సమేతంగా అర్లపెంట రణక్షేత్రానికి చేరుకోగానే తన తండ్రి పెద్దిరాజు శవం కొరకు వెదకటం ప్రారంభించాడు. ఆ సమయంలో దామసాని పోతన, దండెబోయిన ధర్మరాజు, బండారు గోపన్న, అచ్యుత తిరుమణి, ఆవుపువ్వుల హనుమంతు, చెవుల కేశవన్న, పుల్లావుల వెంగళు, భూమిడిపోలు తదితరుల శవాలు కాటమరాజుకు కనిపించాయి.[87] ఈ శవాల మధ్యలో పెద్దిరాజు శవం పడి ఉంది. బహుశా వారంతా పెద్దిరాజు రక్షణ కొరకు యుద్ధ భూమిలో ఆయన వెంట ఉండి ఉండవచ్చు.[88] కాటమరాజు పెద్దిరాజు శవాన్ని తన ఒడిలో పడుకోబెట్టుకొని పెద్దిరాజు శరీరానికి కుచ్చుకొని ఉన్న బాణాలను బయటకు లాగివేశాడు. రక్తపు మరకలను శుభ్ర పరిచాడు. వాలికేతువరాజు కోటను కూల్చి, వాడి తల నరికి పెద్దిరాజు పాదాల ముందు పెట్టి పగతీర్చుకొంటానని కాటమరాజు ప్రతిజ్ఞ చేశాడు.[89]

అర్లపెంట రణక్షేత్రంలో యుద్ధం చేయటానికి రావలసిందని, వాలికేతువ రాజుకు సందేశం పంపాడు కాటమరాజు. వాలికేతువరాజు యుద్ధానికి సన్నద్ధమై ఏనుగులు, గుఱ్ఱాలు, కాల్బలముతో కదలి వచ్చాడు.[90] అర్లపెంట క్షేత్రంలో ఇరువర్గాల వారికి ఘోరమైన యుద్ధం జరిగింది. కాటమరాజు వాలికేతువ రాజును సంహరించి తన ప్రతిజ్ఞ తీర్చుకొన్నాడు.[91]

కాటమరాజు తన తండ్రి శవాన్ని పల్లకీలో కనకరేపల్లెకు తెచ్చాడు. పెద్దమ్మ పట్టు వస్త్రమును కాల్చి పెద్దిరాజు శవంపైనుండి మూడుసార్లు తిప్పి దిష్టి తీసింది. దీనిని రణదృష్టి అంటారు. ఆ తరువాత పన్నీరు చల్లి శరీరాన్ని పట్టువస్త్రంతో శుభ్రపరిచింది.[92]

సహగమనానికి ఏర్పాట్లు చేయవలసిందిగా పెద్దమ్మ కాటమరాజును కోరింది. సహగమనానికి ముందు పెద్దమ్మ తన బిడ్డలు కాటమరాజు, పాపనూకలను కళ్యాణం రాణి పెందోట ముద్దమ్మకు ఒప్పచెప్పింది.[93] కాటమరాజు, పాపనూకలు యాదవ వంశానికి చెందినవారని, వారి తాత తండ్రులు యలమంచి, పంపాద్రి పట్టణాలను పాలించినవారని తెలియజేసింది.[94] ఒకవేళ భక్తిరన్న - (పోలురాజు పెద్దకుమారుడు) వచ్చినట్లయితే కాటమరాజు, పాపనూకలను అతని వెంట పంపించమని చెప్పింది.[95] తన కుమారుడు రాఘవన్నతో పాటుగా కాటమరాజు, పాపనూకలను జాగ్రత్తగా పెంచుతానని ముద్దమ్మ - పెద్దిరాజు భార్య పెద్దమ్మకు వాగ్దానం చేసింది.[96] పెద్దమ్మ పెద్దిరాజుతోపాటు సహగమనం చేసింది.[97]

కాటమరాజు తన తల్లిదండ్రులకు కర్మకాండను పద్దతి ప్రకారంగా చేశాడు. బ్రాహ్మణులకు, తదితర ప్రజానీకానికి అన్నదానం, వస్త్రదానం చేశాడు. సహగమన గుండం చుట్టూ మామిడి, దానిమ్మ, మంచి గంధం, సన్నజాజుల మొక్కలను నాటించాడు.[98]

యాదవులు విశాఖపట్టణం జిల్లాలోని యలమంచి నుండి - తూర్పుగోదావరి జిల్లాలోని పంపాద్రికి వచ్చి అక్కడినుండి కొందరు కళ్యాణ ప్రాంతానికి పోయినట్లు పెద్దిరాజు చరిత్ర ద్వారా తెలుస్తుంది. ఈ క్రింది విషయాలు మనకు ఆసక్తి కల్గిస్తాయి.

1. ఆనాటి కళ్యాణపాలకుడైన మారాచగంగురాజు దేవగిరి యాదవులకు సామంతుడై ఉంటాడు. అందువలన పెద్దిరాజు చరిత్ర - తాళపత్ర గ్రంథంలో "కళ్యాణ దేవగిరి"[99] అని వివరించడం జరిగింది. క్రీ.శ. 12వ, శతాబ్ది చివరలో దేవగిరి యాదవులు, ఓరుగల్లు కాకతీయులు, ద్వార

సముద్రం, హోయసాలలు, కళ్యాణి చాళుక్యులపై తిరుగుబాటు చేసి ఆప్రాంతాలను ఆక్రమించుకొన్నారు.[100]

2. కర్ణాటక రాష్ట్రంలోని కళ్యాణి ప్రాంతానికి సమీపంలో వాలికేతువ రాజు రాజ్యం మదనకుంభిణి (అర్లపెంట) ఉన్నది. దీనిని వీరగంటి పట్టణమని విజయపట్టణమనికూడా పిలిచేవారు.[101]

3. మారాచగంగురాజు తరపున పెద్దిరాజు మదన కుంభిణి పాలకుడైన వాలికేతువ రాజుపై దాడి చేశాడు. గంగురాజుకు కృతజ్ఞత తెలుపుటకు పెద్దిరాజు మదనకుంభిణి పై దాడి చేసి అర్లపెంట యుద్ధంలో వాలికేతువ రాజుచేత చంపబడినాడు. అసలు పెద్దిరాజు, వాలికేతువ రాజుల మధ్య ఎలాంటి పగలేదు. కేవలం గంగురాజు తన మిత్రుడగుట వలన పెద్దిరాజు అర్లపెంట యుద్ధం చేయవలసి వచ్చింది.

## 3. సింహాద్రి రాజు :

వలురాజు పెద్దకుమారుడు సింహాద్రిరాజు. ఇతడు కాటమరాజుకు పెద్ద తండ్రి. సింహాద్రి రాజు భార్య సీత.[102] కరియావుల రాజు,[103] చిట్టినూక వారి సంతానము. కరియావుల రాజు గొప్ప యుద్ధ వీరుడు.

వారసత్వ రీత్యా వలురాజు తర్వాత రాజ్యాధిపత్యానికి సింహాద్రి రాజు అర్హుడు. సింహాద్రి రాజుకు బదులుగా వలురాజు, రెండవకుమారుడైన పెద్దిరాజు సింహాసనమధిష్టించాడు. పెద్దిరాజు సమర్ధుడు, పరిపాలనా దక్షత కలవాడు. అందువలన రాజ్యాధికారం పెద్దిరాజుకు వచ్చింది.

శ్రీకూర్మంలోని వైష్ణవులను[104] సింధుబల్లాని రాజు అవమానాలకు గురిచేస్తూండటం వలన వైష్ణవులను కాపాడటానికి సింహాద్రిరాజు శ్రీకూర్మంపై దండెత్తినట్లు "భక్తిరన్న కథ" - తాళపత్ర గ్రంథంలో వివరింపబడింది. శ్రీకూర్మం రాజు సింధుబల్లానికి వైష్ణవులంటే గిట్టదు. కాబట్టి అక్కడ ఉన్న వైష్ణవులపై దొంగతనం చేసినట్లు నేరం మోపి వారిని చిత్ర హింసలకు గురి చేస్తున్నాడు. అందువలన శ్రీ కూర్మం వైష్ణవులు పంపాద్రికి పోయి తమను రక్షించవలసిందిగా సింహాద్రి రాజును వేడుకున్నారు.[105] ఈ వైష్ణవులను కాపాడటానికి సింహాద్రి రాజు సైన్య సమేతంగా శ్రీకూర్మంపై దండెత్తాడు. ఈ యుద్ధంలో సింధుబల్లాని ప్రాణాలు కోల్పోయాడు. వీరోచితంగా పోరాడి సింహాద్రిరాజు, ఆయన సేనాధిపతి భూమాటిశంకరయ్య శత్రుసైన్యాలను సంహరించి యుద్ధభూమిలో వీరమరణం పొందారు.[106] సింహాద్రిరాజు భార్య సీత, భూమాటి శంకరయ్య భార్య శంకరమ్మ తమ భర్తల మృతదేహాలతో పాటు సహగమనం చేశారు.[107]

శ్రీకూర్మంలోని వైష్ణవులను రక్షించడానికి సింహాద్రి రాజు తన ప్రాణాలను త్యాగం చేశాడు. సింధుబల్లానిని సంహరించి వైష్ణవులను కాపాడినాడు. శ్రీకాకుళం జిల్లాలో శ్రీకాకుళం పట్టణానికి ఆగ్నేయంగా 15కి.మీ.ల దూరంలో శ్రీకూర్మం ఉన్నది.[108] సింహాద్రి రాజు, సింధుబల్లాని రాజుల మధ్య యుద్ధం జరిగింది ఇచ్చటనే.

తూర్పు గోదావరి జిల్లాలోని అన్నవరం రైల్వే స్టేషన్‌కు 3కి.మీ.ల దూరంలో పంపానది ఒడ్డున పంపాద్రి ఉన్నది. ప్రస్తుతం దీనిని అన్నవరం అని పిలుస్తున్నారు.[109] ఒకప్పుడు ఇది శైవ క్షేత్రంగా విలసిల్లింది. ఇప్పుడు శ్రీ వీరవేంకటసత్యనారాయణ స్వామి క్షేత్రంగా విలసిల్లుతుంది.

## 4. యరనూకరాజు :

వలురాజు మూడవ కుమారుడు యరనూకరాజు. పంపాద్రి ప్రాంతానికి యువరాజుగా

ఉన్నాడు. పంపాద్రిలో భాగాలు అయిన తర్వాత యరనూక రాజు అనుచరులు పశుసంపదతో ఏనుగునాథ కొండకు వెళ్లాడు.[110] ప్రస్తుతం దీనిని శ్రీకాళహస్తిగా పిలుస్తున్నారు. ఈ ఏనుగనాథకొండను ఎఱ్రభూపతి రాజు పరిపాలిస్తున్నాడు. ఒక గాయపడిన పులి విషయమై ఈ ప్రాంతంలో ఉన్న ఎరుకల వారికి, ఎఱ్రభూపతికు మధ్య తగాదా వచ్చింది.[111] ఎరుకల వారు యరనూకరాజును సహాయం అర్థించారు. యరనూకరాజు ఎరుకల వారిని రక్షిస్తానని అభయం ఇచ్చాడు. తన శత్రువులైన ఎరుకల వారికి యరనూకరాజు రక్షణ ఇస్తున్నాడనే విషయం ఎఱ్రభూపతిరాజుకు తెలిసింది. అందువలన కాటమరాజు పినతండ్రి అయిన యరనూకరాజుపై పగతీర్చుకోవాలని నిర్ణయించుకొన్నాడు ఎఱ్రభూపతి రాజు. యరనూకరాజు తన మంత్రి పులిముద్దు రాఘవను సైన్యాన్ని సిద్ధంచేసి యుద్ధానికి సన్నద్ధంగా ఉండమని ఆజ్ఞాపించాడు. కాని యరనూకరాజు భార్య యరనూకసీత యుద్ధాన్ని ఆపించడానికి ప్రయత్నించింది. ఎరుకలవారిని ఎఱ్రభూపతికి అప్పగించమని తన భర్తను వేడుకుంది. అనవసరంగా ఏనుగునాథకొండ రాజుతో యుద్ధానికి తలపడటం మంచిది కాదని సలహా ఇచ్చింది. యరనూకరాజు తన భార్య సలహాను తిరస్కరించాడు.

యాదవసైన్యం యుద్ధానికి సన్నద్ధమైంది. అవుపువ్వు, కనకనందుల, జడదారి గాంగేయ, కల్లందుల, బండారు, బంతుల మొదలైన యాదవకుటుంబాల వారు పులిముద్దు రాఘవ నాయకత్వంలో యుద్ధరంగానికి తరలి వెళ్ళారు.

## ఏనుగుమల యుద్ధం : క్రీ.శ. 1222 - 1223

యఱ్రభూపతి రాజు సైన్యంలో కాల్బలం, అశ్వదళం, గజబలం, ఉన్నాయి. యాదవుల సైన్యం కాల్బలం, అశ్వదళం. ఏనుగుల వీపులపై ఇనుప జీనులు వేసి, తొండాలకు దంతాలకు కత్తులు మరియు ఇనుప గొలుసులు కట్టారు.[112] ముందువరుసలో ఏనుగులను, వాటి వెనుక గుఱ్ఱాలను చివరి వరుసలో కాల్బలాన్ని నిలవబెట్టారు. ఏనుగునాథకొండ పాలకుడైన యఱ్రభూపతి రాజు ఏనుగుపై ఎక్కి యుద్ధరంగానికి తరలి వచ్చాడు. యరనూకరాజు, పులిముద్దురాఘవ, యాదవసైన్యాన్ని యుద్ధభూమికి తరలించారు.

ఏనుగుమల యుద్ధభూమిలో యఱ్రభూపతి సైన్యం యరనూకరాజు సైన్యం ముఖాముఖి యుద్ధానికి తలపడ్డాయి. ఎందరో సైనికులు, గుఱ్ఱాలు, ఏనుగులు, యుద్ధంలో ప్రాణాలు కోల్పోవటం జరిగింది. యరనూకరాజు, యఱ్రభూపతిని ద్వంద్వ యుద్ధంలో సంహరించాడు.[113] పులిముద్దురాఘవ, శంభుని కొండయ్య, సారంగు రామయ్య మొదలైన యాదవ ప్రముఖులు యుద్ధరంగములో ప్రాణాలు కోల్పోయారు. యుద్ధం ముగిసిన తర్వాత - యుద్ధంలో తగిలిన గాయాలవల్ల యరనూకరాజు కూడా చనిపోయాడు. యుద్ధభూమి శవాలతో నిండిపోయింది.

యరనూకరాజు కుమారుడైన భట్టావులరాజు యుద్ధభూమికి వెళ్ళి యరనూకరాజు, పులిముద్దురాఘవ మొదలగు యాదవవీరుల మృతదేహాలను యాదవులు నివాసంగా ఏర్పాటుచేసుకున్న భార్గవపురానికి తీసుకొనివచ్చాడు.[114]

యరనూకసీత తన కుమారుడు భట్టావులరాజును, కూతురు నాగమ్మను - భక్తిరన్న కడకు చేర్చమని తనవదిన పుల్లమ్మకు వారిని అప్పగించింది. ఆ తరువాత యరనూక సీత తనభర్త - యరనూకరాజు తోపాటు సహగమనం చేసింది.[115]

"పెద్దిరాజు కథ" - తాళపత్ర గ్రంథంలో, పెద్దిరాజు అతని సోదరులందరు ఒకే సంవత్సరంలో మరణించినట్లు చెప్పబడింది. పెద్దిరాజు చిత్రభాను సంవత్సరంలో అర్లపెంట

యుద్ధరంగంలో వీరమరణం పొందినట్లు ఇంతకు ముందే వివరించబడింది. అందువలన యరనూకరాజు కూడా ఏనుగుమల యుద్ధంలో క్రీ.శ. 1222 - 23 సంవత్సరంలో చనిపోయినట్లు భావింపవచ్చును. ఈ ఏనుగుమల చిత్తూరు జిల్లాలో ఉంది. ఏనుగునాథ కొండను శ్రీకాళహస్తిగా పిలుస్తున్నారు.[116]

## 5. నలనూకరాజు :

వలురాజు నాలుగవ కుమారుడు నలనూకరాజు. కాటమరాజుకు పినతండ్రి. నలనూకరాజు భార్య సీత ఈమెను నలనూకసీత అని పిలుస్తారు. పెయ్యల యర్రయ్య వీరి కుమారుడు. పంపాద్రిలో పంపకాలు అయిన తరువాత నలనూకరాజు అతని అనుచరులు, పశుసంపద, సైన్యంతోపాటు నున్న బెజవాడ ప్రాంతానికి వెళ్ళాడు. చట్టమారయ్య నలనూక రాజు మంత్రి.[117]

నున్న బెజవాడను నందికేశవరాజు పాలించుతున్నాడు. ఇతడు ప్రజలపై అనేకరకాలయిన పన్నులు విధించి నిరంకుశంగా పరిపాలింప సాగాడు.[118] నందికేశవరాజు పాలనలో ప్రజలు నానా బాధలు అనుభవించుచున్నారు.

## దిగ్విదేవుని పెంట యుద్ధం : క్రీ.శ. 1222 - 1223

నందికేశవరాజు అక్రమ పాలనను ఎదిరించాడు నలనూకరాజు. యాదవసైన్యం నున్న బెజవాడపై దాడి చేసింది. దిగ్విదేవుని పెంట[119] కడ ఇరువర్గాల వారికి భీకర పోరాటం జరిగింది. నందికేశవరాజు నలనూకరాజును చంపివేశాడు. యాదవుల మంత్రి చట్ట మారయ్య కూడా ఈ యుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడు. నలనూకరాజు భార్య నలనూక సీత చట్టమారయ్య భార్య మారమ్మ సహగమనం చేశారు.[120]

ఆ తరువాత పెయ్యల యర్రయ్య నున్న బెజవాడపై దాడి చేసి నందికేశవరాజును సంహరించాడు. అందువలన పెయ్యల యర్రయ్యకు "బెజవాడ బెబ్బులి"[121] అను బిరుదు వచ్చింది.

1. నున్న బెజవాడ - విజవాడకు దగ్గరలో ఉన్న - నున్న అనే ప్రాంతం ఇప్పటికి ఉంది. నందికేశవ రాజు నున్నబెజవాడలను కలిపి పాలించి ఉండవచ్చును. అందువలన నున్నను నున్నబెజవాడ అని పిలిచారు. ఆరాజును నున్న భూపతి అని కూడా అనేవారు.

2. వలురాజు పుత్రులు ఐదుగురు. ఒకే సంవత్సరంలో చనిపోయినట్లు తాళపత్రగ్రంథాల రాతల ద్వారా తెలుస్తుంది. కావున దిగ్విదేవుని పెంట యుద్ధం క్రీ.శ. 1222 - 23లో జరిగి ఉంటుంది.

## 6. పోలురాజు : క్రీ.శ. 1212 - 1223

కాటమరాజు పినతండ్రులలో అందరికంటె చిన్నవాడు పోలురాజు.[122] ఇతని భార్య సిరిదేవి. "పోలురాజు యుద్ధం" తాళపత్ర గ్రంథంలో ఇతనికి ముగ్గురు కుమారులు ఒక కూతురు ఉన్నట్లుగా చెప్పబడింది. భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య, కుమారులు. పోలురాజు కూతురు అగుమంచి. ఈమె చాలా అందమైనది.

పెద్దిరాజు కళ్యాణమునకు వెళ్లేసమయములో పోలురాజును పశుసంపదకు, యాదవులకు అధిపతిగా చేశాడు. కల్లందుల మార్నీడును[123] ఇతని మంత్రిగా నియమించారు. పంపాద్రిలో పంపకాలు అయిన తర్వాత పోలురాజు అర్ధవీడు ప్రాంతానికి వచ్చినట్లు తెలుస్తుంది. ధనకొండను

కేంద్రంగా చేసుకొని యాదవులు తమ పశుసంపదను అభివృద్ధి చేసుకున్నారు. పోలురాజు తన భార్య సిరిదేవిని అర్ధవీడులో ఉంచి - రెండవ కుమారుడైన అయితమరాజును గంగదొనకొండ రాజ్యానికి పాలకునిగా నియమించాడు. పుత్తమరాజును అయితమ రాజుకు మంత్రిగా నియమించాడు. అర్ధవీడు, గంగదొన కొండ ప్రాంతాలు ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో ఉన్నాయి. పోలురాజు, పల్లికొండ యాదవసైన్యం, పశుసంపదను వెంటబెట్టుకొని దక్షిణ శ్రీరంగం వైపు వెళ్ళాడు.[124] శ్రీరంగం ప్రాంతంలో వీరు వివిధరకాలైన గుడారాలు వేసుకొని తమ పశువులను మేపుకుంటూ కాలం గడుపుతున్నారు. పోలురాజు, పల్లికొండలు శ్రీరంగనాథుని దర్శించి గంగిమైలావులు, కపిలావులను దేవాలయానికి బహూకరించారు.[125]

శ్రీరంగం పాలకుడు చోడాని, పోలురాజు తమ ప్రాంతానికి వచ్చినట్లుగా తన మంత్రుల ద్వారా తెలుసుకున్నాడు. ఆ రోజులలో చోడాని కావేరి నదికి ఆనకట్ట కట్టిస్తున్నాడు. వేల కొలది పనివారు వెట్టిచేస్తున్నారు. పోలురాజు, తన అనుచరులు కావేరి కట్ట నిర్మాణానికి వెట్టి చాకిరి చేయడానికి రావలసిందిగా చోడాని ఆజ్ఞలు జారీ చేశాడు.[126] చోడాని మంత్రి చంద్రశేఖరుడు ఆజ్ఞా పత్రాలు తీసుకొని పోలురాజుకడకు వచ్చాడు. చోడాని తమను వెట్టిచాకిరి చేయడానికి ఆహ్వానిస్తున్నాడన్న విషయం తెలుసుకొని - పోలురాజు ఉగ్రరూపం దాల్చాడు. వెట్టి చాకిరి ఆహ్వానాన్ని నిష్కర్షగా తిరస్కరించాడు. శ్రీరంగం పాలకుడైన చోడాని పోలురాజు సైనిక శక్తులను తెలుసుకొని, అతనితో తగాదా పడటం మంచిది కాదనుకొని స్నేహం చేయడానికి నిర్ణయించుకొన్నాడు.[127]

శ్రీరంగనాథుని అభిషేకం కోసం పాలు పంపించవలసిందిగా చోడాని పోలురాజును కోరాడు.[128] ఈ విషయమై పోలురాజు పల్లికొండ తదితర మంత్రి వర్గంతో మంతనాలు జరిపి పాలు పంపించటానికి నిర్ణయం తీసుకున్నాడు. కాని ఒక షరతు విధించాడు. యాదవులు వుంటున్న గుడారాల దగ్గర నుంచి శ్రీరంగనాథ దేవాలయం వరకు గచ్చుతో కాలువను నిర్మించాలని - ఆ కాలువ ద్వారానే పాలు పంపుతామని తెలిపాడు.[129]

పోలురాజు పెట్టిన షరతుకు అంగీకరించి చోడాని కాల్వ నిర్మించాడు. యాదవులు ఆ కాల్వ ద్వారా పాలు శ్రీరంగనాథ దేవాలయానికి పంపించారు. చోడాని సంతోషించి రెండు ఏనుగులు, పల్లకీలు, పట్టు వస్త్రాలు, చోడమాడలు[130] (నాణాలు) తమలపాకులు, వక్కలు, మంత్రి పట్టపు మురహరి ద్వారా పోలురాజుకు పంపించాడు. పోలురాజు ఆ బహుమానాలను అందుకొని తిరిగి అయిదువందల ఆవులు, ఐదు కోడెలు, పట్టు వస్త్రాలు, నంది కాసులు[131] (పోలురాజు నాణాలు) తమలపాకులు, వక్కలు చోడానికి పంపించాడు. శ్రీరంగం పాలకుడైన చోడాని, పోలురాజులు ఒకరి అధికారాన్ని మరోకరు గుర్తించారు.

కొంతకాలం తర్వాత పోలురాజు శ్రీరంగం నుండి తమ పశువులను చెరుకూరుకు తరలించి అక్కడ నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. అన్ని సౌకర్యాలతో చిలుకల మర్రి వద్ద గుడారాలు యేర్పాటు చేశారు.[132]

కావేరి కట్ట నిర్మాణానికి వెట్టి చేయడానికి నెల్లూరు రాజు ముక్కంటిని అతని పరివారాన్ని తీసుకురావలసిందిగా శ్రీరంగం రాజు చోడాని తన మంత్రి పట్టపు మురహరిని ఆజ్ఞాపించాడు. ముక్కంటి కావేరి కట్ట నిర్మాణానికి వెట్టి చేయడానికి ఒప్పుకోలేదు. అందువలన చోడాని నెల్లూరు పై దాడి చేసి ముక్కంటిని ఓడించాడు. ఈ సంఘటన జరిగిన తర్వాత నెల్లూరు పాలకుడు ముక్కంటి శ్రీరంగం రాజైన చోడానికి లొంగిపోయాడు.[133]

"పోలురాజు కథ" - తాళపత్ర గ్రంథంలో ముక్కంటి అసలు పేరు "ముక్కంటి కాల్విట్టి' ' గా వర్ణింపబడింది. ముక్కంటి తల్లి పార్వతి తనకు పుత్రుడు కలగాలని శివుణ్ణి ప్రార్థించింది.

కోయ కులానికి చెందిన విట్టయ్య, కాలయ్య లనే ఇద్దరు సోదరులు పార్వతిని పెంచి పెద్ద చేసినారు. పార్వతి తండ్రి విరూపాక్షభోట్లు బ్రాహ్మణుడు. ఇతడు కాశీకి పోతూ తన కూతురు పార్వతిని కాలయ్య, విట్టయ్యలకు ఒప్పచెప్పాడు. కొంతకాలం తర్వాత శివుని వరాన పార్వతికి మగ పిల్లవాడు జన్మించాడు.[134] శివుడు - కాలయ్య విట్టయ్యల జ్ఞాపకార్థం పార్వతి తన కుమారునికి ముక్కంటి - కాల్విట్టి అని నామకరణం చేసింది.

పోలురాజుతో పోరాడిన నెల్లూరు పాలకుడు తిరుకాలట్టి దేవుడు. "పోలురాజు కథ" - రచయిత తిరుకాలట్టి దేవకు బదులు "ముక్కంటి కాల్విట్టి" అని సంభోదించాడు. కంజీవరం (కంచి)లోని వరదరాజ పెరుమాల్ దేవాలయంలో శాసనం ప్రకారం నెల్లూరు రాజు తిరుకాలట్టి దేవునకు బిరుదులు తీసుకోవటం చాలా ఇష్టమని తెలుస్తుంది. ఈ శాసనంలో తిరుకాలట్టి దేవుని బిరుదు ఇలా వ్రాయబడింది. - "మధురాంతక పొత్తపి చోళన్ మనుమసిద్ధరసన్ తిరుకాలట్టి దేవగండ గోపాల" (ఎ.ఆర్.ఇ. 1919 - 20 పుట : 116-117)

ఓగూరు గ్రామం, సిద్ధవటం తాలూకా, కడప జిల్లాలోని శాసనం ప్రకారం శక సంవత్సరం 1159 (క్రీ.శ. 1238) నాటి దానిలో "మహా మండలేశ్వర గండగోపాల తిరుకాలట్టి దేవ చోడ మహారాజ"[135] అని వుంది. తిరుకాలట్టి దేవ చోడునకు సామంతుడైన సూరపనాయుడు అనువాడు ఓగూరు గ్రామంలో మల్లినాథదేవునికి భూమిని దానం చేసి శాసనం వేశాడు.[136] ఈ శాసనంలో చెప్పబడిన తిరుకాలట్టి దేవుడు - నెల్లూరు పాలకుడైన తిక్క చోడ-I ఒక్కరే.[137] ఇతడు నెల్లూరు క్రీ.శ. 1208 నుండి 1248 వరకు[138] పరిపాలించాడు. మనుమసిద్ధి రసరగండగోపాల అను బిరుదులు ఈ చోడతిక్క-I రాజుకు ఉన్నవి.[139] డాక్టర్. టి. వెంకటేశ్వరరావు తన పరిశోధనా వ్యాసం "యాదవరాజు యల్లన దేవుడు" - 1985లో ప్రచురించబడిన ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ - తొమ్మిదవ మహా సభ సంచికలో వలురాజు ఐదవకుమారుడు పోలురాజు తెలుగు చోడవంశానికి చెందిన నెల్లూరు రాజు మనుమసిద్ధితో చెరుకూరు వద్ద యుద్ధం చేసినట్లు చెప్పారు.[140]

పైన చూపించిన ఆధారాలను బట్టి పోలురాజుతో పోరాడిన నెల్లూరు రాజు ముక్కంటి యే చోడతిక్క-I. ఇతనిని మనుమసిద్ధి అనికూడా పిలిచేవారు.[141]

శ్రీరంగం రాజు చోడాని చెరుకూరు నివాసులైన గౌరిమనోహర, గంగాధర, విరూపాక్ష, శంకర, విశ్వనాథ, అను వారిని కావేరి కట్ట నిర్మాణానికి వెట్టి చాకిరి చేయడానికి తీసుకురమ్మని నెల్లూరు రాజు ముక్కంటిని ఆజ్ఞాపించాడు. ఈ ఐదుగురు సోదరులు శిలమంతుల కుటుంబానికి చెందిన జంగమ కులస్తులు.[142]

ముక్కంటి తరపున పట్టపు మురహరి చెరుకూరు పోయి శిలమంతుల సోదరులకు చోడాని రాజు ఆజ్ఞను తెలియజేశాడు. ఈ ఐదుగురు సోదరులు తమ తల్లి శిలాంబతో[143] చర్చించి ఆమె సలహా ప్రకారం తమ భార్యా పిల్లలతో సహా చెరుకూరులోనే ఉన్న పోలురాజు కడకు వెళ్లారు. తమకు వచ్చిన ఆపదను పోలురాజుకు వివరించి రక్షించమని వేడుకున్నారు. పోలురాజు శిలమంతుల సోదరులకు అభయం ఇచ్చాడు.[144]

పట్టపు మురహరి, పోలురాజు ఉన్న ప్రాంతానికి వచ్చి శిలమంతుల సోదరులను అప్పగించవలసిందిగా కోరాడు. అంతకు ముందే పోలురాజు శిలమంతులకు మాట ఇచ్చి ఉండటం వలన వారిని పట్టపు మురహరికి పట్టించడానికి ఒప్పుకోలేదు. కష్టంలో ఉన్నవారికి ఒకసారి అభయహస్తం ఇచ్చిన తర్వాత ఎట్టి పరిస్థితిలోను దానిని వెనుకకు తీసికొనకూడదు. పురాతన కాలం నుంచి కూడా కాటమరాజు వంశంలోని యాదవులు కష్టాలలో ఉన్నవారిని ఆదుకోవటం తమ సాంప్రదాయంగా పరిగణిస్తూ వస్తున్నారు. పోలురాజు శైవమతాభిమాని, జంగములు శైవమత పూజారులు. అందువలన వారిని రక్షించటం తన కర్తవ్యంగా భావించాడు.

పట్టపు మురహరి బలవంతంగా ఐదుగురు జంగాలను చెరుకూరు నుండి తీసికొని

పోవటానికి నిర్ణయించుకొన్నాడు. పట్టపు మురహరిని, అతని అనుచరులను బైటకు నెట్టి వేయవలసిందిగా పోలురాజు తన బావమరిది, గొప్ప యుద్ధవీరుడైన బండారుమల్లును ఆజ్ఞాపించాడు. చేసేది ఏమి లేక పట్టపు మురహరి తన అనుచరులతో పోలురాజు సమక్షం నుండి వెడలి పోయాడు. పల్లికొండ - జంగమ సోదరులను చోడాని కడకు పంపించి రాబోయే అనర్థాన్ని నివారించి రక్తపాతం జరగకుండా చూడమని పోలురాజును కోరుకున్నాడు.[145] పోలురాజు పల్లికొండ మాటలు విని మనసు మార్చుకోలేదు. జంగమ సోదరులను రక్షించడానికే నిర్ణయించుకున్నాడు. చెరుకూరులోని జంగమ కుటుంబాలను శ్రీశైలం పంపించమని పల్లికొండ పోలురాజుకు సలహా ఇచ్చాడు. ఆ విధంగా చేయడం వలన చోడాని జంగమ సోదరులను వెట్టి చేయించటానికి శ్రీరంగం తీసుకొని పోయే అవకాశం ఉండదు. పోలురాజు పల్లికొండ సలహానుసరించి జంగమవారిని, కల్లందుల పోలినీడు, మసిలినీడు, కొంత సైన్యాన్ని రక్షణగా ఇచ్చి శ్రీశైలం పంపించాడు.[146]

పట్టపు మురహరి - పోలురాజుపై లేని పోని విషయాలు కల్పించి చోడానికి చెప్పాడు. అయినను చోడాని మొదట పోలురాజుపై కోపం తెచ్చుకోలేదు. ఎందుకనగా పోలురాజు గొప్ప శివభక్తుడు, చోడానికి మిత్రుడు కూడాను. నెల్లూరు రాజు ముక్కంటి పోలురాజును శిక్షించవలసిందిగా చోడానిని కోరాడు. పోలురాజుపై చర్య తీసుకోకుండా ఉంటే ఇతరులు కూడా చోడాని ఆజ్ఞలను ధిక్కరించుతారని సలహా ఇచ్చాడు.[147] ఎట్టకేలకు ముక్కంటి తన వాదనను నెగ్గించుకున్నాడు. యాదవులపై దాడి చేయడానికి చోడాని, నెల్లూరు రాజు ముక్కంటికి అనుమతి ఇచ్చాడు.

శ్రీరంగం రాజు తన సామంతులంతా పోలురాజు పై యుద్ధానికి బయలుదేరవలసిందిగా ఆజ్ఞాపించాడు. యుద్ధభూమికి చేరుకోటానికి ముందు ముక్కంటి, పోలురాజు కడకు ఒక భట్టును రాయబారం పంపించాడు. యాదవరాజు ముక్కంటి వర్తమానాన్ని లెక్క చేయలేదు. ఎట్టి పరిస్థితిలోను జంగమ సోదరులను చోడాని రాజుకు అప్పగించేది లేదని తేల్చి చెప్పాడు. నెల్లూరు నుండి ముక్కంటి తరపున వచ్చిన భట్టుకు పోలురాజు బంగారు ఆభరణాలు ఇచ్చి పంపించాడు.[148]

## చెరుకూరు యుద్ధం : క్రీ.శ. 1222 – 1223

శ్రీరంగం పాలకుడైన చోడాని, యాదవుల మధ్య యుద్ధం తప్పని సరి అయింది. ముక్కంటి నాయకత్వంలో సైన్యంచెరుకూరు మీద దాడి చేసింది. పోలురాజు తరపున వల్లవులు, తిరుమందుల వారు ముక్కంటిపై యుద్ధం చేయటానికి సిద్ధమయ్యారు. యుద్ధభూమి లోకి ప్రవేశించేముందు పోలురాజు, బంగారు ఆభరణాలు, శ్రీరామ మాడలు (నాణాలు) బ్రాహ్మణులకు, భట్లకు, సైనికులకు, పంచిపెట్టాడు. పోలురాజు తన శరీరానికి గంధం పొడి పూసుకొని బంగారు ఆభరణాలు ధరించాడు. ఈటె, కత్తి మొదలైన అయుధాల పోట్ల నుండి శరీరం గాయపడకుండా ఉండడానికి 'ఉక్కుజీర' - ధరించాడు. తలకు దెబ్బలు తగలకుండా ఉండటానికి 'అల్లికతాపరం' పెట్టుకున్నాడు. నడుముకు బిళ్ళ వడ్డాణము, కుడి, ఎడమ వైపుల వంకిణి, జముదాళి (కత్తులు) మరొక చిన్న సురియ ధరించి "గజ్జెల కఠారి"[149] చేతపట్టుకుని యుద్ధానికి సన్నద్ధమయ్యాడు.

చెరుకూరు యుద్ధరంగంలో ఇరు వర్గాల వైపు చాలా మంది సైనికులు మరణించారు. చోడాని మేనల్లుడైన ఉంద్రవెల్లి ఉద్దన్నను పల్లికొండ చంపివేశాడు.

ముక్కంటి "అతిరత్న" అనే అశ్వాన్ని ఎక్కి పోలు రాజును ఎదుర్కొన్నాడు. ఇరువురి మధ్య జరిగిన ద్వంద్వ యుద్ధంలో పోలురాజు వీర మరణం చెందాడు. ఈ యుద్ధం చిత్రభాను[150]

సంవత్సరంలో జరిగినట్లు - పోలురాజు యుద్ధం తాళపత్ర గ్రంథంలో వివరింపబడింది. (క్రీ.శ. 1223)

యుద్ధభూమిలో పోలురాజు ప్రాణాలు విడువటానికి ముందు తన మంత్రి, సమీప బంధువైన పల్లికొండను దగ్గరకు పిలిచి తన కుమారుల మంచి చెడ్డలను చూసే బాధ్యత పల్లికొండకు అప్పగించాడు.[151] తన భార్య సిరిదేవి సహగమనం చేయవద్దని చెప్పాడు. పోలురాజు చెరుకూరు యుద్ధంలో మరణించిన తర్వాత మిగిలిన యాదవ సైన్యం, పశుసంపద బంధు వర్గముతో పల్లికొండ అర్ధవీడు చేరుకున్నాడు.[152]

రాజవంశ ప్రదీపికలో చెరుకూరు యుద్ధం పోలురాజు, ముక్కంటికి మధ్య చిత్రభాను[153] సంవత్సరంలో జరిగినట్లు తెలుపబడింది. కానీ శక సంవత్సరం ఏదైనదీ ఇవ్వలేదు.

గుండ్లపాలెం శాసనంలో పోలురాజు నెల్లూరు పాలకుడైన నల్లసిద్ధితో శక సంవత్సరం 1170[154] కాళయుక్తి, కార్తీక మాసం, శుద్ధ పంచమి గురువారం నాడు యుద్ధం చేసినట్లు ఉంది.

(i) పైన ఉదహరించిన రీతిగా ముక్కంటి కాల్విట్టి, చోడతిక్క - I (మనుమసిద్ధి) పేర్లు రెండూ ఒకటే. చోడతిక్క - I నెల్లూరును క్రీ.శ. 1209 - 1248 మధ్య కాలంలో పరిపాలించాడు. చెరుకూరు యుద్ధం క్రీ.శ. 1209-1248 మధ్య కాలంలో జరిగింది. పోలురాజు యుద్ధం - తాళపత్ర గ్రంథంలో చెరుకూరు యుద్ధం చిత్రభాను సంవత్సరంలో జరిగినట్లు చెప్పబడింది. క్రీ.శ. 1209 - 1248 మధ్యలో చిత్రభాను సంవత్సరం క్రీ.శ. 1223లో వస్తుంది. అందువలన చెరుకూరు యుద్ధం క్రీ.శ. 1223లో జరిగినట్లు చెప్పవచ్చును.

(ii) శ్రీరంగం దేవాలయం[155] చరిత్ర ఆధారంగా నెల్లూరును పాలించిన తెలుగు చోడులు, చోళరాజులైన మూడవ కులోత్తుంగ (క్రీ.శ. 1178-1218) మరియు మూడవ రాజరాజు (క్రీ.శ. 1218-1257)లకు సామంతులుగా ఉన్నట్లు తెలుస్తుంది.

పోలురాజు యుద్ధం తాళపత్ర గ్రంథంలో వర్ణింపబడిన శ్రీరంగం రాజు చోడాని, చోళ చక్రవర్తి, మూడవ రాజరాజు ఒక్కరే.

శ్రీరంగం దేవాలయ చరిత్రలో వి.ఎన్. హరిరావు ఈ విధంగా వ్రాశారు. -

"శ్రీరంగం దేవాలయాన్ని కళింగ లేక ఒరిస్సా లేక ఒఢ్రాస్ క్రీ.శ. 1223- 24లో ఆక్రమించుకున్నారు.[156] ఇక్కడ కళింగ ప్రాంతం నుంచి వచ్చిన రాజు పేరు ఇవ్వలేదు. కాటమరాజు పినతండ్రి పోలురాజు క్రీ.శ. 1223లో శ్రీరంగంలో ఉన్నట్లు - శ్రీరంగం, నెల్లూరు రాజులతో యుద్ధం చేసినట్లు తెలుస్తుంది.

కాటమరాజు తాత తండ్రులు యలమంచిని క్రీ.శ. 12వ శతాబ్దంలో పరిపాలించారు. యలమంచి ప్రాంతాన్ని మధ్యమ కళింగ అని కూడా అంటారు. అందువలన, మధ్యమ కళింగ నుండి వచ్చిన పోలురాజు క్రీ.శ. 1223లో శ్రీరంగం పై దాడి జరిపి ఉండవచ్చు.

(iii) ప్రకాశం జిల్లాలోని అర్ధవీడులో ఒక గుట్టపై ఆవుల దొడ్డి ఉన్నది. ఇది నీలకంఠేశ్వర స్వామి దేవాలయానికి ఒక కిలోమీటరు దూరంలో ఉన్నది. పోలురాజు ఆవులు ఈ ప్రాంతంలోని గుట్టపై మేతమేసేవని ఇప్పటికి ఈ ప్రాంత ప్రజలు చెప్పుకుంటున్నారు.

(iv) ప్రకాశం జిల్లాలోని వెంగళాపురం గ్రామ సమీపంలో ఉన్న పంచలింగాల కొండలో రాతితో చెక్కిన పోలురాజు విగ్రహం ఉన్నది. ఇప్పటికి కనిగిరి ప్రాంతంలోని ప్రజలు ప్రతి

సంవత్సరం గంగజాతరలు జరుపుతున్నారు.

(V) గుండ్లపాలెం శాసనంలో ఉన్నట్లుగా పోలురాజు యరగడ్డపాడు యుద్ధంలో పాల్గొనే అవకాశం లేదు. యరగడ్డపాడు యుద్ధం శక సంవత్సరం 1204 (క్రీ.శ. 1282)లో జరిగింది.

"మధ్యాంధ్ర యుగ చారిత్రక వ్యాసములు" గ్రంథంలో కొల్లూరు సూర్యనారాయణ కాటమరాజు, అతని తాత తండ్రులు చారిత్రక పురుషులు కారని వ్రాశారు.[157] శ్రీకూర్మ ప్రాంతాలు గంగరాజులైన మూడవ రాజరాజ (క్రీ.శ. 1198-1211) మూడవ అనియంక భీమ (క్రీ.శ. 1211-1238) ఏలుబడిలో ఉన్నాయి. అంతే కాదు సింధు బళ్ళాని రాజనేవాడు ఆ కాలంలోనే కాదుగదా సరికదా ఏకాలంలోనూ శ్రీకూర్మ ప్రాంతాన్ని పాలించలేదు. అతని ఉదంతమే చరిత్రకు తెలియదు. కాటమరాజు పెద తండ్రి సింహాద్రి రాజు, సింధు బళ్ళాని పై యుద్ధం చేసి సింధు బళ్ళానిని సంహరించి తానుకూడ ఆ యుద్ధంలో మరణిస్తాడు - సంస్కృతాంధ్ర - ఓఢ్రభాషలలో లభ్యమవుతున్న శ్రీకూర్మ ఆలయంలోని సుమారు రెండువందల ఎనిమిది శాసనాల్లో దీనిని రూఢి పరిచే విషయం లేదు అని వ్రాశారు.[158]

తూర్పు గాంగ వంశము రాజులు క్రీ.శ. 12వ శతాబ్దంలో శైవమతాన్ని ఆదరించారు.[159] శ్రీకూర్మంలోని శాసనం ప్రకారం నరసింహుడు కళింగకు క్రీ.శ. 1230లో వచ్చి, రాజును వైష్ణవ మతం స్వీకరించేటట్లు చేసినాడని ఉన్నది.[160] అందువలన క్రీ.శ. 1230కి ముందు కళింగ రాజులు వైష్ణవులు కాదని తెలుస్తుంది. కాబట్టి అంతకుముందు అనగా సింహాద్రిరాజు శ్రీకూర్మం మీద దాడి చేసిన సమయంలో వైష్ణవులను బాధించుతున్నారనే విషయం నమ్మతగిందిగా ఉన్నది. అందుచేతనే సింహాద్రి రాజు వైష్ణవులను రక్షించడానికి సింధుబళ్ళాని పై యుద్ధం చేశాడు. సింధు బళ్ళాని తూర్పు గాంగ వంశపు రాజులకు సామంతుడై వుండవచ్చు. ప్రతి సంఘటనకు శాసనాధారం ఉండాలనుకోవటం సమంజసం కాదు.

గుప్తుల కాలంలో భారతదేశానికి వచ్చిన చైనా యాత్రికుడు - ఫాహియాన్ - తన గ్రంథంలో ఆనాటి సామాజిక పరిస్థితులను చక్కగా వివరించాడు. ఎన్నో విషయాలు చర్చించాడు. కానీ రెండవ చంద్రగుప్తుని పేరు ఎక్కడ పేర్కొనలేదు. అంతమాత్రంచేత రెండవ చంద్రగుప్తుడు ఫాహియాన్ భారతదేశాన్ని సందర్శించినపుడు లేడని చెప్పడం సమంజసంగా ఉంటుందా? - జానపద సాహిత్యం పాడుకొనే సమయంలో చారిత్రక విషయాలైనా - వారు పాడుకోవటానికి అనుకూలముగా ఒకొకసారి పదాలను అటుఇటు మార్చే అవకాశం గూడా ఉంటుంది. అంతమాత్రం చేత పేరు కలవలేదనో శాసనం లేదనో - చారిత్రిక సంఘటనను చరిత్ర కాదని కొట్టి పారేయడం సమంజసం కాదు.

---

# నోట్స్ అండ్ రిఫరెన్సు

| | | |
|---|---|---|
| 1. మద్దులేటి కవి | వలురాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం, | తా.ప.నెం. : 1-33 |
| 2. ఇదే | | తా.ప.నెం. - 1 |
| 3. ఇదే | | |
| 4. ఇదే | | |
| 5. ఇదే | | |
| 6. ఇదే | | |
| 7. ఇదే | | |
| 8. ఇదే | | |
| 9. ఇదే | తా.ప.గ్రం.; | తా.ప.నెం. : 5 |
| 10. ఇదే | | |
| 11. ఇదే | | |
| 12. ఇదే | తా.ప.గ్రం. ; | తా.ప.నెం. : 6 |
| 13. ఇదే | | |
| 14. ఇదే | | |
| 15. ఇదే | తా.ప.గ్రం. ; | తా.ప.నెం. : 7 |
| 16. ఇదే | | |
| 17. ఇదే | | |
| 18. ఇదే | | |
| 19. ఇదే | తా.ప.గ్రం. ; | తా.ప.నెం. : 12 |
| 20. ఇదే | | |
| 21. ఇదే | | |
| 22. ఇదే | | |
| 23. ఇదే | | |
| 24. ఇదే | తా.ప.గ్రం. ; | తా.ప.నెం. : 13 |
| 25. ఇదే | | |
| 26. ఇదే | | |
| 27. ఇదే | | |
| 28. ఇదే | | |
| 29. ఇదే | | |
| 30. ఇదే | | |
| 31. ఇదే | తా.ప.గ్రం. ; | తా.ప.నెం. : 19 |
| 32. సుబ్బారావు- సం॥, వీరగాథలు-I, | వలురాజు చరిత్ర - తా.ప.గ్రం., మద్దులేటి కవి | పుట : 46 |
| 33. మద్దులేటి కవి | - వలురాజు చరిత్ర - తా.ప.గ్రం. | తా.ప.నెం. : 22 |
| 34 ఇదే | | |
| 35. ఇదే | తా.ప.గ్రం. ; | తా.ప.నెం. : 24 |

36. ఇదే తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 26
37. ఇదే
38. ఇదే తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 27
39. ఇదే
40. ఇదే
41. ఇదే
42. ఇదే
43. ఇదే
44. ఇదే తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 30
45. ఇదే
46. ఇదే
47. సుబ్బారావు, సం॥, వీరగాథలు-I, వలురాజు చరిత్ర - తా.ప.గ్రం., మద్దులేటి కవి, పుట : 70
48. ఇదే
49. సూర్యనారాయణ పుట : 117
50. ఎ.పి.డి.జి., విశాఖపట్టణం (రివైజ్డ్ ఎడిషన్) 1979 ; పుట : 242
51. ఎ.పి.డి.జి., శ్రీకాకుళం , 1979 పుట : 304
52. మద్దులేటి కవి ; వలురాజు చరిత్ర ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 18
53. సుబ్బారావు, సం॥, వీరగాథలు - I పీఠిక, పుట : clxiii

పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం.లో పెద్దిరాజు చిత్రభాను సం॥లో ఆర్లపెంట యుద్ధంలో చనిపోయినట్లు తెలుపబడింది. తా.ప.నెం. : 10, చిత్ర భాను సం॥ ప్రతి అరువది సంవత్సరములకు ఒకసారి వస్తుంది. యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1282లో జరిగింది. (చిత్రభాను) పెద్దిరాజు ఆర్లపెంట యుద్ధంలో యరగడ్డపాడు యుద్ధానికంటే ముందుగానే చనిపోయాడు, 1282-60 = 1222.

(1222 క్రీ.శ.) చిత్రభాను సం॥ క్రీ.శ. 1222-23 మధ్యలో వస్తుంది. పెద్దిరాజు కుమారుడు కాటమరాజు ఓరుగల్లు ప్రతాప రుద్రునికి సమకాలికుడు. ఎన్.డి.ఐ. రెండవ భాగము - గుండ్లపాలెం శాసనం - పుట : 532.

54. కనకబండి వెంకట్రామయ్య, భక్తిరన్న కథ , తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 8, 9
55. సుబ్బారావు, సం॥, వీరగాథలు - I, , పంపాద్రి కథ ; తా.ప.గ్రం. మల్లయ్య, పుట : 95-96
56. ఇదే పుట : 96
57. ఆరాధ్యుల పిచ్చయ్య, సం॥, పెద్దిరాజు కథ, తా.ప.గ్రం., 1976, పుట : 3, 4 & 5
58. ఇదే పుట : 2
59. ఇదే
60. గోవుల నాగేశ్వర కవి శ్రీ మదనకుంబిణి యుద్ధం, 1962 పుట : 17
61. ఇదే
62. పిచ్చయ్య, సం॥ పెద్దిరాజు కథ, తా.ప.గ్రం. పుట : 8
63. ఇదే పుట : 15
64. సుబ్బారావు, సం॥ , వీరగాథలు - I, పంపాద్రి కథ ; తా.ప.గ్రం. మల్లయ్య పుట : 140-141
65. పిచ్చయ్య, సం॥ పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం ; పుట : 13

66. మహేశ్వరం, కొల్లాపురం - మహబూబ్‌నగర్ జిల్లాలో ఉన్నవి.
67. కాటగుళ్ళు - కొల్లాపురానికి సమీపంలో ఉండవచ్చు.
68. కనకబండి గట్టయ్య, జన్నివాడ కథ, తా.ప.గ్రం., తా.ప.నెం. : 2
కాటమరాజు ధాతనామ సం॥ర పాల్గుణ శుద్ధ పంచమి ఆదివారం నాడు జన్మించాడు. (శక.సం॥ 1138) క్రీ.శ.12-2-1217.
69. రాంపాక వెంకూరాం, పాపనూక కథ - తా.ప.గ్రం.; తా.ప.నెం. : 7
70. కళ్యాణాన్ని బసవకళ్యాణ అనికూడా అంటారు. ఇది ప్రస్తుతం కర్ణాటక రాష్ట్రంలోని బీదర్ జిల్లాలో ఉన్నది.
71. పిచ్చయ్య, సం॥ పెద్దిరాజు కథ - తా.ప.గ్రం. పుట : 19
72. ఇదే పుట : 20
73. పెద్దిరాజు కథ - తా.ప.గ్రం., తా.ప.నెం. - 1
74. అర్లపెంట బసవకళ్యాణం సమీప ప్రాంతంలో ఉండి ఉండవచ్చు.
75. పెద్దిరాజు కథ , తా.ప.గ్రం., తాపనెం. -1
76. సుబ్బారావు ; సం॥ వీరగాథలు ; పెద్దిరాజు కథ , తా.ప.గ్రం. పుట : 172
77. ఇదే పుట : 171-173
78. సుబ్బారావు ; సం॥ , వీరగాథలు-I ; పెద్దిరాజు కథ , తా.ప.గ్రం. పుట : 179
79. ఇదే
80. పెద్దిరాజు కథ - తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 10
81. ఇదే
82. ఇదే
83. ఇదే తా.ప.గ్రం. తా.ప.నెం. : 11
84. ఇదే
85. ఇదే తా.ప.నెం. 13.
86. ఇదే
87. ఇదే తా.ప.గ్రం. తా.ప.నెం. : 19-20
88. ఇదే
89. ఇదే తా.ప.నెం. 23
90. ఇదే తా.ప.నెం. 26
91. ఇదే తా.ప.నెం. 28
92. ఇదే తా.ప.నెం. 29
93. ఇదే
94. సుబ్బారావు, సం॥, వీరగాథలు-I, పెద్దిరాజు కథ - తా.ప.గ్రం. పుట - 279
95. పెద్దిరాజు కథ - తా.ప.గ్రం. తా.ప.నెం. - 33
96. ఇదే
97. ఇదే తా.ప.నెం. - 34
98. పిచ్చయ్య, సం॥ పెద్దిరాజు కథ , తా.ప.గ్రం. పుట నెం. - 53
99. సుబ్బారావు, సం॥, వీరగాథలు-I, పెద్దిరాజు కథ, తా.ప.గ్రం. పుట - 275

100. నీలకంఠ శాస్త్రి, హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా, 1984, పుట - 199

101. బత్తుల లక్ష్మయ్య పుట - 107

102. వెంకట్రామయ్య, భక్తిరన్న కథ, తా.ప.గ్రం. తా.ప.నెం. - 9

103. పిచ్చయ్య,సం॥ కరియావులరాజు చరిత్ర, తా.ప.గ్రం, - 1976 పుట - 16

104. వెంకట్రామయ్య, భక్తిరన్న కథ, తా.ప.గ్రం. తా.ప.నెం. - 9

105. ఇదే

106. ఇదే

107. ఇదే

108. ఎ.పి.డి.జి. శ్రీకాకుళం, 1979 పుట : 205

109. ఎ.పి.డి.జి. తూర్పు గోదావరి, 1979 పుట : 243-244

110. వెంకట్రామయ్య, భక్తిరన్న కథ, తా.ప.గ్రం. తా.ప.నెం. - 9

111. ఇదే తా.ప.నెం. - 10

112. సుబ్బారావు, సం॥, వీరగాథలు - II, 1978, యరనూకరాజు కథ, తా.ప.గ్రం., పుట - 570-571

113. వెంకట్రామయ్య. భక్తిరన్న కథ, తా.ప.గ్రం. తా.ప.నెం. - 9&10

114. సుబ్బారావు, సం॥, వీరగాథలు-I, 1978, యరనూకరాజు కథ, తా.ప.గ్రం., పుట 602

115. వెంకట్రామయ్య, భక్తిరన్న కథ, తా.ప.గ్రం. తా.ప.నెం. - 10

116. బత్తుల లక్ష్మయ్య పుట 108

117. వెంకట్రామయ్య, భక్తిరన్న కథ, తా.ప.గ్రం. తా.ప.నెం. 10

118. ఇదే - నందికేశవరాజు - నున్న బెజవాడ పాలకుడు. ఇతనిని నున్న భూపతి అని కూడా పిలుస్తారు. స్త్రీలు ధరించే గాజులపై పన్ను విధించాడు. పలువిధాలుగా పన్నులు వసూలు చేస్తూ ప్రజలను కష్టాలకు గురిచేశాడు.

119. ఇదే

120. ఇదే

121. సుబ్బారావు, సం॥ వీరగాథలు - I, పంపాద్రికథ, తా.ప.గ్రం., పుట - పీఠిక clxxi

122. గట్టయ్య, పోలురాజు యుద్ధం, తా.ప.గ్రం. తా.ప.నెం. - 4

123. సుబ్బారావు, సం॥ వీరగాథలు - I, పంపాద్రికథ, తా.ప.గ్రం., పుట - 143

124. ఇదే పోలురాజు కథ, తా.ప.గ్రం. పుట - 228

125. సుబ్బారావు, సం॥ వీరగాథలు - I, పోలురాజుకథ, తా.ప.గ్రం., గట్టయ్య పుట - 289

126. ఇదే పుట - 293

127. ఇదే పుట - 313

128. ఇదే పుట - 312

129. ఇదే పుట - 315

130. ఇదే పుట - 318

131. ఇదే

132. ఇదే గుంటూరు జిల్లాలోని చెరుకూరు పుట - 313

133. ఇదే పుట - 343

134. ఇదే పుట - 339

| | | |
|---|---|---|
| 135. ఇ.ఎస్.నెం. - 10, ఎ.పి. : ఎ.ఆర్.ఇ. , 1967 | | పుట - 9 |
| 136. ఇ.ఎస్.నెం. - 10, ఎ.పి. ; ఎ.ఆర్.ఇ. , 1967 | | పుట - 9 |
| 137. ఇదే | | |
| 138. వి.యశోదాదేవి : | జె.ఎ.హెచ్. ఆర్.ఎస్. | పుట - 9 |
| 139. ఎ.ఆర్.ఇ., 1919 - 20 ; | | పుట - 116 |
| 140. టి. వెంకటేశ్వరరావు | ఎ.పి.హెచ్.సి. | పుట - 42 |
| 141. గట్టయ్య | పోలురాజు యుద్ధం : తా.ప.గ్రం. | తా.ప.నెం. - 29 |
| 142. ఇదే. | | తా.ప.నెం. - 1 |
| 143. ఇదే. | | తా.ప.నెం. - 5 |
| 144. ఇదే. | | |
| 145. ఇదే. | | తా.ప.నెం. - 8 |
| 146. ఇదే. | | తా.ప.నెం. - 14 |
| 147. ఇదే. | | తా.ప.నెం. - 20 |
| 148. ఇదే. | | తా.ప.నెం. - 23 |
| 149. ఇదే. | | తా.ప.నెం. - 23, 25 |
| 150. ఇదే. | | తా.ప.నెం. - 30 |
| 151. ఇదే. | | తా.ప.నెం. - 32 |
| 152. ఇదే. | | తా.ప.నెం. - 37 |
| 153. బత్తుల లక్ష్మయ్య | | పుట - 108 |
| 154. ఎన్.డి.ఐ. ; 1905 ; | | పుట - 534-535 |
| 155. వి.ఎన్.హరిరావు | ది హిస్టరీ ఆఫ్ ది శ్రీరంగం టెంపుల్ : 1976 | పుట - 67 |
| 156. ఇదే | | పుట - 68 |
| 157. కొల్లూరు సూర్యనారాయణ ; | మధ్యాంధ్ర యుగ చరిత్ర కావ్యములు : 1989 | పుట - 71 |
| 158. ఇదే | | పుట - 81 |
| 159. కాపర్‌ప్లేట్ ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ మ్యూజియం - I | | పుట - 132 |
| 160. ఇదే | | పుట - 135 |

# 4

# యాదవ ప్రముఖులు

## I. అయితమ రాజు : క్రీ.శ. 1222 - 1282.

కాటమరాజు పినతండ్రి కొడుకు అయితమరాజు గొప్ప యుద్ధవీరుడు[1], పరిపాలనాదక్షుడు. పోలురాజు శ్రీరంగమునకు వెళ్ళే సమయంలో అయితమరాజును దొనకొండ ప్రాంతానికి రాజుగా చేశాడు[2]. ఇది ప్రస్తుతము ప్రకాశం జిల్లాలో ఉన్నది. గంగదొనకొండగా పిలుస్తున్నారు. చెరుకూరు యుద్ధం అయిన తర్వాత పల్లికొండ మిగిలిన యాదవసైన్యం, బంధువర్గం, పశుసంపదతో అర్ధవీడుకు పోయాడు[3].

పోలురాజు మరణించడానికి ముందు తన కుమారులను యలమంచికి తీసుకొనిపోయి, వారికి యలమంచి పాలనను అప్పచెప్పాలని పల్లికొండను కోరతాడు. అంతేకాక తనభార్య సిరిదేవిని సహగమనం చేయవద్దని చెపుతాడు. ఈ విషయాలన్ని పల్లికొండ సిరిదేవి, అయితమరాజు, తదితర యాదవ ప్రముఖులకు అర్ధవీడులో తెలియచేస్తాడు. సిరిదేవి సహగమనం చేస్తానని పట్టుబట్టింది. కాని పల్లికొండ ఆమెను ఓదార్చి పిల్లల కోసం బ్రతకమని, పోలురాజు కోరికను మన్నించమని చెప్పాడు[4].

పల్లికొండ, సిరిదేవి, కొమరమ్మ (కాటమరాజు మేనత్త), భక్తిరన్న, ముమ్మయ్య, అగుమంచి, అయితమరాజు తదితర యాదవ కుటుంబాల వారు యలమంచికి బయలుదేరారు. రాజకుటుంబానికి సంబంధించినవారు పల్లకీలు, గుఱ్ఱాలు ఎక్కి ప్రయాణం సాగించారు. వారు మర్కాపురం, కంభం, కందుకూరు, ధర్మవరం దాటి బల్లికురువ చేరుకున్నారు[5].

పైన తెల్పిన ప్రాంతాలు అర్ధవీడు, మర్కాపురం, కంభం, కందుకూరు ప్రస్తుతము ప్రకాశం జిల్లాలో అవే పేర్లతో పిలువబడుతున్నాయి. ధర్మవరం, బల్లికురువలు గుంటూరు జిల్లాలో ఉన్నవి.

### బల్లికురువ యుద్ధం : క్రీ.శ. 1224

యాదవుల శత్రువైన ఇమ్మడక్కమరాజు - అయితమరాజు అతని పరివారాన్ని బల్లికురువ దగ్గర ఎదుర్కొన్నాడు[6]. ఇమ్మడక్కమరాజుకు సహాయంగా చింతలచెరువు, వినుకొండ పాలకులు తమ సైన్యసమేతంగా బల్లికురువకు వచ్చారు[7]. చింతల చెరువు, వినుకొండ గుంటూరు జిల్లాలో ఉన్నాయి. అయితమరాజు తరపున నేతివారి ముద్దయ్య, నాచకూళ్ళనాయుడు, కల్లందుల మార్నీడు, గోసంగి బలరి[8], యుద్ధంలో పాల్గొన్నారు.యాదవుల ఆలమందలోని బొల్లావు, ఏడు ఎద్దులు కూడా అయితమరాజు తరపున యుద్ధం చేశాయి. చెరుకూరు యుద్ధానికి ముందు జంగమసోదరులను శ్రీశైలం పంపించడానికి వారితోపాటు మార్నీడు, మసిల్నీడులు అంగరక్షకులుగా పోయారు. వారు శ్రీశైలం నుండి తిరిగివచ్చి అయితమరాజుతో కలసి వచ్చారు.

యాదవుల బొల్లావు - ఇమ్మడక్కమరాజు సైనికులను చాలామందిని చంపివేసింది[9]. కల్లందుల మార్నీడు, మసిల్నీడు, బోడావులన్న, గోసంగి సేన, యాదవసైన్యం, ధైర్యసాహసాలతో శత్రువులను ఎదుర్కొన్నారు. కల్లందుల మార్నీడు చేతిలో ఇమ్మడక్కమరాజు ప్రాణాలు కోల్పోయాడు[10]. అయితమరాజు తరపున కల్లందుల మార్నీడు, మసిల్నీడు, బోడావులన్న శత్రువుల చేత

హతమార్చబడినారు.[11] బల్లికురువ యుద్ధం ముగిసిన తరువాత యాదవులు - తమ ప్రయాణం పొగించారు.

యలమంచి వెళ్లే మార్గంలో యాదవులు, ఘ్ననమలమంద, నాదెండ్ల, మంగళగిరి, బెజవాడ, ఏలూరు, రాజమండ్రి, పిఠాపురం దాటి వెళ్ళారు. యనమలమంద, నాదెండ్ల, మంగళగిరి ప్రాంతాలు గుంటూరు జిల్లాలో ఉన్నాయి. యనమలమందను ప్రస్తుతము యనమదల[13] గా పిలుస్తున్నారు. దీనిని ఏనుగుమందల అని కూడా అంటారు. బెజవాడ కృష్ణాజిల్లాలో ఉన్నది. దీనిని విజయవాడ అని పిలుస్తున్నారు. ఏలూరు పశ్చిమగోదావరి జిల్లాలో ఉన్నది. రాజమండ్రి, పిఠాపురం తూర్పుగోదావరి జిల్లాలో ఉన్నవి.

అయితమరాజు, అతని అనుచరులు యలమంచి మార్గమధ్యంలో ఉన్నపుడే పల్లికొండ కొందరు వార్తావరులను యలమంచికి పంపి చల్లపిన్నమనీడుకు తమరాకను తెలియచేశారు. ఆ సమయంలో యలమంచిని చల్లపిన్నమనీడు పరిపాలిస్తున్నాడు.[14] అయితమరాజు ఆగమనము తెలుసుకున్న చల్లపిన్నమనీడు వారిని ఆహ్వానించి తీసుకరావటానికి కొంతమంది ప్రముఖులైన వారిని ఎదురుగా పంపించాడు. యలమంచి నగర ప్రవేశానికి ముందు పల్లికొండ, అయితమరాజును యాదవ పరివారానికి ముందు నడవమని సలహా ఇచ్చాడు. భక్తిరన్న, ముమ్మయ్య, నేతివారి ముద్దయ్య, కల్లందుల పోల్నీడులను అయితమరాజు వెనుక నడవమని ఆజ్ఞాపించాడు. యలమంచి నగరము వెలుపలనున్న కోటను అయితమరాజు తదితర యాదవ ప్రముఖులకు పల్లికొండ చూపించాడు. బలంగా ఉన్న ఆకోట చుట్టూ పెద్ద అగడ్త ఉన్నది.[15]

చల్లపిన్నమనీడు స్వయంగా అయితమరాజు, పల్లికొండ తదితర యాదవ ప్రముఖులను ఆహ్వానించాడు. అందరు రాజ ప్రసాదం లోకి ప్రవేశించారు. యలమంచి సింహాసనంపై కూర్చోవలసిందిగా అయితమరాజును పల్లికొండ సైగచేశాడు. అయితమరాజు పల్లికొండ సలహా ప్రకారం సింహాసనంపై ఆసీనుడయ్యాడు. వెంటనే పల్లికొండ అయితమరాజుకు చేతులెత్తి మ్రొక్కాడు. పల్లికొండ మూడుతరాల వారు - వలురాజు, పోలురాజు, కాటమరాజులకు ప్రధానమంత్రి కావటంవలన అతడంటే అందరికి అమితమైన అభిమానం, గౌరవం ఉన్నాయి. అందువలన అక్కడ ఉన్న యాదవ ప్రముఖులంతా, చల్లపిన్నమనీడు అతని సోదరులతో సహా అయితమరాజుకు వందనం చేశారు.[16]

తలవని తలంపుగా జరిగిన ఈ సంఘటనకు చల్లపిన్నమనీడు అతని సోదరులు - గోవింద, అచ్యుత, కోనేరు, వెంకటాద్రి దిగ్భ్రాంతి చెందారు. పల్లికొండ తమని మోసగించి అయితమరాజుకు సింహాసనం అప్పగించాడని తమలో తాము అనుకున్నారు. అయినప్పటికి వారు అయితమరాజుపై ఎదురుతిరగలేదు. అన్ని విధాలుగా అయితమరాజుకు తమ సహాయ సహకారాలను అందించారు. ఈచల్లా సోదరులంతా కాటమరాజుకు దగ్గర బంధువులు, కాటమరాజు తల్లి, చల్లభూపతి భార్య ఇద్దరు అక్కచెల్లెళ్ళు అవుతారు.

గోవుల నాగేశ్వరకవి తన గ్రంథం "ఓరుగంటి యుద్ధం"[17] - లో శివుడు అయితమరాజుకు కలలో కనిపించి శంభుని తిరునాళ్ళకు ఓరుగంటికి తన పరివారంతో సహా రావలసిందిగా ఆదేశించాడని, అందువలన అయితమరాజు ఓరుగల్లు వెళ్ళి శంభుని సేవించాలని నిర్ణయించుకున్నాడని వ్రాశాడు. అంతేకాక, ఒకప్పుడు పోలురాజు శంభుని తిరునాళ్ళకు ఓరుగల్లు వెళ్ళాడని, ఆ సమయంలో కాకతీయులు పోలురాజును అవమానించారని వ్రాశాడు.[18] దీనివలన కాకతీయులకు, కాటమరాజు వంశీయులకు సరైన స్నేహ సంబంధాలు లేనట్లు తెలుస్తుంది. అయితమరాజు ఓరుగల్లు వెళ్ళినచో కాకతీయులతో ఘర్షణ తప్పదని పల్లికొండ గ్రహించి, ఓరుగల్లు ప్రయాణం

మానుకొమ్మని అయితమరాజుకు సలహా ఇచ్చాడు. కానీ, యాదవరాజు పల్లికొండ సలహాను పాటించలేదు, ఓరుగల్లుకెళ్లి శంభుని ఆరాధించటానికే నిర్ణయం తీసుకున్నాడు.[19]

కరియావుల రాజు చరిత్ర - తాళపత్ర గ్రంథం ప్రకారం - ఓరుగల్లు పోవటానికి ముందు అయితమరాజు యలమంచి గంగను పూజించి ఓరుగల్లుకు బయలుదేరినట్లుగా ఉంది. పల్లికొండ, కరియావులరాజు, భట్టావులరాజు, పుల్లావుకేశవు, కొమనాల పుత్తన్న మరి కొంతమంది యాదవ ప్రముఖులు సైన్య సమేతంగా అశ్వాలను అధిరోహించి అయితమరాజును అనుసరించారు.[20] వారితో పాటు గుడారాలు, మంచాలు, బియ్యం, నెయ్యి, కూరగాయలు, తదితర సామాన్లను కూడా తీసుకొని వెళ్ళారు. ఓరుగల్లు పట్టణానికి బయట గుడార్లు నిర్మించారు.[21] ఆప్రాంతం ఒక చిన్న గ్రామంలాగా ఉంది. తాత్కాలికంగా వారి నివాసానికి కావలసిన సకల సౌకర్యాలు యేర్పాటు చేశారు.

కాకతిరుద్రమదేవి మనుమడు ప్రతాపరుద్రునికి అయితమరాజు సపరివారంగా ఓరుగల్లు వచ్చినట్లు తెలిసింది.[22] శత్రువులు తమ కోటను ముట్టడించడానికి వచ్చారని తలచాడు. యాదవులు ఓరుగల్లు ఎందుకు వచ్చారో అసలు విషయం తెలుసుకొనిరమ్మని ఒక మంత్రిని అజ్ఞాపించాడు. ఒక ప్రత్యేక దూతను అయితమరాజు కడకు పంపించారు. వచ్చినవాడు యాదవులు ఓరుగల్లుకు రావలసిన కారణాలను వివరింపవలసిందిగా కోరాడు. శంభుని సేవించడానికి వచ్చామని అయితమరాజు తరపున పల్లికొండ జవాబు ఇచ్చాడు.[23] ప్రత్యేక దూత ప్రతాపరుద్రుని కడకు వెళ్లి పల్లికొండ చెప్పిన విషయాన్ని తెలిపాడు. ప్రతాపరుద్రుడు తన మంత్రి వర్గంతో చర్చలు జరిపి యాదవులు శంభుని సేవించడానికి అనుమతి ఇస్తున్నట్లు ప్రకటించాడు.[24]

ప్రతాపరుద్రుడు - అయితమరాజు, పల్లికొండ, పుత్తమరాజు, పోచయ్య, ముద్దన్న, నాచకూళ్ల నాయుడు, భట్టావుల రాజు, తదితరులను కాకతీయ ఆస్థానంలోకి చర్చలకు ఆహ్వానించాడు.[25] అయితమరాజు కాకతీయుల ఆహ్వానాన్ని మన్నించి పల్లికొండ తదితర బందుజనంతో కలసి ప్రతాపరుద్రుని దగ్గరకు వెళ్లాడు. ప్రతాపరుద్రుడు యాదవులను సాదరంగా ఆహ్వానించాడు. అయితమరాజుకు బంగారు ఆభరణాలు, నూతన వస్త్రాలను కాకతీయులు బహూకరించారు.[26] యాదవులు రెండు గుర్రాలు, బంగారు ఆభరణాలు, నూతన వస్త్రాలు, ప్రతాపరుద్రునికి బహూకరించారు.[27] కాకతి ప్రతాపరుద్రుడు - యాదవులు, కాకతీయులు దాయాది గోత్రీకులమని,[28] పోలురాజు తనకు తండ్రిలాంటివాడని, అయితమరాజు సోదరుడని,[29] పల్లికొండ బావ అవుతాడని చెప్పాడు.

"కరియావులరాజు చరిత్ర" - తాళపత్ర గ్రంథంలో అయితమరాజు అతని అనుచరులను కుట్రపన్ని ప్రతాపరుద్రుడు చంపటానికి ప్రయత్నం చేసినట్లు వివరించబడింది.[30] యాదవులపై ప్రతాపరుద్రుడు చూపిన ప్రేమాభిమానాలు కపటనాటకం. అయితమరాజును సంహరించటానికి "అలుగుల వీర ధర్మ సింహాసనం"[31] అనే ప్రమాదకరమైన ఆసనాన్ని కాకతీయులు తయారుచేశారు. ఆ సింహాసనాన్ని ఇలా తయారు చేశారు. -

పదిహేను అడుగుల లోతు, వెడల్పులతో ఒక పెద్ద గొయ్యిని త్రవ్వారు. పొడవైన బాణాల కర్రలను చివరులు పైకి ఉండేటట్లు గా ఆ గొయ్యిలో అమర్చారు. ఆ బాణాలపై విలువైన, అందమైన బ్లాంకెట్‌ను కప్పారు. దానిపై వివిధరకాలైన పుష్పాలు చల్లి చూడముచ్చటగా అలంకరించారు. అలుగుల వీరధర్మ సింహాసనానికి ముందు అందమైన పరదాను ఏర్పాటు చేశారు.

పోలురాజు శంభుని సేవించడానికి ఓరుగల్లు వచ్చినపుడు ఈ అలుగుల వీరధర్మ

సంహాసనం పై కూర్చున్నాడని ప్రతాపరుద్రుడు అయితమరాజుతో చెప్పాడు. ఆ రోజు నుంచి ఈ సింహాసనం మీద ఎవరూ కూర్చోలేదని, దానిని పూలతో పూజిస్తున్నామని - ఇప్పుడు అయితమరాజు ఆ అలుగుల వీరధర్మ సింహాసనంపై కూర్చొని తమను సంతోషపర్చవలసినదిగా ప్రతాపరుద్రుడు కోరాడు.[32] కాని పల్లికొండ అలుగుల వీరధర్మ సింహాసనంలోని అంతరార్థాన్ని గుర్తించి అయితమరాజును దానిపై కూర్చోకుండా అపుచేశాడు.[33] ఇంకొకమారు విషం కలిపిన ఆహారాన్ని వడ్డించి,[34] అయితమరాజు, అతని అనుచరులను చంపడానికి కాకతీయులు ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నం కూడా విఫలమైంది. మరొకమారు - రాజభవనానికి వెళ్లేమార్గంలో గోతులు త్రవ్వించి, పైన మామూలు రహదారిలాగా ఉండేటట్లు ఏర్పాటుచేసి కొంతమంది సేవకులకు ఇనుపచువ్వలను ఇచ్చి అయితమరాజు, పల్లికొండ, పుత్తమరాజులు ఆమార్గం ద్వారా వస్తున్నపుడు వారిని చంపి గోతిలో పడవేసి వారి ఒంటి పైనున్న బంగారు ఆభరణాలను తీసుకొనవలసిందిగా ప్రతాపరుద్రుడు వారిని ప్రోత్సహించాడు.[35] పల్లికొండ తెలివితేటల వలన అయితమరాజును అడుగడుగున ప్రతాపరుద్రుని కుట్రల నుండి కాపాడటం జరిగింది.

ఒకమారు ప్రతాపరుద్రుడు "గరుడ గంధర్వ తేజ"[36] అనబడే పొగరుబోతు గుఱ్ఱాన్ని ఎక్కి స్వారీ చేయవలసిందిగా కాటమరాజు బావమరిది అయిన పుత్తమరాజును కోరాడు. ఆ గుఱ్ఱం పుత్తమరాజును తప్పకుండా క్రింద పడవేస్తుందని ప్రతాపరుద్రుడు తలచాడు. పుత్తమరాజు ఆ గుఱ్ఱాన్ని ఎక్కి అది సొంగలుపడి చనిపోయేవరకు స్వారీ చేసి క్షేమంగా తిరిగివచ్చాడు. అయితమరాజు, పల్లికొండ, పుత్తమరాజు తదితర యాదవులు శంభుని గుడికి పోయి పూజలు నిర్వహించారు. వారు తమతో తెచ్చిన మూడు లక్షల మాడలు (నాణాలు) శివునికి సమర్పించారు. కొన్ని కోడెలను శంభుని గుడిలోని స్తంభానికి కట్టివేశారు. కొన్ని ఆవులు, దీపాలను కూడా శంభునికి బహూకరించారు. పూజా కార్యక్రమాలు ముగిసిన తర్వాత ప్రసాదం స్వీకరించి ఆ రాత్రి శంభుని గుడిలో శయినించారు.[37]

కాటమరాజు పెదతండ్రి కుమారుడు కరియావుల రాజు ఓరుగంటి బేతాళుని ద్వంద్వ యుద్ధంలో చంపినట్లు[38] కరియావుల రాజు చరిత్ర - తాళపత్ర గ్రంథంలో వివరింపబడింది. ఈ విషయాన్ని ప్రతాపరుద్రుడు అయితమరాజు దృష్టికి తెచ్చాడు. అయితమరాజు తన అనుమతి లేకుండా, ఓరుగంటి బేతాళుని సంహరించినందుకు కరియావుల రాజుకు మరణదండన విధించాడు.[39]

యాదవులను శంభుని జాతరకు అనుమతించినందుకు అయితమరాజు తన అనుచరులు ప్రతాపరుద్రునికి కృతజ్ఞతలు తెలియజేసినారు. ఓరుగల్లు నగరాన్ని వదలి వచ్చే ముందు యాదవులు తమ గుడారాల పరిసర ప్రాంతాలలోని ప్రజలకు అన్నదానం, వస్త్రదానం చేశారు. కొందరికి ఆవులను, ఆవుదూడలను, బంగారు నాణాలను, తదితర విలువైన వస్తువులను దానం చేశారు.

కరియావుల రాజు కథ - తాళపత్ర గ్రంథంలో యాదవులు యలమంచికి తిరుగు ప్రయాణమై పోయే ముందు కాకతీయ సైన్యాలు గవిలికొండ[40] వద్ద యాదవులను ఎదుర్కొన్నట్లు తెలుపబడింది. ఏది ఏమైనప్పటికి యాదవులను నిర్బంధించడానికి చేసిన ప్రయత్నంలో కాకతీయ సైన్యాలు విఫలమైనాయి.[41]

కాకతీయులతో తగాదా పడిన తర్వాత అయితమరాజు ధనకొండకు పోయి అక్కడ కాటమరాజు తరపున పాలన సాగించినట్లు తెలుస్తున్నది. కాటమరాజు తన పశుసంపదతో శ్రీశైలం వెళ్లాడు.

యరగడ్డపాటి పోట్లాట - తాళపత్ర గ్రంథంలో - అయితమరాజు యరగడ్డపాడు యుద్ధంలో చురుకుగా పాల్గొని నెల్లూరు పాలకుడు నలసిద్ధిరాజు సోదరుడైన కస్తూరి సిద్ధిరాజును బహుళ త్రయోదశి[42] ఆదివారం నాడు సంహరించినట్లు వివరింపబడింది.

తాళపత్ర గ్రంథాలు బల్లికురువ పోట్లాట కోటపాటి తాటివృక్షముతెచ్చే కథ, కరియావుల రాజు చరిత్ర, యరగడ్డపాటి పోట్లాట తదితర ఆధారాలు అయితమరాజు చరిత్రను వ్రాయడానికి, కాకతీయులతో యాదవులకున్న సంబంధాలను తెలియచేయడానికి ఉపయోగపడుతున్నాయి. ఈ సందర్భంలో కొన్ని విషయాలు చర్చించవలసి ఉన్నది.

(i) పోలురాజు పెద్దకుమారుడు భక్తిరన్న ఉండగా అయితమరాజును ధనకొండకు, యలమంచికి పాలకునిగా చేయవలసిన అవసరం ఎందుకు వచ్చింది ?

(ii) ఓరుగల్లు సమీపంలో యాదవులు మరొక యలమంచిని ఎందుకు కట్టవలసి వచ్చింది?

(iii) కాకతీయులకు, యాదవులకు మధ్య యుద్ధం జరగటానికి గల కారణాలేమిటి?

(iv) ఆ కాలంలో కాకతీయ సామ్రాజ్యాన్ని ఎవరు పరిపాలించుతున్నారు ?

(v) అయితమరాజు స్వతంత్రంగా పాలించాడా? లేక కాటమరాజు తరపున పాలించాడా?

(vi) అయితమరాజు పాలనాకాలం?

(i) పోలురాజు రెండవ కుమారుడు కాటమరాజుకు సోదరుడైన అయితమరాజును ధనకొండ యలమంచి ప్రాంతాలకు పాలకునిగా చేశారు. ఓరుగంటి యుద్ధం - గ్రంథం ప్రకారం, పోలురాజు పెద్దకుమారుడైన భక్తిరన్న, ధనకొండ, యలమంచి ప్రాంతాలకు పాలకునిగా ఉండటానికి ఇష్టపడలేదు. భక్తిరన్న గొప్ప శివ భక్తుడు.[43] అతనికి అధికారం, రాజరికాల మీద వ్యామోహం లేదు. అందువలన చిన్నవాడైనా పరిపాలనాదక్షుడు కావటం వలన అయితమరాజుకు అధికారం ఇచ్చారు.

(ii) కాటమరాజుకు పట్టము కట్టిన కథ[44]- తాళపత్ర గ్రంథం ఇచ్చే సమాచారం ప్రకారం, పల్లికొండ అయితమరాజు కొరకు వరంగల్లు సమీపంలో ఉర్లుకొండ[45] దగ్గర మరోక యలమంచి పట్టణాన్ని నిర్మించాడు. వలురాజు పాలించిన యలమంచిని సింహాద్రి రాజు పుత్రులకు ఇచ్చారు. గంగులపిన యల్లయ్య తాను రచించిన కరియావుల రాజు కథ - తాళపత్ర గ్రంథంలో అయితమరాజు ఉర్లుకొండ యలమంచిని పాలించినట్లుగా వివరించాడు. ప్రస్తుతము ఈ ఉర్లుకొండ యలమంచి ఖమ్మం జిల్లాలోని పాలేరుకు సమీపములో ఉన్నది. ఈ ప్రాంతం ఒకప్పుడు వరంగల్ జిల్లాలో ఉన్నది. ఈ ఉర్లుకొండ యలమంచి ప్రాంతమునుంచే అయితమరాజు, కరియావుల రాజు, సిరిదేవి, పల్లికొండ తదితర యాదవులు శంభుని తిరునాళ్ళ కొరకు ఓరుగల్లు వెళ్ళారు.యాదవులు ఇప్పటికి జాతరులు జరుపుతున్నారు. యలమంచిని పదమూడవ శతాబ్దంలో చాళుక్య వంశానికి చేందినవారు పాలించినట్లుగా కనబడుతున్నది.[46] 13వ శతాబ్దం ప్రథమ భాగంలో యాదవులను ఓడించి చాళుక్య వంశం వారు యలమంచిని ఆక్రమించి తమ పాలన కొనసాగించి ఉంటారు. అందువలననే యాదవులు తమ పూర్వీకులు పాలించిన యలమంచి ప్రాంతాన్ని వదలి ఓరుగల్లు ప్రాంతంలోని ఉర్లుకొండ దగ్గర నగరాన్ని నిర్మించి, దానికి యలమంచి అని నామకరణం చేశారు.[47]

(iii) ఆ రోజుల్లో దేవగిరి యాదవులకు కాకతీయులకు మధ్య యుద్ధాలు జరిగాయి. అందువలన

శంభుని సేవించడానికి వచ్చిన అయితమరాజును ప్రతాపరుద్రుడు అనుమానించాడు. ముఖ్యంగా అయితమరాజు యాదవ వంశస్థుడు కావటం, అంతకు ముందు పోలురాజు కాలంలో కూడా కాకతీయులతో తగాదా జరగటం వలన ప్రతాపరుద్రుడు అయితమరాజును హతమార్చటానికి ప్రయత్నించాడు. కాటమరాజు సోదరుడు కరియావుల రాజు ఓరుగంటి బేతాళుని ద్వంద్వ యుద్ధంలో చంపాడు.[48] అయితమరాజు, కరియావులరాజుకు మరణదండన విధించినప్పటికి ప్రతాపరుద్రుడు తృప్తి చెందలేదు. అందువలన కాకతీయులు గవిలికొండ వద్ద యాదవులను ఎదుర్కొన్నారు.

(iv) కరియావుల రాజు చరిత్ర - లో ఓరుగల్లు పాలకుడు వీరప్రతాపుడని చెప్పబడింది.[49] కాని ఆ సమయంలో రుద్రమదేవి ఓరుగల్లును పాలిస్తున్నది. అయితమరాజు ఓరుగల్లుకు యరగడ్డపాటి యుద్ధానికి ముందే వెళ్ళాడు. యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1282లో జరిగింది. రుద్రమదేవి పాలనాకాలం క్రీ.శ. 1262-1289.[50] సిద్దేశ్వర చరిత్ర ప్రకారం రుద్రమదేవి మనుమడైన ప్రతాపరుద్రుడు ఆనందనామ సంవత్సరంలో జన్మించినట్లు తెలుస్తుంది. దీనికి సరియైన క్రీ.శ. 1254[51] రుద్రమదేవికి మగ సంతానం లేనందువలన తన మనుమడైన ప్రతాపరుద్రుని క్రీ.శ. 1270[52]లో యువరాజుగా ప్రకటించింది. ప్రతాపరుద్రుడు యువరాజుగా ఉన్నపుడే మంచి పరిపాలనా దక్షుడుగా పేరుగాంచాడు. అందువలన తాళపత్ర గ్రంథాలలో కాటమరాజు చరిత్ర రచయితలు ప్రతాపరుద్రుని ఓరుగల్లు పాలకునిగా చెప్పారు. అయితమరాజు తో ప్రముఖంగా చర్చలు జరిపింది ప్రతాపరుద్రుడు కావటం వలన అతని పేరే ఎక్కువగా తాళపత్ర గ్రంథాలలో కనిపించుతుంది.

(v) అయితమరాజు - ధనకొండను, యలమంచిని కాటమరాజు తరపున పరిపాలించాడు. కాటమరాజుకు పట్టంకట్టికథ - తాళపత్ర గ్రంథం[53] సమాచారం ప్రకారం, కాటమరాజును తమ పాలకునిగా యాదవులంతా ఒప్పుకుంటారు. అందువలన కాటమరాజు ఎక్కడ ఉన్నా యాదవుల పశుసంపదకు, వారి ఆధీనంలో ఉన్న ప్రాంతాలకు రాజుగా చలామణి అయ్యాడు. వలురాజు తరువాత రాజ్యాధికారం పెద్దిరాజుకు వచ్చింది. కాటమరాజు పెద్దిరాజు కుమారుడు.

(vi) పోలురాజు తన పశుసంపదతో శ్రీరంగం వెళ్ళేముందు, అయితమరాజును ధనకొండ పాలకునిగా చేశాడు. ఇంతకుముందే మూడవ అధ్యాయంలో చెప్పినట్లు పోలురాజు, అతని సోదరులు క్రీ.శ. 1212లో పంపాద్రినందు పంపకాలు చేసుకున్నారు. వారంతా తమకు నచ్చిన ప్రాంతాలకు పశుసంపదతో వెళ్ళారు. అయితమరాజు యరగడ్డపాడు యుద్ధమందు క్రీ.శ. 1282లో[54] ప్రాణాలు కోల్పోయినట్లు 'భక్తిరన్న కథ' - తాళపత్ర గ్రంథం ద్వారా తెలుస్తుంది. అందువలన అయితమరాజు పాలనాకాలాన్ని క్రీ.శ. 1222-1282 మధ్యలో నిర్ణయించవచ్చు.

## I. కరియావుల రాజు :

సింహాద్రిరాజు కుమారుడు, కాటమరాజుకు సోదరుడు అయిన కరియావుల రాజు గొప్ప యుద్ధవీరుడు.[55] యరగడ్డపాటి పోట్లాట - తాళపత్ర గ్రంథం రచయిత గంగుల పినయల్లయ్య కరియావులరాజు చరిత్రను రచించాడు. గంగుల పిన యల్లయ్య చెప్పిన విధంగా అయితమరాజు పరిపాలిస్తున్న ఉర్లుకొండ యలమంచికి[56] బాచయ్య అనువాడు గంగజాతర చూడటానికి వెళ్ళాడు. ఈ బాచయ్య బ్రాహ్మణుడు, ఓరుగల్లు నివాసి. ఇతడు ముందుగా నరసింహస్వామిని సేవించటానికి

వేదాద్రి వెళ్లాడు. తిరుగు ప్రయాణంలో బాచయ్య యలమంచి వెళ్ళాడు. ఉర్లుకొండ యలమంచిలోని భవనాలు చూసి ఆశ్చర్యపడ్డాడు. అయితమరాజు జరుపుతున్న గంగజాతరను చూడాలని బాచయ్య అక్కడ ఉన్నాడు.[57] ఆ సమయంలో అతడు ఓరుగల్లు బేతాళుని గురించి యలమంచి ప్రజలకు చాలా గొప్పగా చెప్పాడు. బేతాళుడు మల్లయుద్ధవీరుడని,[58] అతడిని ఓడించే వారు ఎవరు లేరని చెప్పటం మొదలు పెట్టాడు. ఈ విషయం ఆనోటా ఈ నోటా పడి కరియావుల రాజు చెవిన పడింది.

కరియావులరాజు బేతాళునితో పోరాడాలని చాల ఆరాటపడుతున్నాడు. అందువలన అతడు అయితమరాజు వద్దకు వెళ్ళి శంభుని తిరునాళ్ళకు ఓరుగల్లు పోతానని చెప్పాడు. అయితమరాజు పల్లికొండ సలహా తీసుకొని కరియావుల రాజును తమతో పాటు ఓరుగల్లు రావటానికి అనుమతి ఇచ్చాడు.[59]

ఇంతకుముందు వివరించినట్లు అయితమరాజుతో పాటు, పల్లికొండ, కరియావుల రాజు, తదితర యాదవ బృందం ఓరుగల్లుకు వెళ్ళారు. అయితమరాజు, పల్లికొండలు ఓరుగల్లు నగరములోనికి వెళ్ళడానికి ముందు కరియావుల రాజును యాదవులు విడిది చేసిన గుడార్ల దగ్గర కాపలాగా ఉండమని చెప్పారు.[60] ఇక్కడ కరియావులరాజు ఎక్కువసేపు నిలువలేక పోయాడు. తాను తిరిగి వచ్చే అంతవరకు గుడారాల వద్ద కాపలాగా ఉండవలసిందిగా పుల్లావు కేశవన్నను కరియావులరాజు కోరాడు. పుల్లావు కేశవన్న కాటమరాజుకు బావమరిది. కరియావుల రాజు "గండ కత్తెర"[61] అనే అశ్వాన్ని ఎక్కి ఆయుధాలు ధరించి ఓరుగల్లు నగరము వైపుకు బయలుదేరాడు. ఓరుగల్లు నగర ప్రవేశానికి ప్రధాన ద్వారం దాటవలసి ఉంటుంది. కరియావుల రాజు అక్కడ నిలచి ప్రధాన ద్వారం వైపు చూశాడు. దానికి కొన్ని బిరుదులు (వీర చిహ్నాలు) కట్టబడిఉన్నాయి.[62] ఆ వీర చిహ్నాలు కట్టి ఉన్న ద్వారం గుండా వెళ్ళడము కరియావులరాజుకు మనస్కరించలేదు. అట్లా వెళ్ళడము అతని హోదాకు భంగమని తలచాడు. ఆ బిరుదులు ఎవరు కట్టారని కరియావుల రాజు విచారించాడు. ఆ బిరుదులు ఓరుగంటి బేతాళునివని అక్కడ ఉన్న బేతాళుని సేవకులు కరియావుల రాజుకు తెలిపారు.[63] ఆ బిరుదులు వెంటనే తొలగించాలని లేని ఎడల వాటిని తీసి పారవేయగలనని కరియావుల రాజు బేతాళుని సేవకులకు చెప్పాడు. సేవకులు బేతాళుని దగ్గరకు వెళ్ళి జరిగిన విషయమంతా వివరించారు. కరియావుల రాజు ఆ బిరుదులను తీసి అవతల పారవేశాడు.[64]

కరియావుల రాజు గోపాలస్వామి గుడికి పోయి, భగవంతుడిని ప్రార్థించి అక్కడే కూర్చున్నాడు. చాలామంది ప్రజలు గుమిగూడారు. కరియావుల రాజు ధైర్యసాహసాలకు మెచ్చుకున్నారు. బేతాళుడు ఓరుగల్లులోని సామాన్య ప్రజల్ని పలురకాలుగా పీడించేవాడు. అందువలన బేతాళుని ఎదురించేవాడు వచ్చాడని ప్రజలు సంతోషించినారు.[65]

వేదం వెంకటరాయశాస్త్రి - తన ప్రతాపరుద్రీయము అను గ్రంథంలో ఓరుగంటి బేతాళుడు ప్రతాపరుద్రుని సేనాధిపతి అని వ్రాశాడు.[66]

బేతాళుడు తనని అవమానించిన వానిపై పగ తీర్చుకోవాలని నిశ్చయించుకొన్నాడు.[67] కరియావుల రాజును హతమార్చటానికి బేతాళుడు తన తల్లి లింగమాదేవి అనుమతి కోరాడు. ఓపిక పట్టమని లింగమాదేవి బేతాళుని కోరింది.[68] వంశపారంపర్య తగాదాలు యలమంచి యాదవులకు తమకు మధ్య ఉన్నాయని తెలిపింది. ఒక కోడిపుంజు విషయమై తన పెద్ద కొడుకు నిజ బేతాళునికి యలమంచి యాదవుడైన గోపన్నకు పానగల్లులో తగాదా వచ్చి, యాదవుల గోపన్న నిజబేతాళుని చంపివేశాడని చెప్పింది.

బేతాళుడు తన భార్య చిటిగోపు వద్దకు పోయి కరియావుల రాజు విషయం చెప్పాడు. యాదవులతో తగాదా పడవద్దని అతని భార్య సలహా ఇచ్చింది.[69] బేతాళుడు తల్లి సలహా పాటించలేదు, భార్య మాట లెక్క చేయలేదు. అతడు గోపాలస్వామి గుడివైపు నడిచాడు.

బేతాళుని సేవకులు కరియావుల రాజు కడకు వచ్చి తమ యజమాని రాకను వివరించారు. కరియావుల రాజు తన శత్రువును ఆహ్వానించాడు. బేతాళుడు, కరియావులరాజును తన పుట్టు పూర్వోత్తరాలను గురించి ప్రశ్నించాడు. మాది బడుగుల కుటుంబం, ఆత్రేయ గోత్రం, యాదవ వంశము అని కరియావుల రాజు చెప్పాడు. తమ తాతతండ్రులు యలమంచిని ఏలారని, భాగీరథి గంగ తమ కులదైవమని తన పేరు కరియావుల రాజని సమాధానం ఇచ్చాడు. తాను, తమ బంధువులు ఓరుగల్లు శంభుని సేవించడానికి వచ్చామని ధైర్యంగా పలికాడు.[70]

బేతాళుడు మల్ల యుద్ధం చేసే భవనాన్ని "కత్తుల గరడి"[71] అని అంటారు. తనతో యుద్ధం చేయడానికి కత్తుల గరడీకి రమ్మని బేతాళుడు కరియావులరాజును ఆహ్వానించాడు. కరియావుల రాజు, బేతాళుని కోరిక ప్రకారం కత్తుల గరడీకి వెళ్ళాడు. కరియావులరాజు, బేతాళుని మధ్య భయంకరమైన ద్వంద్వ యుద్ధం జరిగింది.[72] ఓరుగల్లు ప్రజలు కొందరు ఆసక్తితో ఇరువురి పోరాటాన్ని తిలకించారు. బేతాళుడు కూడా చాలా గొప్పగా పోరాడినాడు. చివరకు కరియావుల రాజు బేతాళుని చంపివేశాడు.[73]

బేతాళుని మరణవార్త అతని సోదరుడైన కన్నమాధీరునికి తెలిసింది. కన్నమాధీరుడు కత్తుల గరడీకి వచ్చి కరియావుల రాజుపై కాలుదువ్వాడు. ఇరువురి మధ్య పోరు ఘోరంగా జరిగింది. కన్నమాధీరుడు కరియావుల రాజు చేతిలో కన్నుమూశాడు.[74] కరియావుల రాజు తన అశ్వం 'గండకత్తెర 'ను ఎక్కి బేతాళుని తరపున పోరాడే వారు ఇంకెవరైనా ఉంటే రమ్మని సవాల్ చేశాడు.

ఇంతలోనే కాటమరాజు పినతండ్రి యరనూకరాజు కుమారుడైన భట్టావులన్న తన స్నేహితులతో కలసి ఓరుగల్లు నగరంలోని వాడలను తిలకిస్తూ కరియావులరాజు, బేతాళుని మధ్య పోరు జరుగుతుందని తెలిసి అక్కడికి చేరుకున్నాడు.[75]

బేతాళుని చిన్న తమ్ముడైన రంపాల కేశవుడు కరియావులరాజును ఎదిరించడానికి ముందుకు వచ్చాడు. భట్టావులరాజు తన సోదరుని అనుమతితో రంపాల కేశవునిపై కలియబడ్డాడు. ఈ ద్వంద్వ యుద్ధంలో భట్టావులన్న విజయం సాధించాడు. రంపాల కేశవుడు అసువులు బాశాడు.[76]

యలమంచి పాలకుడు అయితమరాజు, మంత్రి పల్లికొండ, ప్రతాపరుద్రుని[77] సమక్షంలో ఉన్నపుడు కొందరు గూఢచారులు రక్తపు మరకలతో ఉన్న వస్త్రములను తీసుకొని వచ్చి ప్రతాపరుద్రునికి చూపించారు.[78] కత్తుల గరడీలో జరిగిన విషయం సవివరంగా వివరించారు. ప్రతాపరుద్రుడు ఉగ్రరూపం దాల్చాడు. యాదవులు ఓరుగంటికి శంభుని సేవించడానికి వచ్చారా - యుద్ధం ప్రకటించడానికి వచ్చారా? అని అయితమరాజును ప్రశ్నించాడు.[79] బేతాళుడు అతని సోదరులు మరణించినందుకు ప్రతాపరుద్రుడు చాల నొచ్చుకున్నాడు.

కరియావులరాజు బేతాళుని చంపిన విషయం అయితమరాజు, పల్లికొండతో చర్చించాడు. కరియావులరాజు చేసిన పనికి అయితమరాజు ఆగ్రహం చెందాడు. కరియావులరాజు తల నరికి,[80] రక్త వస్త్రములను తనకు చూపవలసిందిగా అయితమరాజు, మంత్రి పల్లికొండను ఆదేశించాడు. కరియావుల రాజుకు ఇంత కఠిన శిక్షపడుతుందని పల్లికొండ ఊహించలేదు. కరియావులరాజు అయితమరాజుకు సోదరుడు కావాలి. ఇద్దరు పెద్దతండ్రి, చినతండ్రి కొడుకులు.

అయితమరాజును తన నిర్ణయం మార్చుకొమ్మని పల్లికొండ సలహా ఇచ్చాడు.

కరియావులరాజును శిక్షించితే యాదవుల ఐక్యత కాపాడటం చాలా కష్టమని చెప్పాడు. కరియావుల రాజు గొప్ప యుద్ధ వీరుడు. అతడు యాదవ సైన్యానికి వెన్నెముక - సిరిదేవి, కొమరమ్మ అగుమంచి మొదలగువారు చాల దుఃఖపడతారని చెప్పాడు.[81]

అయితమరాజు పల్లికొండ సలహాను లెక్క చేయలేదు.[82] కరియావుల రాజుకు విధించిన మరణశిక్షను రద్దు చేయదలచుకోలేదు. న్యాయసూత్రాలను ఉల్లంఘించిన వారిని తప్పకుండా శిక్షించాలనుకున్నాడు. అయితమరాజు తీసుకున్న నిర్ణయం పక్షపాతం లేకుండా న్యాయానికి, ధర్మానికి కట్టుబడి ఉంది.

కరియావుల రాజు కత్తులగరడీ నుండి నేరుగా యాదవులు విడిది చేసిన గుడారాల కడకు వచ్చాడు. పల్లికొండ, అయితమరాజు ఆజ్ఞను కరియావులరాజుకు తెలియచేశాడు. రాజాజ్ఞను శిరసా వహించమని పల్లికొండను వేడుకున్నాడు కరియావులరాజు.[83] ఎలాంటి ఎదురు ప్రశ్నలు వేయకుండా, విమర్శించకుండా రాజాజ్ఞను అమలుపరచమని సవినయంగా పలకటం - కరియావుల రాజుకు న్యాయం, ధర్మం మీద ఉన్న భక్తి విశ్వాసాలను తెలియజేస్తుంది.

కరియావులరాజును సంహరించడానికి పల్లికొండ అంతరాత్మ ఒప్పుకోలేదు.[84] పల్లికొండ, కరియావుల రాజును ఒక రహస్య స్థావరంలో ఉంచాడు. పల్లికొండ ఒక కుందేలును పట్టిచంపి, కరియావులరాజు వస్త్రాలను కుందేలు రక్తంతో తడిపి వాటిని అయితమరాజుకు ప్రతాపరుద్రునికి చూపించాడు.[85] అయితమరాజు తీసుకున్న నిర్ణయానికి ప్రతాపరుద్రుడు చలించిపోయాడు. అయితమరాజు సామాన్యుడు కాదని నిర్ణయించుకున్నాడు. స్వంత సోదరునికే మరణదండన విధించగలిగిన సాహసవంతుడు అయితమరాజు. అందువలన అయితమరాజాదులను అంతం చేయటానికి కాకతి ప్రతాపరుద్రుడు నిశ్చయించుకున్నాడు. బలమైన శత్రువు బ్రతికి ఉండటం ఎప్పటికైనా ముప్పే అని తలచాడు.[86]

రుద్రమదేవి కాకతీయ సామ్రాజ్యం పాలించుతున్న కాలంలో దేవగిరి యాదవులు, కాకతీయుల మధ్య స్నేహ సంబంధాలు లేవు. అయితమరాజు, పల్లికొండ, కరియావులరాజు యాదవ వంశానికి చెందినవారు, ధైర్య సాహసాలు కలిగిన వారు కావటం వలన ప్రతాపరుద్రుడు వారిని తమ శత్రువులుగా తలచాడు. ప్రతాపరుద్రుడు పైకి అయితమరాజును వీరుడు శూరుడు అని పొగడుతున్నప్పటికి మనస్సులో ఎప్పుడు అతన్ని అంతమొందించాలా అని తలచేవాడని, పిన యల్లయ్య తన కరియావులరాజు చరిత్రలో తెలియచేశాడు. అయితమరాజు, పల్లికొండ తదితర యాదవులు కాకతీయ యువరాజైన ప్రతాపరుద్రునికి శంభుని సేవించడానికి అనుమతించినందుకు తమ కృతజ్ఞతలు తెలిపి, యలమంచికి మరలి వెళ్లుతున్నామని చెప్పి సెలవు తీసుకున్నారు.[87]

ఇంతకుముందు చెప్పినట్లుగా, యాదవులు తమ గుడారాల దగ్గరకు చేరుకొని అక్కడ ఉన్న ప్రజలకు దానధర్మాలు చేసి సైన్య సమేతంగా యలమంచికి ప్రయాణం కట్టారు. యాదవులు గవిలికొండ[88] చేరుకున్న తరువాత ఆ రోజు అక్కడ విడిది చేశారు.

కాకతీయ సైన్యం యాదవులపై దాడి చేసింది.[89] అయితమరాజు ఆశ్చర్య పోయాడు. ఎవరి పేరుమీద ఈ యుద్ధం నడిపించాలో పురోహితులనడిగి తెలుసుకురమ్మని పల్లికొండను ఆదేశించాడు. గవిలికొండ యుద్ధం కరియావుల రాజు నాయకత్వంలో చేయటం మంచిదని జ్యోతిష్యులు చెప్పారు.[90] కరియావులరాజుకు మరణదండన విధించినందుకు మనస్సులో మదనపడినాడు, అయితమరాజు. కరియావుల రాజు బ్రతికి ఉన్న సంగతి అయితమరాజుకు తెలియచేశాడు పల్లికొండ. ఈ వార్త అయితమరాజుకు అమృతం లభించినంత సంతోషమైంది.[91]

యాదవసైన్యం కరియావులరాజు నాయకత్వంలో కాకతీయ సైనికులపై అమితోత్సాహంతో పోరాడినారు. తమను ఎదురించవచ్చిన కొద్దిమంది కాకతీయ సైనికులను యాదవులు ఓడించారు. ఆ తరువాత యాదవులు క్షేమంగా యలమంచి చేరుకున్నారు.[92]

గోవుల నాగేశ్వరకవి రచించిన 'ఓరుగంటి యుద్ధం'[93] (కరియావులరాజు నాటకం) అను గ్రంథంలో తాళపత్ర గ్రంథంలో లేని నూతన వ్యక్తులను పరిచయం చేశాడు. బహుశా ఈ రచయిత, చదివే వారికి ఆసక్తి కలిగించటానికి అసలు చరిత్రలో లేని కొన్ని సంఘటనలను కల్పించినట్లు తెలుస్తుంది.

కరియావులరాజు యరగడ్డపాడు యుద్ధంలో పాల్గొని నెల్లూరు పాలకుడు నల్లసిద్ది రాజు సోదరుని సంహరించినట్లు[94] యరగడ్డపాటి పోట్లాట - తాళపత్ర గ్రంథంలో వివరింపబడింది.

తాళపత్ర గ్రంథాలలో వివరించబడిన కరియావులరాజు చరిత్ర యాదవుల, కాకతీయుల సంబంధాలు తెలుసుకోవటానికి చాలా ఉపయోగకరంగా ఉంది.

(i) ఓరుగంటి బేతాళుని ద్వంద్వ యుద్ధంలో చంపి, కరియవులరాజు గొప్ప యోధుడని నిరూపించుకున్నాడు. ఈ బేతాళుడు ప్రతాపరుద్రుని సేనాధిపతులలో ఒకడని తెలుస్తుంది. వేదం వెంకటరాయశాస్త్రి[95] - 'ప్రతాపరుద్రీయం' గ్రంథంలో ఈ విషయం తెలియచేశాడు.

(ii) కరియావులరాజు కథ - తాళపత్ర గ్రంథంలో అయితమరాజాదులను అంతమొందించడానికి ప్రతాపరుద్రుడు ఎలా కుట్రలు పన్నింది తెలుస్తుంది.

(iii) కరియావులరాజు, యలమంచి పాలకుడైన అయితమరాజుకు తెలియకుండా, అతని అనుమతి లేకుండా ఓరుగల్లు బేతాళుని ద్వంద్వ యుద్ధంలో చంపాడు. అందువలన కరియావులరాజుకు యలమంచి పాలకుడు మరణదండన విధించాడు. ఈ సంఘటన అయితమరాజు యొక్క నిష్పక్షపాత వైఖరి తెలియచేస్తుంది.

(iv) గవిలికొండ యుద్ధంలో యాదవులు విజయం సాధించటానికి కరియావుల రాజే కారకుడు. యాదవ సేన అమితోత్సాహంతో పోరాడటానికి ఇతని ప్రోత్సాహం చాలా ఎక్కువగా ఉంది.

(v) కాటమరాజు చరిత్ర చెప్పే గాథాకారులు, కరియావులరాజును గూర్చి ఒక రాత్రి అంతా గానం చేస్తారు. ఇది కాటమరాజు చరిత్రలో - కరియావులరాజుకున్న ప్రాముఖ్యతను తెలియచేస్తుంది.

(vi) ప్రతాపరుద్రుని కాలంలో యాదవులకు పాలనా శాఖలలో ప్రముఖమైన పదవులు ఇవ్వకపోవడానికి పరోక్షంగా ఈ సంఘటన ఒక కారణమై ఉండవచ్చు. వెలమ, రెడ్డి వారికి ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చారు.

# నోట్స్ అండ్ రిఫరెన్సు


1. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం,1976 పుట : 56-57
2. సుబ్బారావు ; సం॥, వీరగాథలు-I, పోలురాజు కథ ; తా.ప.గ్రం. గట్టయ్య పుట : 287-289
3. పిచ్చయ్య ; సం॥, బల్లికురువ యుద్ధం ; తా.ప.గ్రం. 1967, పుట : 1
4. ఇదే పుట - 5-6
5. బల్లికురువ పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 12
6. ఇదే తా.ప.నెం. : 20
7. ఇదే తా.ప.నెం. : 24
8. ఇదే తా.ప.నెం. : 25
   గోసంగి సైన్యం మాతంగి గోత్రానికి చెందిన - మాల, మాదిగ కులాలకు చెందినవారు.
9. ఇదే తా.ప.నెం. : 34
10. సుబ్బారావు ; సం॥, వీరగాథలు-I, బల్లికురువ పోట్లాట ; తా.ప.గ్రం. పుట : 411
11. బల్లికురువ పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 36
12. ఇదే తా.ప.నెం. : 47-50
13. ఎ.పి.డి.జి. ; గుంటూరు - 1977 పుట : 342
14. పెద్దిరాజు తన సోదరులతో సహా రాజధానిని యలమంచి నుండి పంపాద్రికి మార్చిన తర్వాత చల్లపిన్నమనీడు (కాటమరాజు పినతల్లి కొడుకు) యలమంచికి అధిపతి అయినట్లు కనబడుతుంది,
15. బల్లికురువ పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 55
16. పిచ్చయ్య ; సం॥, బల్లికురువ యుద్ధం ; తా.ప.గ్రం. పుట : 42
17. గోవుల నాగేశ్వరకవి ; ఓరుగంటి యుద్ధం ; 1962 పుట : 1
18. ఇదే పుట - 2
19. ఇదే పుట - 6
20. ఇదే పుట - 7
21. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తా.ప.గ్రం. పుట : 9-10
22. ఇదే పుట - 11
23. ఇదే
24. ఇదే
25. ఇదే పుట - 15-16
26. ఇదే పుట -16
27. ఇదే
28. సుబ్బారావు ; సం॥, పిన యల్లయ్య వీరగాథలు-I, కరియావులరాజు కథ ; తా.ప.గ్రం. పుట : 694
29. ఇదే పుట -694-695
30. ఇదే పుట -694
31. ఇదే
32. ఇదే పుట -696
33. సుబ్బారావు ; సం॥, పిన యల్లయ్య వీరగాథలు-I, కరియావులరాజు కథ ; పుట :696

34. ఇదే పుట -700-701
35. ఇదే
36. ఇదే పుట -705
37. ఇదే పుట -712
38. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం, పుట : 53
39. ఇదే పుట -56
40. సుబ్బారావు ; సం॥, పిన యల్లయ్య వీరగాథలు-I, కరియావులరాజు కథ ; తా.ప.గ్రం. పుట : 775
41. ఇదే
42. పినయల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 30
43. వెంకట్రామయ్య ; భక్తిరన్న కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. - 2
44. సుబ్బారావు ; సం॥, మారయ్య వీరగాథలు-I, కాటమరాజుకు పట్టముకట్టిన కథ ; తా.ప.గ్రం. పుట : 531
45. సుబ్బారావు ; సం॥, పిన యల్లయ్య వీరగాథలు-I, కరియావులరాజు కథ ; తా.ప.గ్రం. పుట : 531
46. సూర్యనారాయణ ; పుట : 121
47. వరంగల్ జిల్లాలోని నర్సంపేట సమీపంలో పాపఘటం ఉన్నది. కాటమరాజు చెల్లెలు పాపనూక జ్ఞాపకార్థం దీనిని నిర్మించారు. యాదవులు ఇక్కడ జాతర చేస్తారు. కాటమరాజు వంశీయులు కాకతీయులతో తగాదా పడిన విషయం తాళపత్ర గ్రంథాలలో వివరించబడిన దానికి ఇది ఒక నిదర్శనంగా కనబడుతుంది.
48. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం, పుట : 50
49. ఇదే
50. పరబ్రహ్మ శాస్త్రి ; పుట : 118.
51. కాసే సర్వప్ప : శ్రీ సిద్ధేశ్వర చరిత్రం - పీఠిక పుట - lXX-lXXI
52. ఇదే
53. సుబ్బారావు ; సం॥, వీరగాథలు-I, కాటమరాజుకు పట్టముకట్టిన కథ ; తా.ప.గ్రం. మారయ్య పుట : 520
54. వెంకట్రామయ్య ; భక్తిరన్న కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. - 30
55. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం, పుట : 16
56. ఇదే పుట : 2
లోకబాచయ్య ప్రతాపరుద్రుని ఆస్థానములో హాస్యగానిలా ఉన్నాడని శ్రీ సిద్ధేశ్వర చరిత్రలో తెలుపబడింది. పుట : 152
57. ఇదే పుట -2
58. ఇదే పుట -4
59. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం, పుట : 3
60. ఇదే పుట -4
61. ఇదే పుట -17
62. ఇదే
63. ఇదే పుట -19
కాకతీయుల ఆస్థానంలో బేతాళుడు ప్రముఖమైన యుద్ధ మల్లుడు.
64. ఇదే పుట -34
65. ఇదే పుట -36

66. వేదం వెంకటరాయశాస్త్రి ; ప్రతాపరుద్రీయం ; 1947 ; పీఠిక - పుట - VIII

67. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం, పుట : 38

68. ఇదే పుట : 38-39

69. ఇదే పుట : 40

70. ఇదే పుట : 45-46

71. ఇదే పుట -46

72. ఇదే పుట -45
సింహాద్రిరాజు తన శత్రువులపై 'సందుల సురియ' అనే పేరు గల ఖడ్గంతో పోరాడినాడు. కరియావులరాజు అదే ఖడ్గంతో బేతాళునిపై యుద్ధం చేశాడు.

73. ఇదే పుట -50

74. ఇదే పుట -51

75. ఇదే పుట -52

76. ఇదే పుట -53

77. ఇదే పుట -54
డా॥ సి.వి.రామచందర్‌రావు సం॥ ప్రతాపరుద్ర చరిత్రము, ఏకామ్రనాథ ; 1984 , పుట : 121
ప్రతాపరుద్రుని - ప్రతాప వీర రుద్ర అని వ్రాశారు.

78. పిచ్చయ్య ; సం॥, కరియావులరాజు చరిత్ర ; తాళపత్ర గ్రంథం, పుట : 53

79. ఇదే పుట -54

80. ఇదే

81. ఇదే పుట -56

82. ఇదే పుట -57

83. ఇదే పుట -58

84. ఇదే పుట -59

85. ఇదే

86. ఇదే

87. సుబ్బారావు ; సం॥, వీరగాథలు-I, కరియావులరాజు కథ ; తా.ప.గ్రం.
పిన యల్లయ్య పుట : 770

88. ఇదే

89. ఇదే

90. ఇదే

91. ఇదే పుట : 774-775

92. ఇదే పుట : 775-776

93. గొవుల నాగేశ్వరకవి ; ఓరుగంటి యుద్ధం ; పీఠిక పుట : 8

94. పిన యల్లయ్య ; యరగడ్డపాటి పొట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 29

95. వేదం వెంకటరాయ శాస్త్రి ; పీఠిక, పుట : VIII

# 5

# కాటమరాజు : క్రీ.శ. 1217 - 1282.

భట్టురాయబారము - తాళపత్ర గ్రంథంలో యాదవరాజైన కాటమరాజు గొప్ప యుద్ధ వీరుడని, అతనికి ఎనలేని పశుసంపద ఉన్నదని వివరించబడింది.[1]

గంగుల పిన యల్లయ్య రచించిన యరగడ్డపాటి పోట్లాట - తాళపత్ర గ్రంథంలో కాటమరాజు, నెల్లూరు పాలకుడైన నల్లసిద్దిని[2] యరగడ్డపాడు యుద్ధంలో చంపి అతని తలను పాలేటి గంగకు కానుకగా పెట్టాడని - కాటమరాజు పినతండ్రి పోలురాజును నెల్లూరు చోడ వంశస్తుడైన ముక్కంటి (చోడతిక్క-I) చెరుకూరు యుద్ధంలో చంపినందుకు ప్రతీకారంగా ఈ పనిచేసినట్లు తెలుపబడింది.

## కాటమరాజు తొలి జీవిత విశేషాలు :

పెద్దిరాజు కథ - తాళపత్ర గ్రంథం ప్రకారం, కాటమరాజు తల్లిదండ్రులు పెద్దిరాజు, పెద్దమ్మ సంతానం కొరకు పంపాద్రి వదలి కాటకోటేశ్వరుని పూజించటానికి కళ్యాణం[3] వెళ్ళారు. వారికి కాటమరాజు ధాతనామ సంవత్సర,[4] పాల్గుణ శుద్ధ పంచమి, ఆదివారం (క్రీ.శ. 12-2-1217)నాడు జన్మించినాడు. ఇంతకుముందు మూడవ అధ్యాయంలో చెప్పినట్లు - పెద్దిరాజు, కళ్యాణ పాలకుడైన గంగురాజు తరపున వాలికేతువరాజుపై దండెత్తి, ఆర్లపెంట యుద్ధంలో వీరమరణం చెందాడు. పెద్దమ్మ, తన సంతానమైన కాటమరాజు, పాపనూకలను గంగురాజు భార్య ముద్దమ్మకు అప్పగించి పెద్దిరాజుతో పాటు సహగమనం చేసింది. కాటమరాజు వయస్సు ఏడు సంవత్సరాలు.[5] పాపనూక సంవత్సరంలోపు పసిపాప,[6] కాటమరాజు - పాపనూకలను కళ్యాణం రాణి ముద్దమ్మ పెంచి పెద్ద చేసింది.[7]

గోవుల నాగేశ్వర కవి రచించిన ఓరుగంటి యుద్ధం ప్రకారం, పోలురాజు చనిపోయిన తరువాత పల్లికొండ వివిధ ప్రాంతాలలో ఉన్న కాటమరాజు సోదరులందరిని ఒక్కచోటుకు తీసుకరావటానికి ప్రయత్నం చేశాడు. కరియావులరాజు - చిట్టినూకలను శ్రీకూర్మం నుండి, భట్టావులరాజు - నాగమ్మలను కాళహస్తి నుండి, పెయ్యావుల యఱ్రయ్యను బెజవాడ నుండి యలమంచికి[8] తీసుకవచ్చే ఏర్పాట్లు చేశాడు. భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య, అగుమంచిలను పల్లికొండ స్వయంగా యలమంచికి తీసుకొని వచ్చాడు.[9]

కాటమరాజుకు పట్టంకట్టిన కథ - తాళపత్ర గ్రంథం ఆధారంగా పల్లికొండ, కాటమరాజు, పాపనూకలను కళ్యాణం నుండి తీసుకరావటానికి భక్తిరన్నను పంపించాడు. భక్తిరన్న కళ్యాణము వెళ్ళటానికి ముందు తన తల్లి సిరిదేవి, మేనత్త కొమరమ్మల దగ్గరకు వెళ్లి వారి ఆశీర్వాదం పొందాడు. భక్తిరన్న తన శిష్యులను వెంటబెట్టుకొని కళ్యాణం వెళ్లాడు.[10]

కళ్యాణం చేరుకోగానే భక్తిరన్న మొదట "బసవకళ్యాణం"- ఆలయానికి పోయి ప్రార్థనలు చేశాడు. జంగమయ్య వేశంలో భక్తిరన్న కళ్యాణం వీధులలో సంచరించాడు. అలా తిరుగుతూ - తిరుగుతూ కళ్యాణంరాజు గంగురాజు, రాజప్రాసాదానికి చేరుకున్నాడు. గంగురాజు శైవ భక్తుడు. భక్తిరన్నను సాదరంగా ఆహ్వానించాడు. ఇద్దరు శైవమతాన్ని గురించి చర్చించుకుంటున్న సమయంలో ఒక యువతి స్వరం నుంచి వెలువడుతున్న మధుర గానం భక్తిరన్న చెవిన పడింది. ఆమె, చాలా కాలం క్రితం మరణించిన తన తాత, తల్లిదండ్రులు, వారి తోబుట్టువులను

తలచుకొని దుఃఖంతో పాడుకొంటుంది. ఆ పాటలోని భావాన్ని గ్రహించి, ఆ యువతి పాపనూక అయి ఉంటుందని భక్తిరన్న మనసులో అనుకొన్నాడు. గంగురాజుకు విషయమంతా వివరించాడు భక్తిరన్న.[11]

కాటమరాజును తీసుకొని రావలసిందిగా గంగురాజు సేవకులను ఆజ్ఞాపించాడు. ఆ సమయంలో కాటమరాజు సాధనగరడీలో రకరకాల వ్యాయామాలు చేస్తున్నాడు. రాజభవనం నుండి వచ్చిన పిలుపును పురస్కరించుకొని కాటమరాజు, గంగురాజు దగ్గరకు వెళ్ళాడు. గంగురాజు భార్య, రాణి ముద్దమ్మ భక్తిరన్నను - కాటమరాజు, పానూక తనవారు అయినట్లు నిదర్శనం చూపమని అడిగింది. సరియైన ఆధారం చూపని యడల భక్తిరన్న ప్రమాణం చేయాలని షరతు పెట్టింది.[12] భక్తిరన్న, గంగురాజు, ముద్దమ్మ, కాటమరాజు, పాపనూక, తదితర పెద్దలందరూ కాటమరాజు తల్లి పెద్దమ్మ సహగమనం చేసిన గుండం వద్దకు వెళ్ళారు. భక్తిరన్న - పెద్దమ్మ గుండము చుట్టు మూడు సార్లు ప్రదక్షిణ చేశాడు. కర్పూరము, కుంకుమ, పూలు గుండముపై పెట్టి - కాటమరాజు. పాపనూక తన సోదరుడు, సోదరి అని ప్రమాణం చేశాడు.[13]

గంగురాజు - రత్నాలు, వజ్రాలు విలువైన బంగారు ఆభరణాలు, ఏనుగులు, గుఱ్ఱాలు, పల్లకీలు ఒకవైపు పెట్టించాడు. మరొకవైపు తనకున్న బిరుదు చిహ్నాలను ఉంచి రెండిటిలో ఏదైనా ఒక భాగాన్ని తీసుకొమ్మని కాటమరాజును కోరాడు. కాటమరాజు మొదటి భాగంలో ఉన్న సిరిసంపదలను వదలి రెండవ భాగంలో ఉన్న గంగురాజు బిరుదు చిహ్నాలను తీసుకొన్నాడు.[14] గంగురాజు పాపనూకకు విలువైన బంగారు ఆభరణాలను బహూకరించాడు. భక్తిరన్న కళ్యాణ నగర సమీపంలో ఉన్న కనక రేపల్లెకు వెళ్ళి తాను, కాటమరాజు, పాపనూకలతో సహా యలమంచికి పోతున్నామని అక్కడ ఉన్న యాదవులకు తెలియచెప్పాడు. కనకరేపల్లె లోని యాదవులంతా సంతోషించారు. కాటమరాజు, పాపనూకలు యలమంచి పట్టణానికి చేరుకోవడం వారందరికి ఆనందాన్ని కలిగించింది. గంగురాజు, అతని రాణి ముద్దమ్మ, కళ్యాణ నగర ప్రముఖులు, కనకరేపల్లె లోని యాదవులు అంతా కలసి కాటమరాజు పాపనూకలకు ఘనంగా వీడ్కోలు చెప్పారు.[15]

అయితమరాజు - కాటమరాజు, పాపనూకలను సాదరంగా ఆహ్వానించాడు. భక్తిరన్న, అయితమరాజు, పల్లికొండ, చల్లపిన్నమనీడు, కరియావులరాజు, భట్టావులరాజు, పుత్తమరాజు, ముమ్మయ్య, యర్రయ్య, పోచయ్య, సిరిదేవి, కొమరమ్మ తదితర యాదవ ప్రముఖులను కాటమరాజుకు పరిచయం చేశాడు.[16]

కాటమరాజు పినతల్లి సిరిదేవి, పాపనూకను ఆప్యాయంగా దగ్గరకు తీసుకొని వారి యోగక్షేమాలను అడిగింది. కళ్యాణం నుండి పాపనూకతో పాటు వచ్చిన పరిచారిక, అన్నమ్మ కళ్యాణంలో ఉన్ననాటి అన్ని విషయాలు సిరిదేవికి వివరించింది.[17]

## కాటమరాజు వివాహం :

మర్ల అన్నమ్మ కూతురు, గంగమ్మను కాటమరాజుకు ఇచ్చి వివాహం చేయడానికి పెద్దలు నిర్ణయించారు. రాజ పురోహితులు, మాఘ పౌర్ణమి, మకరలగ్నం వివాహానికి శుభ ముహూర్తంగా నిశ్చయించారు.[18] మహా వైభవంగా కాటమరాజు వివాహం గంగమ్మతో జరిపించారు. పల్లికొండ, సిరిదేవి, కొమరమ్మ మొదలగు పెద్దలంతా కాటమరాజు దంపతులను దీవించారు. వివాహం అయిన తరువాత కాటమరాజు తన చేతికి కట్టిఉన్న వీర కంకణాన్ని విప్పటానికి ఒప్పుకోలేదు.[19] బడుగుల కుటుంబానికి ఉన్న శత్రువులనందరిని అంతమొందించిన తరువాతనే వీరకంకణం విప్పుతానన్నాడు. తన ప్రతిజ్ఞ నెరవేరే వరకు భార్య గంగమ్మను తాకనని కులదేవత

గంగా భవానిలా భావించుతానని అన్నాడు. కాటమరాజు మాటలు బంధువులందరకు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

## కాటమరాజు పట్టాభిషేకం :

కాటమరాజును యాదవులందరకు అధిపతిగా చేయాలని అయితమరాజు ఆస్థానంలో పల్లికొండ ప్రకటించాడు. పల్లికొండ నిర్ణయాన్ని చల్లపిన్నమనీడు వ్యతిరేకించాడు. కాటమరాజు కంటె పెద్దవారు, అనుభవమున్నవారు ఎంతో మంది ఉండగా పల్లికొండ పక్షపాతముతో కాటమరాజును యాదవులకు అధిపతిగా చేయాలని అనుకోవటము మంచిది కాదని చల్లపిన్నమనీడు తీవ్రంగా విమర్శించాడు.[20] ఏది ఏమైనప్పటికి ఎక్కువమంది కాటమరాజు నాయకత్వాన్ని సమర్థించటం వలన కాటమరాజు పట్టాభిషేక మహోత్సవాన్ని చాలా గొప్పగా జరిపించారు. కాటమరాజు యలమంచి, దొనకొండ, కనిగిరి, యరగడ్డపాడు మొదలగు ప్రాంతాలలో ఉన్న యాదవులందరకు రాజయ్యాడు.[21]

అయితమరాజు, సిరిదేవి, కొమరమ్మ, కరియావుల రాజు, భట్టావులన్న, భక్తిరన్నలు తమ యాదవ సేనలతో దొనకొండకు తిరిగి వెళ్ళినారు. కాటమరాజు ప్రతినిధిగా అయితమరాజు దొనకొండ ప్రాంతాన్ని పాలింపసాగాడు. కాటమరాజు తన అపారమైన పశుసంపదతో శ్రీశైలం ప్రాంతానికి వెళ్ళాడు. అందువలన అయితమరాజు యలమంచి నుండి తన రాజధానిని దొనకొండకు మార్చవలసి వచ్చింది.

జన్నివాడ కథ - తాళపత్ర గ్రంథం ఆధారంగా యాదవులు, పశువులు ఎక్కడ ఉంటే అక్కడ పశుపాలకులకు వారి కుటుంబాలకు ప్రత్యేకమైన గుడారాలను నిర్మించేవారు. యాదవ ప్రముఖులకు ప్రత్యేకమైన గుడారాలను యేర్పాటుచేసేవారు. కాటమరాజుకు ప్రత్యేకంగా పట్టు గుడారం యేర్పాటు చేసి, విలువైన తివాచీలు నేలపై పరచి, సింహాసనం ఉంచేవారు. కాటమరాజు ఆ సింహాసనంపై కూర్చుండేవారు. కాటమరాజు ఎక్కడికి వెళ్ళినా మంత్రివర్గం వెంటనే ఉండేది. పెయ్యల యర్రయ్య, చట్టువారి యర్రయ్య, పద్మరాఘవుడు కాటమరాజు వెంట ఎల్లవేళల ఉండేవారు.[22]

## కాటమరాజు పేర్లు - బిరుదులు :

కాటమరాజుకు ముఖ్యంగా ఏడు పేర్లు ఉన్నవి. నలనన్న, ఆవులన్న, పశువులన్న, కాటకోటేశ్వర, కాటమరాజు, కాత్రేడు, మరియు కాత్రేయుడు. డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు కాటమరాజు కథలు - పీఠికలో నలనన్న పేరుకు ఈ క్రింది విధంగా వివరణ ఇచ్చారు.

కాటమరాజు మానవునిగా జన్మించారు. అందువలన అతనిని నలనన్న అన్నారు.[23] నల అనే పదానికి అర్థం నల్లని రంగు. కాటమరాజు శరీరము రంగు శ్రీకృష్ణుని వర్ణము లాగా ఉంటుంది.[24] కాటమరాజుకు ఆవుల పట్టము కట్టారు. అందువలన ఆవులన్న మరియు పశువులన్న అని అంటారు. కాటకోటేశ్వరుని వరమున జన్మించాడు కాబట్టి కాటమరాజు, కాటకోటేశ్వర, కత్రేయుడు, మరియు కాత్రేడు అని పిలుస్తారు. ఈ చివరి నాలుగు పేర్లు శివునికి సంబంధించినవి. (కత్రేడు - కాత్రేడు - శ్మశానమునకు రాజు - శివుడు)కాటమరాజుకు డెబ్బది ఏడు బిరుదులున్నవి. అవి అంభోజ, ప్రలయకాల, సింగణి, కనకసింగణిలు, చంద్ర, గరుడ, శార్దూల, కనక పడిగెలు, పిగిలి తలాటములు, పంచలోహతలాట, భస్మశంకర మొదలైనవి.[25]

## శ్రీశైలంలో పశువుల మంద :

కాటమరాజు యలమంచి నుండి తన పశుసంపదతో గోదావరి నది పరివాహ

ప్రాంతానికి చేరుకొని అక్కడ నుండి కొంతకాలానికి కృష్ణానది తీరానికి వెళ్ళాడు.

ఉత్తరాది అవుల మేపు - తాళపత్ర గ్రంథం ప్రకారం యాదవుల పశువులు ఉత్తర కాంభోజి,[26] కృష్ణానది ప్రాంతంలో మేత మేశాయి. అటునుండి శ్రీశైలం[27]లోని నల్లమల ప్రాంతాలకు చేరుకున్నాయి. దక్షిణ భారతదేశంలో శ్రీశైల దేవాలయం చాలా పురాతనమైనది. మరియు ప్రసిద్ధికెక్కిన పవిత్ర దేవాలయం. దీనిని శ్రీగిరి, శ్రీపర్వత, మరియు రుద్ర పర్వతమని కూడా అంటారు. శ్రీ మల్లికార్జున స్వామి లింగరూపంలో ఉన్నాడు. భారతదేశంలో ప్రసిద్ధి చెందిన పన్నెండు జ్యోతిర్లింగాలలో ఇది ఒకటి.[28] కర్నూలు జిల్లాలో నల్లమల, యర్రమల కొండలు ప్రముఖమైని. నల్లమల కొండలు తూర్పు, పడమరలు నలుబది కిలోమీటర్లు వ్యాపించి ఉన్నవి. ఇవి దాదాపు నూట పదమూడు కిలోమీటర్లు కర్నూలు జిల్లాలో వ్యాపించి, దక్షిణ దిక్కున కడప జిల్లాలోనికి ప్రవేశించాయి. ఈ కొండలు సముద్ర మట్టానికి ఆరువందల ఆరుమీటర్ల ఎత్తున ఉన్నాయి.[29] కాటమరాజుతో పాటు, పద్మనాయుడు (పద్మరాఘవ) పెయ్యల యర్రయ్య, చట్టువారి యర్రయ్య, మరియు యాదవ సైన్యం పశుసంపదతో శ్రీశైలం అడవుల్లో ఉన్నారు. రాజవంశ ప్రదీపిక గ్రంథం ఆధారంగా యాదవుల పశువులు నల్లమల అడవులలో పన్నెండు సంవత్సరాలు మేత మేశాయి.[30]

ఉత్తరాది అవుల మేపు - తాళపత్ర గ్రంథం ఆధారంగా యాదవులు తమ పశువుల మేతకై శ్రీశైలం ప్రాంతంలో ఎలాంటి ఇబ్బందులను ఎదుర్కొనలేదు. పన్నెండు సంవత్సరములు తరువాత శ్రీశైల ప్రాంతంలో గొప్ప కరువు యేర్పడింది.[31] వర్షాలు లేకపోవటం వలన పశువులకు నీరు, మేత కరువయ్యాయి. ఎండవేడికి అడవి మండింది. నల్లమల అడవులలో పశువులు నిలవలేక పోయినాయి. సెలయేర్లు, చెరువులు, భావులు, ఎండిపోయాయి. ఆవులు, ఎద్దులు, కోడెలు, లేగలు, ఎన్నో చనిపోయాయి.[32] కాటమరాజు తన పశుసంపదను ఎలాగైనా రక్షించాలని నిర్ణయించుకున్నాడు. పద్మరాఘవుడు, యర్రయ్యలతో చర్చించి పశువులను శ్రీశైలం ప్రాంతం నుండి తరలించడానికి కాటమరాజు నిర్ణయం తీసుకున్నాడు.[33]

కాటమరాజు శ్రీశైలం వదలి వెళ్ళే ముందు పర్వతాల మల్లన్నకు నెయ్యి సమర్పించి తన పశుసంపదను కాపాడవలసిందిగా ప్రార్థించాడు. పశువులను కొండలపై నుండి క్రిందికి దింపవలసిందిగా గోపాలకులకు, యాదవసైన్యానికి కాటమరాజు ఆజ్ఞలు జారీ చేశాడు.[34] ఈ సమయంలో బలిజకులస్తులైన వీరిశెట్టి, చెన్నమశెట్టి, బ్రహ్మశెట్టి చిక్కి పోయిన కాటమరాజు పశువులను చూడటం తటస్థించింది. కాటమరాజును తన పశువులతో సహా పాకనాడు పోవలసిందిగా బలిజలు[35] సలహా ఇచ్చారు. పాకనాడులో పంటలు, పచ్చిక, నీరు సమృద్ధిగా ఉన్నాయి. అక్కడ అడవులు పచ్చికతో కళకళలాడుతున్నాయి. పాలేరు నది నుండి నెల్లూరు వరకు పచ్చిక, నీరు కొదవలేదు. ఆ ప్రాంతంలో ఉన్న మొలకల, తీగల, కనిగిరి చెరువుల నిండా నీరు ఉంది.[36]

కాటమరాజు తన పశుసంపద, యాదవ పరివారముతో సహా పాకనాటికి పయనమైనాడు. మార్గమధ్యంలో వారు ఇసినేకువ్వ అనే ప్రదేశంలో ఆగారు. అక్కడ నుండి వారు ఉర్లకొండ కురువ, యర్రజరితోక, చెన్నుని కురువ, పులిబండ కురువ, గూబల వాగు - అక్కడి నుండి యేడు నూతులపాడుకు చేరుకున్నారు.[37] ఇక్కడ త్రాగటానికి నీరు సమృద్ధిగా లేక కొన్ని పశువులు చనిపోయినాయి. కాటమరాజు, వర్షం కురిపించమని శివుని ప్రార్థించాడు. కాని లాభం లేక పోయింది. పశువుల నీటి కొరకు ఏడు బావులను త్రవ్వించాడు. అప్పటి నుండి ఈ ప్రాంతానికి

"ఏడు నూతల పాడు"[38] అని పేరు వచ్చింది. ఇప్పటికి ఇక్కడ, ఒక పెద్ద బావి వుంది. దీనిని "గూబగుండం" బావి అని అంటున్నారు. దీని ప్రక్కనే పెద్దసైజులో గల రాతి నీటి తొట్టెలు ఉన్నవి. ఇచ్చటనే కాటమరాజు, గంగవిగ్రహాలు ఉన్నాయి. ప్రతి సంవత్సరం ఉగాది నాడు ఏడునూతల పాడులో గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఈ ప్రదేశాన్ని ప్రజలంతా 'రాజుగుడి' - అని పిలుస్తారు. (కాటమరాజుగుడి) కాటమరాజుకు గంగకు ఘనంగా ఉత్సవాలు జరుపుతారు.[39]

కాటమరాజు 'ఆవులదొడ్డి కుడుపు' - ఉత్సవాలు జరిపించాలని తలచాడు. ఇలా చేస్తే పశువులు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉంటాయని నమ్ముతారు. కాటమరాజు దొనకొండకు వెళ్ళి ఈ విషయాన్ని తన పినతల్లి, సిరిదేవి, మేనత్త కొమరమ్మ, అయితమరాజు, పల్లికొండలకు తెలియచేయాలని అనుకున్నాడు. కాటమరాజు దొనకొండకు ప్రయాణమయ్యాడు. అతనితోపాటు కొంతమంది యాదవ ప్రముఖులు బయలుదేరి వెళ్ళారు.

కాటమరాజు, దొనకొండ చేరుకోగానే అయితమరాజు ఘనంగా స్వాగతం పలికాడు. కాటమరాజు సిరిదేవి దగ్గరకు వెళ్లి తన చెల్లెలు 'పాపనూక'ను దొనకొండ వెలుపల ఒంటరిగా ఒక మేడలో ఉంచినందుకు విచారం ప్రకటించాడు.

పాపనూక కథ - తాళపత్ర గ్రంథం ప్రకారం - సిరిదేవి, పల్లికొండలు పాపనూకకు తన మేనత్త కొమరమ్మ కొడుకు నాచకూళ్ల నాయుడుతో వివాహం జరిపించటానికి ప్రయత్నం చేశారు.[40] కాని జ్యోతిష్యులు పాపనూక జాతకం సరిగా లేదన్నారు. ఆమె చెడు నక్షత్రంలో జన్మించిందని చెప్పారు. పాపనూక చిత్రభాను సంవత్సరం, పాల్గుణ మాసం, జ్యేష్ఠ నక్షత్రం, బుధవారం పట్టపగలు జన్మించింది.[41] పాపనూక పుట్టిన తరువాత ఆమె తండ్రి పెద్దిరాజు అర్లపెంట యుద్ధంలో చనిపోయాడు. అందువలన పాపనూక అత్తవారింట అడుగుపెడితే అరిష్టమన్నారు. జ్యోతిష్యులు పాపనూకను ప్రత్యేకమైన మేడలో విడిగా ఉంచడం మంచిదని సలహా ఇచ్చారు. కాబట్టి పాపనూకకు ప్రత్యేకమైన భవనం దొనకొండ పట్టణం వెలుపల నిర్మించి, ఆమెను అందులో ఉంచారు.[42]

పశువులు నీరు, మేత లేక విలవిలలాడుతున్న సంగతిని కాటమరాజు, సిరిదేవికి విన్నవించాడు. నీటి ఎద్దడిని ఎదుర్కొనుటకు సాగెమ్మసాగిలేటి ప్రాంతంలో బావులు - చెరువులు త్రవ్వించమని సిరిదేవి, కాటమరాజుకు సలహా ఇచ్చింది.[43] కాటమరాజుకు సిరిదేవి మాటలు నచ్చలేదు. యాదవరాజు తన పశువులను నెల్లూరు, కంచి ప్రాంతాలకు తోలుకొని పోవాలని, అక్కడ నీరు, పచ్చిక బాగా లభించుతాయని సిరిదేవితో చెప్పాడు. నెల్లూరు ప్రాంతానికి పోవద్దని సిరిదేవి కాటమరాజును కోరుతుంది. నెల్లూరు పాలకుడు తెలుగుచోడ వంశస్తుడైన ముక్కంటి, కాటమరాజు పినతండ్రి పోలురాజును చెరుకూరు యుద్ధంలో చంపివేశాడు. కాటమరాజు నెల్లూరు ప్రాంతం వెళ్లినట్లయితే - తెలుగుచోడవంశం వారితో తగాదా వస్తుందని సిరిదేవి భయపడుతుంది. కాటమరాజును నెల్లూరు ప్రయాణం విరమించుకొమ్మని సిరిదేవి ఎంతగానో నచ్చచెప్ప ప్రయత్నించింది. కాని కాటమరాజు తన పినతల్లి మాటలు పెడచెవిన పెట్టాడు. నెల్లూరు పాలకుడు నల్లసిద్ధిపై పగ తీర్చుకుంటానని ప్రతిజ్ఞ చేశాడు కాటమరాజు.[44]

ఆరవెల్లిలో కాటమరాజు జరుపతలపెట్టిన ఆవుల దొడ్డి కుడుపు[45] ఉత్సవాలకు తప్పకుండా రావలసిందిగా సిరిదేవిని ఆహ్వానించాడు. ఈ విషయం కూడా సిరిదేవికి నచ్చలేదు. పోలురాజు చెరుకూరు యుద్ధానికి ముందు ఆవులదొడ్డి కుడుపు ఉత్సవం జరిపాడు. అది కలిసిరాలేదు. అందువలన పోలురాజు యుద్ధంలో మరణించాడని సిరిదేవి నమ్మకం. ఆవుల దొడ్డి కుడుపు ఉత్సవాలు నిర్వహించవద్దని సిరిదేవి కాటమరాజును హెచ్చరించింది.

## ఆవులదొడ్డి కుడుపు :

ఈ ఉత్సవాలు జరిపితే యాదవులు పశుసంపదకు శుభం కలుగుతుందని కాటమరాజు నమ్మకం.[46] ఆవులదొడ్డి కుడుపు ఉత్సవాలను ఆపదలచుకోలేదు. అమావాస్య, ఆదివారం నాడు ఆరవెల్లి రావలసిందిగా[47], సిరిదేవి, అయితమరాజు, పల్లికొండ తదితర బంధువర్గాన్ని ఆహ్వానించాడు కాటమరాజు. ఆ తరువాత కాటమరాజు తన సహచరులతో కలసి అర్ధవీడు వెళ్లాడు. ఇక్కడ పోలురాజు కొంతకాలం పాలన సాగించాడు. కాటమరాజు అర్ధవీడు గంగను పూజించి భోనము చెల్లించాడు.[48] అర్ధవీడు నుండి బయలుదేరి కాటమరాజు, కంభం, మంగలకుంట, ఎలుగొండ, వాగెమడుగు మీదుగా ప్రయాణం చేసి ఆరవెల్లి చేరుకున్నారు. ఆవుల దొడ్డికుడుపు ఉత్సవం జరపటానికి ఆరవెల్లిలో ఆవులమంద మధ్యన ఒక పెద్ద గుడారాన్ని నిర్మించారు.[49]

కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు తాళపత్ర గ్రంథం ఆధారంగా, దొనకొండలోని యాదవులు భోనం తయారుచేసుకొని ఆవులదొడ్డి కుడుపు ఉత్సవాలకు తరలి ఆరవెల్లికి బయలుదేరారు. దొనకొండ పాలకుడు, అయితమరాజు, యాదవుల మంత్రి పల్లికొండ, కరియావుల రాజు, భట్టావులరాజు, ముమ్మయ్య, పోచయ్య, తదితర యాదవ పెద్దలంతా పల్లకీలు ఎక్కి ఆరవెల్లికి ప్రయాణమయ్యారు. సిరిదేవి, కొమరమ్మలు రథాలలో బయలుదేరారు.[50] కాటమరాజు బార్య- వీరగంగ,[51] అయితమరాజు చెల్లెలు అగుమంచి పల్లకీలో ఎక్కి పయనించారు. మిగతావారు ఎడ్లబండ్లలో పయనమైనారు. దొనకొండ ప్రజలు చాల మంది ఆరవెల్లికి బయలుదేరారు.

ఆవుల దొడ్డి కుడుపు ఉత్సవాన్ని ఈ క్రింది విధంగా నిర్వహించారు. అయితమరాజు దొనకొండ నుండి వచ్చిన వారికి ప్రత్యే ఏర్పాట్లు దగ్గరుండి జరిపించాడు. అమావాస్య, ఆదివారం ఉదయం ఆవులదొడ్డి కుడుపు ఉత్సవం ప్రారంభమైంది. యాదవులు వివిధ రకాలైన పండ్లు - పూలతో పాలవెల్లిని అలంకరించారు. అమితమైన భక్తి శ్రద్ధలతో బసవన్న (ఎద్దు) ను పూజించారు. బియ్యం, కొర్రలతో వండిన అన్నాన్ని బోనంగా గంగా-పోతురాజు ముందు రాశి పోశారు. ఆ బోనం చిన్న కొండలా ఉంది. ఆ తరువాత గొర్తె పోతులను, మేకపోతులను కోసినారు. సిరిదేవి 'గంటల కుంతలం' విల్లు, పిడుగుల కత్తికి పూజ జరిపింది. వీటిని వరుసగా కాటమరాజు, పద్మరాఘవ మరియు బీర్నీడు ధరించారు.[52]

ఆవుల దొడ్డి కుడుపు ఉత్సవం విజయవంతంగా ముగిసింది. సిరిదేవి - ఆరవెల్లి నుండి దొనకొండకు ప్రయాణం అయ్యే ముందు - యాదవులలో ఐకమత్యాన్ని కొనసాగేటట్లు చూడమని కాటమరాజును కోరుకున్నది. మరొక్కమారు కాటమరాజును నెల్లూరు పోవద్దని హెచ్చరించింది.

## పాకనాడు ప్రయాణం :

కాటమరాజు తన పశుసంపదను, యాదవ సైన్యాన్ని వెంటబెట్టుకుని పాకనాడుకు వృష సంవత్సరం, కార్తీక మాసం,[53] శుక్ల పంచమినాడు (1281 A.D.) బయలుదేరాడు. యాదవులు మూసి నదిని దాటి, మునగపాడు, పాదిలి, మర్రిపూడి, అద్దంకిపల్లె, బొమ్మిరెడ్డిపల్లె, మీదుగా పయనించి కనిగిరి చేరుకున్నారు.[54] కొంతకాలం కనిగిరిలో ఉండి ఆ తరువాత నెల్లూరు వైపు ప్రయాణం సాగించారు.

పుల్లరి చెల్లింపు విషయంలో[56] కాటమరాజుకు నెల్లూరు నల్లసిద్దికి మధ్య తగాదా ప్రారంభమైంది.[55] గుండ్లపాలెం శాసనంలో కూడా ఇదే పుల్లరి విషయమై నల్లసిద్ధి, కాటమరాజుల మధ్య ఎర్రగడ్డపాడు యుద్ధం జరిగినట్లు ఉంది.[57]

వేటూరి ప్రభాకరశాస్త్రి పరిష్కరించిన - కోటపాటి తాటి వృక్షం తెచ్చే కథ - తాళపత్ర గ్రంథం ప్రకారం, కాటమరాజు[58] దొనకొండలోని అయితమరాజు,[59] పల్లికొండ, కరియావులరాజు, భట్టావులరాజు, పుత్తమరాజులను యరగడ్డపాడు యుద్ధానికి రావలసిందిగా ప్రత్యేకంగా వర్తమానం పంపించాడు. అయితమరాజు కుమార్తె సిరిగిరమ్మకు అనేక భాషలు వచ్చు. ఆమె కాటమరాజు పంపించిన లేఖలను చదవి వినిపించింది. మాఘమాసం, బహుళ శివరాత్రినాడు యుద్ధం ప్రారంభమవుతుందని, దొనకొండలోని యాదవ వీరులంతా యుద్ధానికి సన్నద్ధమై యరగడ్డపాడు చేరుకొవలసిందిగా ఆ లేఖలో వివరింపబడింది.[60]

అయితమరాజు తన సైన్యాన్ని యరగడ్డపాడు యుద్ధానికి సిద్ధం కావలసిందిగా ఆజ్ఞలు జారీ చేశాడు.[61] యుద్ధానికి బయలుదేరేముందు, అయితమరాజు, రఘుపతి (పల్లికొండ), కరియావులరాజు, భట్టావుల వల్లభన్న, తదితర ప్రముఖులంతా భారత, పురాణాలను విన్నారు.[62] అయితమరాజుకు పాపనూకను చూడాలనిపించింది. వెంటనే పాపనూకను రాజభవనానికి తీసుకరావలసిందిగా తన మేనల్లుడు ముమ్మయ్యను ఆజ్ఞాపించాడు. ముమ్మయ్య దొనకొండ వెలుపల ఉన్న పాపనూక భవనానికి వెళ్లి ఆమెను అయితమరాజు కడకు రావలసిందిగా కోరాడు. కాని పాపనూక నిరాకరించింది. తనకు వివాహం చేయకుండా, ఒంటరిగా ప్రత్యేక భవనంలో ఉంచినందుకు సిరిదేవి, అయితమరాజులను నిందించింది. అందువల్ల పాపనూక వీళ్లను తన శత్రువులుగా భావించింది.[63]

యరగడ్డపాడు యుద్ధానికి వెళ్లేముందు అయితమరాజు తన సోదరి అగుమంచికి[64] దొనకొండ పరిపాలనను అప్పగించాడు. ముమ్మయ్య, పోచయ్యలను అగుమంచికి అంగరక్షకులుగా నియమించాడు. యరగడ్డపాడు యుద్ధభూమిలో జరుగు విశేషాలను ఏరోజుకారోజు వేగుల ద్వారా, పావురాల ద్వారా[65] దొనకొండకు వర్తమానాలు పంపిస్తానని అయితమరాజు అగుమంచికి చెప్పాడు.

నెల్లూరు పాలకుడు నల్లసిద్ధితో యుద్ధం చేయడానికి పల్లికొండ, కరియావులరాజు, నాచకూళ్ల నాయుడు, నేతివారి ముద్దయ్య, భట్టావుల వల్లభన్న, పుత్తమరాజు, అల్లుదాడెన్న మొదలగు యాదవవీరులు అయితమరాజుతోపాటు యరగడ్డపాడు యుద్ధరంగానికి బయలుదేరారు. కాటమరాజు దొనకొండ నుండి వచ్చిన అయితమరాజు సైన్యాలను సాదరంగా ఆహ్వానించాడు.[66] దొనకొండ రక్షణ విషయమై చేసిన యేర్పాట్లను అయితమరాజు స్వయంగా కాటమరాజుకు వివరించాడు. ఈ యరగడ్డపాడు యుద్ధం - ఆరవ అధ్యాయంలో వివరంగా చర్చించడం జరిగింది.[67]

కాటమరాజు పరిపాలనా విషయాలు తెలుసుకొనుటకు తాళపత్ర గ్రంథాలు - పెద్దిరాజు కథ, కాటమరాజుకు పట్టం కట్టిన కథ, కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు, జన్నివాడ కథ, యరగడ్డపాటి పోట్లాట, శాసనాలు - గుండ్లపాలెం శిలాశాసనం, గంగదొన కొండ గంగగుడిలోని శాసనాలు, గుండంచర్లలోని కాటమరాజు విగ్రహం తదితర ఆధారాలు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఈ క్రింది విషయాలు ముఖ్యంగా గమనించదగినవి.

1. యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1282లో జరిగింది. గుండ్లపాలెం శాసనం ప్రకారం, కాకతి ప్రతాపరుద్రుడు యువరాజుగా ఉన్న కాలంలో కాటమరాజు ముప్పదిమూడు సంవత్సరాలు పరిపాలన చేశాడు. అందువలన కాటమరాజు పట్టాభిషేకం 1250లో జరిగిందని చెప్పవచ్చు. (క్రీ.శ. 1282-32 = 1250)

2. జన్నివాడ కథ - తాళపత్ర గ్రంథంలోని అంశాలను బట్టి యాదవుల పశుగణం ఉత్తర తెలంగాణా, దక్షిణ మహారాష్ట్ర ప్రాంతాలలో తిరిగినట్లు గోదావరి నది ప్రాంతాన్ని ఆధారంగా

తీసుకొని మేతలు మేసినట్లు, అదే సమయంలో కాటమరాజు పశు సంరక్షణార్థమై కొందరితో యుద్ధాలు చేసినట్లు తెలుస్తున్నది.

3. కాటమరాజు పశువులు పన్నెండు సంవత్సరాలు శ్రీశైలం అడవుల్లో మేసినట్లు ఆధారాలు కనబడుతున్నాయి. ఇప్పటికి ఆ ప్రాంతం చెంచులు కాటమరాజును పూజిస్తారు.

4. అన్నింటికంటె ఆసక్తికరమైన విషయం ఏమిటంటే కాటమరాజు తన పశుగణంతో ఎక్కడికి వెళితే అక్కడికి వారి సింహాసనాన్ని కూడా తరలించేవారు. కాటమరాజుకు ప్రత్యేకమైన గుడారంలో సింహాసనం ఉంచేవారు. అక్కడే కూర్చొని రాచకార్యాలు నిర్వహించేవాడు. కాటమరాజు మంత్రులు, సలహాదారులు, ప్రముఖులంతా రాజును అనుసరించేవారు.

5. కాటమరాజు, ధాతనామ సంవత్సర,[68] పాల్గుణ శుద్ధ పంచమి ఆదివారం నాడు జన్మించినాడు. - క్రీ.శ. 12-02-1217.

6. డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు సంకలనం చేసిన కాటమరాజుకథలు ప్రథమభాగంలో కాటమరాజు ధాతనామ సంవత్సర పాల్గుణ శుద్ధ పంచమి గురువారం నాడు జన్మించినట్లు ఉంది. ఇప్పటికి పాల్గుణ శుద్ధ పంచమి యాదవులకు పర్వదినం.

జన్నివాడ కథ - తాళపత్ర గ్రంథంలో కాటమరాజు ధాతనామ సంవత్సర పాల్గుణ బహుళ పంచమినాడు జన్మించినట్లుగా ఉంది.[69]

మూడవ అధ్యాయంలో చెప్పినట్లుగా కాటమరాజు ధాతనామ సంవత్సరం అనగా శక సంవత్సరం 1138లో జన్మించాడు. పైన చెప్పిన దాని ప్రకారం గురువారం నాడు శుద్ధ పంచమి కావటం లేదు. కాని శుద్ధ పంచమి ఆదివారం అవుతుంది. కాటమరాజు శక సంవతత్సరం 1138 ధాతనామ సంవత్సరం, పాల్గుణ శుద్ధ పంచమి ఆదివారం నాడు జన్మించాడనేది సరియైన తేదిగా అనిపిస్తుంది. ఇది క్రీ.శ. 12-02-1217కు సమానం. జన్నివాడ కథ ప్రకారం కాటమరాజు దాతనామ సంవత్సర పాల్గుణ బహుళ పంచమినాడు జన్మించాడు. ఆ రోజు ఆదివారం అవుతుంది. ఇది క్రీ.శ. 26-2-1217కు సమానమవుతుంది.

7. కళ్యాణ పాలకుడు గంగురాజు దేవగిరి యాదవులకు సామంతుడై ఉంటాడు. పెద్దిరాజు కథ - తాళపత్ర గ్రంథంలో కళ్యాణమును - కళ్యాణ దేవగిరిగా వర్ణించారు.[70]

ఈ కళ్యాణి, కర్ణాటకలోని బీదర్ జిల్లాలో ఉంది. కళ్యాణ - కళ్యాణి రెండు ఒకటే. మొదటి సోమేశ్వరుడు కళ్యాణిని చాళుక్యుల రాజధానిగా యేర్పాటు చేశాడు. ఒక వంద సంవత్సరాల తర్వాత కాలచురి బిజ్జలుడు, కళ్యాణిని ఆక్రమించాడు. క్రీ.శ. 12వ శతాబ్దం అంతానికి చాళుక్యుల అధికారం కళ్యాణిలో నశించింది. కళ్యాణి దేవగిరి యాదవుల ఆధిపత్యంలోకి వచ్చింది.[71.]

---

# నోట్స్ అండ్ రిఫరెన్సు


1. భట్టురాయబారము: తాళపత్ర గ్రంథం, తా.ప.నెం. : 2
2. పిన యల్లయ్య ; యరగడ్డపాటి పొట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 41
3. పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 30
4. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - I ; పీఠిక - పుట : CXXXIX
5. పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 11
6. ఇదే తా.ప.గ్రం. తా.ప.నెం. : 32
7. ఇదే తా.ప.గ్రం. తా.ప.నెం. : 33
8. నాగేశ్వరకవి ; శ్రీ ఓరుగంటి యుద్ధం ; పుట : 3
9. బల్లికురువ పొట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 56
10. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - I ; కాటమరాజుకు పట్టం కట్టిన కథ, తా.ప.గ్రం. - మారయ్య పుట : 500
11. ఇదే పుట : 506.
12. ఇదే
13. ఇదే పుట : 508
14. ఇదే పుట : 510
15. ఇదే
16. ఇదే పుట : 514-515
17. ఇదే పుట : 516.
18. ఇదే
19. ఇదే పుట : 520
20. ఇదే పుట : 521
21. ఇదే పుట : 530
22. గట్టయ్య, జన్నివాడ కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 2
23. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - I ; పీఠిక పుట : CXXXX
24. మోడె గంగులు గంగదొనకొండ - సంభాషణ
25. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - I ; పీఠిక పుట : CXXXX
26. ఇదే ; వీరగాథలు - II ; కాటరాజు ఉత్తరాది అవులమేపు ; తా.ప.గ్రం. పుట : 2
27. ఇదే
28. ఎ.పి.డి.జి. కర్నూలు - రివైజ్డ్ ఎడిషన్ 1974 పుట : 241-242
29. ఇదే
30. బత్తుల లక్ష్మయ్య, పుట : 109
31. ఇదే
32. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - II ; కాటరాజు ఉత్తరాది అవులమేపు ; తా.ప.గ్రం. పుట : 7
33. ఇదే
34. ఇదే పుట : 8

35. ఇదే పాకనాడు నెల్లూరు జిల్లాలో ఉన్నది. పుట : 22
36. ఇదే
37. ఇదే
38. ఏడు నూతులపాడు - ది. 15-5-1987న ఇక్కడకు వెళ్లి చూశాను. గుండంచర్ల ప్రజలు ఈవిషయాన్ని వివరించారు.
39. రాజు గుడి : (కాటమరాజు దేవాలయం) ఇది గండంచర్ల గ్రామానికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఉంది. మర్కాపురం సమీపంలో, ప్రకాశం జిల్లాలో ఉన్నది. మర్కాపురం నుండి గుండంచర్లకు బస్సులతో వెళ్లవచ్చు. గుడంచర్ల నుండి కాటమరాజు గుడికి కాలినడకన వెళ్లాలి.
40. వెంకురాం ; పాపనూక కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 3
41. ఇదే తా.ప.నెం. : 7
42. ఇదే తా.ప.నెం. : 42
43. సుబ్బారావు; వీరగాథలు - II ; కాటమరాజు ఉత్తరాది అవులమేపు ; తా.ప.గ్రం. పుట : 45
సాగెమ్మ సాగిలేడు - క్రాశం జిల్లాలో ఉన్నది.
44. ఇదే పుట : 46-47
45. ఇదే పుట : 49
46. ఇదే పుట : 50
47. ఇదే
48. ఇదే పుట : 52
ఇప్పటికి ఇక్కడ గంగ విగ్రహం ఉన్నది. దీనిని అర్ధవీడులోని చెన్నకేశవ ఆలయంలో ఉంచారు.
49. ఇదే పుట : 53-54
50. ఇదే
51. వీరగంగ - గంగమ్మ ఈ రెండు పేర్లు ఒకటే.
52. సుబ్బారావు; వీరగాథలు - II ; కాటరాజు ఉత్తరాది అవులమేపు ; తా.ప.గ్రం. పుట : 55-56
53. ఇదే పుట : 63
54. ఇదే పుట : 64
55. భట్టు రాయబారము ; తా.ప.గ్రం. ; కాటమరాజు నల్లసిద్ధి రాజుల మధ్య యుద్ధం నివారించడానికి భట్టు రాయబారము జరుగుతుంది. కాని ఇది విఫలమవుతుంది.
56. ఎస్.డి.ఐ. గుండ్లపాలెం శాసనం పుట : 534
57. భట్టురాయబారము ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 206
58. ప్రభాకరశాస్త్రి ; సం॥, కాటమరాజు కథ ; కోటపాటి తాటి వృక్షము తెచ్చే కథ ; తా.ప.గ్రం. పుట : 193
59. ఇదే
60. ఇదే పుట : 200
61. ఇదే పుట : 202
62. ఇదే పుట : 203
63. ఇదే పుట : 204
64. ఇదే పుట : 206-207
65. ఇదే పుట : 207
66. ఇదే పుట : 212
67. ఇదే
68. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - I ; పీఠిక పుట : CXXXIX
69. గట్టయ్య, జన్నివాడ కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 2
70. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - I ; ; పెద్దిరాజుకథ ; తా.ప.గ్రం. పుట : 275
71. ది ఇంపీరియల్ గెజిటీర్ ఆఫ్ ఇండియా వాల్యూమ్ - XIV, 1908, పుట : 324.

# 6

# యరగడ్డపాడు యుద్ధం : క్రీ.శ. 1282

కాటమరాజు వంశీయులు చేసిన అన్ని యుద్ధాల కంటె ఈ యరగడ్డపాడు యుద్ధం చాల ప్రసిద్ధి చెందింది. ఈ యుద్ధంలో కేవలం కాల్బలము, అశ్వదళము, గజబలమే కాకుండా, ఆవులు, ఎద్దులు[1] కూడా వీరోచితంగా పోరాడాయి. ఈ యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1282లో ప్రకాశం జిల్లాలోని పాలేటి ఒడ్డున ఉన్న పంచలింగాల కొండ దగ్గర నెల్లూరు పాలకుడు నల్లసిద్ధి, యాదవరాజు కాటమరాజు సైన్యాలకు మధ్యన జరిగింది.

## యుద్ధ కారణాలు :

శ్రీశైల ప్రాంతంలో వర్షాలు లేకపోవటం వలన పశువులకు మేత, నీరు కరువైంది. అందువలన కాటమరాజు నెల్లూరు ప్రాంతమునకు తన పశువులను తరలించాలని అనుకున్నాడు. ఈ విషయమే తన పినతల్లి సిరిదేవికి చెప్పాడు. ఒకప్పుడు. కాటమరాజు పినతండ్రి (సిరిదేవి భర్త) పోలురాజును చెరుకూరు యుద్ధంలో నెల్లూరు పాలకుడు ముక్కంటి చంపడం వలన, కాటమరాజు నెల్లూరు వెళ్లినచో పాతపగలు బైటపడి తగాదాలు వస్తాయనే భయంతో పశువులను నెల్లూరుకు తరలించవద్దని సిరిదేవి[2] కాటమరాజును బ్రతిమాలుతుంది. కాటమరాజు ఆమె సలహా పాటించలేదు. తరాల నాటి పాత పగలను తీర్చుకోవాలని కాటమరాజు నిశ్చయించుకొన్నాడు. అందువలన పశుగణాన్ని నెల్లూరు తరలించదలచాడు.

కాటమరాజు తన అనుచరులైన పద్మరాఘవుడు, పెయ్యల యర్రయ్య తదితర యాదవ సైన్యమును వెంటబెట్టుకుని పశువులను తోలుకొని పంచలింగాల ప్రాంతానికి చేరుకున్నారు.[3] అక్కడ నివాసయోగ్యమైన గుడారాలను తదితర సౌకర్యాలను ఏర్పాటు చేసుకున్నారు. పంచలింగాల కొండవద్ద ఉన్న పోలురాజు విగ్రహానికి కాటమరాజు పూజలు జరిపించాడు. చెరుకూరు యుద్ధంలో పోలురాజు మరణాన్ని మననం చేసుకున్నాడు.[4] నెల్లూరు చోడ వంశస్తులపై పగ తీర్చుకునే సమయం ఆసన్నమైందని అనుకున్నాడు.

కాటమరాజు తన స్నేహితుడు మంత్రి అయిన పద్మ రాఘవుడు మరికొంత మంది ప్రముఖులతో చర్చలు జరిపి పద్మ రాఘవుడిని నెల్లూరు వెళ్లి నల్లసిద్ధి రాజుతో పుల్లరి ఒప్పందం కుదుర్చుకొని రమ్మన్నాడు.[5] నెల్లూరు అడవుల్లో యాదవుల పశువులు మేసినందుకు పుల్లరి క్రింద వారు అడిగినంత ధనం ఇవ్వటానికి ఒప్పుకొమ్మని పద్మరాఘవునికి అనుమతి ఇచ్చాడు.[6]

పద్మ రాఘవుని నాయకత్వంలో ప్రముఖులనుకున్న వారు కొందరు యరగడ్డపాడు నుండి బయలుదేరి నెల్లూరు చేరుకున్నారు. ఆ సమయంలో నెల్లూరును నల్లసిద్ధి రాజు పరిపాలిస్తున్నాడు. నల్లసిద్ధి ఆస్థానంలో ప్రధాన మంత్రిగా ఉన్న భీమినీడు[7] - పద్మరాఘవుని బృందాన్ని గౌరవ మర్యాదలతో ఆహ్వానించాడు. నల్లసిద్ధి యాదవులకు నెల్లూరు చోడవంశము వారికి ఉన్న పాత పగలను, ప్రధాని భీమినీడుకు గుర్తు చేశాడు. కాని ఖడ్గతిక్కన మంత్రి[8] యాదవులకున్న ధనం, వారి అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని లాభం పొందవచ్చనే ఉద్దేశంతో నల్లసిద్ధి రాజును యాదవులతో పుల్లరి ఒప్పందానికి అనుకూలంగా ఉండేటట్లుగా చేశాడు. ఖడ్గ తిక్కన నల్లసిద్ధి ఆస్థానములో మంత్రి - సేనాధిపతి పదవులను నిర్వహించుతూ ఉండటం వలన నెల్లూరు రాజును తేలికగా ఒప్పించగలిగాడు. పుల్లరి పత్రం రాసే ముందు ఖడ్గ తిక్కన కొన్ని నిబంధనలు విధించాడు. అవి ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. కాటమరాజు మూడువేల వరహాలు నెల్లూరులోని నీటకంఠ స్వామికి,[9] ఆరువేల వరహాలు

గణపతి ఉత్సవాలకు, పన్నెండువేల వరహాలు పలల్లికొండ పెరుమాళ్ళ స్వామికి, ఆరువేల వరహాలు సంగమేశ్వరునికి ఇవ్వాలి.

2. నల్లసిద్ధి రాజుకు నాలుగు లక్షల వరహాలు,[10] ఆయన సోదరులైన యర్రసిద్ధి రాజుకు ఎనభైవేల వరహాలు, పాపసిద్ధిరాజుకు పదివేల వరహాలు, గోపాల సిద్ధిరాజుకు ఒక లక్ష వరహాలు, కుమార సిద్ధిరాజుకు ఒక లక్ష వరహాలు కాటమరాజు ఇవ్వాలి.[11]

3. రాజ ప్రసాదములోని స్త్రీలకు పదివేల వరహాలు, పుల్లరి పత్రం రాసినందుకు ఖడ్గతిక్కనకు ఆరువేల వరహాలు యాదవులు ఇవ్వాలి.[12]

4. ఆరుపుట్ల నెయ్యికూడా యాదవులు నెల్లూరు రాజవంశానికి ఇవ్వవలసిందని నియమాలు పెట్టారు. ఈ ఒప్పందం చేసుకోవటానికి యాదవులు కొంత ధనం ఖర్చు చేయవలసి వచ్చింది.

ఖడ్గ తిక్కన మంత్రి పెట్టిన నిబంధనలు యాదవులు ఒప్పుకున్నారు. కాని తాము కూడా ఒక సూచన చేశారు. "నీరును పుట్టిన పూరెల్ల మాది - అవున పుట్టిన కోడెల్ల మీది"[13]- నీటి ద్వారా పుట్టిన గ్రాసమంతా యాదవులది, నెల్లూరు బీళ్లలో పశువులు మేసినంత కాలం యాదవుల ఆవులకు పుట్టిన కోడెదూడలను నల్లసిద్ధి రాజుకు ఇవ్వాలని అర్థం. ఈ ఒప్పందం నెల్లూరు వారు ఆమోదించారు.

జన్నివాడకథ - తాళపత్ర గ్రంథంలో కాటమరాజు నల్లసిద్ధి పక్షమువారు చర్చలు జరిపిన తరువాత పుల్లరి ఒప్పందం కుదిరినట్లు ఉంది. ఆ ఒప్పందం ప్రకారం యాదవుల పశువుల మంద నెల్లూరు బీళ్లలో మేసినంత కాలం నల్లసిద్ధి కాటమరాజు పశువులకు రక్షణ కల్పించాలి.[14] నెల్లూరులో కాటమరాజు పశువులు మేసినంత కాలం - ఆ మందలలోని ఆవులకు పుట్టిన కోడెదూడలన్నింటిని నల్లసిద్ధికి ఇవ్వాలి.[15] ఇది పుల్లరి ఒప్పందం.

వృషనామ సంవత్సర కార్తీక శుద్ధ విదియ, గురువారం[16] నుండి విజయనామ సంవత్సర చైత్ర బహుళ పంచమి శుక్రవారం[17] వరకు ఈ పుల్లరి ఒప్పందం అమలులో ఉండునట్లు ఖడ్గ తిక్కన పత్రం వ్రాశాడు. (క్రీ.శ. 16-10-1281 నుండి 27-3-1293) కాటమరాజు - నెల్లూరు నల్లసిద్ధి మధ్య ఈ ఒప్పందం కుదిరినట్లు సాక్షులుగా హరిహర, భైరవ, సంగమేశ్వర, భూమి, ఆకాశం, మొదలైన దేవతలను పేర్కొన్నారు. పుల్లరి పత్రం లోని ఒప్పందాన్ని ఉల్లంఘించిన ఎడల , పుల్లరి చెల్లించడం జరగదని యాదవులు నల్లసిద్ధికి తెలియచేశారు. నల్లసిద్ధి రాజు పుల్లరి ఒప్పందం, రాగి రేకులపై చెక్కించి[18] నెల్లూరు లోని పల్లికొండ దేవాలయంలో పద్మరాఘవునికి అందరి సమక్షంలో అందచేశారు. ఆతరువాత తీర్థప్రసాదాలు తీసుకొని ఎటు వారటు వెళ్లిపోయారు.[19]

పద్మరాఘవుడు తన అనుచరులతో కాటమరాజు వద్దకు వచ్చి పుల్లరి ఒప్పందం వివరాలను తెలియచేశాడు. కాటమరాజు సంతోషించి, పుల్లరి ఒప్పందాన్ని హృదయపూర్వకంగా అమలు పరచాలని తన వారందరిని ఆజ్ఞాపించాడు.[20]

పుల్లరి ఒప్పందం కుదిరిన తరువాత కాటమరాజు పశువులు నెల్లూరు అడవులలో పచ్చిక మేయసాగాయి. ఒకరోజు నల్లసిద్ధి సామంతుడైన నందివాడ బేతినీడు కాటమరాజు పశువులను నందివాడ చెరువులో నీరు త్రాగటానికి అనుమతించక కొంత పరివారాన్ని పంపి ఆవులను బెదర బెట్టించాడు.[21] చట్టువారి యర్రయ్య ఈ విషయం కాటమరాజుకు తెలిపి నందివాడ బేతినీడుపై చర్య తీసుకోవడానికి అనుమతి ఇవ్వవలసిందిగా కోరాడు. నందివాడ నెల్లూరు రాజ్యంలోది. నందివాడ బేతినీడు నల్లసిద్ధి రాజుకు సామంతుడు. పుల్లరి ఒప్పందం ప్రకారం కాటమరాజు పశువులకు రక్షణ కల్పించవలసిన బాధ్యత నల్లసిద్ధికి ఉన్నది. నల్లసిద్ధి పుల్లరి ఒప్పందాన్ని ఉల్లంఘించినట్లు కాటమరాజు భావించాడు. చట్టువారి యర్రయ్య కాటమరాజు అనుమతితో కొంత సైన్యాన్ని వెంటబెట్టుకొని నందివాడ బేతినీడుపై దాడి చేశాడు.

చట్టువారి యర్రయ్య నందివాడ బేతినీడును నరికి అతని వస్త్రాలను రక్తంతో తడిపి నెల్లూరు పాలకుడైన నల్లసిద్ధి రాజుకు పంపించాడు.[22] నల్లసిద్ధి మాట నిలబెట్టుకోలేదని, పశువులను నెల్లూరు పంటపొలాలపై వదలమని గోపాలురను ఆజ్ఞాపించాడు. జానపదకవులు కాటమరాజు పశువుల మందలను ఇలా వర్ణించారు - "కుదురు ఆరామడ, కదలు పన్నెండామడ"[23] - కాటమరాజు పశువులన్నీ ఒకచోట గుమిగూడితే ఆరామడల ప్రదేశాన్ని ఆక్రమించుతాయి. అదే పశువులు మేతకు కదలినట్లయితే పన్నెండామడల విస్తీర్ణం ఆక్రమించుకుంటాయి. ఇక్కడ కొంత అతిశయోక్తి కనబడుతుంది. కాని కాటమరాజు పశువుల మందలు అంత పెద్ద మొత్తంలో ఉన్నాయని చెప్పడానికి జానపద కవులు ఆ విధంగా వ్రాసి ఉంటారు.

యాదవుల పశువులు తమ పంటపొలాలను పాడుచేస్తున్నాయని నెల్లూరు ప్రాంతం రైతులు నల్లసిద్ధి రాజుకు ఫిర్యాదు చేశారు. నల్లసిద్ధి కాటమరాజుతో పుల్లరి ఒప్పందం చేసుకోవటాన్ని వారు తీవ్రంగా విమర్శించారు. నల్లసిద్ధి రైతులకు ఏవో మాటలు చెప్పి వారిని ఓదార్చి పంపించాడు. మరికొంతమంది రైతులు నల్లసిద్ధిని కలిసి కాటమరాజు పశువులను చంపుతామని, కొంత ధనాన్ని కూడా రాజుకు బహుమానంగా ఇచ్చుకుంటామని అంటారు. కాని నల్లసిద్ధి ఇందుకు ఒప్పుకోలేదు. కొంత మంది రైతులు నల్లసిద్ధి పట్టమహిషి త్రిభువనదేవిని కలుసుకుని కాటమరాజు పశువులు, పంటపొలాలు పాడు చేస్తున్నాయని అందుకు ప్రతీకారంగా పశువులను చంపడానికి అనుమతించవలసిందిగా వేడుకున్నారు. రాణి త్రిభువన దేవి అందుకు ఒప్పుకోలేదు.[24]

నెల్లూరు కాపులు కొందరు నల్లసిద్ధి రాజు రెండవ భార్య కుందమాదేవి వద్దకు వెళ్లి యాదవుల పశువులు ఆమె తల్లిగారు పసుపు కుంకుమల[25] క్రింద ఇచ్చిన భూములలోని పంటను పాడు చేశాయని చెప్పారు. కుందమాదేవి తమ సోదరుడు పడవీటిబావరాజును కాటమరాజు పశువులను చంపవలసిందిగా కోరింది. అలా చేయని పక్షంలో తాను ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించింది. అతడు అందుకు ఒప్పుకోలేదు. పశువులను చంపించే ఆలోచన మానుకొమ్మని పడవీటి బావరాజు కుందమాదేవికి నచ్చచెప్ప ప్రయత్నం చేశాడు. నెల్లూరు అడవులలో నివసించుచున్న కొందరు కోయబోయలు కుందమాదేవి వద్దకు వచ్చి కాటమరాజు పశువులను చంపుతామని వాగ్దానం చేవారు. ఆమె సంతోషించి కొన్ని బంగారు ఆభరణాలను వారికిచ్చి పంపించింది.[26] కాటమరాజు స్నేహితుడు పద్మరాఘవుడు పొరపాటున కుందమాదేవి పెంపుడు చిలుకను చంపాడు.[27] ఆ ప్రాంతంలో ఉన్న కోయబోయలు ఈ విషయాన్ని కుందమాదేవికి తెలిపారు. కుందమాదేవి కోపం తారా స్థాయికి చేరుకుంది. కాటమరాజు పశువులను చంపవలసిందిగా కోయబోయలను ఆజ్ఞాపించింది.[28] వారు వెంటనే కాటమరాజు పశువులు మేయుచున్న ప్రాంతానికి పోయి ఇరువై ఒక్క ఆవులు, పదిహేను కోడెదూడలను బాణాలు వేసి చంపారు.[29] యాదవులు ఆ బాణాలను నల్లసిద్ధి రాజుకు చూపించడం కోసం ఒక పెట్టెలో భద్రపరిచారు.

పట్టపురావి కైఫీయతు ప్రకారం- యాదవులు నెల్లూరు ప్రాంతానికి వెళ్లిన కొద్ది కాలానికే వర్షాభావము ఏర్పడి కరువు సూచనలు కనిపించాయి.[30] పశువుల మేతకు సమస్య ఏర్పడింది. అప్పుడప్పుడు పశువులు తప్పించుకొని పంటపొలాలలోనికి పోతున్నవి. పశువుల కాపరులు ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికి కొన్ని పశువులు తప్పించుకొని పంటపొలాలలో మేస్తుండేవని తెలుస్తుంది.

రణతిక్కన కైఫీయతు ప్రకారం - యాదవులు నెల్లూరు అడవులల్లో[31] తమ పశువులను క్రూరమృగాల బారినుండి తప్పించడానికి అప్పుడప్పుడు వేటాడుతూ ఉండేవారు. యాదవులు వేటాడి క్రూరమృగాలను చంపడం ఆప్రాంతంలో ఉంటున్న కోయబోయలకు నష్టం వాటిల్లుతున్నట్లు భావించారు. ఎందుకంటే వారు జంతువులను వేటాడి జీవించేవారు,[32] అందువలన యాదవులు తమ పశువులతో నెల్లూరు అడవులలో ఉండటం కోయబోయలకు ఇష్టం లేదు.

ఒకరోజు కాటమరాజు పిన తండ్రి పోలమరాజు ఒక చిలుకను చంపాడు.[33] ఆ చిలుక కాళ్లకు గజ్జెలు కట్టి ఉండటం వలన అది పెంపుడు చిలుక అని గుర్తించారు. ఆ చిలుక నల్లసిద్ధి రెండవ భార్య కుందమాదేవిది. అడవిలో ఉంటున్న కోయబోయలు ఈ విషయాన్ని కుందమాదేవికి తెలిపారు. కుందమాదేవి కోపంతో యాదవుల పశువులను చంపమని కోయబోయలను ఆజ్ఞాపించింది.[34] అంతట వారు అడవిలోనికి వచ్చి అచ్చటక్రూరమృగాలను వేటాడుచున్నట్లు నటించి కాటమరాజు పశువులను బాణాలతో చంపారు.[35] కొన్ని ఆవులు, కోడెలు అక్కడికక్కడే చనిపోయాయి. అప్పటి నుండి కాటమరాజు నల్లసిద్ధికి పుల్లరి అపు చేశాడు.[36] రణ తిక్కన కైఫియతులో చెప్పినట్లుగా చిలుకను పోలమరాజు చంపలేదు. కుందమాదేవి చిలుకను చంపినవాడు పద్మరాఘవుడు. పోలురాజు ఎప్పుడో చెరుకూరు యుద్ధంలో చనిపోయాడు.

నల్లసిద్ధి, పుల్లరిని వసూలు చేసుకుని రావలసిందిగా కాటమరాజు కడకు కొంత పరివారాన్ని పంపించాడు.[37] నల్లసిద్ధి యాదవుల పశువులను రక్షించలేక పోయినాడని, పుల్లరి ఒప్పందాన్ని ఉల్లంఘించాడని అందువలన పుల్లరి ఇవ్వనన్నాడు కాటమరాజు. ఇదే విషయాన్ని వారు నల్లసిద్ధికి తెలియచేశారు.

నల్లసిద్ధి, కాటమరాజు నుండి బలవంతంగా నైనా పుల్లరి వసూలు చేసుకొని రావలసిందిగా కొందరు సైనికులను పంపించాడు. కాటమరాజు సేనలు, నెల్లూరు సైన్యాన్ని ఓడించి పంపివేశారు.[38] కాటమరాజు కొంతమంది సైనికులను పంపించి నల్లసిద్ధిరాజును బంధించి తన దగ్గరకు తీసుకుని రమ్మని ఆజ్ఞాపించాడు. నల్లసిద్ధి రాజు కాటమరాజు దగ్గరకు వెళ్లడానికి సిద్ధమయ్యాడు. కాని ఆయన భార్య కుందమాదేవి ఒప్పుకోలేదు. యాదవులు నల్లసిద్ధి రాజును చంపుతారని ఆమె భయపడింది.

నల్లసిద్ధి తరపున ఖడ్గ తిక్కన, కాటమరాజు అనుచరులను పెన్నానది ఒడ్డున కలుసుకొని చర్చలు జరిపారు.[39] ఆవులు కోడెలను నెల్లూరు కోయబోయలు బాణాలతో చంపినట్లు సాక్షమేమిటని ఖడ్గతిక్కన ప్రశ్నించాడు. అంతట కాటమరాజు పశువులను కాపలా కాసే గోపాలకులు పెట్టెలో దాచి ఉంచిన బాణాలను తీసి ఖడ్గతిక్కన మంత్రికి చూపించారు. ఆయన ఆ బాణాలను పరిశీలించి ఏమి మాట్లాడకుండా నెల్లూరు వెళ్లిపోయాడు.[40]

యాదవులు నెల్లూరుపై దాడి చేసి కొంత కలవరం సృష్టించారు. నల్లసిద్ధి యాదవులను ఎదుర్కోవటంలో విఫలమైనాడు.[41] పైన వివరించిన విషయాలను బట్టి యరగడ్డపాడు యుద్ధానికి కారణాలను ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చును.

1. యరగడ్డపాడు యుద్ధానికి అసలుకారణం నెల్లూరు తెలుగు చోడ వంశము, కాటమరాజు పూర్వీకుల మధ్య వంశపారంపర్య తగాదాలు ఉన్నవి. కాటమరాజు నల్లసిద్ధిపై యుద్ధం చేసి పాత పగలను తీర్చుకోవాలనుకున్నాడు. కాటమరాజు అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు.

2. యాదవుల పశువులను నందివాడ చెరువులో నీరు త్రాగనివ్వకపోవటం వలన నల్లసిద్ధి పుల్లరి ఒప్పందాన్ని ఉల్లగించినట్లుగా కాటమరాజు భావించడం.

3. కాటమరాజు, పశువులను నెల్లూరు పంటపొలాల్లోనికి వదలమని గోపాలురను ఆదేశించడం, పశువులు పంటపొలాలు పాడుచేయడం, ఇరు వర్గాల మధ్య యుద్ధానికి దారి తీసింది. కాటమరాజు మధ్యవర్తుల ద్వారా నల్లసిద్ధిని సంప్రదించి సమస్యను పరిష్కరించుకోవలసింది.

4. కుందమాదేవి పంటపొలాలు, కాటమరాజు పశువుల మేయటం, నెల్లూరు రైతులు, కోయబోయలు కుందమాదేవిని కాటమరాజు పశువులను చంపడానికి పురిగొల్పటం, ఆమె తొందరపడి పశువులను చంపించడం యుద్ధానికి దారి తీసింది.

5. పద్మ రాఘవుడు - కుందమాదేవి చిలుకను చంపడం దానికి ప్రతీకారంగా యాదవుల ఆవులను, కోడెలను కుందమాదేవి చంపించడం.

6. కోయబోయలు ఇరువైఒక్క ఆవులు, పదిహేను కోడెదూడలను చంపిన వార్తను విని కాటమరాజు కోపోద్రిక్తుడైనాడు. అందువలన కాటమరాజు ప్రతీకారం తీర్చుకోదలచాడు.

7. నల్లసిద్ధి పుల్లరి ఒప్పందాన్ని ఉల్లంఘించాడు. అనుకున్న విధంగా కాటమరాజు పశువులను కాపాడలేకపోయాడు. ఖడ్గతిక్కన సమక్షంలో కోయబోయలు కాటమరాజు పశువులను చంపినట్లు యాదవులు నిరూపించారు.

8. నల్లసిద్ధి, పుల్లరిని వసూలు చేసుకొని రావటానికి సైనికులను పంపించాడు. కాటమరాజు సేనలు నెల్లూరు సైన్యాన్ని తేలికగా ఓడించాయి.

9. యాదవులు నెల్లూరు కోటపపై దాడి చేసినపుడు నల్లసిద్ధి వారిని ఎదుర్కొనలేక పోయినాడు. ఇవి యరగడ్డపాడు యుద్ధానికి ముఖ్య కారణాలు.

## యరగడ్డపాడు యుద్ధం - ముఖ్య ఘట్టాలు :

యాదవుల వద్దనుండి పుల్లరిని వసూలు చేసుకొని రమ్మని నల్లసిద్ధి రాజు రాయశృంగావళి[42] అనే భట్టుని కాటమరాజు వద్దకు పంపించాడు. కాటమరాజు పుల్లరి చెల్లించడానికి తిరస్కరించి, నల్లసిద్ధి రాజును యుద్ధానికి సిద్ధం కమ్మని భట్టు ద్వారా కబురు చేశాడు.

యరగడ్డపాడు యుద్ధానికి సైన్య సమేతంగా తరలి రావలసిందిగా కాటమరాజు దొనకొండలోని ఐతమరాజుకు వర్తమానం పంపించాడు.[43] పల్లికొండ, సిరిదేవి, కొమరమ్మ, కరియావుల రాజు, భట్టావులరాజు, పుత్తమరాజు, మిగిలిన యాదవప్రముఖులకు పేరుపేరున లేఖలు వ్రాయించి నెల్లూరు నల్లసిద్ధితో వచ్చిన పుల్లరి వివాదము తెలియచేశాడు. ఐతమరాజు సైన్య సమేతంగా బయలుదేరి పంచలింగాల కొండకు చేరుకున్నాడు.[44]

నల్లసిద్ధి, తన మంత్రి, సేనాధిపతి అయిన ఖడ్గ తిక్కనను యరగడ్డపాడు యుద్ధానికి సైన్యాన్ని సిద్ధం చేయవలసిందిగా ఆదేశించాడు. యరగడ్డపాడు యుద్ధంలో తమకు సహాయంగా రావలసిందిగా ఖడ్గతిక్కన ఉదయగిరి, తిరుణామల, అర్లుకొండ, గయకొండ, ఉర్లుకొండ, చెన్నపట్నం, కాళహస్తి, వెలికంచి, ప్రభగిరిపట్నం, నందికనుమ పాలకులకు లేఖలు వ్రాశాడు.[45]

ఈ యరగడ్డపాడు యుద్ధం కాటమరాజు, నల్లసద్ది రాజుల మధ్య ఎనియిది రోజులు జరిగింది.

### ఖడ్గతిక్కన యుద్ధం :

మొదటిరోజు యుద్ధంలో - కాటమరాజు తరపున చల్లపిన్నమనీడు యాదవసైన్యానికి నాయకత్వం వహించాడు. నెల్లూరు సేనలను ఎదుర్కొనుటకు చల్లపిన్నమనీడు, అతని సోదరులు సైన్యసమేతంగా "చాగలకొండ"[46] ప్రాంతానికి చేరుకున్నారు. ఇది పంచలింగాల కొండకు ఇరువదినాలుగు కిలోమీటర్లు ఉంటుంది. ప్రస్తుతము దీనిని చాకలి కొండ అని పిలుస్తున్నారు.

గంగుల పిన యల్లయ్య రచించిన యరగడ్డపాటి పోట్లాట తాళపత్ర గ్రంథం ఆధారంగా ఖడ్గతిక్కన, కాటమరాజు సైన్యాన్ని ఎదుర్కొనుటకు మొదటి రోజు యుద్ధం చేసే అవకాశం తనకే ఇవ్వాలని కోరాడు. ఖడ్గ తిక్కనను మొదటిరోజే యుద్ధానికి పంపించడానికి మొదట నల్లసిద్ధి రాజు ఒప్పుకోలేదు.[47] చాగలకొండ ప్రాంతంలో చల్లపిన్నమనీడును తేలికగా ఓడించుతానని ఖడ్గతిక్కన నమ్మకంగా చెప్పాడు. నెల్లూరు సైన్యాన్ని యుద్ధ రంగంలో నడిపించడానికి మొదటిరోజు ఖడ్గతిక్కనకు అవకాశం ఇచ్చాడు నల్లసిద్ధిరాజు.

బహుళ సప్తమి, సోమవారంనాడు (23-11-1282) ఖడ్గతిక్కన, కాటమరాజు సైన్యాన్ని చాగలకొండ

దగ్గర ఎదుర్కొన్నాడు.[48] ఇరువర్గాల మధ్య పోరు ఘోరంగా జరిగింది. నెల్లూరు సైనికులు చాలా మంది యుద్ధంలో చనిపోయారు.[49] మొదటిరోజే నెల్లూరు సైన్యం ఓడిపోతుందని ఖడ్గతిక్కన ఊహించలేదు. అనుకోని ఓటమికి ఖడ్గతిక్కన కలత చెందాడు. యుద్ధం ఆగిపోయింది. చల్లపిన్నమనీడు ఖడ్గతిక్కన దగ్గరకు వచ్చి ఇలా అన్నాడు-

"పోరు నిల్పుము ఓయి భూసురోత్తముడ
సరికాదు మాతోడ సమరంబుసేయ
తరతరాల మా తాత తండ్రులు మేము
జంగాల - లింగాల బడుగు వర్గాల
భట్టుల, బ్రాహ్మల, వైష్ణవోత్తముల
వెట్టి చెరల్ మాన్పి గట్టి అభయంబిచ్చి
ప్రాణాలొసగి కీర్తి ప్రబలియున్నాము
పుడమిలో యాదవులు పుణ్యాత్ములనగ
కడకు బ్రహ్మ హత్య కట్టుకోరాదు
ఖడ్గతిక్కన మంత్రి అడ్డగించకు మమ్ము
భూమీశుడెరుగని పోరు నీకేల
దవ్వున ఉన్నాడు మీధారుణీశ్వరుడు
సిద్ధిరాజుకు బుద్ధిసెప్పి పంపించు
అనిలోన నలసిద్ధి తలనరికివేతుము
పాలేటి గంగకు పాదకానుక పెట్టి
తాత తండ్రుల పగలు తీర్చుకుంటాము."[50]

ఖడ్గ తిక్కన యాదవులను ఓడించాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు. అదనపు బలగాలను సమకూర్చుకొని తిరిగి యుద్ధానికి రావటానికి నెల్లూరు వెళ్లాడు.[51] ఇంటికి పోయిన తర్వాత ఖడ్గ తిక్కన తండ్రి సిద్ధన యుద్ధ విషయాలను ప్రస్తావించాడు. కొడుకు మౌనంగా ఉండటం చూచి, యుద్ధంలో ఓడిపోయి వచ్చాడని ఆగ్రహం చెందాడు. తమ వంశ గౌరవాన్ని పోగొట్టాడని అనుకున్నాడు. పులి కడుపున మేక పుట్టిందని రకరకాలుగా నిందించాడు. యుద్ధరంగంనుండి పారిపోయి వచ్చే కంటే మరణించడం మంచిదన్నాడు.[52]

రణతిక్కన కైఫీయత్ ప్రకారం-ఖడ్గ తిక్కన భార్య చానమ్మ(జానమ్మ) తన భర్త యరగడ్డపాటి యుద్ధంలో ఓడిపోయి వచ్చినందుకు విచారించింది. తన భర్త స్నానానికి రాగి బిందెలలో వేడి నీళ్లు, చన్నీళ్ళు పెట్టి, ఒక పళ్లెంలో పసుపు ముద్ద ఉంచి, మంచం అడ్డంగా పెట్టి ఖడ్గ తిక్కనను స్నానానికి రమ్మని పిలిచింది.[53] స్త్రీలు స్నానమాడే విధంగా ఏర్పాటు చేసి తన భర్తకు పౌరుషం కలుగచేసేలా చేసింది. ఖడ్గతిక్కన అవమాన భారంతో ఏదో విధంగా స్నానం ముగించుకుని వచ్చాడు. తల్లి ప్రోలమ్మ భోజనం వడ్డించి విరిగిపోయిన పాలు పోసింది.[54] అమ్మా విరిగిన పాలు పోశావేమి ? అని ప్రోలమ్మను ప్రశ్నించాడు. ఆమె కొడుక్కి గుణపాఠం చెప్పాలని అనుకున్నది. మన ఆవులు మేత మేయడానికి యుద్ధ భూమి వైపు వెళ్లినాయి. అక్కడ నీవు ఓడిపోయి పారి వస్తుంటే అవి నిన్ను చూశాయి. అందువలన పాలు విరిగాయని ప్రోలమ్మ సమాధానం చెప్పింది. నెల్లూరు ప్రజలు ఖడ్గ తిక్కనపై ఆగ్రహం వ్యక్తం చేశారు, రకరకాలుగా అవమానించారు.

ఖడ్గతిక్కన సైన్యాలను సమకూర్చుకొని మరుసటి రోజు బహుళ అష్టమి మంగళవారంనాడు[55] (24-11-1282) యాదవులమీద దాడి చేశాడు. చల్లపిన్నమనీడు యుద్ధ రంగంలో ఖడ్గ తిక్కనను చూసి చాలా విచార పడ్డాడు. ఒక బ్రాహ్మణున్ని చంపి బ్రహ్మ హత్యా పాతకం కట్టుకోవడం ఇష్టంలేదు.

అదే సమయంలో యాదవుల మంత్రి బ్రహ్మరుద్రయ్య చల్లపిన్నమనీడు దగ్గరకు వచ్చి తాను శైవ బ్రాహ్మణుడు, ఖడ్గతిక్కన బ్రాహ్మణుడు, అందువలన ఒక బ్రాహ్మణుడు మరొక బ్రాహ్మణుడిని చంపితే తప్పులేదు. నన్ను అనుమతించండి, ఖడ్గ తిక్కనను సంహరించుతానని బ్రహ్మరుద్రయ్య అన్నాడు. చల్లపిన్నమనీడు సరే అన్నాడు.[56]

శివుని మదిలో ప్రార్థించి తన వాహనమైన ఎద్దును ఎక్కి రణానికి సిద్ధమయ్యాడు బ్రహ్మరుద్రయ్య. ఖడ్గతిక్కన అశ్వాన్ని అధిరోహించి యుద్ధం ప్రాంభించాడు. రెండు వర్గాల మధ్య యుద్ధం గొప్పగా జరుగుతుంది. సైనికులు విల్లంబులు, కత్తులు, కఠార్లు, వెదురుగడలు, వంకిణులు, చక్రాలు, కంపణము, వణిజజాలము, మొదలగు ఆయుధాలను ధరించి యుద్ధం చేస్తున్నారు.[57]

ఖడ్గ తిక్కన రౌద్రుడై పోరాడుతున్నాడు. యాదవసైన్యాలను చీల్చి చెండాడుతున్నాడు. కాటమరాజు సైనికులను కుప్పతెప్పలుగా నరుకుతున్నాడు. ఇక లాభం లేదని బ్రహ్మ రుద్రయ్య ఖడ్గతిక్కనను ఎదుర్కొన్నాడు. ఇద్దరు ద్వంద్వ యుద్ధానికి తలపడినారు. ఒకరిని మించి ఒకరు పోరు సల్పుతున్నారు. చివరకు బ్రహ్మరుద్రయ్య ఖడ్గతిక్కన తలను నరికి వేశాడు.[58] ఈ వార్త క్షణంలో సైనికులందరికి తెలిసిపోయింది. యుద్ధరంగం స్తంభించింది. యుద్ధంలో తగిలిన గాయాలతో బ్రహ్మరుద్రయ్య కూడా మరణించాడు.[59] నల్లసిద్ది సైనికులు నెల్లూరు ముఖం పట్టారు. ఆ తరువాత ఖడ్గతిక్కన భార్య సహగమనం చేసింది.[60] ఆమహావీరుని మరణానికి నెల్లూరు ప్రజలంతా విలపించారు. యాదవులు కూడా ఖడ్గతిక్కనకు నివాళులు అర్పించారు. సంతాప సూచకంగా మరుసటి రోజు యుద్ధం ఆపుచేశారు. ఖడ్గ తిక్కన శౌర్య ధైర్యాలను పొగడుతూ ఎన్నో జానపదగేయాలు రచింపబడినాయి. ఇప్పటికి ఆంధ్రదేశంలో వాటిని గానం చేస్తూనే ఉన్నారు.

యరగడ్డపాడు యుద్ధంలో ఖడ్గతిక్కన మరణించడం నల్లసిద్ధికి ఆగ్రహం కలిగించింది. నెల్లూరు సైన్యానికి బంగారు మాడలు పంచిపెట్టారు. యాదవులను ఎలాగైనా ఓడించాలని నల్లసిద్ధి స్వయంగా యుద్ధానికి బయలుదేరాడు. అతనితోపాటు తన సోదరులు యర్రసిద్ధి, పాపసిద్ధి, కస్తూరిసిద్ధి, కూమార సిద్ధి, మంత్రి చింకర్ల భీమన్న మరియు గండగోపాల రాజులు బయలుదేరారు. నెల్లూరు సైన్యంలో కాల్బలం, అశ్వదళం, గజబలం ఉన్నాయి. విల్లంబులు, కఠార్లు ధరించిన సైనికులు దశమి గురువారం[61] నాడు (26-11-1282) చాగలకొండ చేరుకున్నారు.

## చల్లావారి యుద్ధం :

మూడవరోజు జరిగిన యుద్ధానికి కాటమరాజు తరపున చల్లపిన్నమనీడు, అతని సోదరులు - గోవిందు, కోనేరు, అచ్యుతుడు, పుణ్యుడు మరియు వెంకటాద్రి యుద్ధానికి సిద్ధమయ్యారు. గోసంగి సైన్యం (దళితులు) సమిడిపాక బొమ్ముు నాయకత్వంలో కాటమరాజు తరపున యుద్ధానికి బయలుదేరారు.[62]

నల్లసిద్ది సైన్యములో భయోత్పాతము కలిగించి సైన్యము పారిపోయేటట్లుగా చేయమని చల్లపిన్నమనీడు తన సైనికులకు సలహా ఇచ్చాడు. రక్తపాతం లేకుండా శత్రువును జయించటానికి ప్రయత్నం చేయాలనుకున్నాడు.. చల్లపిన్నమనీడు సోదరులు సూర్యకఠార్లు ధరించి వాయుదేవుణ్ణి ప్రార్థించి యుద్ధం మొదలు పెట్టారు. చల్లపిన్నమనీడు ద్వంద్వ యుద్ధంలో కుమార సిద్దిరాజును చంపి వేశాడు. సమిడిపాక బొమ్ము వీరోచితంగా పోరాడినాడు. కస్తూరి సిద్ధి రాజు తన సోదరుడు కుమార సిద్ధి రాజు మరణవార్త విని శత్రువులను ఊచకోత కోయసాగాడు. చల్లపిన్నమనీడు సోదరులంతా యుద్ధంలో మరణించారు. ఈ నాటి యుద్ధంలో యాదవులు వెనుకడుగు వేశారు.[63]

చాగలకొండ నుండి నల్లసిద్ధి తన సైన్యాలను పంచలింగాల కొండవైపు తరలించాడు. సైన్యాన్ని అడ్డావుల కట్ట వద్ద నిలిపారు. నెల్లూరు సైన్యం దిరిసెల, కరియెద్దుకురువ, ఆదోరు, పెంట్రాల,

అన్నెబోయినపల్లె, ఈదల భీమవరం, చినపెంట, చిట్లెమడుగుపాడు, ఆరుమూడుగుళ్ళ, మారెపల్లి, మంగల్లిపాడు, దామిశెట్టి చెరువు, కంపమడుగుపాడు, గుజ్జర్లవాగు ప్రాంతం వరకు వ్యాపించి ఉన్నాయి.[64] వెలుగోట ఉత్తర ప్రాంతంలో సైన్యాన్ని నిలిపి యాదవులు తప్పించుకొని పోకుండా ఉండేటట్లు యేర్పాట్లు చేశారు.

నల్లసిద్ధి సైన్యం విడిది చేసినచోట, కొన్ని చెడు శకునాలు కనిపించాయి. కొన్ని పాల పక్షులు సైనికులకు కనిపించాయి. సీతువలు, నల్లపులుగులు (గుడ్లగూబలు) అరవటం ప్రారంభించాయి. పాములు పడగవిప్పకుండా నేలమీద పాకుతూ వెళ్లుతున్నాయి. కొండగొఱ్ఱె ఒకటి బిగ్గరగా అరచింది. సుడిగాలికి గుడారాలు కులిపోయినాయి. పైడికంటి (బంగారు వర్ణం కన్ను గల పక్షి) భయంకరమైన శబ్దం చేసింది. ఈ అపశకునాలను చూసి నల్లసిద్ధి కలవరపడ్డాడు.[65]

సంధ్యగోపాలుడనే జోతిష్యుని పిలిచి ఈ అపశకునాలు సైన్యం మీద ఎలాంటి ప్రభావం చూపిస్తాయో చెప్పమన్నాడు.[66] సంధ్యగోపాలుడు శకునాల ఫలితాలను ఇలా చెప్పాడు. పాల పక్షులు సైన్యంపై ఎగరటం, అశ్వదళానికి నష్టం, సీతువలు, అరవటం కాల్బలానికి కష్టం కలుగుతుంది. నల్లపులుగుల అరుపులు, అశ్వసైనికుల పతనానికి సూచన. పాములు పడగ విప్పకుండా భూమిమీద పాకటం రాజుకు అశుభం.[67] అడవి గొఱ్ఱె అరవటం రాజ సేవకులకు నష్టం సుడిగాలికి గుడారాలు నెలకొరగటం సైన్యం చెల్లాచెదరవుతుందని అర్థం. పైడికంటి శబ్దం - బొల్లావు సైన్యంలో కలకలం కలగిస్తుంది.[68] సంధ్యగోపాలుడు చెప్పిన శకున ఫలితాలను విని కొందరు సైనికులు నవ్వారు. సైన్యంలో భయం కలిగించవద్దని హెచ్చరించారు. పులులు, సింహాలను అవలీలగా ఎదుర్కొనే వీరులు ఒక బొల్లావుకు భయపడటం అసంభవం అన్నారు.[69]

నల్లసిద్ధి సైనికులను జాగ్రత్తగా ఉండవలసిందిగా హెచ్చరించాడు. సైన్యం రక్షణ కోసం తగిన చర్యలు తీసుకున్నారు.[70] సైనిక గుడారాల చుట్టు ప్రతి రెండు గజాలకు ఒక సైనికుని కాపలా ఉంచారు. కాపలా సైనికుల ముందు ముళ్లకంపలను చుట్టు యేర్పాటు చేశారు. ముల్లకంచెకు ముందు గట్టి వలలను గుండ్రంగా పరచిఉంచారు. వలల వలయానికి ముందు మొనలుదేరిన ఇనుపకడ్డీలను నిలువుగా పాతారు. ఇనుపకడ్డీల వలయానికి ముందు లోతైన కందకం త్రవ్వారు. దివిటీలు వెలిగించి, ఏనుగులపై ఎక్కి తెల్లవార్లు కొందరు సైనికులు - నల్లసిద్ధి సైనిక శిబిరాన్ని కాపలా కాశారు.[71]

## బొల్లావు యుద్ధం :

నాల్గవరోజు యుద్ధం ఏకాదశి శుక్రవారం[72] నేడు (27-11-1282) జరిగింది. ఈ రోజు యాదవ సైన్యాలను ఎవరు నడిపించాలని కాటమరాజు, మంత్రి పల్లికొండను అడిగాడు. బొల్లావు పేరు మీద యుద్ధం చేయవలసి ఉన్నదని పల్లికొండ అన్నాడు. యాదవులు, బొల్లావును ఆదినారాయణ అవతారంగా భావించారు. యుద్ధం ప్రారంభించడానికి ముందు కాటమరాజు, పల్లికొండలు బొల్లావు చుట్టు ప్రదక్షిణ చేశారు. నీళ్లతో దాని కాళ్లు కడిగారు. నుదుటన నామాలు పెట్టారు. బొల్లావు శరీరానికి అగరు, గంధం, పునుగు, జవ్వాది, కస్తూరి సువాసనలు వెదజల్లే పదార్థాలను పూశారు. విసనకర్రలతో విసిరారు.[73]

అయితమరాజు బంగారు ఆభరణాలతో బొల్లావును అలంకరించాడు. నాలుగు కాళ్లకు అందెలు, మెడ చుట్టు గంటలు, నుదుటన రత్నాల పతకము, కొమ్ములకు బంగారు తొడుగులు, మెడలో బంగారు గొలుసు, ముత్యాలహారం, మూపురం చుట్టూ చిరుగంటలు, బొడ్డు గంట, మొదలైన బంగారు అభరణాలు అలంకరించాడు.[74]

బొల్లావుకు అలంకరణ పూర్తి అయిన తర్వాత పల్లికొండ సాంబ్రాణి, మైసాక్షిలతో పొగవేసి కర్పూర హారతి పట్టాడు. యాదవులంతాయుద్ధంలో విజయం కలగాలని బొల్లావును ప్రార్థించారు. బహుళ ఏకాదశి శుక్రవారం నాడు యాదవులు బొల్లావును వెంటబెట్టుకొని యుద్ధానికి బయలుదేరారు.

బొల్లావు చాలా మంది నల్లసిద్ది సైనికులను చంపింది.[75] యుద్ధ భూమిలో సుడిగాలిలా తిరిగింది. బొల్లావు విజృంభణను ఆపటం నెల్లూరు సైనికులకు కష్టమయింది. నల్లసిద్ది బొల్లావును చంపవలసిందిగా కోయబోయలను ఆజ్ఞాపించాడు. కోయబోయలు బొల్లావును చంపివేశారు.[76]

## బీర్నీడు యుద్ధం :

ఐదవరోజు యుద్ధానికి యాదవసైన్యాలను బీర్నీడు నాయకత్వంలో నడిపించారు. బీర్నీడు మాతంగి కులమునకు చెందినవాడు. కాటమరాజు పినతల్లి సిరిదేవి బీర్నీడును పెంచి పెద్ద చేసింది. ఇతడు కాటమరాజుకు నమ్మిన బంటు. బీర్నీడుకు ఆరువేల గోసంగి సైన్యం ఉంది. మంగల్లిపాడు వద్ద బీర్నీడు నల్లసిద్ది సైన్యాలను ఎదుర్కొన్నాడు. ఈ యుద్ధంలో నెల్లూరు అశ్వదళాన్ని, గజబలాన్ని కుప్పతెప్పలుగా కూల్చివేశాడు బీర్నీడు. నెల్లూరు సైనికులు బీర్నీడును యుద్ధభూమిలో చంపివేశారు.[77] ఆరాత్రి నల్లసిద్ది కొప్పుకొండకు పోయి విశ్రాంతి తీసుకున్నాడు.[78] అక్కడ కాటమరాజు అభిమాని కొమ్ముకసినీడు నెల్లూరు సైనికులతో పోరాడినాడు. నల్లసిద్ది సైన్యం కొమ్ము కసినీడును ఓడించాయి.[79]

కాటమరాజు - అయితమరాజు కుమారుడైన అల్లుదాడెన్నను పూరి జగన్నాథస్వామిని సేవించడానికి పంపించాడు. యరగడ్డపాడు యుద్ధంలో యాదవులు విజయం సాధించితే జగన్నాథునికి మూడువేల వరహాలు, మూడువందల ఆవులు, మూడు కోడెదూడలు, బంగారు పల్లకి, సమర్పిస్తాని మొక్కిరమ్మని చెప్పాడు. ముందు జాగ్రత్త చర్యగా కాటమరాజు కొంతమంది యాదవకుటుంబాలను అల్లుదాడెన్నతో కటకం ప్రాంతానికి పంపించాడు.[80] ఒకవేళ యుద్ధంలో యాదవులు ఓడిపోతే వారి వంశం పూర్తిగా పతనం కాకుండా ఉండటానికి కాటమరాజు ఇలా చేశాడు.

## అయితమరాజు యుద్ధం :

ఆరవరోజు యుద్ధానికి అయితమరాజు యాదవ సైన్యానికి నాయకత్వం వహించాడు. ఈ రోజు ఎవరు ఎవరితో యుద్ధం చేయాలో పల్లికొండ ముందుగానే నిర్ణయించాడు. యాదవుల తరపున కరియావులరాజు, భట్టావుల వల్లభన్న, ముమ్మయ్య, అయితమరాజులు - యర్రసిద్దిరాజు, పాపసిద్దిరాజు (నల్లసిద్ది సోదరులు) విరిగోపు (ఉండవెల్లి పాలకుడు), గండగోపాలరాజు, కస్తూరి సిద్దిరాజులతో పోరాడాలి. నాచకూళ్లనాయుడు (కాటమరాజు బావమరిది), పోచయ్య (కాటమరాజు మేనల్లుడు) లు గుత్తిభీముడు, తిరుణామల తిప్పనితో పోరాడాలి. నేతివారి ముద్దయ్య, కొండువారి కొండయ్య, గోవుల గంగయ్యలు, పెదవేగి బావరాజు, పెదవరదరాజులతో యుద్ధం చేయాలి.[81]

కాటమరాజు, అపర సరస్వతిభట్టును నల్లసిద్ది దగ్గరకు పంపించి యుద్ధ సమయం స్థలాలను తెలిపాడు. నల్లసిద్ది తన అంగీకారాన్ని తెలిపి కాటమరాజు పంపిన భట్టుకు బంగారు ఆభరణాలు బహూకరించి పంపించాడు.[82] బహుళ త్రయోదశి ఆదివారం[83] నాడు (29-11-1282) యుద్ధం ప్రారంభమైంది. యుద్ధ ఫలితాన్ని తెలుసుకోవటానికి కాటమరాజు, పద్మరాఘవుడు చదరంగం ఆడారు.[84] కరియావులరాజు, యరసిద్దిరాజు ఏనుగులపై ఎక్కి యుద్ధం చేశారు. అయితమరాజు, కరియావులరాజు, ముమ్మయ్య, పోచయ్యలు, కస్తూరి సిద్దిరాజు, గండగోపాలరాజు, యరసిద్దిరాజు, ఉండవల్లి విరిగోపుడు, గంగురాజు, చంద్రశేఖర మరియు తిప్పయ్యలనుయరగ్గపాడు యుద్ధంలో చంపివేశారు. ముమ్మయ్య శత్రువుల తలలు నరికి కాటమరాజు వద్దకు తీసికొనిపోయి చూపించాడు.[85]

## ఆవుల, ఎద్దుల యుద్ధం :

ఏడవరోజు యుద్ధం బహుళ చతుర్దశి సోమవారంనాడు (30-11-1282) ప్రారంభమైంది. ఆవుల యర్రయ్య (కాటమరాజు తమ్ముడు) చట్టువారి యర్రయ్య (కాటమరాజు బావమరిది) ఆవులు ఎద్దులను

తీసుకొని యరగడ్డపాడు యుద్ధానికి బయలుదేరారు.[86] ఆవుల యర్రయ్య - ఆవులకు, ఎద్దులకు యుద్ధంచేసే పద్ధతులను నేర్పేవాడు. ఆవుల ఎద్దులు - గుఱ్ఱాలు, ఏనుగులపై యుద్ధం చేసే విధానాన్ని యర్రయ్య శిక్షణ ఇచ్చేవాడు.

కాటమరాజు - ఆవులు, ఎద్దులు యరగడ్డపాడు యుద్ధంలో నల్లసిద్ధి గుఱ్ఱాలను, ఏనుగులను కొన్నింటిని చంపివేశాయి.[87] ఆవుల యర్రయ్య, చట్టువారి యర్రయ్యలు శ్రీకంఠంరాజును, పాపసిద్ధిరాజులను చంపివేశారు.[88]

## కాటమరాజు యుద్ధం :

చారిత్రాత్మకమైన యరగడ్డపాడు యుద్ధం చివరి రోజున కాటమరాజు స్వయంగా యుద్ధానికి బయలుదేరాడు. యుద్ధానికి బయలుదేరటానికి ముందు కాటమరాజుతో సహా యాదవులంతా శివపురాణం విన్నారు.[89] ఆ ముందు రాత్రి ఉపవశించారు.

బహుళ అమావాస్య మంగళవారం (1-12-1282) ఉదయం కాటమరాజు విల్లంబులు, త్రిశూలం, ఖడ్గం, బరిసె ఆయుధాలు ధరించి, అశ్వాన్ని అధిరోహించి, ఒకలక్షమంది యాదవసైన్యంతో యరగడ్డపాడు యుద్ధభూమికి బయలుదేరాడు.[90] నల్లసిద్ధి ఏనుగు ఎక్కి యుద్ధానికి వచ్చాడు. ఇది విజయాన్ని నిర్ణయించే ఆఖరిరోజు యుద్ధం. కాటమరాజు నెల్లూరు పాలకుడు నల్లసిద్దిని స్వయంగా ఎదుర్కొన్నాడు. ఇద్దరి మధ్య పోరు మహా భయంకరంగా జరిగింది. కాటమరాజు ఈటెతో నల్లసిద్దిరాజు గుండెల్లో పొడిచాడు. నల్లసిద్ది అక్కడికక్కడే మరణించాడు.[91] ద్వంద్వ యుద్ధంలో పద్మరాఘవుడు - నెల్లూరు మంత్రి చింకర్ల భీమన్నను చంపివేశాడు. కాటమరాజు అనుకున్న విధంగా యరగడ్డపాడు యుద్ధంలో నల్లసిద్ధిని చంపి పాతపగలు సాధించాడు. అతడు చేసిన ప్రతిజ్ఞ ప్రకారం నల్లసిద్ది తలను నరికి పాలేటి గంగకు పాద కానుక పెట్టాడు.[92] నెల్లూరి ముక్కంటి రాజు కాటమరాజు పినతండ్రి పోలురాజును చేరుకూరు యుద్ధంలో చంపినందుకు నల్లసిద్దిని చంపి ప్రతీకారం తీర్చుకున్నాడు. కాని యాదవులకు అపారనష్టం కలిగింది. కాటమరాజు తరువాత దొనకొండలో యాదవుల అధికారం అంతరించింది.

## యరగడ్డపాడు యుద్ధం - కాలనిర్ణయం :

యరగ్డపాడు యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది, అనేది వివాదాస్పద విషయం. కాటమరాజును గూర్చి ఇంతకు ముందు వ్రాసిన రచయితలు రకరకాల అభిప్రాయాలు తెలిపారు.

బత్తుల లక్ష్మయ్య - రాజవంశ ప్రదీపికలో యరగడ్డపాడు యుద్ధం కాటమరాజు, మనుమసిద్ధికి మధ్య క్రీ.శ. 1300లో జరిగినట్లు వ్రాశారు.[93] నల్లసిద్ధికి బదులు మనుమసిద్ధి అని వ్రాశారు. తిమ్మావజ్ఝల కోదండరామయ్య (కాటమరాజు కథ[94] అనే శీర్షికతో 1953 మేనెల భారతిలో ఒక వ్యాసము రాశారు. ఇందులో యరగడ్డపాడు యుద్ధాన్ని గురించి చర్చించారు. కాటమరాజు ధాతనామ సంవత్సర పాల్గుణ శుద్ధ పంచమి గురువారం నాడు జన్మించినట్లు పేర్కొన్నాడు. ఇది సరికాదు - ఎందుకనగా ధాతనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ పంచమి, ఆదివారం అవుతుంది కాని గురువారం కాదు. కోదండరామయ్య గుండ్లపాలెం శాసనం మెకంజయ్ సేకరించిన కాటమరాజు కథలను పరిశీలించారు. ఈ క్రింది విధంగా వ్రాశారు.

గుండ్లపాలెం శాసనం ప్రకారం కాటమరాజు నెల్లూరు పాలకుడు నల్లసిద్దిరాజు మధ్య యరగడ్డపాడు యుద్ధము స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు 1170 అగునేటి కాళయుక్తి సంవత్సర కార్తీక శుద్ధ పంచమి నాడు జరిగినట్లున్నది. జానపద గాథాకారులు యరగడ్డపాడు యుద్ధం, చిత్రభాను సంవత్సరంలో జరిగినట్లు చెప్పుచున్నారు. గుండ్లపాలెం శాసనంలోని తేదికి, జానపద గాథాకారులు చెప్పేదానికి పొంతనలేదు.[95]

కోదండరామయ్య యరగడ్డపాడు యుద్ధం ఏ సంవత్సరంలో జరిగింది అనే విషయం తేల్చి

చెప్పలేదు. ఈ కాల నిర్ణయానికి మరికొంత పరిశోధన జరగవలసి ఉన్నదని వ్రాశారు.

వేటూరి ప్రభాకరశాస్త్రి కాటమరాజు కథ - తాళపత్ర గ్రంథాన్ని పరిష్కరించారు. మల్లంపల్లి సోమశేఖర శర్మ పీఠిక వ్రాశారు. ఇందులో యరగడ్డపాడు యుద్ధాన్ని గురించి కొంత చర్చించారు. సోమశేఖరశర్మ ఈ యుద్ధం ఎప్పుడు జరిగింది అనే విషయం బాగానే చర్చించారు. కాని మాఘ బహుళ అమావాస్య మంగళవారం - శకసంవత్సరాలు చిత్రభాను 1144 (A.D.1223) లేక 1204 (1283A.D.)లలో సరికావటంలేదని తిరస్కరించారు. నల్లసిద్ధి, కాటమరాజుల మధ్య ఈ యుద్ధం ఎప్పుడు జరిగిందో తెలుసుకొనుటకు సరియైన ఆధారాలు లేవన్నారు.[96]

యరగడ్డపాడు యుద్ధాన్ని గురించి చర్చించిన తాళపత్ర గ్రంథాలను సోమశేఖరశర్మ పరిశీలించలేదు. కనకబండి గట్టయ్య వ్రాసిన, జన్నివాడకథ తాళపత్ర గ్రంథంలో, గంగుల పిన యల్లయ్యచే రచింపబడిన యరగడ్డపాటి పోట్లాట, తాళపత్ర గ్రంథంలో కాటమరాజు-నల్లసిద్ధి రాజులమధ్య కుదిరిన పుల్లరి ఒప్పందం కాలం మరియు యరగడ్డపాటి యుద్ధం జరిగిన కాలం తెలియచేశారు.[97]

డా॥ వారణాశి యశోదాదేవి, ఆంధ్రదేశంలోని చిన్నతరహా రాజవంశాల చరిత్రను వ్రాస్తూ, యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1259లో[98] జరిగిందని తెలిపారు. వారు ఆంగ్లంలో వ్రాసిన పత్రం "ఆంధ్రదేశ చరిత్ర క్రీ.శ. 1000 నుండి 1500 చిన్న తరహా రాజవంశాలు" జె.ఎ.హెచ్.ఆర్.ఎస్., 23వ వాల్యూమ్‌లో ప్రకటించబడింది. అందులో గుండ్లపాలెం శాసనం, తెలుగుచోడ వంశము వారికి చెందిన ఇతర శాసనాలను పరిశోధించినట్లు ఉంది. కాని కాటమరాజు చరిత్రకు చెందిన జానపదగాథలను పరిశీలించినట్లు లేదు. యశోదాదేవి ఈ విధంగా చెపుతున్నారు. "నల్లసిద్ధి, మూడవ నల్లసిద్ధి ఇద్దరూ ఒక్కరే - ఇతడే మూడవ మనుమసిద్ధి (క్రీ.శ. 1248 - 1267). గుండ్లపాలెం శాసనంలో పేర్కొనబడిన సిద్ధిరాజు, మూడవ మనుమసిద్ధి ఒక్కరే. యాదవులు సిద్ధిరాజును క్రీ.శ. పన్నెండవ శతాబ్దంలో[99] పేర్కొనటము సీవెల్‌ది పొరపాటు. ఇదే సమయంలో కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించినవాడు గణపతిదేవుడు. గుండ్లపాలెం శాసనంలో గణపతిదేవునికి బదులు పొరపాటున ప్రతాపరుద్రుడని పేర్కొనటము జరిగింది. మూడవ మనుమసిద్ధిని ఎదిరించటంలో అలపోలుకు కాకతీయుల మద్దతు ఉండవచ్చు".[100]

నెల్లూరు తెలుగు చోడవంశంలో చాలమంది మనుమసిద్ధులు, నల్లసిద్ధులు, గండగోపాలురు కనిపిస్తారు. వాస్తవంగా చెప్పాలంటె నెల్లూరు చోడవంశానికి చెందిన సరియైన వంశ వృక్షాన్ని తయారుచేయడం కష్టం. కాటమరాజు చరిత్రను తెలిపే తాళపత్ర గ్రంథాలు చాలా ఉన్నాయి. వీటిని చాలమంది కవులు మంజరి ద్విపద సాహిత్యంలో రచించారు. అన్ని తాళపత్ర గ్రంథాలలో యరగడ్డపాడు యుద్ధ సమయంలో నెల్లూరును పాలించినరాజు నల్లసిద్ధి రాజు అని ఉంది. ఈ రాజ వంశం వారు మనుమసిద్ధి పేరును ఒక బిరుదుగా వాడుకున్నట్లు తెలుస్తుంది. అందువలన చాలమంది నెల్లూరు తెలుగు చోడవంశం రాజుల పేర్లు మనుమసిద్ధితో ముడివడి ఉన్నాయి.

ఛార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్ వ్రాసిన యరగడ్డపాటి పోట్లాట డి.నెం. 1031, 1034లో ఇలా వివరించారు.

"నెల్లూరును, భుజబల వీరనల్లసిద్ధ దేవచోళ మహారాజు పరిపాలించుతున్న సమయంలో యరగడ్డపాటి యుద్ధం జరిగి ఉండవచ్చు. ఇది శాలివాహన సంవత్సరం 1087 (A.D.1157)జరిగినట్లు చెప్పవచ్చు. డి.నెం. 1040లో - "స్థానిక చరిత్రలు వాల్యూమ్ ఎక్స్.పి. 298లో కాటమరాజు యుద్ధాన్ని వర్ణించబడింది. ఈ యుద్ధం నలనామ సంవత్సరం 1658 (A.D.1736)లో జరిగింది.[101]

ఛార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్ పేర్కొన్న సంవత్సరాలు తప్పుగా భావించవచ్చు. ఎందుకనగా యరగడ్డపాడు యుద్ధం పదమూడవ శతాబ్దంలో జరిగింది కాని పన్నెండవ శతాబ్దంలో కాదు, లేక పద్దెనిమిదవ శతాబ్దంలో కాదు, కాటమరాజు చరిత్ర యడల బ్రౌన్ చాల శ్రద్ధ చూపించారు.

మెకంజియ్ మాన్యు స్క్రిప్ట్ ౹ ప్రకారం (స్థానిక చరిత్రలు) కాటమరాజు అమరావతి యరగడ్డపాడులను పాలించాడు. ఈ యుద్ధం క్రీ.శ. 1263లో జరిగింది.[102]

రాబర్ట్ సీవెల్ ప్రకారం, యాదవులకు సిద్ధిరాజుకు మధ్య యుద్ధం 12వ శతాబ్దంలో జరిగింది. కాటమరాజు పేరును కంటమరాజుగా పేర్కొన్నాడు.[103]

విజ్ఞాన సర్వస్వం - వాల్యూమ్ 4 నందు నెల్లూరు మనుమసిద్ధి, కాటమరాజుల మధ్య పుల్లరి యుద్ధం క్రీ.శ. 1261లో జరిగినట్లు ఉంది. కొంతమంది చరిత్రకారులు ఈ యుద్ధం క్రీ.శ. 1261లో[104] జరిగినట్లు నమ్ముతున్నారని తెలుపుతుంది. విజ్ఞాన సర్వస్వం సరియైన యుద్ధకాలాన్ని నిర్ణయించలేదు.

1962లో మామిడిపూడి వెంకటరంగయ్య సంపాదకత్వం ద్వారా వెలువడిన సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము నందు యరగడ్డపాడు యుద్ధాన్ని గురించి చర్చించడం జరిగింది - నెల్లూరు మనుమసిద్ధి తరపున ఖడ్గ తిక్కన యాదవులపై యుద్ధానికి వెళ్లాడు. కాటమరాజు పినతల్లి కొడుకు చల్లపిన్నమనీడు ఖడ్గతిక్కనను ఓడించాడు. సైన్యాన్ని సమకూర్చుకొని తిరిగి యుద్ధానికి రావాలని ఖడ్గతిక్కన నెల్లూరు వెళ్లాడు. అక్కడ తల్లిదండ్రులు, భార్య, పురంలోని ప్రజలు ఖడ్గ తిక్కనను అవమానించారు. తిరిగి యుద్ధరంగానికి సైన్య సమేతంగా పోయి యాదవులను ఎదుర్కొని, వీరోచితంగా పోరాడి బ్రహ్మరుద్రయ్య చేతిలో వీరమరణం పొందాడు.[105] ఇందులో యుద్ధ ఘట్టాన్ని బాగానే చర్చించారు. కాని యుద్ధం జరిగిన సంవత్సరం గూర్చి చర్చ జరుపలేదు.

దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి, యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1282లో జరిగిందని అభిప్రాయపడ్డారు.[106] కాటమరాజు చరిత్రకు సంబంధించిన శాసనాలు తాళపత్ర గ్రంథాలు పరిశీలించారు. శకసంవత్సరం, చిత్రభానులో ఈ యుద్ధం జరిగినట్లు నమ్ముతున్నారు. కాటమరాజు కథలను గానం చేసే జానపద గాథాకారులు, కాటమరాజు, నల్లసిద్ధిరాజుల మధ్య యరగడ్డపాడు యుద్ధం చిత్రభాను సంవత్సరంలో జరిగినట్లు గట్టిగా నమ్ముతున్నారు.

ఆరాధ్యుల పిచ్చయ్య,[107] బల్లికురువ యుద్ధం, గ్రంథ పీఠిక నందు యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1248లో జరిగినట్లు వ్రాశారు. ఈ కాల నిర్ణయంలో ఆరాధ్యుల పిచ్చయ్య 1953లో మద్రాసు ప్రభుత్వం ప్రచురించిన 'కాటమరాజు కథలు' - గ్రంథాన్ని ఆధారంగా తీసుకున్నారు.

చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రను అయిదు సంపుటాలలో వెలువరించారు. ఇందుకుగాను వారికి చరిత్ర చతురానన బిరుదు లభించింది. వీరు తమ గ్రంథంలో కాటమరాజు చరిత్రను చర్చించార్కు[108] ప్రకాశం జిల్లా, కందుకూరు దగ్గర ఉన్న గుండ్లపాలెం శాసనంలోని విషయాలు సమగ్రంగా లేవన్నారు. చిలుకూరి వీరభద్రరావు -కాటమరాజు చరత్రను తెలిపే తాళపత్ర గ్రంథాలను పరిశీలించలేదు. అందువలన యరగడ్డపాడు యుద్ధాన్ని గురించి సరియైన నిర్ణయానికి రాలేక పోయినారు.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం వ్రాసిన ఆంధ్రుల చరిత్ర సంస్కృతి ప్రకారం - పుల్లరి విషయంలో నెల్లూరు మనుమసిద్ధికి, కాటమరాజు (గొల్లదొర)కు మధ్య కనిగిరి ప్రాంతంలోని పాలేటి ఒడ్డున పంచలింగాల కొండ వద్ద యుద్ధం జరిగింది. ఈ యుద్ధాన్ని పల్నాటి యుద్ధంతో పోల్చారు. కాటమరాజు కథ చరిత్రకు సంబంధించిన గ్రంథం కాదన్నారు. కాని చారిత్రాత్మకమైన జానపదగాథగా తెలిపారు. నెల్లూరు నల్లసిద్ధి, కాటమరాజులు సమకాలికులనే విషయాన్ని అంగీకరిస్తున్నారు.[109] వీరు కూడా తాళపత్ర గ్రంథాలను పరిశీలించలేదు. అందువలన చిలుకూరి వీరభద్రరావు అభిప్రాయాన్నే వీరు వెలిబుచ్చారు.

డా॥ అరుణకుమారి రచించిన ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు, గ్రంథములో కాటమరాజు పుల్లరి యుద్ధంను గురించి చర్చించారు. వారి అభిప్రాయం ఇలా వెలిబుచ్చారు.

"ఇప్పటివరకు గ్రామీణ ప్రజలే ఎక్కువగా
యరగడ్డపాడు యుద్ధాన్ని గురించి చర్చించు
చున్నారు. ఈ యుద్ధం శాసనాలలోకాని, సమ
కాలీన సాహిత్యం లోకాని ప్రస్తావించలేదు -
తిక్కన వ్రాసిన నిర్వచనోత్తర రామాయణం.
కేతన దశకుమార చరిత్రలో దీని ప్రస్తావన
లేదు. కాటమరాజు చారిత్రకతను నిరూపిం
చుటకు సరియైన ఆధారాలు లేవు."[110]

కాటమరాజు చరిత్ర యరగడ్డపాడు యుద్ధం కాలనిర్ణయానికి సరియైన పరిశోధన జరగలాని అరుణకుమారి సలహా ఇచ్చారు. వారు గంగదొనకొండలోని శాసనాలు, పంచలింగాల కొండలోని శిల్పాలు, వీరగల్లులు కాటమరాజు చరిత్రకు సంబంధించిన వాటిని పరిశీలించలేదు.

ఆరుద్ర ప్రముఖ తెలుగు కవి-సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర - "కాకతీయ యుగం" గ్రంథంలో నెల్లూరు మనుమసిద్ధి, పుల్లరి విషయమై కాటమరాజుతో జరిగిన యుద్ధమందు క్రీ.శ. 1260లో ప్రాణాలు కోల్పోయాడని చరిత్రకారులంతా ఏకగ్రీవంగా ఒప్పుకున్నారని వ్రాశారు![111]

కాటమరాజు చరిత్రకు సంబందించిన తాళపత్రాలన్నింటిని ఆరుద్ర సమగ్రంగా పరిశీలించలేదు. క్రీ.శ. 1263లో పాండ్యులు, మనుమసిద్ధిని సంహరించారు.[112]

నెల్లూరు జిల్లా గజటీరు నందు రెండవ మనుమసిద్ధి, కాటమరాజుల మధ్య పుల్లరి యుద్ధం శక సంవత్సరం 1180 (క్రీ.శ. 1258)లో[113] జరిగినట్లు ఉంది. ఇందు గుండ్లపాలెం శాసనంలోని సంవత్సరాన్ని ఆధారంగా తీసుకున్నారు.

డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు, సంకలనం చేసిన వీర గాథలు - కాటమరాజు కథలు ; ప్రథమభాగంనందు విపులమైన పీఠిక వ్రాశారు. యరగడ్డపాడు యుద్ధం కాకతి ప్రతాపరుద్రుని కాలమందు క్రీ.శ. 1290-1297 మధ్యలో జరిగినట్లు చెప్పారు.[114] కాకతి ప్రతాపరుద్రుని సేనాధిపతి, ఆడిదము మల్లు క్రీ.శ. 1290లో మనుమసిద్ధిని చంపాడు. ఆ తరువాత నల్లసిద్ధి నెల్లూరు సింహాసనం అధిష్ఠించి కాటమరాజు పై యుద్ధం చేశాడని అభిప్రాయపడినారు.[115] డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు, మనుమసిద్ధి కాలాన్ని సరిగా నిర్ణయించలేదు. మనుమసిద్ధి నెల్లూరురాజ్యాన్ని క్రీ.శ. 1248- 1263 మధ్య పాలించాడు.[116] యరగడ్డపాడు యుద్ధం, మాఘ బహుళ చతుర్దశి సోమవారం నాడు ప్రారంభమై, చిత్రభాను సంవత్సర పాల్గుణ బహుళ అమావాస్య మంగళవారం[117] నాటి వరకు జరిగిందని డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు అభిప్రాయ పడినారు. కాని ఇదిసరియైన కాలనిర్ణయం కాదు. ఈ యుద్ధం చిత్రభాను సంవత్సరం, మార్గశిర బహుళ సప్తమి సోమవారం నాడు మొదలై చిత్రభాను సంవత్సరం, మార్గశిర బహుళ అమావాస్య మంగళవారం నాడు ముగిసింది.[118]

కళా ప్రపూర్ణ నిడదవోలు వెంకట్రావు, ప్రముఖ తెలుగు సాహిత్య విమర్శకుడు 1978, జనవరి, భారతి మాస పత్రికలో కాటమరాజు కథలు పై విమర్శనాత్మకమైన వ్యాసం వ్రాశారు. ఖడ్గ తిక్కన క్రీ.శ. 1200 - 1250 కాలము వాడని, యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1259లో కాకతి గణపతిదేవుని కాలంలో జరిగిందని వివరించారు.[119]

డా॥ బి.ఎస్.ఎల్.హనుమంతరావు, ప్రముఖ ఆంధ్ర చరిత్రకారుడు తన ఆంధ్రుల చరిత్ర గ్రంథమందు పుల్లరి విషయమై కాటమరాజు, మనుమసిద్ధి రాజుల మధ్య క్రీ.శ. 1260లో యుద్ధం జరిగినట్లు వ్రాశారు.[120]

కాటమరాజు యుద్ధం చేసింది నల్లసిద్ది పైన కాని మనుమసిద్ధి మీద కాదు. గుండ్లపాలెం శాసనం, తాళపత్ర గ్రంథాలు, కాటమరాజుతో యుద్ధం చేసిన నెల్లూరు రాజు నల్లసిద్ది అనే తెలుపుతున్నాయి. ఇంతకు ముందు చెప్పినట్లుగా జటావర్మ - సుందరపాండ్యుడు నెల్లూరు పై దాడిచేసి క్రీ.శ. 1263లో ముదుగూరు వద్ద మనుమసిద్దిని చంపివేశాడు.[121]

కంభంపాటి సత్యనారాయణ - ఆంధ్రుల చరిత్ర సంస్కృతి, రెండవ భాగము నందు పుల్లరి విషయమై కాటమరాజు మూడవ మనుమసిద్ది మధ్య యుద్ధం వచ్చిందని తెలిపారు. రణతిక్కన నాయకత్వంలో నెల్లూరు సైన్యం క్రీ.శ. 1267లో కాటమరాజుపై దాడి చేశారు. ఈ యుద్ధం పెన్నానది ఒడ్డున సోమశిల ప్రాంతంలో జరిగినట్లు చెప్పారు.[122]

మల్యాల దేవిప్రసాద్ యాదవ్, 'యాదవచంద్రిక' గ్రంథాన్ని రచించారు. ఇందులో 'అయిదవ మందపోరు 1259' శీర్షికన యరగడ్డపాడు యుద్ధాన్ని గూర్చి కొంత వ్రాశారు. కేతన, శ్రీనాథుడు, కాటమరాజు చరిత్రను పద్య ద్విపద సాహిత్యంలో వ్రాసినట్లు దేవిప్రసాద్ యాదవ్ తెలిపారు. కనిగిరి ప్రాంతంలో ఉన్న యరగడ్డపాడు ప్రాంతాన్ని కాటమరాజు క్రీ.శ. 1259లో పాలించినట్లు వ్రాశారు.[123] ఇందులో యుద్ధ క్రమాన్ని చర్చించారు. కాని యుద్ధ కాల నిర్ణయం సరిగా చర్చించలేదు.

ఆంధ్రప్రదేశ్, ప్రకాశం జిల్లా, కందుకూరు తాలూకా, గుండ్లపాలెం[124] గ్రామం, బ్రహ్మేశ్వర స్వామి దేవాలయంలో ఉన్న శిలాశాసనం కాటమరాజు చరిత్ర యరగడ్డపాడు యుద్ధాన్ని గురించి కొంత సమాచారం ఇస్తుంది. ఈ శాసనంలో కాటమరాజు ఓరుగల్లు కాకతి ప్రతాపరుద్రుని కాలంలో ముప్పైరెండు సంవత్సరాలు[125] పాలించాడని పంచలింగాలకొండ సమీపంలోని యరగడ్డపాడులో నల్లసిద్దితో యుద్ధం చేసినట్లు ఉంది. నల్లసిద్ధి, యాదవుల మధ్య శక సంవత్సరం 1170, కాళయుక్తి నామ సంవత్సర కార్తీక మాస శుద్ధ, పంచమి, గురువారం నాడు యుద్ధం జరిగినట్లు గుండ్లపాలెం శాసనం తెలుపుతుంది.[126] వలురాజు, పోలురాజు మరియు పెద్ది రాజులు కూడా యరగడ్డపాడు యుద్ధంలో పాల్గొన్నట్లు ఇందులో ఉంది. కాని ఇది నిజం కాదు. పెద్దిరాజు, పోలురాజు, వీరితండ్రి వలురాజు నల్లసిద్ది పై యుద్ధం చేయలేదు. పెద్దిరాజు అర్లపెంట యుద్ధంలో పోలురాజు, చెరుకూరు యుద్ధరంగ మందు మరియు వలురాజు ఖండెమొండెముల యుద్ధభూమిలో మరణించారు. ఈ శాసనంలో ఇచ్చిన సంవత్సరం కూడా సరియైనది కాదు. యరగడ్డపాడు యుద్ధమైన తర్వాత కొంత కాలానికి ఈ శాసనాన్ని వేసి ఉంటారు.

మల్లంపల్లి సోమశేఖరశర్మ గుండ్లపాలెం శాసనాన్ని తప్పుల తడకగా వర్ణించారు. గుండ్లపాలెం శాసనం క్రీ.శ. 23-10-1438న వేసినట్లు దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి అభిప్రాయ పడినారు.[127] ఈ శాసనం పదిహేనవ శతాబ్దంలో వేసినదని ఆరుద్ర అంటున్నారు.[128] ఏది ఏమైనప్పటికి, గుండ్లపాలెం శాసనం, కైఫీయతులు, తాళపత్ర గ్రంథాలు, కాటమరాజు, నల్లసిద్ది రాజుల మధ్య యరగడ్డపాడులో యుద్ధ జరిగినట్లు ప్రామాణికంగా తెలుపుతున్నాయి.

సాహిత్య ఆధారాలలో యరగడ్డపాడు యుద్ధం చిత్రభాను సంవత్సరం, మాఘ బహుళ అమావాస్య మంగళవారం నాడు జరిగినట్లు తెలుస్తుంది.

కాని శక సంవత్సరం తెలుపలేదు. అయినప్పటికి శక సంవత్సరం తెలుసుకోవడం ఏమంత కష్టం కాదు. కాకతి ప్రతాపరుద్రుడు యువరాజుగా ఉన్నపుడు ఈ యుద్ధం జరిగినట్లు స్పష్టంగా తెలుస్తుంది. ప్రతాపరుద్రుని కాలానికి సరియైన చిత్రభాను శక సంవత్సరం 1204. అందువలన యరగడ్డపాడు యుద్ధం శకసంవత్సరం 1204, చిత్రభాను మాఘ బహుళ అమావాస్య మంగళవారం నాడు సమాప్తమైనట్లు తెలుస్తుంది. యరగడ్డపాటి పోట్లాట, తాళపత్ర గ్రంథంలో ఖడ్గతిక్కన, బ్రహ్మరుద్రయ్యను మాఘ బహుళ అష్టమి మంగళవారం[129] నాడు ఎదుర్కొన్నట్లు వ్రాయబడింది. ఇదే తాళపత్ర గ్రంథంలో

చివరన మాఘ బహుళ అమావాస్య మంగళారంనాడు[130] కాటమరాజు, నల్లసిద్ధిని యుద్ధ భూమిలో చంపినట్లు వివరించబడింది. ఈ యుద్ధం బహుళ సప్తమి నుండి బహుళ అమావాస్య వరకు జరిగింది. బహుళ నవమినాడు యుద్ధం జరుగలేదు. మొత్తంమీద యరగడ్డపాడు యుద్ధం ఎనిమిది రోజులు జరిగింది.[131]

శక సంవత్సరం 1204 చిత్రభాను, మాఘ బహుళ అమావాస్యనాడు మంగళవారం కావడం లేదు. శక సం॥ 1204 చిత్రభాను - ఏ నెలలో బహుళ అమావాస్య నాడు మంగళవారం అవుతుందో చూడాలి. మార్గశిర మాసంలోని బహుళ అమావాస్య మంగళవారం అవుతుంది. మార్గశిరకు బదులు, మాఘ అని వ్రాయటం మొదలు పెట్టారు. గాథాకారులు కూడా పాడటానికి అనుకూలంగా ఉండటానికి మార్చిఉంటారు. ఈ పొరపాటు యరగడ్డపాడు యుద్ధం ఎప్పుడు జరిగిందనే విషయం తేల్చి చెప్పటానికి చాల తికమక పెట్టింది.

కాటమరాజు - నల్లసిద్ధి రాజుల మధ్య యరగడ్డపాడు యుద్ధం, శక సం॥ 1204 చిత్రభాను, మార్గశిర బహుళ అమావాస్య[132] మంగళవారం[133] నాడు జరిగింది. ఇది సరియైన క్రీ.శ. 1-12-1282. యరగడ్డపాటి యుద్ధం కాలాన్ని ఈ క్రింది విధంగా నిర్ణయించడం జరిగింది.

1. శక సం॥ 1204, చిత్రభాను, మార్గశిర బహుళ సప్తమి సోమవారం నాడు (23-11-1282) ఖడ్గతిక్కనను చల్లపిన్నమనీడు చాగలకొండ వద్ద ఓడించాడు.
2. శక సం॥ 1204, చిత్రభాను, మార్గశిర బహుళ అష్టమి మంగళవారం నాడు (24-11-1282) ఖడ్గతిక్కన రెండవసారి యాదవుల పైకి యుద్ధానికి వచ్చాడు. బ్రహ్మరుద్రయ్య ఖడ్గ తిక్కనను చంపివేశాడు.
3. మూడవ రోజు బుధవారం యుద్ధం జరుగలేదు. ఖడ్గ తిక్కన మరణానికి ఇరుపక్షాల వారు సంతాపం ప్రకటించి ఉండవచ్చు.(25-11-1282)
4. క్రీ.శ. 1204, చిత్రభాను, మార్గశిర బహుళ దశమి గురువారం నాడు (26-11-1282) నల్లసిద్ధి అతని సోదరులు, చల్లపిన్నమనీడు సోదరులను చాగలకొండ దగ్గర చంపివేశారు.
5. శక సం॥ 1204, చిత్రభాను, మార్గశిర బహుళ ఏకాదశి శుక్రవారం నాడు (27-11-1282) బొల్లావు నల్లసిద్ధి ఏనుగులు, గుఱ్ఱంలపై విజృంభించింది. కోయబోయలు బొల్లావును చంపివేశారు.
6. శక సం॥ 1204, చిత్రభాను, మార్గశిర బహుళ ద్వాదశి శనివారం నాడు (28-11-1282) బీర్నీడు, తన గోసంగి బలంతో నెల్లూరు సైన్యాన్ని మంగల్లిపాడు వద్ద ఎదుర్కొన్నాడు.
7. శక సం॥ 1204, చిత్రభాను, మార్గశిర బహుళ త్రయోదశి ఆదివారంనాడు (29-11-1282) అయితమరాజు, నల్లసిద్ధి సోదరులతో యుద్ధం చేసి కస్తూరి సిద్ధిరాజు, యరసిద్ధిరాజులను చంపివేశాడు.
8. శక సం॥ 1204, చిత్రభాను, మార్గశిర బహుళ చతుర్దశి సోమవారం నాడు (30-11-1282) అవుల యర్రయ్య నాయకత్వంలో ఆవులు, ఎద్దులు ఎక్కువ సంఖ్యలో యుద్ధం చేశాయి.
9. శక సం॥ 1204, చిత్రభాను, మార్గశిర బహుళ అమావాస్య మంగళవారం నాడు కాటమరాజు, నెల్లూరు నల్లసిద్ధి తలనరికి పాలేటి గంగకు పాదకానుక పెట్టాడు.

పైన ఉదహరించిన విషయములు కాటమరాజు చరిత్రకు సంబంధించిన తాళపత్ర గ్రంథములు, శాసనములు, కైఫీయతులు, శిల్పాలను ఆధారంగా చేసుకొని యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 23-11-1282 నుండి 1-12-1282 వరకు జరిగిందని చెప్పవచ్చును.

---

# నోట్స్ అండ్ రిఫరెన్స్

1. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 34
2. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; కాటమరాజు ఉత్తరాది అవుల మేపు ; తా.ప.గ్రం. పుట : 47
3. గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం ; తా.ప.నెం. : 3
4. ఇదే
5. ఇదే తా.ప.నెం. : 8
6. ఇదే
7. ఇదే తా.ప.నెం. : 9
8. ఇదే
9. ఇదే తా.ప.నెం. : 10
10. ఇదే తా.ప.నెం. : 11
11. ఇదే తా.ప.నెం. : 12
12. ఇదే
13. ఇదే
14. ఇదే తా.ప.నెం. : 14
15. ఇదే తా.ప.నెం. : 12
16. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పీఠిక ; పుట : CVI
17. గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం ; తా.ప.నెం. : 15
18. భట్టురాయబారము ; తా.ప.గ్రం ; తా.ప.నెం. : 5
19. గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం ; తా.ప.నెం. : 15
20. ప్రభాకరశాస్త్రి, సం॥కాటమరాజు కథ ; భట్టు రాయబారము ; తా.ప.గ్రం ; తా.ప.నెం. : 160
    గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం ; తా.ప.నెం. : 16
21. ఇదే తా.ప.నెం. : 17
22. ఇదే తా.ప.నెం. : 18
23. ఇదే తా.ప.నెం. : 28
    ఆమడ (నాలుగు కోసుల దూరము - లేక ఎనిమిది మైళ్లు)
24. ఇదే తా.ప.నెం. : 35
25. ఇదే
26. ఇదే తా.ప.నెం. : 39
27. సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; కాటమరాజు దక్షిణాది అవుల మేపు ; తా.ప.గ్రం.పుట : 138 - 139
28. ఇదే పుట : 143
29. ఇదే పుట : 155
30. కైఫీయతులు - మెకంజయ్ మాన్యు - స్క్రిప్ట్స్ - ఆర్.నెం. 1126.
    పట్టపురావి కైఫీయతు పుట : 4
31. ప్రబాకరశాస్త్రి సం॥, కాటమరాజు కథ ; రణతిక్కన ; పీఠిక - పుట : XII
32. ఇదే
33. ఇదే పుట : XIII
34. ఇదే
35. ఇదే

36. ఇదే - కైఫీయత్‌లో కుందమాదేవి చిలుకను పోలురాజు చంపినట్లు ఉన్నది. జన్నివాడ కథ తాళపత్ర గ్రంథంలో, కాటమరాజు స్నేహితుడు పద్మ రాఘవుడు చిలుకను చంపినట్లుగా ఉన్నది. పోలురాజు ఇంతకు ముందే చాలా కాలం క్రితం చెరుకూరు యుద్ధంలో చనిపోయాడు. (జన్నివాడ కథ - తా.ప.గ్రం. ; తా.ప.నెం.: 3)

37. ఇదే

38. గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం. తా.నెం. : 35

39. ఇదే తా.ప.నెం. : 52

40. ఇదే తా.ప.నెం. : 55

41. ఇదే తా.ప.నెం. : 60

42. భట్టురాయబారము ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 7

43. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 2

44. ఇదే తా.ప.నెం. : 25

45. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 2 & 3

46. ఇదే - చాగల కొండ - పంచలింగాల కొండకు 24మైళ్ల దూరంలోఉన్నది. ప్రస్తుతము దీనిని చాకలికొండ అని పిలుస్తున్నారు.

47. ఇదే తా.ప.నెం. : 5

48. ఇదే తా.ప.నెం. : 6

49. ఇదే తా.ప.నెం. : 6

50. ఇదే - అసంపూర్ణంగా ఉన్నచోట భావం చెడకుండా పూరించడం జరిగింది.

51. ఇదే తా.ప.నెం. : 7

52. ఇదే

53. ప్రభాకరశాస్త్రి ; సం॥ కాటమరాజు కథ ; రణతిక్కన ; పీఠిక - పుట : XIII

54. ఇదే పుట : XIV

55. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 10

56. ఇదే తా.ప.నెం. : 9

57. ఇదే తా.ప.నెం. : 6

58. ఇదే తా.ప.నెం. : 10

59. ఇదే

60. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 10

రణతిక్కన నెల్లూరు నల్లసిద్ధి తరపున సోమశిల వద్ద కాటమరాజు, కరియావుల రాజుపై పట్టపురావి గ్రామానికి కొంత దూరంలో - ఈశాన్య భాగమున ఉన్న పినాకిని నది ఉత్తర భాగం తీరమున యుద్ధం చేసినట్లు పట్టపురావి కైఫీయతులో వివరింపబడింది. దైవానుగ్రహం లోపించి తిక్కన కాటమరాజు చేతిలో మరణించినాడు. (లోకల్ రికార్డ్ అర్. నెం. : 1126. పట్టపురావి కైఫీయత్ పుట : 6)

ప్రస్తుతము ఈ ప్రాంతాన్ని తిక్కనపాడు అని పిలుస్తున్నారు. ఇక్కడ తిక్కన గుఱ్ఱంపై ఎక్కినట్లు శిలా విగ్రహం ఉన్నది. ఖడ్గ తిక్కన, బ్రహ్మరుద్రయ్య చేత బహుళ అష్టమి, మంగళవారంనాడు చంపబడినట్లు యరగడ్డపాటి పోట్లాట తాళపత్ర గ్రంథంలో గంగుల పిన యల్లయ్య వివరించినాడు.

యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 10

61. ఇదే తా.ప.గ్రం. తా.ప.నెం. : 11

62. ఇదే తా.ప.నెం. : 11

63. ఇదే

64. ఇదే

65. ఇదే తా.ప.నెం. : 12 & 13

66. ఇదే

67. ఇదే
68. ఇదే
69. ఇదే — తా.ప.నెం. : 12-14
70. ఇదే — తా.ప.నెం. : 13-14
71. ఇదే
72. సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; యరగర్లపాటి పొట్లాట ; తా.ప.గ్రం. పినయల్లయ్య పుట : 342
73. ఇదే — పుట : 342-343
74. ఇదే
75. ఇదే — తా.ప.నెం. : 345
76. పిన యల్లయ్య — యరగర్లపాటి పొట్లాట ; తా.ప.గ్రం. — తా.ప.నెం. : 18
77. ఇదే — తా.ప.నెం. : 24
78. ఇదే — తా.ప.నెం. : 24-25
79. ఇదే
80. ఇదే — తా.ప.నెం. : 27
81. పిన యల్లయ్య — యరగర్లపాటి పొట్లాట ; తా.ప.గ్రం. — తా.ప.నెం. : 27
82. ఇదే — తా.ప.నెం. : 28
83. ఇదే — తా.ప.నెం. : 31
84. ఇదే — తా.ప.నెం. : 28
85. ప్రభాకరశాస్త్రి , సం॥ ; కాటమరాజు కథ ; కాగితపు ప్రతి- పినయల్లయ్య — పుట : 111 - 112
86. పిన యల్లయ్య — యరగర్లపాటి పొట్లాట ; తా.ప.గ్రం. — తా.ప.నెం. : 34
87. ఇదే — తా.ప.నెం. : 35
88. ఇదే — తా.ప.నెం. : 37
89. ఇదే — తా.ప.నెం. : 36-37
90. ఇదే — తా.ప.నెం. : 38
91. ఇదే — తా.ప.నెం. : 41
92. ప్రభాకరశాస్త్రి , సం॥ ; కాటమరాజు కథ ; కాగితపు ప్రతి- గంగుల పినయల్లయ్య — పుట : 153
93. బత్తుల లక్ష్మయ్య — పుట : 110
94. కాటమరాజు కథ ; తిమ్మావఝ్ఝల కోదండ రామయ్య, భారతి-1953, మే — పుట : 430-431
95. ఆంధ్ర పత్రిక - తెలుగు పత్రిక, 1953-54 — పుట : 35-36
96. ప్రభాకరశాస్త్రి , సం॥ ; కాటమరాజు కథ ; పీఠిక - — పుట : XII
97. గట్టయ్య — జన్నివాడ కథ ; తా.ప.గ్రం. — తా.ప.నెం. : 3-15
పిన యల్లయ్య , యరగర్లపాటి పొట్లాట ; తా.ప.గ్రం. — తా.ప.నెం. : 40
98. యశోదాదేవి, — జె.ఎ.హెచ్.ఆర్.ఎస్. — పుట : 13
99. ఇదే
100. ఇదే
101. ఛార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్, కాగితపు ప్రతి డి. 1031, 1034, 1040 -
భారతి తెలుగు పత్రికలో ప్రచురణ - 1950, మే — పుట : 435
102. టేలర్. మాక్ - కాట్. — పుట : 729
జె.ఎ.హెచ్.ఆర్.ఎస్., 1954-56 వాల్యూమ్ - XXIII — పుట : 14

103. రాబర్ట్ సీవెల్ - లిస్ట్ ఆఫ్ ది అంటిక్వేరియన్ రిమేయిన్స్ ఇన్ ది ప్రెసిడెన్సి ఆఫ్ మద్రాస్, వెల్లూరు డిస్ట్రిక్ట్ 1882 - 83 పుట : 135
104. విజ్ఞాన సర్వస్వం - వాల్యూమ్ - 1961 పుట : 1332
105. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశం, వాల్యూమ్ -III, 1962 పుట : 176-178
106. పుల్లరి యుద్ధ కాలం, దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి, భారతి జూలై, 1966 పుట : 76
107. పిచ్చయ్య, సం॥ బల్లికురువ యుద్ధం ; పీఠిక పుట : 1
108. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్ర ; 1912, పుట : 86
109. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర సంస్కృతి ; 1980 పుట : 252-253
110. డా॥ అరుణకుమారి, ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు, 1978 పుట : 147
111. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర - కాకతీయ యుగం- వాల్యూమ్ - II 1965 పుట : 104
112. పరబ్రహ్మశాస్త్రి పుట : 114-115
113. ఎ.పి.డి.జి. వెల్లూరు, 1977, పుట : 23-24
114. వెంకట సుబ్బారావు, సం॥ వీరగాథలు -I. పీఠిక పుట : XCVI
115. ఇదే - XCVII
116. హనుమంతరావు పుట : 230
117. వెంకట సుబ్బారావు , సం॥ వీరగాథలు - I పీఠిక , పుట : CCXV
118. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట; తా.ప.గ్రం. తా.ప.నెం. : 40
119. కాటమరాజు కథ ; నిడదవోలు వెంకట్రావు, భారతి, జనవరి 1978, పుట : 26-27
120. హనుమంతరావు పుట : 233
121. ఇదే
122. కంభంపాటి సత్యనారాయణ, ఆంధ్రుల సంస్కృతి చరిత్ర భాగము -II , 1982 పుట : 5-6
123. మల్యాల దేవి ప్రసాద్ యాదవ్ , యాదవ చంద్రిక ; 1982, పుట : 49-53
124. ఎన్.డి.ఐ. భాగము - II పుట : 527-535
125. ఎన్.డి.ఐ. పార్ట్ - II , మే, 20, 1987న గుండ్లపాలెం వెళ్లి శాసనం పరిశీలించడం జరిగింది. నాలుగువైపుల రాతిపై శాసనాన్ని చెక్కినారు. ఇది క్రింద పడిపోయి ఉన్నది. ఇది స్థంభ శాసనం పుట : 535
126. ఇదే పుట : 534
127. కాటమరాజు పుల్లరి యుద్ధ కాలం - దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి, భారతి, మే, 1965 అండ్ జూలై 1966, పుట : 76-77
128. గుండ్లపాలెం శాసనం ; ఆరుద్ర - భారతి , డిశంబర్, 1960
129. పిన యల్లయ్య ; యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 10
130. ఇదే తా.ప.నెం. : 40
131. ఇదే తా.ప.నెం. 6-40
132. ఇదే తా.ప.నెం. - 40
133. ఇదే

---

# 7
# కాటమరాజు చారిత్రకత

వేటూరి ప్రభాకరశాస్త్రి కాటమరాజు కథను పరిష్కరించారు. దీనిని 1953 లో ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్ లైబ్రరీ మద్రాసు వారు ప్రచురించారు. ఈ గ్రంథానికి మల్లంపల్లి సోమశేఖరశర్మ పీఠిక వ్రాస్తూ ఇలా అన్నారు.

"ఈ కథ చాల ఆసక్తిదాయకంగా ఉన్నప్పటికి, ఇందులో చారిత్రకత లోపించింది. నల్లసిద్ధి, ఖడ్గతిక్కన పేర్లు తప్ప చరిత్రకాంశాలు ఏమీ లేవు. దీని చారిత్రకతను నిరూపించడానికి ఎలాంటి ఆధారాలు లేవు. కాటమరాజు., నల్లసిద్ధి రాజుల తరపున యుద్ధంలో పాల్గొనిన వ్యక్తులు చారిత్రకంగా ఉన్నారని నిరూపించడానికి ఎలాంటి ఆధారాలు లేవు."[1]

కేతన దశకుమార చరిత్రలో ఖడ్గ తిక్కనను మహా వీరునిగా పేర్కొన్నాడు. ఖడ్గతిక్కనకు గంధవారణ బిరుదు ఉన్నట్లు తెలిపాడు. సిద్ధన, ప్రోలమ, ఖడ్గతిక్కన తల్లితండ్రులు. అతని భార్య పేరు, జానమ్మ (చానమ్మ). వీరికి నలుగురు పుత్రులు కలిగారు. వారు సిద్ధన, కొమ్మన, ఇమ్మడి, ముమ్మడి. మహాభారతమును తెలుగులోకి అనువదించిన, కవి తిక్కన తండ్రి కొమ్మన ఖడ్గతిక్కన తండ్రి సిద్ధన సోదరులు. నెల్లూరు మనుమసిద్ధి రాజు ఆస్థానములో కవి తిక్కన, ఖడ్గ తిక్కన మంత్రి పదవులు నిర్వహించారు. కేతన దశకుమార చరిత్రను రచించి తన గురువైన కవి తిక్కనకు అంకితం ఇచ్చాడు. అందువలన ఖడ్గతిక్కన చారిత్రకతను గూర్చి అనుమాన పడవలసినది లేదు.[2]

యరగడ్డపాటి పోట్లాట, తాళపత్ర గ్రంథంలో ఖడ్గతిక్కన, కాటమరాజుపై యుద్ధానికి వెళ్లి బ్రహ్మరుద్రయ్య చేతిలో మరణించినట్లు వివరించబడింది. యరగడ్డపాడు యుద్ధం అధ్యాయంలో ఈ విషయం విపులంగా చర్చించడం జరిగింది. ఖడ్గ తిక్కన, కాటమరాజుపై యుద్ధానికి వెళ్లి యుద్ధ భూమిలో మరణించాడనే విషయాన్ని తాళపత్ర గ్రంథాలే కాక కైఫీయతులు, చాటుపద్యాలు కూడా తెలుపుతున్నాయి.[4] ఖడ్గతిక్కన కాటమరాజు సైన్యంతో కాక మరెవరితో యుద్ధం చేసి చనిపోయాడు ? ఈ ప్రశ్నకు వేరే సమాధానం లేదు. ఖడ్గతిక్కన చారిత్రక పుషుడైనపుడు - కాటమరాజు చారిత్రక పురుషుడు కాడా? మనుమసిద్ధి మరణము తరువాత నల్లసిద్ధి నెల్లూరు సింహాసనం అధిష్టించాడు. తిక్కన, ఖడ్గతిక్కనలు నల్లసిద్ధి ఆస్థానములో మంత్రి, సేనాధిపతి పదవులు నిర్వహించారు.

బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి దశకుమార చరిత్ర పీఠికలో కవి తిక్కన క్రీ.శ. 1210 - 1288[5] మధ్య కాలంలో జీవించినట్లు తెలిపారు. కేతన, దశకుమార చరిత్రను కవి తిక్కనకు అంకితం ఇచ్చాడు. కావున కేతన, కవి తిక్కన, ఖడ్గ తిక్కన, కాటమరాజు అందరు సమకాలికులు. కేతన కాటమరాజు చరిత్రను పద్యంలో రచించాడని, శ్రీనాథుడు ద్విపద సాహిత్యంలో కాటమరాజు చరిత్రను వ్రాశాడని మాల్యాలదేవి ప్రసాద్, 'యాదవచంద్రిక'[6] లో తెలిపారు. కేతన కాటమరాజు చరిత్రను పద్యంలో రచించటము వలన శ్రీనాథుడు, పల్నాటి వీరచరిత్ర లాగ కాటమరాజు చరిత్రను ద్విపదలో వ్రాసి ఉంటాడు.[7]

ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఖడ్గతిక్కన యరగడ్డపాడు యుద్ధంలో పాల్గొన్న విషయమై అనుమానము వ్యక్తం చేశారు. ఆరుద్ర ఇలా వ్రాశారు. "యరగడ్డపాడు యుద్ధకాలానికి ఖడ్గ తిక్కన వయసు డెబ్బది సంవత్సరాలు. ఈ వయస్సులో యుద్ధం చేయడానికి వీలుపడుతుందా?"[8]

13వ శతాబ్దం ప్రజలు ఈ నాటి వారి కంటె బలిష్టంగా ఉండి ఎక్కుకాలం జీవించేవారు. కాకతి గణపతిదేవుడు, ఖడ్గతిక్కన సమకాలికులు. గణపతిదేవుడు అరువదిమూడు సంవత్సరాలు పరిపాలన చేశాడు. ఇదదు యువరాజుగా ఉన్నపుడు తన తండ్రి మహాదేవునితోపాటు దేవగిరి యాదవులపై దాడి

చేశాడు. అప్పుడు గణపతిదేవుని వయస్సు ఇరువది నాలుగు సంవత్సరాలైనా ఉండి ఉంటుంది. గణపతిదేవుడు క్రీ.శ. 1199లో కాకతీయ సింహాసనం అధిష్టించి క్రీ.శ. 1261 వరకు పరిపాలించాడు. గణపతిదేవుడు ఎనభై సంవత్సరాలు పైగా జీవించి ఎన్నో యుద్ధాలలో పాల్గొన్నాడు.[9] అందువలన ఖడ్గ తిక్కన డెబ్బయి సంవత్సరాల వయస్సులో యరగడ్డపాడు యుద్ధంలో పాల్గొనటం సమంజసంగానే భావింపవచ్చు.

నిడదవోలు వెంకట్రావు 1978 జనవరి భారతిలో కాటమరాజు కథలపై విమర్శనాత్మకమైన వ్యాసం వ్రాశారు. వారు ఇలా అభిప్రాయ పడినారు.

"బాచన (పిన భాస్కర మంత్రి) ఖడ్గ తిక్కన చిన్న తమ్ముడు. క్రీ.శ. 1240లో బాచన, దేవగిరి యాదవరాజు సింఘనపై యుద్ధం చేశాడు. అప్పుడు బాచన వయస్సు 35-40 సంవత్సరాలు ఉండవచ్చు. సిద్ధన మంత్రికి ఖడ్గతిక్కన పెద్దకుమారుడు. దశకుమార చరిత్ర రచనా కాలము నాటికి ఖడ్గ తిక్కనకు నలుగురు కుమారులు. దశకుమార చరిత్రలో కేతన, ఖడ్గతిక్కన కుమారుల పేర్లు తెలిపారు. వారు - సిద్ధన, కొమ్మన, ఇమ్మడి, ముమ్మడి. కావున దశకుమార చరిత్ర రచనా కాలము నాటికి ఖడ్గ తిక్కన వయస్సు యాభై సంవత్సరాలు (1249-50) యరగడ్డపాడు యుద్ధం క్రీ.శ. 1282లో జరిగిన యడల ఖడ్గతిక్కన వయసు 82సం॥లు అవుతుంది. ఈ వయస్సులో యుద్ధం చేయడం సాధ్యపడదు. ఖడ్గతిక్కనను తల్లిదండ్రులు, భార్య, నెల్లూరు ప్రజలు అవమానించారని అనుకోవటం నమ్మశక్యం కాని విషయం".[10]

నిడదవోలు వెంకట్రావు, దశకుమార చరిత్ర రచనా కాలం నాటికి ఖడ్గతిక్కన వయస్సు యాభై సంవత్సరాలని ఊహించారు. కాని సరియైన ఆధారం చూపించలేదు. ఆ రోజుల్లో స్త్రీలు, పురుషులు ఎనభై సంవత్సరాల వయస్సులో కూడా బలంగానే ఉండేవారు.

ఆంధ్ర ప్రదేశ్, నల్గొండ జిల్లా, చంద్రుపట్ల గ్రామం శాసనం ఆధారంగా కాకతి రుద్రమదేవి, ఆమె సేనాధిపతి మల్లిఖార్జున నాయకుడు, ఇద్దరు క్రీ.శ. 1289లో మరణించారు.[11] త్రిపురాంతకము శాసనం ఆధారంగా అంబదేవుడు కాకతి రుద్రమదేవిపై దాడి చేసి ఆమెను క్రీ.శ. 1289లో యుద్ధరంగమందు సంహరించినట్లు తెలుస్తున్నది.[12] అప్పుడు రుద్రమదేవి వయస్సు ఎనభై సంవత్సరాలు.[13]

కాటమరాజు చరిత్ర, రచయిత నెల్లూరు తెలుగు చోడవంశానికి చెందిన నల్లసిద్ధిని పల్లవ నల్లసిద్ధి అని ఎందుకు సంబోధించాడనే దానికి డా॥ రామరాజు "తెలుగు జానపద గేయ సాహిత్యం" గ్రంథంలో ఇలా సమాధానం చెప్పాడు.

"కాటమరాజు కథ - గేయంలో ఖడ్గతిక్కన నల్లసిద్ధి రాజును పల్లవ నల్లసిద్ధి పట్టాభిరామ" అని పలుమార్లు సంబోధించాడు. నల్లసిద్ధి చోళరాజు, పల్లవుల తర్వాత చోళులు అధికారంలోనికి వచ్చారు. మొదట చోళులు పల్లవులకు సామంతులు. అందువలన చోళులు పల్లవుల బిరుదులను తీసుకొని ఉంటారు. చోళులే కాక, ఆంధ్రదేశంలో చాలా సామంతరాజవంశాలు పల్లవుల చేత స్థాపించబడినాయి. పల్లవుల గౌరవార్థం చోళులు వారి బిరుదులను స్వీకరించారు. పడమటి చాళుక్యుల బిరుదులను కాకతీయులు తీసుకున్నారు.[14]

గుండ్లపాలెం శాసనం ప్రకారం, కాటమరాజు, కాకతి ప్రతాపరుద్రుని కాలంలో ముప్పదిరెండు సంవత్సరాలు పరిపాలన చేశాడు.[15] ఇతడు పంచలింగాల కొండ సమీపమున ఉన్న యరగడ్డపాడులో నల్లసిద్ధిపై యుద్ధం చేశాడు. మారేమండ రామారావు సంపాదకత్వంలో ప్రచురించిన కాకతీయ సంచికలో ప్రతాపరుద్రుడు శాలి శకం 1176 ఆనందనామ సంవత్సర, చైత్ర శుద్ధ పంచమి, గురువారంనాడు (A.D.25-3-1254) జన్మించినట్లు తెలిపారు.[16] క్రీ.శ. 1270లో[17] రుద్రమదేవి, ప్రతాపరుద్రుని యువరాజుగా

ప్రకటించింది. అతడు యువరాజుగా ఉన్నపుడే మంచి పరిపాలనా దక్షుడని నిరూపించుకున్నాడు.

క్రీ.శ. 1282లో కాటమరాజు, నల్లసిద్ధి రాజుల మధ్య యుద్ధం సంభవించినప్పుడు ప్రతాపరుద్రుని వయస్సు 28 సంవత్సరాలు. అందువలన కాటమరాజు ప్రతాపరుద్రునికి సమకాలికుడని చెప్పవచ్చు. కరియావులరాజు చరిత్ర[18] - తాళపత్ర గ్రంథంలో ఓరుగల్లు ప్రతాపరుద్రుడు, కాటమరాజుకు సమకాలికుడని తెలుపబడింది. అయితమరాజు,[19] కరియావుల రాజు, పల్లికొండ తదితర యాదవులు శంభుని జాతర చూడటానికి ఓరుగల్లు వెళ్లారు. ప్రతాపరుద్రుడు వీరిని చంపడానికి కుట్ర పన్నాడు.[20] పల్లికొండ ఉపాయంతో అయితమరాజాదులను ప్రమాదం నుండి తప్పించాడు. ఈ తాళపత్ర గ్రంథంలో ప్రతాపరుద్రుని పేరు వీర ప్రతాపునిగా వ్రాయబడింది. ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రలో కూడా ప్రతాపరుద్రుని పేరు వీర ప్రతాపరుద్రునిగా చెప్పబడింది.[21]

ప్రకాశం జిల్లా, గంగదొనకొండ గ్రామం, గంగదేవాలయం ప్రాంగణంలోని ఒక శాసనాన్ని[22] తిరుమందుల కుటుంబానికి చెందిన తినుటిజిక కుమారులు వేయించారు. వీరు క్రీ.శ.1406లో గంగదొనకొండ నందు మాంకాళమ్మ దేవాలయం, కట్టించి అందు యుద్ధ వీరుల శిలా విగ్రహాలు ఉంచినట్లు ఈ శాసనం ద్వారా తెలుస్తుంది. తిరుమందుల కుటుంబం వారు కాటమరాజుకు దగ్గరి బంధువులు. ఆవుల వలురాజు చరిత్ర తాళపత్ర గ్రంథంలో తిరుమందుల - తరిముత్తమ్మరాజు,[23] కాటమరాజు తాత వలురాజుకు మంత్రిగా ఉన్నట్లు వివరింపబడింది.

గంగదొనకొండలోని మరొక శాసనం ఎద్దు ముమ్మయ్య బగదింగరు శాలిశకం 1447 (క్రీ.శ. 1525)లో వేయించాడు. ఇతడు విజయనగర సామ్రాజ్య పాలకుడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ద్వారపాలకుడుగా ఉన్నాడు. నందగోపకులు బడుగుల వారి కుటుంబానికి ప్రధాన కేంద్రమయిన దొనకొండ గ్రామాన్ని గంగ పరమేశ్వరి నిత్య నైవేద్యం కొరకు సమర్పించినట్లుగా ఈ శాసనం తెలుపుచున్నది.[24] కాటమరాజు బడుగుల కుటుంబానికి చెందినవాడని ఇంతకుముందే తెలియచేయడం జరిగింది. దొనకొండను కాటమరాజు ప్రతినిధిగా అయితమరాజు పాలించాడు.

యరగడ్డపాటి పోట్లాట, తాళపత్ర గ్రంథం ప్రకారం - యరగడ్డపాడు యుద్ధంలో కాటమరాజు, ఆవులు, ఎద్దులు, నెల్లూరు సైన్యంలోని గుఱ్ఱాలు, ఏనుగులతో యుద్ధం చేశాయి.[25] ఈ విషయాన్ని ధృవీకరించడానికి, గంగదొనకొండ, గంగదేవాలయం రాతి గోడలకు చెక్కిన శిల్పాలు ఆధారంగా కన్పిస్తున్నాయి. గంగ దేవాలయం ఉత్తర దిక్కున ఉన్న గోడకు ఒక ఆవు గుఱ్ఱంతో పోరాడుతున్నట్లు ఉంది. పడమట దిక్కున ఉన్న గోడపై ఒక ఎద్దు ఏనుగుపై యుద్ధం చేస్తున్నట్లుగా చెక్కబడింది. దక్షిణ దిక్కున ఉన్న గోడకు ఒక వీరుడు ఏనుగుతో తలపడుతున్నట్లు శిల్పం మలచబడిఉంది.[26]

గంగదొనకొండ, గంగదేవాలయం మండపంలోని ఏనుగు, సింహం - ఎద్దు, విలుకాడు విగ్రహాలు చెక్కబడిన రాతి శిల్పం[27] బడుగుల వారి రాజచిహ్నాంగా గుర్తించబడింది. అది ఈ విధంగా ఉంది- ఒక ఏనుగుపై సింహం ఎక్కింది, సింహం పైభాగమున శివ లింగం - దానికి ఇరువైపులా రెండు ఎద్దులు నిలబడి ఉన్నవి. ఏనుగు - సింహం ముందు ఒక విలుకాడు ఎక్కుపెట్టిన బాణంతో గురి చూస్తూ నిలుచున్నాడు. దీనిని ఈ విధంగా ప్రతిపాదించవచ్చును.

ఈ రాతి శిల్పం - కాటమరాజు వంశం యొక్క రాజ చిహ్నాం అనుటలో సందేహంలేదు. కాటమరాజు, తాత, తండ్రులు, ధర్మ కోపం, బడుగు వర్గాలను ఉద్ధరించడం కొరకు తమ ప్రాణాలను త్యాగం చేశారు.

1. శివ లింగం - కాటమరాజు తాత తండ్రులు శైవ మతాన్ని అవలంబించారనే విషయం తెలుపుతుంది.
2. ఏనుగు - నెల్లూరు చోడవంశం గజబలాన్ని కల్గిఉన్నారనే సంగతి గుర్తు చేస్తుంది.
3. ఎద్దులు - విలుకాడు - కాటమరాజు సైన్యాన్ని తెలుపుతుంది. యాదవుల సైన్యంలో ఆవులు - ఎద్దులు, కాల్బలం ఎక్కువగా ఉన్నాయి.
4. ఏనుగుపై సింహం - యాదవులు తమ శుత్రువులకు సింహ స్వప్నమని తెలుపుతుంది. కాటమరాజు తన జీవితకాలమంతా తాత తండ్రుల పగలు తీర్చడానికి కంకణం కట్టుకున్నాడు.

యరగడ్డపాడు యుద్ధంలో చనిపోయిన యుద్ధ వీరుల శిలా విగ్రహాలు దొనకొండలోని గంగ దేవాలయ ప్రాంగణంలో ఉన్నాయి. గంగదేవాలయం లోపలి భాగంలో కాటమరాజు చెల్లెలు పాపనూక పోలురాజు భార్య సిరిదేవి శిలా విగ్రహాలు ఉన్నవి. గంగ దేవాలయంలోని గంగ విగ్రహం నల్లని రాతితో చెక్కబడింది. సుమారు నాలుగు అడుగుల ఎత్తు ఉంటుంది. కాటమరాజు వంశీయులు గంగా భవానిని పూజించారు. గంగ దేవాలయానికి ఒక కిలోమీటరు దూరంలో అయితమరాజు కోట శిథిలాలు ఒక కొండపై కన్పిస్తున్నాయి. అయితమరాజు దొనకొండను, కాటమరాజు ప్రతినిధిగా పరిపాలించాడు. ఈ కోట శిథిలాల సమీపంలోనే శిథిలమైన పాపనూక భవనం,[28] శివుని దేవాలయం, సహగమన గుండం, ఓరుగంటి బేతాళుని శిలా విగ్రహం మొదలైనవి కన్పిస్తున్నాయి. తాళపత్ర గ్రంథాలలో తెలుపబడిన విషయాలకు, ఈ శిథిల భవనాలు, శిలాశాసనాలు, శిలా విగ్రహాలు ప్రత్యక్ష సాక్షంగా కనబడుతూ కాటమరాజు చారిత్రక పురుషుడని చెప్పడానికి ఉపయోగపడుతున్నాయి.[29]

కాటమరాజు దేవాలయం[30] ప్రకాశం జిల్లా, గుండంచర్ల సమీపంలో ఏడు నూతుల పాడు వద్ద ఉన్నది. దీనిని ప్రజలంతా రాజు గుడి అని పిలుస్తున్నారు. ఇక్కడ కాటమరాజు ఒక గుఱ్ఱమును ఎక్కి కుడిచేత ఖడ్గం ధరించినట్లు చెక్కిన శిలా విగ్రహం ఉంది. ఈకాటమరాజు విగ్రహానికి ఎదురుగా నాలుగు చేతులు కలిగిన గంగా భవాని రాతి శిల్పం ఉంది. ఈ దేవాలయం ప్రక్కన ఒక పెద్ద బావి, పెద్ద పెద్ద రాతి నీటి తొట్టెలు కన్పిస్తున్నాయి.

అర్ధవీడు సమీపంలో ఒక శివాలయం ఉంది. ఈ దేవాలయం ఉత్తర గోడకు ఒక ఎద్దు, ఏనుగు పై పోరాడుతున్నట్లు రాతితో చెక్కిన శిల్పం కనబడుతుంది. ఈ దేవాలయం వెనుక భాగమున ఉన్న ఒక గోడకు ఒక స్త్రీ గొఱ్ఱెపోతుపై ఎక్కినట్లు శిల్పం చెక్కబడింది.[31] ఈ శిల్పం, పెద్దిరాజు కథ - తాళపత్ర గ్రంథంలో వ్రాయబడిన విషయాలను ధృవీకరిస్తుంది.[32] కాటమరాజు తల్లి పెద్దమ్మకు కలలో గంగా భవాని గొఱ్ఱెపోతుపై ఎక్కి వచ్చినట్లు కనబడుతుంది. ఈ శివాలయం వెలుపల పోలురాజు విగ్రహం చెక్కబడి ఉంది. బల్లికురవ యుద్ధం - తాళపత్ర గ్రంథంలో, చెరుకూరు యుద్ధానికి ముందు పోలురాజు - సిరిదేవి అర్ధవీడులో ఉన్నట్లు ఉన్నది.[33] ఈ అర్ధవీడు ప్రస్తుతము ప్రకాశం జిల్లాలో ఉన్నది.

పంచలింగాల కొండ, ప్రకాశం జిల్లాలోని పాలేరు నది ఒడ్డున ఉన్నది. పంచలింగాల కొండ సమీపంలో కాటమరాజు కోట శిథిలాలు ఉన్నవి. యరగడ్డపాడు యుద్ధభూమి పంచలింగాలకొండ సమీపంలోనే ఉన్నది. పాలేరు నది ఒడ్డున గంగ దేవాలయం ఉంది. పాలేరు నది మధ్యలో ఉన్న పెద్ద రాతి గుండ్లపై బీర్నీడు, గంగ విగ్రహాలు చెక్కబడినవి. దీనిని గుంటి గంగ అంటారు. ఈ రెండు విగ్రహాలు ఒక దానికి ఒకటి ఎదురుగా ఉన్న రాతి గుండ్లపై చెక్కబడ్డాయి. నదిలోని కైలాస బండపై ఒక శాసనం ఉన్నది. కాని అది చదవటానికి వీలుగా లేదు. భక్తులు ఆప్రాంతంలో కొబ్బరికాయలు కొట్టడం వలన శాసనంలోని అక్షరాలు కొంత వరకు అరిగి పోయాయి. యరగడ్డపాడు యుద్ధంలో కాటమరాజు తరపున పోరాడి చనిపోయిన యాదవవీరులకు ప్రతి సంవత్సరం గంగ జాతర సమయంలో పిండాలను తర్పణంగా వదలుతున్నారు. తాళపత్ర గ్రంథాలలో తెలిపిన విషయాలు ఈ ప్రాంతంలో కనబడుతున్న శిల్పాలు ఒకదాని కొకటి సరిపోతున్నాయి.[34]

యాదవులు నిర్మించిన భవనాలు, దేవాలయాలు ఇప్పటికి యలమంచి, పంచలింగాల కొండ, గంగదొనకొండ, గుండంచర్ల, అర్ధవీడు, పాపఘటం,[35] ఆంధ్రదేశంలో నిలిచి ఉన్నాయి. ఇవన్నీ కాటమరాజు చరిత్రను రచించడానికి తోడ్పడుతున్నాయి.

పోలురాజు కథ - తాళపత్రగ్రంథంలో యాదవులు నందికాసులు[36] అను పేరుగల నాణాలను ఉపయోగించినట్లు పేర్కొనబడింది. యలమంచి గుట్టపైన కోటమీద రెండు రకాలైన నాణాలు కనిపించాయి. అందులో ఒక నాణెంమీద నంది చిహ్నం, శ్రీచంద్ర అనే అక్షరాలు ఉన్నాయి. కాటమరాజుకు శ్రీచంద్ర అనే బిరుదు ఉన్నది.[37]

యరగడ్డపాడు యుద్ధం అయిన తర్వాత యాదవులు కాటమరాజు చరిత్రను ప్రజలలో ప్రచారం చేయడానికి కొమ్ముల వారికి అనుమతి ఇచ్చారు. కొమ్ముల వారు యాదవుల చరిత్రను గానం చేస్తూ - వారి చరిత్రను రక్షించారు. ప్రతి నిత్యం గొప్పగా జరిగే సంఘటనలను ప్రజలు పాటల రూపంలో పాడుకుంటూ ఉండేవారు. కాటమరాజు చరిత్రను పాడటం కొమ్ముల వారికి ఆచారమయింది. అందువలన యాదవులు కొమ్ములవారిని గౌరవించుతారు. యాదవుల ఇంటికి కొమ్ముల వారు వస్తే ముందు వీరికి భోజనం పెట్టి ఆ తరువాత యాదవులు తినాలి. ఇది ఒక ఆచారంగా మారింది. ఇప్పటికి ఈ పద్ధతి ఆచరణలో ఉన్నది.

కనిగిరి కోటను, కాటమరాజు నిర్మించాడని ఇప్పటికి ఆ ప్రాంతం ప్రజలు చెప్పుకుంటున్నారు. కాటమరాజు చరిత్రను శ్రీనాథుడు, పల్నాటి చరిత్రలాగా ద్విపదలో రచించాడు. కేతన కాటమరాజు చరిత్రను పద్య రూపంలో రచించాడు. ఈ విషయం ఇంతకుముందే చెప్పడం జరిగింది. వేటూరి ప్రభాకరశాస్త్రి - తన వ్యాసం "తాళపత్ర గ్రంథములు" - లో కాటమరాజు చరిత్ర రేడియో ద్వారా ప్రచారం చేసినట్లు తెలిపారు.[38]

కాటమరాజు చరిత్రను ద్విపద సాహిత్యంలో ఈ క్రింద ఉదహరించిన కవులు తాళపత్ర గ్రంథాలలో రచించారు. పడరుప మద్దులేటి కవి - వలురాజు చరిత్ర, మల్లయ్య కవి - పంపాద్రి కథ, కనకబండి గట్టయ్య కవి - పోలురాజు కథ, జన్నివాడ కథ, గంగుల పిన యల్లయ్య కవి - యరగడ్డపాటి పోట్లాట, కరియావుల రాజు కథ, కట్టిబోయిన మారయ్య కవి - కాటమరాజుకు పట్టం కట్టిన కథ, కంగళాపురి వెంకటాద్రి కవి - పాపనూక కథ, జరుగుపల్లి చెన్నయ్య కవి - అగుమంచి కథ, రాంపాక వెంకూరాం కవి - పాపనూక కథ.

కాటమరాజు ధాతనామ సంవత్సర, పాల్గుణ శుద్ధ పంచమి ఆదివారం నాడు జన్మించాడు. (క్రీ.శ. 12-2-1217) ఇప్పటికి పాల్గుణ శుద్ధ పంచమి యాదవులకు పర్వదినం. కాటమరాజు, ఆవుల మందల జ్ఞాపకార్థం, యాదవులు గంగ జాతర, ఆవుల పరుపు మొదలగు పండుగలను జరుపుకుంటున్నారు. శ్రీశైలం అడవుల్లో నివశించే చెంచులు కాటమరాజును దేవుడుగా పూజిస్తారు.

తాళపత్ర గ్రంథాలు - వలురాజు చరిత్ర, పెద్దిరాజు కథ, పోలురాజు కథ, కరియావులరాజు చరిత్ర, కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు, జన్నివాడ కథ, పాపనూక కథ, యరగడ్డపాటి పోట్లాట, గుండ్లపాలెం, గంగదొనకొండ లోని శాసనాలు, దేవాలయాలు, యలమంచి, అర్ధవీడు, గుండంచర్ల, గంగదొనకొండ, పంచలింగాల కొండలోని - శిల్పాలు, నాణాలు, కైఫీయతులు - పట్టపురావి కైఫీయతు, రణతిక్కన కైఫీయతు, సిద్ధవటం కైఫీయతు, జానపద గేయాలు, చాటుపద్యాలు - ఇవన్నీ కాటమరాజు చరిత్రను వ్రాయడానికి ఆధారాలుగా ఉపయోగపడుతున్నాయి. తాళపత్రగ్రంథాలలో చెప్పిన విషయాలు - శాసనాలు, భవనాలు, దేవాలయాలు, శిల్పాలు, కైఫీయతులు, జానపదగేయాలు, చాటుపద్యాలు ఒకదానికొకటి సరిపోతున్నాయి. పైన ఉదహరించిన సాక్ష్యాధారాలు కాటమరాజు చారిత్రకతను నిరూపిస్తున్నాయి. ఆంధ్రదేశంలో కాటమరాజు చరిత్రకు సంబంధించిన ప్రాంతాలలో తిరిగి తాళపత్రగ్రంథాలు సేకరించి, శిలా శాసనాలు, శిథిల భవనాలు, శిల్పాలను ఫొటోలు తీసి, కొమ్ముల వారితో చర్చించి సరియైన ఆధారాలను సేకరించి కాటమరాజు - చారిత్రకత పరిశోధనాపత్రం వ్రాయడం జరిగింది.

# నోట్స్ అండ్ రిఫరెన్స్

1. ప్రభాకరశాస్త్రి, సం॥ ; కాటమరాజు కథ ; పుట : XI
2. చంద్రమౌళిశాస్త్రి, సం॥ దశకుమార చరిత్ర ; కేతన - 1967 పుట : 12-15
3. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 10
4. జి. లలిత తెలుగుచాటు కవిత్వం ; 1981, పుట : 72
5. కేతన దశకుమార చరిత్ర పుట : 7
6. మల్యాలదేవి ప్రసాద్ యాదవ్ - పుట : 52
7. ఇదే
8. ఆరుద్ర పుట : 110
9. యాజధాని ; భాగము - VII - XII పుట : 599
10. భారతి , తెలుగు మాస పత్రిక ; జనవరి 1978, పుట : 24, 25, 28
11. పరబ్రహ్మశాస్త్రి పుట : 125
12. హనుమంతరావు పుట : 262
13. పరబ్రహ్మశాస్త్రి పుట : 125
14. బి. రామరాజు, తెలుగు జానపద గేయ సహిత్యం ; 1978, పుట : 207
15. ఎన్.డి.ఐ. , పార్ట్ - II పుట : 532
16. మారేమండ రామారావు, సం॥ కాకతీయ సంచిక ; 1935, పుట : 64
17. ఇదే
18. పిచ్చయ్య, సం॥ కరియావుల రాజు చరిత్ర ; తా.ప.గ్రం., పుట : 16
19. ఇదే
20. ఇదే పుట : 60
21. రామచందర్‌రావు ; సం॥ ప్రతాపరుద్ర చరిత్ర ; ఏకామ్రనాథ పుట : 120
22. ఎన్.డి.ఐ. ; పార్ట్ - I పుట : 310-312
23. మద్దులేటి కవి, వలురాజు చరిత్ర ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 1
24. ఎన్.డి.ఐ. ; పార్ట్ - I పుట : 315-318
25. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 34-35
26. గంగ దేవాలయం ; గంగదొనకొండ ; ప్రకాశం జిల్లా , అం.ప్ర.
27. ఇదే
28. పాపనూక భవనం శిథిలాలు - గంగదొనకొండ గ్రామం వెలుపల రాళ్లతో కూడిన మట్టి దిబ్బలా కనిపిస్తుంది.
29. గంగదేవాలయం, గంగదొనకొండ, ప్రకాశం జిల్లా, అం.ప్ర.
30. రాజు గుడి - గుండంచర్ల గ్రామం - ప్రకాశం జిల్లా, అం.ప్ర.
31. శివుని దేవాలయం , అర్ధవీడు ప్రకాశం జిల్లా, అం. ప్ర.
32. పెద్దిరాజు కథ , తా.ప.గ్రం. తా.ప.నెం. : 4
33. పిచ్చయ్య, సం॥ బల్లికురువ యుద్ధం, తా.ప.గ్రం. , తా.ప.నెం. : 1
34. పంచలింగాల కొండ - కనిగిరి సమీపమునందు ప్రకాశం జిల్లాలో ఉన్నది.
35. పాపఘటం - నర్సంపేట సమీపములో వరంగల్ జిల్లా నందు ఉన్నది.
36. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పోలురాజు కథ ; తా.ప.గ్రం. - గట్టయ్య పుట : 318.
37. డా॥ టి. వెంకటేశ్వరరావు ; పుట : 42
38. వేటూరి ప్రభాకర శాస్త్రి, తాళపత్ర గ్రంథములు, భారతి, సంపుటి-27, సంచిక -9, 1950.

# 8
# పాలనా విధానము - సైనిక పద్ధతి

## రాజరికము :

కాటమరాజు పాలనాకాలంలో రాజరికము వంశపారంపర్యంగా ఉండేది. ఒక్కొక్కసారి సమర్ధతను బట్టి సింహాసనాధికారం లభించేది. అవుల వలురాజు చరిత్ర - తాళపత్ర గ్రంథంలో[1], అవుల వలురాజు రెండవ కుమారుడు పెద్దిరాజు యలమంచి సింహాసనం అధిష్టించినట్లుగా ఉంది. హిందూ ధర్మశాస్త్రం ప్రకారం అవుల వలురాజు పెద్ద కుమారుడు సింహాద్రి రాజు అధికారం స్వీకరించాలి, కాని అలా జరుగలేదు. పెద్దిరాజు సమర్ధుడనే ఉద్దేశ్యంతో ఆయనకు రాజ్యాధికారం ఇవ్వడం జరిగింది.

## పట్టాభిషేక మహోత్సవము :

పట్టాభిషేకము ఒక ముఖ్యమైన ఉత్సవము. పరిపాలించడానికి న్యాయపరమైన అధికారం కలుగచేస్తుంది. పోల్మరాజు కథ - తాళపత్ర గ్రంథం ప్రకారం, పెద్దిరాజు, కళ్యాణం వెళ్లే ముందు పోలురాజుకు అవుల పట్టం కట్టాడు[2]. పోలురాజును, తన బంధువర్గాన్ని, అన్నదమ్ములను, అందరిని సమానంగా చూడమని పెద్దిరాజు సలహా ఇచ్చాడు. యాదవ సైన్యాన్ని, పశు సంపదను చాలా జాగ్రత్తగా చూడమన్నాడు.

కాటమరాజు శక్తి సామర్థ్యాలను గుర్తించి అతడిని యాదవులకు అధిపతిని చేశారు[3]. పట్టాభిషేక మహోత్సవం మహా వైభవంగా జరిపి వజ్ర సింహాసనం మీద అధిష్టింపచేశారు. అప్పటి నుండి కాటమరాజు యలమంచి, దొనకొండ, కనిగిరి, యరగడ్డపాడు యాదవులకు రాజయ్యాడు. ఉర్లుకొండ యలమంచిలో కాటమరాజుకు పట్టాభిషేకం జరిగింది.

## రాజధానులు - కోటలు :

కాటమరాజు వంశీయుల మధ్య యుగంలో ఆంధ్రదేశమందు చిన్నచిన్న ప్రాంతాలను పాలించారు. వారి రాజధానులు - యలమంచి, పంపాద్రి, అర్ధవీడు, ఉర్లుకొండ యలమంచి, దొనకొండ, యరగడ్డపాడు. ప్రస్తుతము యలమంచి విశాక పట్టణం జిల్లాలో, పంపాద్రి తూర్పు గోదావరి జిల్లాలో, అర్ధవీడు, దొనకొండ, యరగడ్డపాడు ప్రకాశం జిల్లాలో, ఉర్లుకొండ యలమంచి నల్లగొండ జిల్లాలో ఉన్నాయి. కాటమరాజు తాత తండ్రులైన అవుల వలురాజు, పెద్దిరాజులు యలమంచిని 12వ శతాబ్దంలో పరిపాలించారు. యలమంచి కోటకు బురుజులు, దాని చుట్టూ కందకం ఉన్నాయి. కోటపై కొమ్మలు, కొత్తళంబులు ఉన్నాయి[4].

అవుల వలురాజు చనిపోయిన తర్వాత పెద్దిరాజు అతని సోదరులు రాజధానిని యలమంచి నుండి పంపాద్రికి మార్చారు[5]. ఇది పంపా నది ఒడ్డున ఉన్నది. ప్రస్తుతము దీనిని అన్నవరం అని పిలుస్తున్నారు. పంపాద్రిలో పెద్దిరాజు అన్నదమ్ములు భాగాలు పంచుకొని విడిపోయినారు. కాటమరాజు పినతండ్రి పోలురాజు అర్ధవీడును రాజధానిగా చేసుకొని పరిపాలన చేశాడు[6]. అయితమరాజు దొనకొండను కేంద్రంగా చేసుకొని అధికారం నడిపించాడు. ఇప్పుడు దీనిని గంగదొనకొండ అని పిలుస్తున్నారు. దొనకొండకు ఒక కిలో మీటరు దూరంలో అయితమరాజు కోట శిథిలాలు ఒక కొండపై కనిపిస్తున్నాయి. కనిగిరి కోటను కాటమరాజు కట్టించాడని ఆ ప్రాంతం ప్రజలు నమ్ముతున్నారు. తర్వాత గజపతులు దీనిని అభివృద్ధి చేశారు[7]. యరగడ్డపాడు కోట శిథిలాలు పంచలింగాల కొండ సమీపంలో ఉన్నాయి. యరగడ్డపాడు యుద్ధం జరిగిందిి ఇక్కడే. ఇది ప్రకాశం జిల్లాలో ఉన్నది. ఇటీవల ఇక్కడ ఒక పొలం దున్నుతుండగా శిలా శాసనం బయటపడింది. దురదృష్ట వశాత్తు అది పగిలి పోయింది. ఆ శాసనం కాటమరాజు చరిత్రకు సంబంధించినదై ఉండవచ్చును.

## రాజచిహ్నాం :

గంగదొనకొండ, గంగ దేవాలయం మండపంలోని ఏనుగు, సింహం, శివలింగం, ఎద్దులు,

విల్లంబులు ధరించిన విలుకాడు కాటమరాజు వంశీయుల రాజ చిహ్నమై ఉంటుంది.[9] దీని వివరణ ఇంతకు ముందు అధ్యాయంలో చర్చించడం జరిగింది.

## మంత్రులు :

రాజుకు అన్ని విషయాలలో మంత్రులు సలహా ఇచ్చేవారు. అంతిమ నిర్ణయం రాజుదే. పల్లికొండ, మూడు తరాల వారికి మంత్రిగా వ్యవహరించాడు - వలురాజు, పోలురాజు, కాటమరాజులకు పల్లికొండ మంత్రి. మంత్రులు ఎల్లప్పుడు రాజునంటిపెట్టుకుని ఉండేవారు. తిరుమందుల తరిముత్తరాజు, చట్టమారయ్య, కల్లందుల పోలినీడు, బ్రహ్మరుద్రయ్య, పద్మ రాఘవుడు, కాటమరాజు వంశీయులకు ప్రముఖమైన మంత్రులు. ఆవుల వులరాజు చరిత్ర - తాళపత్ర గ్రంథం ప్రకారం అయ్యలరాజు, శివరామరాజు, భాస్కరరాజు, దత్తమ రాజు మరియు కన్నమరాజులు ఖండెమొండెముల కోట పాలకుడైన కలభూత గంగురాజుకు మంత్రులుగా ఉన్నారు.[10]

## నాణేలు :

యాదవులు నంది కాసులు అనబడే నాణెములు ఉపయోగించినట్లు తెలుస్తుంది. పోలురాజు యుద్ధం తాళపత్ర గ్రంథం, శ్రీరంగం పాలకుడైన చోడానికి పోలురాజు నందికాసులు[11] నాణాలను బహూకరించినట్లు తెలుపుతున్నది. దీనికి బదులుగా చోడాని పోలురాజుకు చోడమాడలు పంపించాడు. శ్రీరంగం పాలకుడు తన పేరుతో చోడమాడలు[12] నాణాలను విడుదల చేశాడు. కాటమరాజు నాణేలపై శ్రీ చంద్రదేవ[13] అని ఉన్నది. వాటిమీద నంది, బొమ్మ శ్రీ చంద్ర అనే అక్షరాలు ఉన్నాయి.[14] కాటమరాజుకు శ్రీచంద్రదేవ అనే బిరుదు ఉంది.[15]

## సైనిక పద్ధతి :

ఈ కాలము నాటి సైన్యాన్ని అయిదు విధాలుగా విభజింపవచ్చు. కాల్బలము, అశ్వదళము, గజబలము, ఆవులమంద, ఎద్దుల బలము. యాదవుల సైన్యంలో ఆవులు, ఎద్దులు, కాల్బలము, గుఱ్ఱాలు, ఉన్నవి. యరగడ్డపాడు యుద్ధంలో ఆవులు, గుఱ్ఱాలను - ఎద్దులు, ఏనుగులను ఎదుర్కొని నెల్లూరు సైన్యంపై పోరాడినాయి. నల్లసిద్ధి సైన్యంలో కాల్బలము, అశ్వాలు, ఏనుగులు ఉన్నాయి. గంగదొనకొండ, గంగదేవాలయము గోడలకు ఆవు గుఱ్ఱంతో పోరాడుతున్నట్లు, ఎద్దు, ఏనుగుతో పోరాడుతున్నట్లు చెక్కబడి ఉన్న శిల్పాలు, యరగడ్డపాటి పోట్లాట - తాళపత్ర గ్రంథంలో చెప్పబడిన విషయాలను ధృవపరుస్తున్నాయి.[16]

గుఱ్ఱాలు, ఏనుగులపై యుద్ధం చేయడానికి ఆవులకు, ఎద్దులకు శిక్షణ ఇచ్చేవారు. కాటమరాజు సోదరుడు పెయ్యల యర్రయ్య ఆవులు, ఎద్దులకు మంచిగా శిక్షణ ఇచ్చేవాడు.[17] ఏనుగులు, గుఱ్ఱాలు, ఎద్దులను యుద్ధరంగానికి తీసికొనిపొయ్యేవారని పల్నాటి వీర చరిత్రలో శ్రీనాథుడు వివరించాడు.[18]

యుద్ధభూమికి వెళ్లేముందు ఆవులను, ఎద్దులను బంగారు, వజ్రాల, ముత్యాల ఆభరణాలతో అలంకరించేవారు.[19] యరగడ్డపాడు యుద్ధ సమయంలో అయితమరాజు బొల్లావును అలంకరించి పూజించాడు. ఆవుల, ఎద్దులను దేవతల పేర్లతో పిలిచేవారు. ఎద్దుల పేర్లు ఇలా ఉండేవి - జాంబవంత, హరిమల్లెచెన్ను, ఏకామ్రనాథ, కొరుకొండగిరినాథ, గొడుగుమల్లె చెన్ను, బలరామ, పుల్లెద్దు, మట్టెద్దు మొదలగునవి.[20]

పోలురాజు యుద్ధం - తాళపత్ర గ్రంథంలో పోలురాజు చెరుకూరు యుద్ధానికి ముందు, ముక్కంటి తరపున రాయబారిగా వచ్చిన భుట్టకు పునుగు గంధం పూసి - ఆకులు, పోకలు, ఇచ్చి, రాకట్టు

ఉంగరాలు, రత్న భూషణాలు, మెడనూలు, నెవలాలు, బంగారు మాడలు, బహూకరించి పంపించాడు.[21]

యుద్ధానికి ముందు శత్రురాజులకు రాయబారుల ద్వారా కబురు పంపే ఆచారం ఉండేది. నల్లసిద్ధి రాజు, రాయశృంగావళి అనే భట్టును పుల్లరి అడగటానికి కాటమరాజు వద్దకు రాయబారిగా పంపాడు. ఈ విషయం భట్టు రాయబారం - తాళపత్ర గ్రంథంలో సవివరంగా ఉంది.[22]

రాజు సైనికులకు యుద్ధ నియమాలు తెలియచేసేవాడు. పెద్దిరాజు కథ - తాళపత్ర గ్రంథం ప్రకారం, అర్ల పెంట యుద్ధమపుడు పెద్దిరాజు, తన సైనికులకు యుద్ధంలో పాటించవలసిన నియమాలు ఇలా తెలిపాడు.

1. బ్రాహ్మణులు, స్త్రీలు, పిల్లలు, గోవులను చంపకూడదు.
2. యుద్ధం జరుగుతున్నపుడు చెట్టును ఎక్కిన వానిని, పొదలో దాగిన వానిని చంపరాదు.
3. నోటిలో గడ్డిపోచలు పెట్టుకొనిన వానిని చంపరాదు. అటువంటివారు ఓటమిని అంగీకరించినట్లు.
4. చేతులెత్తి శరణు వేడిన వారిని చంపరాదు.
5. నీటిలో నిలుచున్న వానిని చంపకూడదు.
6. యుద్ధభూమినుండి పారిపోతున్న వానిని చంపకూడదు.
7. శవాల మధ్య చనిపోయినట్లు పడుకున్న వారిని చంపరాదు.
8. ముటు వేసుకొని ఉన్నవాడిని చంపకూడదు.[23]

పైన ఉదహరించిన వారిని యుద్ధంలో వధించిన ఎడల చంపిన వారు స్వర్గమునకు పోలేరు.

[24] యుద్ధ నీతుల గురించి శ్రీనాథుడు కూడా పల్నాటి వీర చరిత్రలో ఇలాంటి నియమాలే తెలిపాడు. బ్రాహ్మణుని చంపిన బ్రహ్మ హత్య పాతకం తగులుంతుందని నమ్మేవారు.[25] అందువలన యాదవులు యరగడ్డపాడు యుద్ధంలో ఖడ్గతిక్కనను చంపడానికి భయపడినారు. ఖడ్గ తిక్కనను శైవ బ్రాహ్మణుడైన బ్రహ్మరుద్రయ్యతో చంపించారు.[26] యుద్ధ భూమికి వెళ్లే ముందు యాదవులు శివ, విష్ణు, గంగను పూజించేవారు. ఉద్రేకము పొందుటకు శివ పురాణం, మహా భారతం, కథలను వినేవారు.

కాటమరాజు, పల్లికొండ మొదలైన వారు యుద్ధానికి వెళ్లేముందు శివ పురాణం విన్నారని గంగుల పిన యల్లయ్య రచనల ద్వారా తెలుస్తున్నది.[27] యుద్ధానికి ముందు సైనికులకు బంగారు ఆభరణాలు, నాణాలు, పంచిపెట్టేవారు. పోలురాజు యుద్ధం - తాళ పత్ర గ్రంథంలో, చెరుకూరు యుద్ధానికి బయలుదేరే ముందు సైనికులకు గంధం, కస్తూరి పూసి విలువైన బంగారు ఆభరణాలు, నాణాలు, పట్టు వస్త్రాలు, కప్పూరము, తమలపాకులు, పోకచెక్కలు, పంచిపెట్టినట్లు ఉన్నది.[28] దీనిని రణదాన అంటారు.[29] యుద్ధభూమికి మంచాలు, పక్కబట్టలు, వస్త్రాలు బియ్యం, పంచదార, గంధం పొడి, పునుగు, జువ్వాజి, కంతలాలు, పాన్నటంకలు, తమలపాకులు, పోకలు తీసుకొని పోయేవారు.[30]

శత్రువుల కోటపై దాడి చేయడానికి వెళ్లేటప్పుడు పంచ వాయిద్యాలను మ్రోగించుకుంటూ పోయేవారు.[31] ఆవుల వలురాజు - ఖండెమొండెముల కోటపై దాడి చేసినపుడు యాదవ సైన్యం, శృంగం, మృదంగం, శంఖం, భేరి, చానము, మరియు పెద్ద బాకలు మ్రోగించారు. కాల్బలము విల్లంబులు, ఖడ్గాలు, కత్తులు, బాకాలు, ఈటెలతో పోరాడేవారు.

పోలురాజు నెల్లూరు పాలకుడు ముక్కంటి మీదకు యుద్ధానికి పోయే ముందు తన శరీరానికి గంధం పొడి రాసుకొని బంగారు ఆభరణాలు పెట్టుకున్నాడు. ఉక్కుజీర (కవచం) తొడుక్కుని, అల్లిక తాపరం తలకు పెట్టుకుని, నడుముకు బిళ్ళ వడ్డాణము బిగించి, కుడివైపు వంకిణి (ఖడ్గము), ఎడమవైపు

జముదాళి (పెద్ద కత్తి), చిన్నకత్తి పెట్టుకుని గజ్జల కఠారి చేత పట్టుకుని బయలుదేరాడు.[32] ఈ విషయం పోలురాజు యుద్ధం - తాళపత్ర గ్రంథంలో వివరంగా ఉంది.

ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గుడారాలలో యుద్ధ పద్ధతుల గురించి ఆలోచన చేసేవారు. చెరుకూరు యుద్ధమపుడు పోలురాజు "రణ మండపము"[33] వేయించాడు. రాజులు, మంత్రులు స్వయంగా యుద్ధంలో పాల్గొనేవారు.

యరగడ్డపాటి పోట్లాట, భక్తిరన్న కథ, తాళపత్ర గ్రంథాలు - ఆవుల వలురాజు, పెద్దిరాజు, పోలురాజు, అయితమరాజు, కాటమరాజు,[34] నల్లసిద్ధి, ఖడ్గతిక్కన, వీరంతా యుద్ధరంగంలో మరణించినట్లు తెలుపుతున్నది.[35]

యుద్ధంలో విజయం సాధించిన తర్వాత శత్రురాజు, సింహాసనంపై గెలిచిన రాజు బంధువులు కూర్చునే ఆచారం ఉంది. ఆవుల వలురాజు ఖండె మొండెముల కోటపై విజయం సాధించినపుడు అతని బంధువులంతా గంగురాజు సింహాసనం పై కొద్ది సేపు కూర్చొని లేచారని, ఆవుల వలురాజు చరిత్ర ద్వారా తెలుస్తున్నది. అంతఃపుర స్త్రీలు పరదా పాటించేవారు. వలురాజు ఖండెమొండెముల యుద్ధంలో గంగురాజును చంపినపుడు గంగురాజు భార్యలు తెరల చాటున నిలబడి, తమ కుమారుణ్ణి క్షమించి విడిచి పెట్టమని ఆవుల వలురాజుతో మాట్లాడారు.[36]

కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు - తాళపత్ర గ్రంథంలో ఏడునూతుల పాడు దగ్గర కాటమరాజు తన విగ్రహాన్ని[37] పెద్దమ్మ విగ్రహాన్ని[38] రాతిలో చెక్కించినట్లు వ్రాయబడింది. ఇప్పటికి ఇవి మనకు కన్పిస్తున్నాయి. ఏడునూతులపాడు మర్కాపురం (ప్రకాశం జిల్లా) సమీపంలో ఉంది.

---

## నోట్స్ అండ్ రిఫరెన్స్

1. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; వలురాజు కథ ; తా.ప.గ్రం. - మద్దులేటి కవి పుట : 45.
2. ఇదే పంపాద్రి కథ ; తా.ప.గ్రం., మల్లయ్య పుట : 139-143
3. ఇదే ; కాటమరాజుకు పట్టం కట్టిన కథ ; తా.ప.గ్రం., మారయ్య పుట : 530
4. బల్లికురువ పోట్లాట ; తా.ప.గ్రం., తా.ప.నెం.: 55
5. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పంపాద్రి కథ ; తా.ప.గ్రం. - మల్లయ్య పుట : 95-96
6. ఇదే పోలురాజు కథ ; తా.ప.గ్రం., గట్టయ్య పుట : 287
7. శ్రీ విక్రమ సింహపురి మండల సర్వస్వం , పార్ట్ - II, 1963, పుట : 126.
8. పంచలింగాల కొండ, యరగడ్డపాడు ప్రాంతాలలో తిరిగి ఫోటోలు తీయడం జరిగింది.
9. గంగదొనకొండ దేవాలయంలోని శిల్పాలన్నింటిని ఫొటోతీయడం జరిగింది.
10. మద్దులేటి కవి, వలురాజు చరిత్ర ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 3
11. సుబ్బారావు ; సం॥ వీరగాథలు - I ;పోలురాజు కథ ; తా.ప.గ్రం. - గట్టయ్య పుట : 318
12. ఇదే
13. డా॥ టి.వెంకటేశ్వరరావు - ఎ.పి.హెచ్.సి.ప్రొసీడింగ్స్ పుట : 42
14. ఇదే
15. ఇదే
16. పినయల్లయ్య, యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 34
17. ఇదే - పెయ్యల యర్రయ్యను, ఆవుల యర్రయ్య అని కూడా పిలిచేవారు.
18. సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘీక చరిత్ర ; 1982 పుట : 38
19. సుబ్బారావు సం॥ వీరగాథలు - ; యరగడ్డపాటి పోట్లాట, ; తా.ప.గ్రం. - పినయల్లయ్య పుట : 342-343
20. పినయల్లయ్య, యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 30
21. గట్టయ్య పోలురాజు యుద్ధం ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 23
22. భట్టు రాయబారము ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 7
23. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం. - పుట : 179
24. సురవరం ప్రతాపరెడ్డి పుట : 37
25. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 9
26. ఇదే
27. ఇదే తా.ప.నెం. : 37
28. గట్టయ్య, పోలురాజు యుద్ధం ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 24
29. ఇదే
30. అరుణకుమారి, పుట : 157
31. మద్దులేటి కవి ; వలురాజు చరిత్ర ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 22
32. గట్టయ్య పోలురాజు యుద్ధం ; తా.ప.గ్రం. ; తా.ప.నెం. : 25
33. ఇదే ; రణమండపం ; యుద్ధ వ్యూహాన్ని గురించి చర్చించడానికి రాజు-మంత్రులకు ప్రత్యేకమైన గుడారము ఏర్పాటు చేసేవారు. దీనిని రణమండపం అంటారు. తా.ప.నెం. : 22
34. భక్తిరన్న కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 8-30
35. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం.; తా.ప.నెం. : 9, 10-41
36. మద్దులేటి కవి ; వలురాజు చరిత్ర ; తా.ప.గ్రం.; తా.ప.నెం. : 27&33

    పంపాద్రి కథ ; తా.ప.గ్రం.లో కాటమరాజు తల్లి పెద్దమ్మ జంగమ దేవరలను భోజనానికి ఆహ్వానించినపుడు తెరచాటున నిలుచుని వారితో మాట్లాడింది.
    (సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; పంపాద్రి కథ ; తా.ప.గ్రం. - మల్లయ్య పుట : 117)
37. సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు ; తా.ప.గ్రం. - పుట : 30
38. ఇదే

# 9
# సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులు

కాటమరాజు వంశీయులు హిందూ ధర్మాన్ననుసరించి శరణు వేడిన వారిని రక్షించారు. మత సామరస్యాన్ని ప్రోత్సహించారు. అన్ని మతాలను గౌరవించారు. ఆ కాలంలో సతీసహగమనం, పుల్లరి విధానము, శకునములు, కలలు, వాటి ఫలితాలు, గంగ ఆరాధన, మతపరమైన నమ్మకాలు, ఆదాయ మార్గాలు, యరగడ్డపాడు యాదవుల సాంఘీక, ఆర్థిక పరిస్థితులను తెలుపుతున్నాయి.

## వస్త్రధారణ - ఆహారపు అలవాట్లు :

ఆంధ్రదేశం మధ్యయుగంలో ముఖ్యంగా యరగడ్డపాడు యాదవులు రకరకాల బంగారు ఆభరణాలు, వస్త్రాలు ధరించారు. స్త్రీ, పురుషులు నూలు, పట్టు వస్త్రాలు ధరించేవారు. ఆడ మగ తేడా లేకుండా బంగారు వెండి ఆభరణాలు, అలంకరించుకునేవారు. కాటమరాజు చరిత్రకు చెందిన తాళపత్ర గ్రంథాలు, అనాటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులను వివరంగా తెలుపుతున్నాయి.

రాజకుటుంబం స్త్రీలు, సాధారణంగా వివిధ రకాల పట్టు వస్త్రాలను ధరించేవారు. సామాన్య ప్రజలు ఎక్కువగా నూలు బట్టలు కట్టుకునేవారు. పురుషులు 20గజాల పొడవు చెంగావి పంచలు కట్టుకునే వారు. పెద్దిరాజు, పెద్దమ్మలు ఇద్దరు కలిసి 33 గజాల పట్టు చీరను కాటకోటేశ్వరుని పూజించే సమయంలో ధరించినట్లు - పెద్దిరాజు కథ తాళపత్ర గ్రంథం తెలుపుతుంది.[1]

వలురాజు కథ, తాళపత్ర గ్రంథమందు వలురాజు, ఖండెమొండెముల కోట పైకి యుద్ధానికి పోయే సమయంలో - ముత్యా పోగులు, ముంగ మురుగులు, రత్నాల మకుటము, మెడనూలు, కంఠసరి, మేలుంగరాలు, హారాలు ధరించినట్లు వివరింపబడింది.[2]

అర్లపెంట యుద్ధానికి వెళ్లే ముందు పెద్దిరాజు, ముత్యాల చేకట్లు, మువ్వల వడ్డాణము, గంటల వడ్డాణము, చవుకట్టు పోగులు వంటి ముత్యా జోడు, వజ్రాంగి, ముత్యాల కిరీటం ధరించాడు.[3]

రాజవంశపు స్త్రీలు, ధనవంతులు ఏడువారాల బంగారు నగలు ధరించేవారు. జరుగుపల్లి చెన్నయ్య. అగుమంచి కథ - తాళపత్ర గ్రంథంలో అగుమంచికి ఆమె సోదరుడు బంగారు ఆభరణాలు బహూకరించినట్లు తెలుపబడింది. అవి - పముజులు, కమ్మలు, కడియాలు, కెంపులు, కుందనపు తీగె, ముత్యాల కంఠమాల, పచ్చల పతకము, బోన్నసరం, సందిటె కడియాలు, ఉంగరాలు, ముంగారు మురుగులు.[4]

కాటమరాజు చెల్లెలు పాపనూక ముంగ మురువుల తీగ, ముత్యాల బొట్లు, మాణిక్యాలు, చేమపూకడియాలు, హేమంపు మణులు, పచ్చల కడియాలు, కూర్చిన ముత్యాలు, గుండు నేమనాలు, బంగారు గాజులు, చిలుకల తాళి, అందెలు, జాజిబందులు, ముత్యాల కమ్మలు, బంగారు వడ్డాణము, గోమేధికములు, జమిడిముత్యాల దండలు మొదలగు బంగారు ఆభరణాలు ధరించినట్లు పాపనూక కథ - తాళపత్ర గ్రంథంలో వివరింపబడింది.

అనాటి ప్రజల ముఖ్య ఆహారం- వరి, గోధుమ, పంచదార, బెల్లం, తేనె, పాలు, పెరుగు, నెయ్యి, కొబ్బరి, అల్లం, వివిధ రకాలైన పండ్లు. కాటమరాజు ఉత్తరాది అవుల మేపు - తాళపత్ర గ్రంథంలో, జంగం వారికి కాటమరాజు విందు ఏర్పాటు చేసినట్లు వివరింపబడింది. వారికి దోరావుల పాలతో తయారు చేసిన పాయసం, మంచి నెయ్యి, గడ్డ పెరుగు, పాలకడియాలు, అల్లంచారు, మిర్యాల కూరలు, అల్లం ఉరగాయ (మామిడి - అల్లం కలిపి చేసినది), పేరిన నెయ్యి, మీగడతో తయారు చేసిన పాలకోవ, పంచపదార్థాలు, పండ్లు వడ్డించారు. భోజనమైన తరువాత విడియం ఇచ్చారు.[5]

శాఖాహారంతో పాటు కొందరు గొర్రె, మేక, కోడి మాంసం తినేవారు.[7] అతిధులకు తమలపాకులు సున్నం వక్కలు కలిపిన విడియం ఇచ్చే ఆచారం ఉంది.

## స్త్రీల స్థానం :

రాజవంశీయులు, ధనవంతుల కుటుంబాల స్త్రీలు విద్యను అభ్యసించేవారు. కోటపాటి తాటి వృక్షం తెచ్చే కథ - తాళపత్ర గ్రంథం స్త్రీ విద్యా విషయంలో కొంత సమాచారం అందిస్తుంది - సిరిగిరమ్మ, అయితమరాజు కూతురు, తెలుగు, తమిళం, కన్నడం, మరాఠీ భాషలు అభ్యసించింది.[8] రాజవంశపు స్త్రీలు అప్పుడప్పుడు పరిపాలనా విషయాలలో జోక్యం కలిగించుకునేవారు. కాటమరాజు తల్లి పెద్దమ్మ కోరికననుసరించి, పెద్దిరాజు తన అన్నదమ్ముల నుండి భాగాలు పంచుకొని విడిపోయి, కళ్యాణ ప్రాంతానికి వెళ్లాడు.[9] సంతానం కోసం కళ్యాణ సోమప్పను ప్రార్థించాడు. స్త్రీలు పరిపాలనా భాధ్యతలు వహించారు. అయితమరాజు యరగడ్డపాడు యుద్ధానికి వెళ్లే ముందు, తన చెల్లెలు అగుమంచిని[10] దొనకొండకు రాజప్రతినిధిగా నియమించాడు. రాజకుటుంబానికి చెందిన స్త్రీలు పాలనా విషయాలలో రాజుకు సలహాలిస్తుండేవారు. కాటమరాజును ఆవుల మందలతో నెల్లూరు వెళ్లవద్దని సిరదేవి సలహా ఇచ్చింది.[11] యర్రభూపతితో తగాదా రాకుండా ఉండాలనే ఉద్దేశంతో, యరనూకరాజు భార్య, యరనూక సీత, ఎరుకల వారిని ఏనుగనాథు కొండకు పంపించమని సలహా ఇచ్చింది.[12] నల్లసిద్ధి రాజు రెండవ భార్య కుందమాదేవి, కోయబోయలను యాదవుల ఆవులను చంపమని ఆజ్ఞాపించింది. ఈ విషయం నల్లసిద్ధి రాజుకు తెలియచేయలేదు.[13]

సంతానం లేని స్త్రీలకు సమాజంలో గౌరవం లేదు. జంగం వారు పిల్లలు లేని ఇండ్లలో భోజనం చేయలేదు. పంప్యాద్రి కథ, తాళపత్ర గ్రంథంలో జంగాలు, పెద్దమ్మకు పిల్లలు లేరని ఆమె వడ్డించిన భోజనం తినలేదని ఉంది.[14]

సంతానం కొరకు స్త్రీలు పూజలు చేసేవారు. పెద్దమ్మ చీమలకు పంచదార, పాములకు పాలు, నందికి బియ్యం, బాలురకు పండ్లు పంచిపెట్టింది. అనాథలైన పేదవారికి అన్నం పాలు పంచిపెట్టింది. బీద బ్రాహ్మల వివాహాలు జరిపించింది. ఆడ మగ పావురాలకు పెండ్లి చేసింది.[15] బ్రాహ్మణులకు భూములు, ఆవులు, వస్త్రాలు దానం చేసింది. శివుణ్ణి అమితమైన భక్తితో పెద్దమ్మ ఆరాధించింది.[16]

రాజు, రాజధానిలో లేనప్పుడు అంతఃపుర మందిరంలోకి, అందరికి ప్రవేశం లేదు. ఇతర స్త్రీలు కూడా అంతఃపురంకు వెళ్లరాదు.[17]

శత్రువుల మీద యుద్ధం చేయడానికి స్త్రీలు తమ భర్తలను ప్రోత్సహించేవారు. ఖడ్గ తిక్కన భార్య జానమ్మ (చానమ్మ) ఖడ్గతిక్కనను యరగడ్డపాడు యుద్ధానికి తిరిగి వెళ్లేటట్లు చేసింది. ఖడ్గతిక్కన తల్లి ప్రోలమ్మ కూడా కొడుక్కు పౌరుషం కలిగించేటట్లు ప్రవర్తించింది.[18]

చెడు నక్షత్రంలో పుట్టిన స్త్రీలకు సమాజంలో గౌరవం లేదు. కాటమరాజు చెల్లెలు పాపనూక దుష్ట గడియలలో పుట్టిందని[19] జోతిష్యుల సలహా ప్రకారం దొనకొండ బయట ఒక భవనం నిర్మించి అందులో ఉంచారు.[20] ఆమెకు వివాహం చేయలేదు. పాపనూక పుట్టుక తల్లి తండ్రులకు, బంధువులకు, వంశానికి నష్టమని భావించారు. ఇప్పటికి కొందరు యాదవులు, పాపనూక పుట్టిన నక్షత్రంలో తమ ఇంట ఆడ శిశువు జన్మించితే తమకు చెడు జరుగుతుందని భయపడుతారు.

## సతీ సహగమనం :

యాదవరాణులు, వల్లమ్మ,[21] పెద్దమ్మ, యరనూక సీత, తదితరులు ఇష్ట పూర్తిగా తమ చనిపోయిన భర్తలతో పాటు సహగమనం చేశారు. కాటమరాజు తల్లి పెద్దమ్మ సహగమన విధానాన్ని పెద్దిరాజు కథ - తాళపత్ర గంధం ఇలా వివరించింది.

పెద్దమ్మ సహగమన గుండం[22]తయారు చేయించమని కాటమరాజును ఆజ్ఞాపించింది. కాటమరాజు పనివారలను పిలిపించి గుండం త్రవ్వించాడు. గంధం చెక్కలు, సహగమన గుండంలో చక్కగా పేర్చారు. కొన్ని బిందెల సంపంగి నూనెను గంధం చెక్కలపై పోశారు. పెద్దిరాజు శవాన్ని గుండంలో, గంధంచెక్కలపై పడుకొబెట్టినారు. కాటమరాజు నిప్పంటించాడు. పెద్దిరాజు శవం బూడిదగా మారింది. పెద్దమ్మ తన బంధువులను సమీపించి ఆచారం ప్రకారం సహగమనం చేయించండని సంతోషంగా వేడుకొంది.

కొందరు యాదవ స్త్రీలు పెద్దమ్మను తల స్నానం చేయించి పసుపు చీరను కట్టారు. వడికట్టు బియ్యాన్ని గుడ్డలో పోసి నడుముకు కట్టారు. పెద్దమ్మకున్న బంగారు ఆభరణాలనన్నింటిని ఆమెకు అలంకరించారు. కనులకు కాటుక, నుదుటన కుంకుమ బొట్టు తీర్చి దిద్దారు. పరిచారికలు నిలువుటద్దం తెచ్చి పెద్దమ్మ ముందు ఉంచారు. ఆమె అద్దంలో ముఖం, ఆభరణాలను, అలంకరణను చూసుకొని సంతృప్తి చెందింది. పెద్దమ్మను శ్రీ మహాలక్ష్మి అనే పేరుగల అశ్వం పై ఎక్కించి కనకరేవల్లె (కళ్యాణ దేవగిరి) వీధులలో మంగళ వాయిద్యాలతో ఊరేగింపుగా తీసుకవెళ్లారు.[23] పెద్దమ్మ గౌరవార్థం బంధువులు, స్నేహితులు, భోజనాలు ఏర్పాటు చేశారు. వారిని సంతృప్తి పరచడానికి ప్రతి చోట కొద్దిగా పదార్థాలను స్వీకరించింది. చివరకు ఆ ఊరేగింపు సహగమన గుండం చేరుకుంది.

పెద్దమ్మ సహగమన గుండం దగ్గరకు వచ్చిన స్త్రీలందరకు పసుపు, కుంకుమ, చాటలు పంచిపెట్టింది. బ్రాహ్మణ స్త్రీలకు బంగారు ఆభరణాలు దానం చేసింది. బ్రాహ్మణ పండితులకు గోదానం, భూదానం చేసింది. ఆమె దాన ధర్మాలు చేసే సమయంలో, వడ్డెర్లు సహగమన గుండంలో పెద్దిరాజును దహనం చేసిన చోటనే గంధం చెక్కలు అమర్చి, వాటిపై సంపంగి నూనె పోసి ఉంచారు. పెద్దమ్మ తన కొడుకు, కాటమరాజును, కూతురు పాపనూకను కళ్యాణ పట్టణం రాణి పెందోట ముద్దమ్మకు అప్పగించి వారి ఆలన, పాలన చూడమని వేడుకొంది.[24] అప్పుడు కాటమరాజు వయస్సు ఏడు సంవత్సరములు. పాపనూక ఐదు నెలల పసికందు.

పెద్దమ్మ చంప్రదు కట్టవద్దకు వెళ్ళి నిలుచున్నది.[25] సహగమన గుండంలోని గంధం చెక్కలకు నిప్పు అంటించారు. పెద్ద మంటలు లేచాయి. పెద్దమ్మ అక్కడ ఉన్న బంధువులకు, స్నేహితులకు, ప్రజలందరికి చేతులెత్తి నమస్కరించింది. ఆమె ఏడు అడుగులు వెనక్కి వేసి, దాసమ్మ పండును ముందుగా మండుతున్న గుండంలోకి వేసి వెంటనే సహగమన గుండంలో దూకింది. తక్షణమే మరికొంత సంపంగి నూనె ఆ మంటలలో పోసి వట్టివేళ్ల తడకలు సహగమన గుండం పై కప్పి వేశారు. కనకరేవల్లె ప్రజలంతా దుఃఖంతో వెనక్కి తిరిగివెళ్లారు.[26]

## కుల వ్యవస్థ :

ఆ రోజుల్లో పద్దెనిమిది వర్ణాలున్నాయి. గ్రామంలో కులాల వారిగా వీధులుండేవి. వర్ణాశ్రమ ధర్మాన్ని పాటించేవారు.[27] కుల వ్యవస్థ మరీ కఠినంగా లేదు. వర్ణాంతర వివాహాలు జరుగుతుండేవి. యాదవులు, రెడ్డి కులస్తుల మధ్య వివాహ సంబంధాలున్నాయి. అగుమంచి కథ - తాళపత్ర గ్రంథం ఆధారంగా పోలురాజు, రెడ్డి కుటుంబానికి చెందిన సిరిదేవిని వివాహం చేసుకున్నాడు. పోలురాజు కూతురు అగుమంచి, యరగడ్డపాడు యుద్ధంలో ఉన్న తన సోదరుల సమాచారం తెలుసుకొని రమ్మని ఆమె మేనమామలను కోరుతుంది. పాట్లపాటి పోలరెడ్డి, పాదిలి గంగి రెడ్డి, వాదెండ్ల పాపిరెడ్డి, వనర నాగిరెడ్డి, యలమంచి కొమ్మిరెడ్డి, దాన్యాల గంగిరెడ్డి వీరంతా అగుమంచికి అండదండగా ఉన్నారు.[28] యరగడ్డపాడు యుద్ధం జరుగుతున్న సమయంలో దొనకొండకు రాజ ప్రతినిధిగా ఉన్నాడి.

పోలురాజు భార్య సిరిదేవి, బీర్నీడు (మాదిగ)ను పెంచి పెద్ద చేసినట్లు భక్తిరన్న కథ, తాళ పత్ర

గ్రంథం ద్వారా తెలుస్తున్నది.[29] సిరిదేవి, బీర్నీడును సొంత కొడుకులా చూచుకొని పైకి తెచ్చింది. కాటమరాజు స్నేహితుడు - మంత్రి అయిన పద్మ రాఘవుడు, రేచర్ల గోత్రానికి చెందిన వెలమ కులస్తుడు. కాటమరాజు అతనిని బావ అని పిలిచేవారు. పద్మ రాఘవుడు నెల్లూరు ప్రధాన మంత్రి, చింకర్ల భీమన్నతో యుద్ధం చేస్తూ యరగడ్డపాడులో మరణించాడు.[30]

ఆకాలంలో బ్రాహ్మణులు-మంత్రులు, సేనాధిపతులు, రాయబారులు, దళాధిపతులుగా పనిచేసేవారు. ఖడ్గ తిక్కన నెల్లూరు నల్లసిద్ధి ఆస్థానంలో మంత్రి, సేనాధిపతి పదవులను నిర్వహించాడు. శివబ్రాహ్మణుడైన బ్రహ్మరుద్రయ్య కాటమరాజు తరఫున యుద్ధం చేశాడు.

## వివాహ సంబంధాల నిర్ణయం :

యువతీ యువకుల వివాహాలు తల్లిదండ్రులు, దగ్గరి బంధువులు నిర్ణయించేవారు. వివాహానికి ముందు కాబోయే వధూవరుల జాతకాలు జోతిష్య పండితుల ద్వార చూపించేవారు. అస్తి కన్నా ఈడుజోడు ఉండాలని అనుకునేవారు. శకునాలను పాటించే ఆచారం ఉంది.[31]

వివాహాలు నిశ్చయం జరిగేటపుడు పాటించే ఆచారాలు పాపనూక కథ - తాళపత్ర గ్రంథంలో సవివరంగా ఉంది. పాపనూక వివాహ విషయంలో పల్లికొండ ఎక్కువగా శ్రద్ధ తీసుకొన్నాడు. పల్లికొండ గృహములో వల్లవతిరుమందుల కుటుంబం వారు సమావేశమయ్యారు. పల్లికొండ వారందరిని సాదరంగా ఆహ్వానించి, కర్పూర విడియాలు ఇచ్చారు.[32] పాపనూకకు, కొమరమ్మ కొడుకు నాచకూళ్ల నాయుడుకు వివాహం నిశ్చయం చేయదలచామని వారితో అన్నాడు. నాచకూళ్లనాయుడు విద్యాభ్యాసం, యుద్ధ విద్యలు పూర్తి చేశాడు. పాపనూకకు పెండ్లి ఈడు వచ్చింది.[33] అందువలన మనమంతా సిరిదేవి వద్దకు వెళ్లి వివాహ విషయం చర్చించి పప్పన్నం తినాలని అక్కడికి వచ్చిన వారినుద్దేశించి చెప్పాడు. ఈ విషయాన్ని సిరిదేవికి తెలుపటానికి పల్లికొండ, పరిచారికలను పంపించాడు.

సిరిదేవి ఇంటిని శుభ్రపరచి, అలంకరించవలసిందిగా పనివారిని ఆదేశించింది. ఇంటిముందు పన్నీరు, జువ్వాజి కలయంపి చల్లించి, కురువెల్ల చవికలో[34] పట్టు తివాచీలు పరిపించింది. ఇక్కడ అన్ని ఏర్పాట్లు అయిన తర్వాత, సిరిదేవి పల్లికొండకు కబురు పంపింది.

పల్లికొండ, అయితమరాజు, కరియావులరాజు తదితర యాదవ పెద్దలు సిరిదేవి భవనానికి బయలుదేరారు. సిరిదేవి వారినందరిని కురివెల్ల చవికలోకి ఆహ్వానించింది. అందరూ పట్టు తివాచీల మీద కుర్చున్న తరువాత కర్పూర విడియములు ఇచ్చి అందరి మెడలకు గంధం పూసి, జువ్వాజి, కస్తూరి పంచిపెట్టారు.[35]

అయితమరాజు చర్చ మొదలు పెట్టాడు. మనమంతా ఇక్కడ ఎందుకు సమావేశమైనామని - అక్కడ కూర్చున్నవారిని అడిగాడు. పాపనూకకు, నాచకూళ్ల నాయుడుకు వివాహ నిశ్చయం చేయుటానికి వచ్చామని, మకుటకోట మల్లయ్య, మర్లమల్లయ్యలు పల్లికొండ తరఫున సమాధానం ఇచ్చారు.[36]

సిరిదేవి, కొమరమ్మ ఇతర యాదవ స్త్రీలు కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు. వరుడు తల్లి కొమరమ్మను, నవరత్నాల గద్దెపై కూర్చోపెట్టారు.[37] పురోహితులు వచ్చి అయితమరాజాదులను ఆశీర్వదించారు. గౌరవ మర్యాదలతో అందరూ పురోహితులకు నమస్కరించారు. పురోహితులందరకు కర్పూర విడియాలు పంచారు. పాపనూక, నాచకూళ్ల నాయుడు పేరు మీద మంచి ముహూర్తం చూడమని అయితమరాజు పురోహితులను కోరాడు. పాపనూక జాతకాన్ని పరిపరివిధాలుగా పరిశీలించారు పురోహితులు. పాపనూక చిత్రభాను సంవత్సరం, ఫాల్గుణ మాసం, బహుళ అమావాస్య, బుధవారం జ్యేష్ఠా నక్షత్రం (జమిలి) పట్టపగలు జన్మించినదని,[38] ఆమె జననం తల్లిదండ్రులకు వారి గోత్రానికి నష్టం కల్గిస్తుందని పురోహితులు

తెలిపారు. ఆమెకు వివాహం చేసి అత్తవారింటికి పంపించిన ఆకుటుంబం సర్వనాశనం అవుతుందని అన్నారు. వరుడు ఇల్లరికం వచ్చి పాపనూక తల్లిదండ్రుల ఇంట్లో ఉంటే నష్టం ఏమి ఉండదని సలహా ఇచ్చారు.[39]

పాపనూక, నాచకూళ్ల నాయుడులకు వివాహం జరిపించి, పెండ్లికుమారుని ఇల్లరికం పంపించమని సిరిదేవి, కొమరమ్మను కోరింది. వరకట్నం క్రింద కోరినంత ధనాన్ని ఇస్తానని సిరిదేవి, కొమరమ్మతో చెప్పింది. సిరిదేవి మాటలు కొమరమ్మకు కోపం తెప్పించాయి. వరకట్నం ఇస్తామని తమని అవమానించినట్లు భావించింది, కొమరమ్మ - ఆరోజుల్లో అన్ని విధాల ఉన్నవారు వరకట్నం తీసుకోవడం అవమానంగా భావించేవారు. అందువలన కొమరమ్మ - తన కొడుకు నాచకూళ్ల నాయుడుకు, పాపనూక కు వివాహం చేయడం ఇష్టం లేదని తెలిపింది.[40]

పాపనూకకు వివాహ సంబంధం చిట్లి పోయింది. పాపనూకను, ప్రత్యేక భవనంలో దొనకొండ వెలుపల ఉంచడం మంచిదని పురోహితులు, అయితమరాజుకు సలహా ఇచ్చారు. ఈ విషయాన్ని శ్రీశైలం అడవులలో పశువుల మందల కడ ఉన్న కాటమరాజుకు అయితమరాజు, ప్రత్యేకమైన వార్తావరుల ద్వారా తెలిపాడు. పురోహితుల సలహానుసరించి నడవ వలసిందని అయితమరాజుకు సలహా ఇచ్చాడు కాటమరాజు. దొనకొండ వెలుపల ఒక భవనాన్ని నిర్మించి అందులో పాపనూకను ఉంచారు.[41] ఇప్పటికి దొనకొండ బయట పాపనూక భవనం శిథిలాలు కనిపిస్తున్నాయి. ఇది ప్రస్తుతము ప్రకాశం జిల్లాలో ఉంది. ఆనాటి ప్రజలు, శకునాలు, జోతిష్యం మీద ఎక్కువ నమ్మకం కలిగి ఉన్నారని తెలుస్తుంది.

## కలలు, శకునాలు :

ఆనాటి ప్రజలు కలలు, శకునాలకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చేవారు. కొందరనుభవజ్ఞులు కలలు, శకునాల ఫలితాలను వివరించి చెప్పేవారు. కాటమరాజు, తల్లి పెద్దమ్మకు వచ్చిన కలలను కళ్యాణము రాణి ముద్దమ్మ, విప్పి చెప్పినట్టు, పెద్దిరాజు కథ , తాళపత్ర గ్రంథంలో ఉంది. నెల్లూరు రాజు, నల్లసిద్ధి ఆస్థానంలో ఉన్న సంధ్య గోపాలుడు శకునాల ఫలితాలను చెప్పటంలో మహా దిట్ట. కొందరు ప్రజలు, మంత్రాలు, చేతబడులను కూడా నమ్మేవారు.[42] యరగడ్డపాడు యుద్ధానికి ముందు అగుమంచికి చెడు కలలు వచ్చినట్లు అగుమంచి చరిత్ర - ద్వారా తెలుస్తున్నది.[43]

## లేఖలు - ముద్రలు :

రహస్య విషయాలు బయట పడకుండా ఉండటానికి లేఖల పై ముద్రలు వేసేవారు. లేఖలను పెట్టెలలో భద్రపరచి ఆ పెట్టెలకు సీలు వేసి ఉంగరాల ముద్రలు వేసేవారు. లేఖలను పావురాలు, కాళారుల (ప్రత్యేకవార్తావరులు) ద్వారా పంపించేవారు.[44]

ఈ కాలంలో రాజు ఇతరులతో ముఖాముఖి మాట్లాడే వాడు కాదు. రాజు ఆస్థానంలో ఒక మధ్యవర్తి ద్వారా మాట్లాడేవారు. శత్రువైన రాజును అవమానించడానికి, అతని తరపున వచ్చిన రాయబారికి మెడలో పట్టు వస్త్రం వేసేవారు. ఒకొక్కప్పుడు శత్రురాజు, చిన్న విగ్రహం, రాగితో చేసిన దానిని రాజు కాలికి కట్టుకొని అవతలి వారిని అవమానించేవారు. దీనిని బొమ్మకట్టు అంటారు.[45]

## వెట్టిచాకిరి :

వెట్టిచాకిరి విధానము ఉన్నది. పోలురాజు యుద్ధం, తాళపత్ర గ్రంథంలో శ్రీరంగం రాజు చోడాని ఒక ఆనకట్టను నిర్మించే సమయంలో చెరుకూరులోని జంగమ సోదరులను వెట్టికి రమ్మని బలవంతం చేశారు.[46] నెల్లూరు, నల్లసిద్ధి రాజు సైన్యంలో రాత్రిపూట దివిటీలు పట్టడానికి వెట్టివారు ఉండేవారు. వెట్టి చాకిరీ చేసే వారికి ఇంత జీతం ఇవ్వాలనే నియమం లేదు. వారికిచ్చే ప్రతిఫలం యజమానుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది.

## ఆటలు - వినోదాలు :

ప్రజలు రకరకాలైన ఆటలు, వినోదాలతో కాలక్షేపం చేసేవారు. బల్లికురువ పోట్లాట,[47] తాళపత్ర గ్రంథం ద్వారా ఆనాటి ఆటలు వినోదాలు ఎలా ఉన్నాయి అనేది తెలుస్తున్నది. బల్లికురువలో, అయితమరాజు, సిరిదేవిల సమక్షంలో గొఱ్ఱె పొట్టేళ్ల పోట్లాట, కోడిపుంజుల కొట్లాట, కోడెల మధ్య యుద్ధం, పికిలిగాండ్ల పోట్లాటలు యేర్పాటు చేశారు. యువకులు బొంగరాల ఆట ఆడేవారు. కాటమరాజు దగ్గరి బంధువులైన ముమ్మయ్య, పోచయ్య, పందెం వేసుకొని బొంగరాలు ఆడినట్లు, వేడుక బొంగరాలు, తాళపత్ర గ్రంథంలో వివరించబడింది. ఆ బొంగరాలపైలింగ ముద్రలు, విష్ణు ముద్రలు ఉండేవి. ఇవేకాక, మల్ల యుద్ధాలు, ద్వంద్వ యుద్ధాలు, వేట మొదలగునవి ఆనాటి ప్రజల వినోదాలు.

ఆ కాలం నాటి బొంగరాలపై లింగ ముద్రలు, విష్ణు ముద్రలు ఉండటం మత విషయాలను తెలుపుతుంది. లింగ ముద్రలు ఉన్న బొంగరాలను శైవమతస్తులు ఉపయోగించేవారని, విష్ణు ముద్రలున్న బొంగరాలున్న బొంగరాలను వైష్ణవులు, ఉపయోగించేవారని తెలుస్తుంది. ఈ లింగ ముద్రలు, విష్ణుముద్రలు ఎద్దులకు కూడా వేశేవారని కాటమరాజు చరిత్రకు సంబంధించిన తాళపత్ర గ్రంథాల ద్వారా తెలుస్తుంది.

## మల్లయుద్ధం :

కరియావుల రాజుతో మల్లయుద్ధం చేయడానికి ఓరుగల్లు బేతాళుడు వెళ్లే సమయంలో - బేతాళుడు, కావిచల్లదుం (ఎరుపురంగు గల) ధరించి, మొలదట్టి (బెల్టు లాంటిది) బిగించి, దానిపై రామాంతముళ్లు (ఇనుప పిన్నులతో ఉన్న గొలుసు) నడుముకు కట్టుకొని సురియల తొగెజంట (చిన్న కత్తులు) తలకు కట్టుకొని, కాలి వేళ్లకు 'పరుజులు (పిడికత్తులు) కట్టుకొని, చేతి వ్రేళ్లకు గద్దగోళ్లు తొడుక్కొని, బొడ్డు గంట, బొడ్డుకు కట్టుకొని, అయిదు జానల కఠారి కుడిచేత పట్టుకొని కరియావుల రాజు పైకి వెళ్లాడు.[48]

## ఆదాయ మార్గం :

ఆ కాలంలో గొప్ప పశుసంపద ఉన్న వారిని ధనవంతులుగా పరిగణించేవారు. కాటమరాజు వంశీయుల ముఖ్య ఆదాయ మార్గం పశుసంపదే. వ్యవసాయదారులు, తదితర ప్రజలు ఎక్కువగా పశువులపై ఆధారపడేవారు. యాదవులకు అపారమైన పశుసంపద ఉంది. జన్నివాడ కథ, తాళపత్ర గ్రంథంలో కాటమరాజుకు తొమ్మిదివేల నర్రావులు, (కొమ్ములు ఉన్న ఆవులు) ఏడువేల లింగ ముద్ర ఎడ్లు (ఎద్దులకు లింగ ముద్ర వేసేవారు), పన్నెండు వేల బసవ ముద్ర ఎడ్లు (ఎద్దులకు నంది ముద్ర వేసేవారు) ఉన్నట్లు వ్రాయబడింది. వెన్న తీయడానికి ఆరువేల గుత్తి కవ్వాలు ఉన్నాయి.[49] కాటమరాజుకు అసలు పశుసంపద ఎంత ఉన్నది అన్నది ఏ తాళపత్ర గ్రంథంలోను పూర్తిగా వివరించలేదు. చోడాని, శ్రీరంగం రాజు -శ్రీరంగనాథుని దేవాలయానికి సున్నం వేయడానికి పాలు పంపించమని పోలురాజును కోరాడు. యాదవుల పశువుల మంద ఉండే చోటు నుండి శ్రీరంగం దేవాలయం వరకు కాలువ కట్టించాడు చోడాని, అప్పుడు కాలువ ద్వారా పాలు శ్రీరంగనాథ స్వామి దేవాలయానికి పంపించారు.[50] దీనిని బట్టి ఆ రోజుల్లో దేవాలయాలకు సున్నం వేయడానికి, సున్నంలో పాలు కలిపి వెల్లవేసేవారని తెలుస్తుంది.

## పుల్లరి :

పుల్లరి ఇచ్చి ఇతరుల భూములలో పశువులను మేపుకొనే పద్ధతి ఉన్నది. కొన్ని సమయాలలో పుల్లరి క్రింద కోడెదూడలను ఇచ్చేవారు.

కాటమరాజు, నల్లసిద్ది రాజుల మధ్య జరిగిన పుల్లరి ఒప్పందం, జన్నివాడ కథ - తాళపత్ర

గ్రంథంలో వివరింపబడింది. ఈ ఒప్పందం ప్రకారం యాదవుల పశువులు నెల్లూరు అడవుల్లో మేయాలి. నెల్లూరులో ఉన్నంత వరకు యాదవుల అవులకు పుట్టిన కోడెదూడలను పుల్లరిగా నల్లసిద్ధి రాజుకు ఇవ్వాలి. నల్లసిద్ధి రాజు యాదవుల పశువులను రక్షించాలి. ఖడ్గ తిక్కన, నెల్లూరి సేనాధిపతి ఈ పుల్లరి ఒప్పందాన్ని వ్రాశాడు.

'భక్తిరన్న కథ' - తాళపత్ర గ్రంథం ప్రకారం బెజవాడ నున్న భూపతి 'కంచుకి' (స్త్రీల రవిక), పెంచుకి (పాత్రలు), గాజు కంకణం (స్త్రీల గాజులు)లపై పన్ను విధించాడు.[51] దీనిని బట్టి ఆ రోజుల్లో కొందరు రాజులు ఎంత నిరంకుశంగా ప్రవర్తించేవారో అర్థమవుతుంది.

## మత నమ్మకాలు :

మధ్య ఆంధ్రయుగంలో శైవులు, వైష్ణవులు ఆధిపత్యం కోసం పోరాడేవారు.[52] శైవ ఉద్యమాన్ని వైష్ణవులు పూర్తిగా వ్యతిరేకించేవారు.[53] కాటమరాజు వంశీయులు మత సహనం పాటించారు.

యాదవరాణులు, సింహాద్రి సీత, పెద్దమ్మ, యరనూక సీత, నలనూక సీత, సిరిదేవి, పంపాద్రి బసవన్నను పూజించారు. పెద్దిరాజు, పెద్దమ్మలు - కాటకోటేశ్వర స్వామిని ఆరాధించారు. కాటకోటేశ్వరుని వరాన జన్మించాడు కాబట్టి, కాటమరాజని అతనికి పేరు పెట్టారు.

కాటమరాజు పెద్ద తండ్రి సింహాద్రి రాజు శ్రీ వైష్ణవులను రక్షించడానికి, శ్రీకూర్మం పై దండెత్తి సింధు భల్లాని రాజుతో యుద్ధం చేసినట్లు, భక్తిరన్న కథ - తాళపత్ర గ్రంథంలో ఉంది. సింధు భల్లాని ఆ ప్రాంతం లోని వైష్ణవ మతస్తులను అవమానాలకు గురి చేస్తుంటే, వారు సింహాద్రి రాజు వద్దకు వచ్చి తమను రక్షించమని వేడుకున్నారు. శైవ మతస్తులైన, జంగమ సోదరులను రక్షించడానికి పోలురాజు శ్రీరంగం పై దాడి చేశాడు.[54]

యాదవుల సైన్యంలో కొందరు వీరశైవ మతస్తులు ఉన్నారు. బ్రహ్మరుద్రయ్య శైవ బ్రాహ్మణుడు, కాటమరాజు తరపున యుద్ధం చేశాడు. ఇతడు ఎద్దునెక్కి శత్రువులపై పోరాడినాడు. యుద్ధరంగంలోకి వెళ్లేముందు అయితమరాజు, తదితర యాదవులు పంచాక్షరి మంత్రం జపించి, శివుణ్ణి పూజించేవారు. పల్లికొండ శివపురాణం వినేవాడు. కాటమరాజు శ్రీ కృష్ణుని అవతారమనీ,[55] యాదవులు నమ్మేవారు. యాదవులు శివుణ్ణి, విష్ణువును పూజించేవారు.

## గంగ ఆరాధన :

యాదవులు, గంగను వారి కులదేవతగా భావించి పూజించారు. గంగకు భోనాలు చెల్లించి, మేక, గొర్రెపోతులను బలి ఇచ్చేవారు. శత్రురాజుల తలలు నరికి, గంగకు కానుకగా సమర్పించేవారు. ఈ విధంగా చేస్తే గంగ వారిని ఆశీర్వదిస్తుందని నమ్మేవారు. కాటమరాజు, నెల్లూరు పాలకుడైన నల్లసిద్ధిరాజు తలను నరికి పాలేటి గంగకు పాదకానుకగా పెట్టాడు.

## గంగ - సిడిమాను :

యాదవులు, ప్రతి సంవత్సరం గంగ గుడి ముందు సిడి తిరిగేవారు.[56] ఇప్పటికి ప్రతి సంవత్సరం పంచలింగాల కొండ దగ్గర గంగజాతర యాదవులు జరుపుతున్నారు. ఈ గంగ జాతర వైశాఖమాసం, బహుళ పాడ్యమినాడు మొదలవుతుంది. ఆరు రోజుల పాటు మహా ఉత్సాహంగా జాతరను జరుపుతారు. సిడి ఏర్పాటు ఈ క్రింది విధంగా ఉంటుంది.

సిడిని తయారు చేయడానికి పొడవైన గట్టి దూలాన్ని ఉపయోగించుతారు. ఈ దూలం క్రింది భాగం మందంగా ఉండి చివర సన్నగా ఉంటుంది. దూలాన్ని భూమిలో నిలువుగా ఉండేటట్లు పాతుతారు. ఈదూలం చివరి భాగాన, మరొక పొడవైన గట్టి కర్రను అడ్డంగా అమర్చుతారు. దీనిని దూలం చుట్టూ గుండ్రంగా తిరిగేటట్లు ఏర్పాటు చేస్తారు. దీని చివరన గట్టి తాడు కడతారు. భక్తుడు ఆ తాడును నడుముకు కట్టుకొని గాల్లిల్లో తేలి ఆడుతూ ఉంటాడు. తరువాత ఈ సిడిని గుండ్రంగా తిప్పుతారు. ఇది ఒక చక్రంలా తిరుగుతుంది.[57]

పంచలింగాల కొండ, గంగదేవాలయం ప్రాంగణంలో ఒక భక్తుడు "సిడి" తిరుగుతూ ఉండగా తాడు తెగి క్రిందపడి - అక్కడికక్కడే మరణించాడు. ఆ రోజు నుండి ఇప్పటి వరకు సిడికి మనిషికి బదులు ఒక మేక పోతును కట్టి త్రిప్పుతారు. ఈ సిడిని చాలా వేగంగా త్రిప్పుతారు. కొంత సేపు త్రిప్పిన తర్వాత, ఆ మేక పోతును విడిచి పెడతారు. అది బ్రతికి ఉన్నట్లయితే దానిని మేకల మందలో పోతుగా వదులుతారు. ఎలాంటి పరిస్థితిలోను ఈ మేకపోతును చంపడం జరుగదు.

యాదవులు, ఈ సిడిని ఆవులు, కోడెల పటుత్వాన్ని పరీక్షించడానికి ఉపయోగించి ఉంటారు. యాదవులు ఎక్కువగా ఆవులు, ఎద్దులను యుద్ధంలోకి దింపేవారు. యుద్ధానికి కావలసిన ఆవులు, కోడెలను ఈ సిడిపై త్రిప్పి, అవి బ్రతికి ఉంటే వాటికి యుద్ధంలో పోరాడటానికి శిక్షణ ఇచ్చేవారు.

## వీరపూజ :

యుద్ధంలో చనిపోయిన వీరులను పూజించేవారు. చెరుకూరు యుద్ధంలో చనిపోయిన పోలురాజు పంచలింగాల కొండపై శివలింగమై వెలిశాడనే నమ్మకంతో కాటమరాజాదులు పూజించారు. దొనకొండలోని గంగదేవాలయంలో ఇప్పటికి యరగడ్డపాడు యుద్ధంలో చనిపోయిన వీరుల శిలా విగ్రహాలు ఉన్నాయి.[58]

## పట్టాభిషేకం జరిపే విధానం :

పంపాద్రి కథ - తాళపత్ర గ్రంథంలో పోలురాజు ఆవుల పట్టం - ఈ క్రింది విధంగా వర్ణించంబడింది.

ఆవుల మంద సమీపంలో ఒక ఎర్రటి పట్టు గుడారాన్ని వేశారు. ఆ గుడారాన్ని పట్టు వస్త్రాలతో అలంకరించారు. మధ్యలో ఒక ఆసనం వేశారు. నాలుగు వైపుల స్థంభాలకు అరటి ఆకులు కట్టి అలంకరించారు. ఈ పట్టాభిషేక మహోత్సవాన్ని తిలకించడానికి చాలా మంది స్త్రీలు, పురుషులు వచ్చారు. పోలురాజుకు - జమిలి, మెడనూలు, ఉంగరాలు, చేమపూ కడియాలు, చిలకల తాళి, ముత్యాలచేకట్లు మొదలగు బంగారుఆభరణాలు అలంకరించారు. బ్రాహ్మణులు, భట్లు పొగడుతుండగా పోలురాజును ఆసనంపై కూర్చుండబెట్టారు. కల్లందుల మార్నీడును, పోలురాజు సరసన కూర్చుండబెట్టారు. అతడిని పోలురాజుకు ప్రధాన మంత్రిగా ప్రకటించారు. తిరుమందులమల్లును న్యాయశాఖ మంత్రిగా ప్రకటించారు. పెద్దిరాజు పట్టు వస్త్రాలు, విలువైన బహుమానాలు, పోలురాజు, కల్లందుల మార్నీడు, తిరుమందుల మల్లులకు బహూకరించాడు. పంపాద్రి ప్రభువైన పెద్దిరాజు, అతని సోదరుడు పోలురాజుకు చేతులెత్తి నమస్కరించాడు.[59]

పల్లికొండ తదితర పెద్దలను గౌరవంగా చూడమని పెద్దిరాజు, తన తమ్ముడు పోలురాజుకు సలహా ఇచ్చాడు. శరణు వేడిన వారిని రక్షించమని చెప్పాడు. పెద్దిరాజు, పోలురాజు శిరస్సుపై అక్షింతలు చల్లినాడు. బ్రాహ్మణులు, తదితర పెద్దలు కూడా సేసలు చల్లినారు. బ్రాహ్మలకు భూదానం ఇచ్చారు, భట్టులు, మల్లయోధులు, ఆటగాళ్లు, విలుకాళ్లకు బహుమతులు పంచిపెట్టారు. ఆ తరువాత అక్కడ వారంతా ఆటపాటలతో, మంగళవాయిద్యాలతో పంపాద్రికి తిరిగి వెళ్లారు.[60]

ఈ కాలంలో యాదవులు తమ రాజును ఎన్నుకొనుటకు "బసవన్న" పేరు గల ఆబోతు నిర్ణయానికి వదిలేవారు.

కట్టెబోయిన మారయ్య కాటమరాజు పట్టాభిషేకాన్ని కాటమరాజుకు పట్టం కట్టిన కథలో ఇలా వర్ణించాడు.[61]

యాదవ ప్రముఖులు, పశువుల మందలున్న, "రేపల్లెకు" వెళ్లారు. ఒక గుడారం నిర్మించి, అందులో పట్టు తివాచీలు పరిచారు. అందరూ అక్కడ కూర్చున్నారు. బసవన్న - యాదవ ప్రముఖుల ముఖాలను పరిశీలించి, కాటమరాజు తల పై తన కుడికాలును ఆనించింది. రాజు ఎంపిక అయిపోయింది.

## పశువుల దొడ్డి :

యాదవులకు అపారమైన పశువుల మందలు ఉన్నాయి. జన్నివాద కథ - తాళపత్ర గ్రంథంలో కాటమరాజు పశువుల మందలను ఇలా వర్ణించాడు.

"కుదురు ఆరామడ - కదలు పన్నెండామడ" - ఆ పశువులన్ని ఒక చోట దొడ్డిగా గుమిగూడితే, ఆరు ఆమడల ప్రదేశాన్ని ఆక్రమించుతాయి. అవి కదలి అటు ఇటు మేతకు బయలు దేరితే పన్నెండామడల ప్రాంతం వరకు విస్తరించుతాయి. బహుశా ఇది అతిశయోక్తి అయి ఉండవచ్చు. కాటమరాజుకు గొప్ప పశువుల మంద ఉన్నదని చెప్పడానికి, జానపద గాథాకారులు ఈ పద ప్రయోగం చేసి ఉంటారు. వారి పశువుల మందలో ఆవులు, ఆవు దూడలు, ఎద్దులు, కోడెలు ఉన్నవి. వాటిని గుర్తించటానికి వివిధ రకాల వర్గాలుగా విభజించారు. ఉదాహరణకు - నల్రావులు, కవిలావులు, జెన్నావులు, బసవ ముద్ర ఎడ్లు, లింగ ముద్ర ఎడ్లు మొదలగునవి.

పశువులు మేసే ప్రాంతానికి యాదవులు తమతో పాటు గుడారాలు, మంచాలు, పెట్టెలు, ఆయుధాలు, తివాచీలు, రణభేరి, గుత్తి కవ్వాలు, పంచవాయిద్యాలు, ఏనుగులు, గుర్రాలను తీసుకొని వెళ్లేవారు.

## ఆవుల పరపు :

యరగడ్డపాడు యుద్ధంలో వీర మరణం పొందిన యోధులను, ఆవులను, ఎద్దులను గుర్తుంచుకోవడం కోసం ఇప్పటికి కుంభగిరి గ్రామం (కడప జిల్లా)లో పూజించుతున్నారు. ప్రతి సంవత్సరం 'ఆవుల పరపు'[62] ఉత్సవాలు జరుపుతున్నారు. ఈ విషయం సిద్ధవటం కైఫీయతులో వివరించబడింది. యరగడ్డపాడు యుద్ధంలో చనిపోయిన ఆవుల ఎద్దుల కొమ్ములు, తీసుకొని వచ్చి యాదవులు తమ ఇండ్లలో భద్రపరచుకొన్నారు. ఆ కొమ్ములకు ప్రతిరోజు పసుపు రాసి సాంబ్రాణి పొగ వేస్తారు. ఇక్కడ రాతిలో చెక్కిన ఆవుల విగ్రహాలు కన్పిస్తాయి. ఈ ప్రాంతాన్ని ఆవుల మాలె అని పిలుస్తారు. ఆవుల పరపు ఉత్సవాల సమయంలో యాదవుల ఇండ్లలో భద్రపరచబడిన ఆవుల కొమ్ములను తీసుకొని వస్తారు. వీటిని తీసుక వచ్చే సమయంలో పంబజోళ్లు, జమిడికె. మద్దెల, వాయిద్యాలను మ్రోగిస్తారు.

ఆవుల పరపు - ఉత్సవాలకు రావలసిందని దూరాన ఉన్న బంధువులకు పసుపు గుడ్డలో అక్షింతలు కట్టి పంపుతారు. ఈ ఉత్సవం జరిగే రోజు కొందరు యాదవులు ఎల్లెద్దు, (తెల్లఎద్దు) , కర్రెద్దు (నల్లఎద్దు), బోడెద్దు (కొమ్ములు లేని ఎద్దు), లాగా నటించుతారు. పంబ జోళ్లు వాయించే వ్యక్తి ఎద్దులాగ నటించేవారితో ఒకరి దగ్గరకు వస్తాడు. ఆ ఎద్దు యరగడ్డపాడు యుద్ధంలో చేసిన పోరాటాన్ని పొగడుతూ పంబజోళ్లు వాయిస్తాడు. ఇలా జరిగేదాన్ని "తానకం" అంటారు. ఆ తరువాత వారంతా కలిసి, కాటమరాజు గొప్పతనాన్ని వర్ణించుతూ గానం చేస్తారు. చివరకు పెసరపప్పు, శనగ పప్పు ఫలహారాలు, రాతిలో చెక్కబడిన ఆవుల శిల్పాలకు, కొమ్ములకు ప్రసాదంగా పెడతారు. ఈ ప్రసాదాన్ని యాదవులు తమ ఇండ్లకు తీసుకొని పోయి ఆవులకు పెడతారు.[63]

కాటమరాజు మీద తమకున్న అభిమానాన్ని తెలియచేసుకోవడానికి, కడప, నెల్లూరు ప్రాంత గ్రామాలలోని యాదవులు ఆవుల పరపు ఉత్సవాలను జరుపుతున్నారు.

## నంది పూజ :

కాకతి రుద్రమ దేవి, తన కూతురు ముమ్మడమ్మతో నంది పూజ చేయించి, బ్రాహ్మలకు దక్షిణతొ పాటు ప్రతి ఒక్కరికి ఒక ఎద్దును దానం చేసింది. ఈ విషయం సిద్దేశ్వర చరిత్రలో వివరింపబడింది. యరగడ్డపాడు యాదవులేకాక , కాకతీయుల కాలంలో ప్రజలు చాలా మంది నందిని పూజించేవారని తెలుస్తుంది.[64]

### తలలు తెగ నరుక్కోవటం :

కళ్యాణంలోని బసవేశ్వర దేవాలయం వద్ద కొందరు శివ భక్తులు తలలు నరుక్కొని మొక్కులిచ్చేవారు.[65] ఈ విషయం కాటమరాజుకు పట్టం కట్టిన కథ - తాళపత్ర గ్రంథంలో ఉంది. యాదవులు వేడి చేసిన పాలను ఎద్దులకు పోసేవారు, ఆవులకు వెన్న తినిపించేవారు.[66]

### చనిపోయిన పశువుల సమాధి :

కాటమరాజు, తన అనుచరులు, చనిపోయిన పశువుల పై కూడా తగు శ్రద్ధ చూపించేవారు. వీటిని పూడ్చి పెట్టే విషయంలో ఆచార వ్యవహారాలను పాటించేవారు. ముందుగా పెద్ద గొయ్యి త్రవ్వేవారు. ఆ గోతిలో గంధం, కస్తూరి, పునుగు, జవ్వాది, వేసి పూలు చల్లేవారు. చనిపోయిన ఆవు, లేక ఎద్దును గోతిలో పెట్టి ముందు మంగళ వాయిద్యాలను వాయించేవారు. జంగము వారు శంఖులను ఊదేవారు. ఆ తరువాత గోతిని పూడ్చేవారు.[67]

### తటాకాలు - దేవాలయాలు :

ఆ కాలంలో రాజులు, రాణులు, మంత్రులు, తటాకాలు త్రవ్వించి, దేవాలయాలు కట్టించేవారు. వరి తదితర పంటలు పడించడానికి నీటి వసతి కల్పించేవారు. అవుల వలురాజు మంత్రి తరిముత్తరాజు యలమంచిలో ఒక చెరువును త్రవ్వించి కరకంఠ దేవాలయం కట్టించినట్లు బల్లికురువ పోట్లాట, తాళపత్ర గ్రంథం తెలుపుతుంది.[68]

నెల్లూరు చెరువు క్రింద రకరకాలైన వరి ధాన్యాన్ని పండించేవారు. జన్నివాడ కథ - తాళపత్ర గ్రంథంలో వరి పేర్లు ఇవ్వబడినాయి. అవి - కస్తూరి, నిగవాలు, గాజుశ్రౌరీలు, రాజనాలు, రావిగుత్తులు, దినసరాలు, ముత్యపు సరాలు, గజ దంతాలు, మొగత కందలు, ఎర్రమచ్చలు, గోధుమలు, కళింగ పువ్వులు, గుమ్మడి గుత్తులు, పులి మీసాలు, పున్నమి వెన్నెల, మొలకలు, శ్రీరామ వంకెలు, బంగారు తీగలు - వివిధ రకాల మేలు రకమైన వరిధాన్యాన్ని పండించినట్లు తెలుస్తుంది.[69]

### గడియారము :

కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు - తాళపత్ర గ్రంథంలో కాలాన్ని గడియారం "మొగసాల" తో తెలుసుకున్నట్లు వివరింపబడింది.[70]

## ముగింపు

1975లో "కాటమరాజు కథ" - గ్రంథాన్ని చదివే అవకాశం నాకు కలిగింది. దీని రచయిత గంగుల వీన యల్లయ్య, వేటూరి ప్రభాకర శాస్త్రి పరిష్కరించారు. గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ, మద్రాసు వారు 1953లో ప్రచురించారు. ఈ కాటమరాజు కథ గ్రంథానికి పీఠిక వ్రాస్తూ మల్లంపల్లి సోమశేఖర శర్మ, పుల్లరి ఒప్పందం, యురగడ్డపాడు యుద్ధానికి కారణాలు తెలుసుకోవటానికి ఈ గ్రంథం పూర్తి సమాచారం ఇవ్వటం లేదని అన్నారు. కాటమరాజు చరిత్ర, యురగడ్డపాడు యుద్ధం పూర్తి సమాచారాన్ని సేకరించాలనే అభిప్రాయం కలిగింది. అందువలన కాటమరాజు చరిత్రకు సంబంధించిన వివిధ తాళపత్ర గ్రంథాలను సేకరించడం మొదలు పెట్టాను. వాటిని పరిశీలించిన తరువాత కాటమరాజు చరిత్రపై పరిశోధన చేయాలనే పట్టుదల పెరిగింది.

ఈ కాటమరాజు చరిత్ర, ప్రముఖంగా తాళపత్ర గ్రంథాలను ఆధారంగా చేసుకొని రచించడం జరిగింది. ఆంధ్రదేశం అంతటా తిరిగి, అరుదైన తాళపత్ర గ్రంథాలు, కాటమరాజు చరిత్రకు సంబంధించినవి సేకరించాను.

గుత్తికొండ భక్త వత్సలకవి తాను రచించిన కరియావుల కాటమరాజు చరిత్రను ద్విపదలో

వ్రాసినట్లు తెలిపారు. గంగుల పిన యల్లయ్య రచించిన యరగడ్డపాటి పోట్లాటలో, తను శ్రీనాథుడు చెప్పిన విధంగా కాటమరాజు చరిత్రను సంపూర్ణంగా వ్రాశానని చెప్పాడు.

గుఱ్ఱంకొండ భక్త వత్సల కవి, గంగుల పిన యల్లయ్య చెప్పిన విషయాలను బట్టి, శ్రీనాథుడు, కాటమరాజు చరిత్రను ద్విపదలో రచించినట్లు తెలుస్తున్నది. కాని శ్రీనాథుడు స్వయంగా రచించిన కాటమరాజు చరిత్ర తాళపత్ర గ్రంథం లభించటం లేదు. మల్యాల దేవి ప్రసాద్ రచించిన యాదవ చంద్రికలో కాటమరాజు చరిత్రను పద్యకావ్యంగా కేతన వ్రాశాడని తెలియచేశాడు. ఇది కూడా అలభ్యం. వీటి విషయమై పరిశోధన చేయవలసి ఉన్నది.

ప్రకాశం జిల్లాలోని, పంచలింగాల కొండ, గంగదొన కొండ, కనిగిరి, గుండంచర్ల, అర్ధవీడు, గుండ్లపాలెం, విశాఖపట్టణం, జిల్లాలోని యలమంచి, తూర్పు గోదావరి జిల్లాలోని పంపాద్రి ప్రాంతాలు తిరిగి అవసరమైన ఫోటోలను తీసుకొని, శాసనాలు, శిలా విగ్రహాలు, శిథిల భవనాలు, పరిశీలించి కాటమరాజు కథలు చెప్పే గాథాకారులతో చర్చించాను.

ఆంధ్రదేశం మధ్యయుగం, పన్నెండవ, పదమూడవ శతాబ్దముల నాటి రాజకీయ పరిస్థితులను తెలుసుకొనుటకు తూర్పు చాళుక్యులు, యలమంచిలి చాళుక్యులు, కాకతీయులు, నెల్లూరు తెలుగు చోడులు, మరియు తూర్పు గాంగ వంశీయులు వారి రాజకీయ చరిత్రను చర్చించడం జరిగింది. కాటమరాజు బడుగుల కుటుంబానికి చెందిన యాదవ వంశీయుడు. ఈ విషయం తాళపత్ర గ్రంథాలు, శాసనాలు కూడా తెలియచేస్తున్నాయి. కాటమరాజు పూర్వీకులు తాము శ్రీకృష్ణుని మనుమడైన వజ్రుని సంతతి వారమని తెలిపారు. వజ్రుని సంతతి వారు మధుర, నుండి మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర దేశానికి వలస వచ్చినట్లుగా తెలుస్తున్నది.

కాటమరాజు పూర్వీకులు - అవుల వలురాజు, సింహాద్రి రాజు, పెద్దిరాజు, యరనూక రాజు, నలనూకరాజులు, వరుసగా ఖండెమొండెముల కోట, శ్రీకూర్మం, అర్లపెంట, యేనుగునాథుకొండ, నున్న, శ్రీరంగం ప్రాంతాల రాజులపై పోరాడి యుద్ధంలో చనిపోయారు. ఖండెమొండెముల కోట శ్రీకూర్మం, శ్రీకాకుళం జిల్లాలో ఉన్నాయి. అర్లపెంట కర్ణాటకలోని కళ్యాణం సమీపంలో ఉన్నది. యేనుగువాధ కొండ చిత్తూరు జిల్లాలో ఉంది. నున్న, కృష్ణా జిల్లాలో ఉంది. శ్రీరంగం, తమిళనాడులో ఉంది. పైన తెలిపిన విషయాలను కాటమరాజు చరిత్రకు సబంధించిన తాళపత్ర గ్రంథాలు, వీరగాథలు, సమర్ధిస్తున్నాయి. కాని, శాసనాధారాలు కనిపించటం లేదు. ఖండెమొండెముల కోటను ప్రస్తుతం మొండెంకల్‌గా పిలుస్తున్నారు. దీని చుట్టుపట్ల ప్రాంతాలలో వల్లాపురం, పెద్దపాడు, యలమంచిలి మరియు వీరగట్టం గ్రామాలు ఉన్నాయి. మొదటి రెండు గ్రామాలు - వలురాజు, పెద్దిరాజుల పేర్ల మీద కట్టి ఉంటారు. వీరిద్దరూ యలమంచి రాజ్యాన్ని పాలించారు. వీరఘట్టం, యలమంచి, కాటమరాజు పూర్వీకులు పాలించిన ప్రాంతాలు. తాళపత్ర గ్రంథాలలో యలమంచి, ఎలమంచి అని వ్రాశారు. ఈ రెండు ఒకటే - అదే విధంగా, ధనకొండ, ధనుమకొండ, దొనకొండ పేర్లు కూడా ఒకటే.

అయితమరాజు, కరియావుల రాజులు, కాటమరాజు, పినతండ్రి - పెద తండ్రి కుమారులు. వీరు కాటమరాజు చరిత్రలో ప్రముఖమైన పాత్ర వహించారు. శంభుని జాతర చూడటానికి వీరు పల్లికొండ, కొంతమంది యాదవులతో కలిసి ఓరుగల్లు వెళ్లారు. కాకతి ప్రతాపరుద్రుడు వీరిని చంపడానికి కుట్ర పన్నాడు. పల్లికొండ తెలివిగా వీరిని రక్షించాడు. కరియావులరాజు ఓరుగల్లు బేతాళుని మల్లయుద్ధంలో చంపివేశాడు. కాకతీయ సైన్యం యాదవులను గవిలికొండ దగ్గర ఎదుర్కొన్నారు. కాని వారిని అణచలేక పోయారు. గవిలికొండ వరంగల్ జిల్లాలో ఉంది.

రుద్రమదేవి కాలంలో దేవగిరి యాదవులకు, ఓరుగల్లు కాకతీయులకు మంచి స్నేహ సంబంధాలు లేవు. అయితమరాజు, కరియావులరాజులు, యాదవ వంశానికి చెందిన వారు కావటం వలన

యువరాజు ప్రతాపరుద్రుడు వారిని అనుమానించాడు. బడుగుల కుటుంబం వారికి కాకతీయులకు మధ్య తగాదా రావటానికి ఇదే కారణమై ఉంటుంది. బల్లికురువ పోట్లాట, కరియావులరాజు చరిత్ర తాళపత్ర గ్రంథాలు యాదవులు, కాకతీయుల మధ్య తగాదాలను సవివరంగా తెలుపుతున్నాయి. ఈ తాళపత్ర గ్రంథాలలోని విషయాలను సమర్థించే శాసనాధారాలు కనిపించటం లేదు. కాటమరాజుకు పట్టం కట్టిన కథ - తాళపత్ర గ్రంథంలో, పల్లికొండ సలహానసరించి అయితమరాజు ఓరుగల్లు ప్రాంతంలో మరొక యలమంచి పట్టణాన్ని నిర్మించినట్లు తెలుస్తుంది. దీనిని ఉర్లుకొండ యలమంచి అంటారు. పదమూడవ శతాబ్దంలో యలమంచి పట్టణం, యలమంచిలి చాళుక్యులు పాలనలో ఉంది. ప్రస్తుతము ఉర్లుకొండ యలమంచి ఖమ్మం జిల్లాలోని పాలేరు సమీపంలో ఉంది. ఇక్కడ యాదవులు ఉర్లుకొండ యలమంచి గంగజాతరలు ఇప్పటికి నిర్వహిస్తున్నారు. కాటమరాజుకు పట్టాభిషేకం చేసింది ఇక్కడనే.

డా॥ ఎమ్. ముకుందరావు తూర్పు కళింగ గాంగ వంశముపై పరిశోధన చేశారు. వారి పరిశోధనా వ్యాసంలో క్రీ.శ. 1070 - 1197లో యలమంచిలి గాంగ వంశం వారి అధీనములో లేనట్లు తెలిపారు. కాటమరాజు పూర్వీకులు యలమంచిని క్రీ.శ. 1075-1205 మధ్య కాలంలో పాలించి ఉంటారు. కాటమరాజు, తాత, - తండ్రులైన వలురాజు, పెద్దిరాజులు, యలమంచిని క్రీ.శ. 12వ శతాబ్దంలో పాలించారు.

కాటమరాజుకు మర్ల అన్నమ్మ కూతురు గంగమ్మను ఇచ్చి వివాహం చేశారు. వివాహం అయిన తరువాత కాటమరాజు తాత తండ్రుల శత్రువులను హతమార్చే వరకు తన చేతికి కట్టిన వీర కంకణం విప్పటానికి తిరస్కరించాడు. శత్రువులను నాశనం చేసేవరకు భార్య గంగను తాకనని కాటమరాజు శపథం చేశాడు. అప్పటి వరకు భార్య గంగమ్మను, గంగా భవానిగా భావించుతానన్నాడు.

కాటమరాజును యలమంచి, ధనకొండ, కనిగిరి, యరగడ్డపాడు ప్రాంతం యాదవులకు రాజుగా పట్టాభిషేకం చేశారు. పశువుల మందలు ఎక్కడ ఉంటే అక్కడ ఒక పెద్ద గుడారం నిర్మించి, దాని మధ్యలో కాటమరాజు సింహాసనం ఉంచేవారు. మంత్రులు, సలహాదారులు, యాదవ ప్రముఖులు, సైన్యం కాటమరాజును అనుసరించేవారు. కాటమరాజు పాలనాకాలంలో ధనకొండ యాదవులకు ప్రధాన కేంద్రం. కాటమరాజు పశువుల మందలతో ఒక చోటు నుండి మరొక చోటుకు ప్రయాణం చేస్తూ శత్రువులను హతమార్చాడు.

యరగడ్డపాడు యుద్ధానికి ప్రధాన కారణం, నెల్లూరు తెలుగు చోడ వంశానికి, బడుగుల కుటుంబం వారికి వంశపారంపర్యంగా ఉన్న తగాదాలు, పుల్లరి ఒప్పందాన్ని రాగి రేకులపై వ్రాశారు. పంచలింగాల కొండ గంగ దేవాలయం పూజారి, బొడ్డెబోయ్ని గంగయ్య, పుల్లరి రాగి శాసనం, తన తండ్రి బొడ్డెబోయ్ని అయ్యన్న కాలంలో వెంగళాపురంలోని ఇల్లు కాలిపోయినపుడు, అమంటల్లో - అది కూడా కాలిపోయిందని తెలియచేశారు. నేను బొడ్డెబోయ్ని గంగయ్యను స్వయంగా కలిసినపుడు ఈ విషయం చెప్పాడు.

యరగడ్డపాడు యుద్ధంలో ఆవులు, ఎద్దులు, పాల్గొన్నాయి. ఇప్పటికి, ఆవు - గుఱ్ఱం, ఎద్దు - ఏనుగు, పోరాడుతున్నట్లు చెక్కిన విగ్రహాలు, గంగదేవాలయం, గోడలకు దొనకొండలో కనిపిస్తున్నాయి. కాటమరాజు, వల్లసిద్ధి తలవరికి, పాలేటి గంగకు పాదకానుక పెట్టి తాత తండ్రుల పగలు తీర్చుకున్నాడు.

గుండ్లపాలెం శాసనంలో, యాదవులు నెల్లూరు సైన్యంచేత ఓడింపబడినట్లు ఉంది. నెల్లూరులో నల్లసిద్ధి పాలన క్రీ.శ. 1282 వరకు కనిపిస్తుంది. కాటమరాజు వంశీయుల పాలన క్రీ.శ. 1282 వరకు కనిపిస్తుంది, కాటమరాజు వంశీయుల పాలన క్రీ.శ. 1282 తరువాత కనిపించడం లేదు. తాళపత్ర గ్రంథాలలో అతిశయోక్తులు ఎక్కువగా కనిపిస్తున్నాయి. అతిశయోక్తులను వదలివేసి, చారిత్రక విషయాలను తీసుకోవటం జరిగింది.

వలురాజు చరిత్ర, పెద్దిరాజు కథ, పోలురాజు కథ, కరియావుల రాజు చరిత్ర, కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు, జన్నివాడ కథ, పాపనూక కథ, యరగడ్డపాటి పోట్లాట, మొదలైన తాళపత్ర

గ్రంథాలు - గుండ్లపాలెం, గంగదొనకొండ, పంచలింగాల కొండలోని శాసనాలు, శిల్పాలు, శిథిల భవనాలు, నాణాలు, కైఫీయతులు, వీరగాథలు, చాటుపద్యాలు, మొదలగు ఆధారాలన్నీ కాటమరాజు చరిత్రను వ్రాయుటానికి చక్కగా ఉపయోగపడుతున్నాయి. తాళపత్ర గ్రంథాలలో తెలిపిన విషయాలు, కైఫీయతులు, వీరగాథలు, చాటుపద్యాలలోని సంఘటనలతో సరిపోతున్నాయి. ఇవన్నీ కాటమరాజు చారిత్రకతను ధృవపరుస్తున్నాయి.

పరిపాలనా విషయంలో మంత్రులు రాజుకు ఎల్లవేళలా సలహాలిచ్చేవారు. పల్లికొండ, తిరుమందుల తిరిమత్తరాజు, చట్టమారయ్య, కల్లందుల పోలినీడు, బ్రహ్మరుద్రయ్య, పద్మరాఘవ మొదలగు వారు కాటమరాజు వంశీయులకు మంత్రులుగా సేవ చేశారు.

యాదవుల సైన్యంలో ఆవులు, ఎద్దులు, అశ్వదళం, కాల్బలం, ఉండేవి. యుద్ధరంగంలో గుర్రాలు, ఏనుగులను ఎదుర్కొనటానికి ఆవులకు, ఎద్దులకు శిక్షణ ఇచ్చేవారు.

ఈ కాలంలో సతీ సహగమనం ఆచరణలో ఉంది. కాని బలవంతంగా అమలు జరపటానికి ప్రయత్నం చేయలేదు. యాదవ రాణులు, వల్లమ్మ, పెద్దమ్మ, యరనూక సీత, తదితరులు ఇష్టపూర్తిగానే సహగమనం చేసినట్లు తెలుస్తుంది. యాదవుల, రెడ్డి కుటుంబాల మధ్య వివాహ సంబంధాలు జరుగుతుండేవి. కాటమరాజు, పినతండ్రి పోలురాజు రెడ్డికుటుంబానికి చెందిన సిరిదేవిని వివాహం చేసుకున్నాడు. సిరిదేవి జాంబవంత (మాదిగ) కులానికి చెందిన బీరినీడును పెంచి పెద్ద చేసింది.

యాదవులు మత సహనం చూపించి హరిహర సాంప్రదాయాన్ని ప్రోత్సహించారు. శైవ వైష్ణవ మతాలను సమానంగా చూశారు. ఈ రెండు మతాల మధ్య తగాదాలను రూపు మాపడానికి ప్రయత్నం చేశారు.

శత్రువుల పై పగ తీర్చుకోవడం ధర్మంగా భావించారు. వంశ పారంపర్యంగా శత్రుత్వం వస్తుండేది. కాటమరాజు తన తండ్రి, పినతండ్రులను చంపిన శత్రువులను యుద్ధ రంగంలో హతమార్చి, వారి తలలు నరికి గంగకు పాద కానుకగా ఇచ్చాడు.

కాటమరాజు వంశీయులకు అపారమైన పశు సంపద ఉంది. ఆనాడు ఆంధ్ర దేశంలో వ్యవసాయం, పశుపోషణ ముఖ్య వృత్తులు. వ్యవసాయదారులకు ఎద్దులు, కోడెలు అవసరముండేది. యాదవులు సమాజానికి ఆవులు, ఎద్దులు, కోడెలు , పాలు, పెరుగు, నెయ్యి, సరఫరా చేసేవారు. కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు, తాళపత్ర గ్రంథంలో - కాటమరాజు ఉత్తర కాంభోజిలో ముప్పది ఏడు యుద్ధాలు గెలిచినట్లు చెప్పబడింది. మహారాష్ట్రలో గోదావరి తీర, అమరావతి ప్రాంతాలలో కాటమరాజు చారిత్రక సంఘటనలు, కనిపించే అవకాశం ఉంది.

భక్తిరన్న - తాళపత్ర గ్రంథంలో యరగడ్డపాడు నందు నవ నిధులు ఉన్నట్లు వివరింపబడింది. ఇక్కడ కాటమరాజు కోట శిథిలాలు ఉన్న చోట నిధి ఉన్నదని గాథాకారుల నమ్మకం. యరగడ్డపాడు, గంగదొనకొండలో పురావస్తు శాఖవారు త్రవ్వకాలు జరిపితే నిధి, నిక్షేపాలు బయట పడే అవకాశం ఉంది. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఒంగోలు జాతి గిత్త కాటమరాజు ఆవులు, ఎద్దుల సంతతికి చెందినదే. కాకతీయుల కాలం నాటికి చాలా మంది వ్యవసాయంపై మొగ్గు చూపి, తమ ఆదాయ మార్గాలను పెంచుకునే తరుణంలో - యాదవులు ఇంకా పశుపోషణ మీదనే ఆధారపడి ఉన్నారు. కరువు-కాటకాలు ఏర్పడినపుడు, పశుపోషణ భారం కావడం, దూర ప్రాంతాలకు పశువుల మేతకై తరలి పోవడం, ఇతరులతో తగాదాలు రావటం, యుద్ధాలు చేయడం, ఆర్థికంగా నష్ట పోవడం మొదలైన కారణాలు యాదవులు అధికారం కోల్పోవడానికి తోడ్పడినవి.

# నోట్స్ అండ్ రిఫరెన్స్


1. పిచ్చయ్య ; సం॥ పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం. పుట : 16-17
2. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; వలురాజు చరిత్ర ; తా.ప.గ్రం. - మద్దులేటి కవి, పుట : 48
3. ఇదే పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం., పుట : 181
4. సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; అగుమంచి కథ ; తా.ప.గ్రం. - చెన్నయ్య, పుట : 470-475
5. వెంకురాం ; పాపనూక కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 32-41
6. సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; కాటమరాజు ఉత్తరాది ఆవుల మేవు ; తా.ప.గ్రం. పుట : 20
7. పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 19
8. ప్రభాకరశాస్త్రి ; సం॥ కాటమరాజు కథ ; కోటపాటి తాటి వృక్షం తెచ్చే కథ ; కాగితపు ప్రతి పుట : 197
9. పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 30
10. ప్రభాకరశాస్త్రి ; సం॥ కాటమరాజు కథ ; కోటపాటి తాటి వృక్షం తెచ్చే కథ ; తా.ప.నెం. : 207
11. సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; కాటమరాజు ఉత్తరాది ఆవుల మేవు ; తా.ప.గ్రం. పుట : 47
12. ఇదే, యరనూకరాజు కథ ; తా.ప.గ్రం., పుట : 565
13. గట్టయ్య జన్నివాడ కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 39
14. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పంపాద్రి కథ ; తా.ప.గ్రం. - మల్లయ్య, పుట : 121
15. ఇదే , పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం., పుట : 112-113
16. ఇదే
17. సుబ్బారావు సం॥ వీరగాథలు - II ; యరనూకరాజు కథ ; తా.ప.గ్రం., పుట : 574
18. పిన యల్లయ్య యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 7-10
19. వెంకురాం ; పాపనూక కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 7
20. ఇదే - తా.ప.నెం. - 42, చాగంటి శేషయ్య ; ఆంధ్రకవి తరంగిణి - 1960 పుట : 144
21. మద్దులేటి కవి , వలురాజు చరిత్ర ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 32
22. పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 31
23. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 275
24. పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 32-33
25. సహగమన గుండం వద్ద ఏర్పాటు చేయబడిన చిన్న దిమ్మె
26. పెద్దిరాజు కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 34
27. పిచ్చయ్య ; సం॥ కరియావుల రాజు చరిత్ర ; తా.ప.గ్రం. పుట : 2
28. వెంకట్రామయ్య ; భక్తిరన్న కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 26
29. సుబ్బారావు సం॥ వీరగాథలు ; భక్తిరన్న కథ ; తా.ప.గ్రం. పుట : 558
30. పిన యల్లయ్య ; యరగడ్డపాటి పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 40
31. వెంకురాం ; పాపనూక కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 1-10
32. ఇదే
33. ఇదే
34. ఇదే
35. ఇదే
36. ఇదే
37. ఇదే తా.ప.నెం. : 5-6
38. ఇదే తా.ప.నెం. : 7
39. ఇదే

40. ఇదే తా.ప.నెం. : 9
41. ఇదే తా.ప.నెం. : 42
42. పిచ్చయ్య ; సం॥ పోలురాజు చరిత్ర ; తా.ప.గ్రం ; 1976 పుట : 20
43. అగుమంచి చరిత్ర ; కాగితపు ప్రతి నెం. : 1599 - శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము ఓరియంటల్ లైబ్రరీ ; తిరుపతి పుట : 22
44. అరుణకుమారి పుట : 157
45. ఇదే
46. గట్టయ్య ; పోలురాజు యుద్ధం ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 1-2
47. బల్లికురువ పోట్లాట ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 13
48. పిచ్చయ్య ; సం॥ కరియావుల రాజు చరిత్ర ; తా.ప.గ్రం., పుట : 42&45
49. గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 1
50. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పోలురాజు కథ ; తా.ప.గ్రం. - గట్టయ్య, పుట : 316-317
51. వెంకట్రామయ్య ; భక్తిరన్న కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 10
52. డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం, సం॥ మార్కండేయ పురాణం - మారన, 1984 ; పీఠిక ;పుట : XXII
53. డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు ; రిలీజియన్ ఇన్ ఆంధ్ర ; 1973 । పుట :
54. వెంకట్రామయ్య ; భక్తిరన్న కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 9-10
55. డా॥ నాయని కృష్ణకుమారి ; తెలుగు జానపద గేయ గాథలు - 1990 పుట : 275
సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పీఠిక, పుట : CXXXXIV
56. ది. 18-5-1987నాడు పంచలింగాల కొండ (ప్రకాశం జిల్లా)కు వెళ్లి గంగ దేవాలయం ముందు ఏర్పాటు చేసి యున్న 'సిడి'ని చూచి, దానిని ఎలా తయారు చేశారనేది పరిశీలించడం జరిగింది.
57. భొర్జె బోయ్న గంగయ్య, గంగ దేవాలయం పూజారి - వెంగళాపురం నివాసి, (ప్రకాశం జిల్లా) సిడికి సంబంధించిన వివరాలు దాని ఉపయోగం తెలిపాడు.
58. గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 2
59. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; పంపాద్రి కథ ; తా.ప.గ్రం. - మల్లయ్య పుట : 140-143
60. ఇదే
61. ఇదే - కాటమరాజుకు పట్టము కట్టిన కథ ; తా.ప.గ్రం. మారయ్య, పుట : 524-525
62. గట్టయ్య ; జన్నివాడ కథ ; తా.ప.గ్రం., తా.ప.నెం. : 1-5
63. ప్రభాకరశాస్త్రి ; సం॥ కాటమరాజు కథ ; పీఠిక పుట : XXXIV
64. కాసే సర్వప్ప ; శ్రీ సిద్ధేశ్వర చరిత్రము ; పుట : 131
65. సుబ్బారావు సం॥ వీరగాథలు - I ; కాటమరాజుకు పట్టం కట్టిన కథ ; మారయ్య, పుట : 501
66. ఇదే - వీరగాథలు - II ; కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు తా.ప.గ్రం.; పుట : 19
67. ఇదే పుట : 27
68. బల్లికురువ పోట్లాట ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 55
69. గట్టయ్య జన్నివాడ కథ ; తా.ప.గ్రం. తా.ప.నెం. : 30 & 31
70. సుబ్బారావు సం॥ - వీరగాథలు - II ; కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు తా.ప.గ్రం.; పుట : 34

# అనుబంధము - I

## గుండ్లపాలెం శిలాశాసనం

**NDI. Part - II, P. No. : 527 to 535**

### ప్రథమభాగము

1. యాదవ జల్మం[1] వైశంపా
2. యిందు పరీక్షిత్తుకు యి
3. ట్లనిఎ అధితికి కశ్యపునకు పుట్టి
4. న వైవస్వతుండను మనువునకు
5. యె ముందును శనేశ్వరుం
6. డ్డను యెమున యుందపతి యుం
7. బుట్టిరందు వైవస్వతుండను మను
8. వు వలన బ్రహ్మ క్షత్రియ వైశ్య సూ
9. ద్రులైన మానవులు అనేకులు పు
10. ట్టిరి. వారికి[2] శేన ప్రముఖులైన రాజులు
11. యనమండ్ర పుట్టిరి। ఆ ముని పుత్రి ఐ
12. న యిలగన్య సోమ పుత్రుండైన బుధు
13. నకు పురురవ చక్రవత్తిఁ పుట్టె పురూరవు
14. నకు పూవఁసికి వా యువుండు పుట్టె నా
15. యువునకున్ స్వభాఁయుకున్ నభిషుండుపు
16. ట్టె రాజ్యంబు సేశె నభిషునకున్ ప్రియమోను[3]।
17. నకున్ యయాది పుట్టె యనాక యాగంబులు సేసె
18. ను యయాదికిని శుక్రుని పుత్రి యైన దేవయాన
19. కున్ యదువు జన్మించెను। శీలము గల యదుకులాత్మ
20. జుండు యాత్రియ గోత్ర జుండ్డు ఆసూరూను
21. ండను వాండు మధురా పురంబ్బుందనకు రాజధాని
22. గా మాధురంబులు సూరసేనంబుల నియెడి దేశంలేలె పూ
23. ర్వ కాలమున అసూరునునికి పుత్రుం వసు దేవుండు అచట
24. రాజేంద్ర విను తొల్లి రాజలాంచ్చనంతో వేల
25. సంఖ్యలు దైత్య విభులం దన్ను। ఆక్రమించ్చిన భూమి భా
26. ర మానం జాలక గోరూపు యై బ్రహ్మం జేరంబోయి క
27. న్నీరు మున్నీరు రోధనం శాయ కరుణతో భావించి కమ
28. ల భవుండు ధరణి నూరడం బల్కి ధాత్రియును వెల్పులు క
29. దిలి రా విష్ణునింగాన నెంగి పురుష సూక్తంబు చదివి య
30. ద్భుద సమాధి నుండి యోక మాంట విని వారి జోద్భవు
31. ండ్డు వినుండి వేల్పులు ధరయును విన్న యెట్టి పలుకు వివరించెద.

32. నని ప్రీతిం బలికెం దెలియ యాదవ కులమున నమరులు మెదిని
33. పైం బుట్టం జనుండు మీ యంశమునన్ । శ్రీ దైత్యుండు వసుదేవు
34. న కాదరమునం బుట్టి భార మంత్తయుం భాపును హరి పూజాతఁ్రం
35. పుటుండు సురకన్యలు భూమి యంద్ను సుందర తనులై హరిక(గజు
36. ంఢై శేషుండు హరి కళతోంబుట్టి భార మంతయుం బాపును । అవనీ
37. శ విను ద్రోణుండను వాండు వసువుల యందు ముఖ్యుండు ధర అ
38. తని భార్య ఆవెల్పుల పెద్ద అద్రోణుండు ఈ నంద్ద గోపంకుండై జన్మి
39. ంచె ధరయియ్యు హరి యోగ మాయ యశోద నంద్కుడు గాయై జె
40. ల్మించె యల్ల ధేనలెల్ల రుషుల అంశమున జన్మించె సురలెల్ల గోరక్ష
41. పాలకులై జన్మించ్చె దేవకీ యను తొల్లి స్వాయంభు మను నంతరంబు
42. న పుష్టి యును ప్రతివ్రత వసుదేవుండ్ణను[4] । సుతు పుణ్యుండను ప్రజాప
43. తి రెండవ జన్మమున అధితి యుంగస్య పుండును మూండువ జన్మమున
44. వసుదేవ దేవకి రామ క్రిష్ణులు వుద్భవించిరి అక్షరాంగనలు గోప కన్యలై వు
45. దయించిరి రామక్రిష్ణులు మొదలైన సర్వ యాద గోపులు గోపాలల్కు ద్వాపార ఆ
46. ంత్యమున కూడ వతిఁ్ణంచ్చి అచటం గొనాళ్ళ । దుర్యోధనాదులం ద్రుంచ్చి పాండ్ల
47. వుల పరగ బట్టంబు గట్టి సంతోషమ్ము వచ్చే ద్వారకా పురికి కణ్వ మహా ము
48. నుల గాంధారి శాపం వంకను మునుకొని యన్నంగ ముప్పది యారువష ఁ్షులు
49. శ్రీక్రింష్ణ మోదలైన సర్వ యాదవలు రాజ్యంబు సేసిరి । శయ్యంగ నొక్కనాండు
50. వుత్పాతములు వొడిమె వుఫీఁ్ణ శు పంపున । జాతరలు శయ్యను ద్వారవతి
51. కదిలిరి శ్రీ క్రిష్ణ యాదవులు సముద్రుని కడకు జలధి తీరమున సవ పా
52. న మత్తులై విష్ణ భోజాంత్తక వీరులెల్ల మునివర నిధిఁ్ణ ష్టమున నిధిఁ్ణ ష్టము స
53. లాంత్మకృములైన,[5] ముయ్యంచ్చు తుంగ్గల మోందులాడి మ్మ
54. తులైరి అంత [6] తారకుండు చని పాండవుల కెరింగి
55. ంచెు

(1). జన్మం. (2). చాలా. (3). మను. (4). డు. (5). ముసలాత్మకములైన. (6). దారకుండు.

## ద్వితీయ భాగము

1. అజుఁ్ణనుండు ద్వారావతికి వచ్చి
2. వసు దేవునింగని శ్రీ క్రిష్ణ పరమ మూ
3. త్తిఁ్ణంగలసె [1]అధవులు దేవగణానంగ
4. లసిరి ద్వారావతి వనధి ముంచ్చునని ఆ
5. క్షణమె బాల వ్రిద్ధులాను[2] అక్షురాం
6. గ్గనలాను గోపాంగ్గన లాను గొంచ్చు
7. అజుఁ్ణనుండు యింద్ర ప్రస్థ కుంచె
8. చ్చెను । అదవ కుల కరుండైన వజ్రధరుని

9. ంబట్టంబు గట్టెను । యాదవ గోపికా పౌత్ర
10. ని నేమించ్చి గోవులకు గోరక్ష పాలకునింజె
11. సి గోవులం గాపాడు మని ఘనవిరపురంబ్బు
12. న అమృత గోవిందుని అభిషిక్తు జేసెను యా
13. దవుల అంద్దరిని అక్కడ అక్కడ నిలిపి అజ్జునను
14. ండు । అస్తనాపురికి బోయి దమ ౹జుకు యెరింగి
15. ంచ్చెను యాదవులు పాండవులున్ స్వగా౹ది
16. బోగానకు బోయిన వెనక నన్నూరు యేండ్లకు
17. కలియుగం చొచ్చెను । వజ్ర దేవుని పుత్రుండు దధి
18. నం గ్గుండనంగ గోపికల పౌత్రకుల వంశకరులు
19. బృంద్దావనమునం బ్రిధివిం బెంపొంద్ది నంద్ద వ్రజ
20. ంబ్బుకు ఫలిన్ఢొప్పుఘుండ్ఢు । అవుల మేపుత్తనలరి
21. గోపకులు రైవతా చలమున రంజిలుచున యా
22. దవులకు దైవ మెంతయు వొప్పు అమృత బా
23. గేశ్వరుండంద్దు, వెలిసున్న వసుదేవ నంద నులుతొ
24. ల్లి శ్రీక్రిష్ణ ముందరం గోకు౹లు మీర ప్రతిష్టలు శేశి
25. రి ప్రభ మీరి వెలయ గోవిందు మనమండు వుపనంద్దు
26. పుత్రుండు అమృతాం బోజుండని ఆ దేవు పేర వెలయ
27. ంగ బెట్టెను విచిదంబుగాను అతని పుత్రుండు విరయా
28. ంభోజుండు । సంతోషమున నుండ్ద జనమేజయు
29. ండు యజ్ఞంబు సేయ నెల్ల రాజులను రప్పించి య
30. జ్ఞ ముండగం జేసె విజయాంభోజుని మెచ్చి వారణా
31. పురంబ్బున పట్న స్వామిగా జేసి కొంత్త గాలం రాజ్య
32. ంబ్బు సెసిరి । కలి యుగాబ్దాః సూద్రికి రాజకాల
33. మున విజయాం బోజా బ్దాః (530) కనకాం బోజాబ్దాః ।
34. (490) విక్రమార్కుని కాలమున గజయాంబోజాబ్దా ।
35. (430) రాయాంబోజాబ్దాః (420) రత్నాంబోజాబ్దా
36. ః (402) వీర విజయః రాజాబ్దాః (390) శాలి వాహనునికా
37. లమున పద్మన రాజాబ్దాః (354) శ్రీ కూమి౹రాజాబ్దాః (340)
38. బోజరాజు కాలమున సిహ్మాద్రి రాజాబ్దాః (300)
39. చోడాని కాలమున వల్లు రాజాబ్దాః (195) పోలురా
40. జాబ్దాః (82) ఓరుగంట ప్రతాపుని కాలమున కా
41. టమరాజు (32) రాజ్యం సెసి లింగాల కొండ యరగడపాట
42. ను నల సిద్ది రాజుం గూడి యుద్ధంబు సేశి బడుగులవారు
43. చనిపొయ్యే నాంటికి కలియుగంబొచ్చి (3965) యెండ్లా

44. యను। విరుల మహాత్వం ఆది పవ౯ సకల భూత సంభవ అను
45. శాసనీక భాగవత దశమ స్కంధ మవుసలాన వెల్లిన శాస్త్ర ధమ౯
46. మిది త్రి మూర్తులు కారణమున గోస్రుంగ పర్వతావ తొల్లి
47. యాంభోజరుటి మొదలైన రుషుల సంతతిని దేనువులున్ క్రిష్ణావ
48. తారంన గూడి దేవతులు కూడ వతి౯ంచ్చి ద్వాపార అంత్యము
49. న జన్మించిరి ఆథవుకులమున చంద్రనందను పురూర చక్రవతి౯
50. యయాధి యెదుకులోమ్మజు సూరశేను వసుదేవు పుత్రుం శ్రీ
51. క్రిష్ణుదుగ౯ క్రిష్ణుదుగ౯ వీరికి వడచి డెబ్బైరెండు నియోగాలు బడుగుల
52. వారికి చెల్లును వీరు యయాది వంశం శాపకారణమున
53. గోవుల రక్షింప గోరక్ష పాలకులం జేసిరి వెలసిరి గోప
54. కులు వేయివేల సంఖ్య ॥ శ్రీ శ్రీం జేయూనూ॥

శాసనంలో సంవత్సరాలు తెలుగు అంకెలలో ఇవ్వబడినవి. వాటిని - ఇంగ్లీషు అంకెలలో అనువదించటం జరిగింది.

## తృతీయ భాగము

1. అత్రి యెముని సంతతి రాజులు యె
2. లిన పట్టణ భూములు అత్రియ నెత్ర పుత్రుడు
3. భూలోక మెల్లాడి పించెను ఆచంద్రనంద
4. ను పుత్ర పురూరవుండ్ను భూచక్రమె యే
5. లెను ఆ పురూరవ పుత్ర పౌత్రుండుయ యా
6. ది రాజు యైనవ ఖండ పృధివి యేలెయ యా
7. ది పుత్రుండు యధువు యేనాక భూములు
8. యెలెను యెధు కులోంత్మజు సూరశేను మధు
9. ర మాధురంబులు సూరసేనంబులనియెడి దేశ
10. ంబులు యేలెను అతని ఆంత్మజుండు వసుదేవు
11. మధురా పురంబు యేలె అతని భందువు
12. నంద గోపకుండు రేవుపల్లె యేలె వసు
13. దేవు పుత్ర శ్రీ క్రిష్ణ ద్వారవతి యేలె నొ
14. క్రిష్ణ గోపికా వపుత్రులు వజ్రధరు అ
15. మృత గోవిందు అంభోజులాగు౯రు
16. యింద్ర ప్రస్థ ఘన వీర పురి రాజ్యంబు
17. సేశిరి పద్మ నాభుండు యెలె । యంద్దలి
18. రాజ్యంబు కొంత యెలె । వీర విజయు
19. ండు యేలెనున । శ్రీ కూమ్ము౯ం డేలెను అ
20. రుంటుల కోన అమరవతి॥ సింహ్యాద్రి యె

21. లమంచి యేలెను వల్లురాజులె ఆలవల్ల
22. పురము అచట కొన్నాళ్లు అడిదెవి టేలె
23. ను ఆల పోలురాజు ప్రతాపుని కాలము
24. న యెదు కులాత్మజులు దనముకొండ్ల
25. మందలుడ, పిన యేర్ప పెద యెర్ప యేలింగ యెర్పులకు అనావ్రిష్టిదాంకి దేనువు
27. లకు మేంత లేదని రాజు~ పద్మనాయుం
28. డు~ వివరించుకొని దెనువులు~దారు
29. కదిలిరి పాంకనాడు సిద్దిరాజుకు పు
30. ల్లరి వొడంబడి భూమి చొచ్చి మేపిరి। మె
31. పుతనల నన్న ధేనువులం దాను దక్షణాదనువు
32. కోటికి కదిలి పోయి దనువు కోవల్లభుని దనువు కోవల్లభుని దశి~
33. ంచ్చి నలనన్న దెనువులుందాను మరిలి దిననిధుల
34. మీందం గదిలి వచ్చి పెన్న వెంట విడిశిరి నలసి
35. ద్ధి వారు యెద్దుల యేసిరి ఆదవుల మందను ఆడం
36. తరుదాయ అడవుల వంక్కరంతు వడె
37. నెల్లూరు ధేనువులుం దారు కదిలియ
38. రగడ్డ పాట నిలిచెను నలసిద్ధి రాయభారి పుల్లరికి వచ్చెను దట్టించ్చి రాయ
40. భారిని పుల్లరి లేదు పొమ్మనిరి లేదు పొ
41. పొమ్మంటేను నెల్లూరి నలసిద్ధి రాజు యఱ
42. గడ్డపాట్టికి యెత్తి వచ్చెను॥

## చతుర్ధ భాగము

1. స్వస్తి శ్రీ శాలివాహన శక వ
2. ష~ంబ్బులు (1170) అగునేం
3. టి కాళయుక్తి సంవత్సర కాతి~క
4. శు (5)గు నెల్లూరి నలసిద్ధి రాజు సవ~
5. సెన్నా హంమెరసి। లింగాల కొండ యఱగ
6. డ్డ పాటి కూడలి సొమేశ్వరుని సందలిన
7. నాన అత్రియ గోత్ర యాదవ క్షత్రి
8. య మధురాపుర మందీశ్వర శ్రీ
9. విష్ణు యోగమాయ దివ్య శ్రీ పా
10. దక బ్రకట శ్యాత్ర వభంజన నచ్చెర వుంది
11. పౌత్రలా యత్త వం గౌరవ పౌరవు
12. ండు ద్వారకాపురి గోపికా వల్లభు
13. ని పౌత్ృండు వల్లురాజు లతని సు
14. తులు పోలురాజు పెద్దురాజు వా

15. రి పుత్రులు మోదలైన యాదవులు
16. నలసిద్ధిం గూడి యుద్ధము
17. సేసి మృతులైరి। యదు వంశ
18. మునకు భయంబు తొలుగునని త్రిమూ
19. తుర్త లున్ యోగ మాయా దేవిని యిట్ల
20. నిరి గోపికా జనములు గోపాలకు
21. లుంన్న పసల మంద్దకు నేంగు భద్ర
22. నీవు వసుదేవ నందనులకు గర్భ పు
23. త్రికవై నానా విధ సంప్పదలకు స్తా
24. నకమై మానవులు భక్తిం గొలుతు
25. రు కానుకలును బలులు నిచ్చి పద్దె
26. నిమిది స్థానంబుల్ల నొని యాడు
27. దురు ఇయ్యా స్థానంబులు యె
28. రింగించ్చ వుమి పిఠాపురి హేంకృతిద
29. నువు కొండంబ్రత్యక్షమై । పాలెటి
30. తీరంమున భాగిరతై నిలిచి భక్తునికి
31. ప్రత్యక్షమై త్రిమూర్తుల మెప్పించి వీ
32. ర మహత్తు ఇప్పించెను భాగీరతి దుర్గ
33. స్తానం కొండయ్య కొడ్కురా
34. మయ్య వుద్ధరించిన శాసనం॥

# అనుబంధము - II

## గంగదొనకొండ దేవాలయం శాసనాలు

**NDI. Part - I, P. No. : 317 to 318**

### 1. యెద్దు ముమ్మయ్య శాసనం

1. శుభమస్తు
2. స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన
3. శక వష౯ంబులు (1447) అగునెంటి పా
4. ధి౯వ సంవత్సర పుష్యశు (15) సో । సోమ గ్రహణ
5. పుణ్యకాలమందు అతిమ హింపు విరూపా
6. క్ష విఠలేశ్వర దేవర్లకు అచ్చి౯ంచి శ్రీ దొనకొం
7. డ గంగా పరమేశ్వరి పరిబ్రహము । శ్రీమ
8. న్మహ రాజాధి రాజ రాజ పరమేశ్వర మూ
9. రు రాయరగండ అరిరాయ విభాళ అష్ట ది
10. గ్రాయ మనో భయంకర బాసదప్పు వరా
11. యరగండ పూర్వ దక్షిణ పక్షిమ సముద్రా
12. ధీశ్వర యవన రాజ్య స్థాపనా చాయ్య౯ అశ్వ
13. పతి గజపతి విభాళ శ్రీ వీర ప్రతాప శ్రీ క్రి
14. ష్ణరాయ మహారయలు విద్యా నగరమందు
15. వజ్రసింహాసనంబున పృథ్వీ రాజ్యం సే
16. యు చుండంగాను శ్రీ కృష్ణరాయ దేవ మహా
17. రాయల ద్వార పాలకులైన గోపకుల వధ౯ను
18. లున్ను యెదుకుల శ్రేష్టులున్ను యలగోల
19. సింహ్యాలుంనైన తింమప నాయుండు అ
20. దిపనాయుండు నరసపనాయుండు భండార
21. ము పెద్దనాయుండు బోరి సూభైరినెండ్డు అ
22. నాగ తాత అవసరం బసివినెండు కీతి౯లయ్యం
23. గారు వీళ్లు మొదలైన రాయ సింహ్యాసనందుని
24. ంగల గోత్ర వారిని యెద్దు ముమ్మయ
25. బగాదింగారు పాడగని నంద గోపాలక ప్రజంస్వ
26. బ్రిధివింబ్బదుగుల వారికి మూల స్థానమైన దే
27. వర దొనకొండ గంగా పరమేశ్వర్కి గానీ మింప
28. యాదవ గోత్రం వారు సంతోషించ్చి క్రిష్ణరాయ మ
29. హారాయులకు విన్నపము సేసి గంగా పర
30. మేశ్వరి అంగరంగ వైభవాల
31. కున్ను అమ్రుత పంల్లకున్ను చెల్లి
32. ంచెటట్టు గాను దొనకొండ గ్రా
33. మము వాపి కూప తటాక నిధి
34. నిక్షేపాది సహాగాను చెతు
35. శ్చీమాను అచంద్రాక౯స్థాఇగా
36. సమపి౯ంచిన దమ౯ శాసనము

37. "స్వదత్తాం పరదత్తాం వాయొహరే
38. తి వసుంధరాం షష్ఠుర్వర్షసహ
39. స్త్రాణి విష్ఠాయాం జయతేకృమీ : (111)
40. శత్రుణాపి కృతో ధర్మః పాలనీ
41. ప్రయత్నతః । క్షాత్రురవేహ
42. తశత్రుః స్యాద్ధర్మః శత్రునకస్యాచిత్"
43. చప్పన్న దేశాల కొలంగోమ
44. రి కోనుకుం పాటి శావదెండు
45. యెద్దు ముంమయ బగాదింగా
46. రు మంగళవహ శ్రీశ్రీశ్రీ
47. ం జేయును.

శాసనంలో 37 నుండి 42 పంక్తులు దేవనాగర లిపిలో ఉన్నవాటిని తెలుగు లిపిలోకి మార్చడం జరిగింది.

## 2. పోతయ జీయలిడు శాసనం

**Part-I NDI - P. 308.**

1. నల సంవత్సర
2. నిజ ఆశ్వీజ శు
3. (15)లు శ్రీ దొన
4. కొండ గంగ దె
5. వరి పూజరి
6. వెంగ్గళ కోమా
7. రుండు పోత
8. యజీయలిడు
9. సదా సేవశ్రీ.

## 3. తిరుమందుల తినుటిజీక శాసనం

**Part-I NDI - P. 310.**

### ప్రథమభాగము

1. స్వస్తిశ్రీ శ
2. క వరుషంబులు
3. (1328) అగునేం
4. టి వ్యయ సంవ
5. త్సర కాతిఁక బ (5)
6. అమైయారు
7. దేశాలు నువ్విర
8. లు సుభిక్షముగా
9. నున్న దొనకొండ
10. గ్రామము పూ
11. జిఁతముగా నున్న
12. దెవరాయమ
13. హా రాయలు
14. కొమారుం

### ద్వితీయ భాగము

15. డుగ్రా
16. జ్యమేలు
17. చుం
18. డగాను
19. కప్రతిదే
20. వయని
21. వొడ
22. యలు
23. గ్రామ
24. మేలు
25. చుం
26. డంగాను
27. దొణకొండ తి
28. రుమంద్దులపు
29. తినుటిజిక కొ
30. మాళ్లకు పుణ్యం
31. ముగాను త
32. ......................
33. నకుం గల పున్న్యము
34. గామండపాలు
35. వెట్టించి మాం
36. కలమ్మాకు కల్లుగు
37. డి గట్టించి పీరలు
38. గుడి గట్టించి ప్రాకా
39. రము కోట వెట్టిం
40. చెను. అ చంద్రా కఁ స్తా
41. ఇగాము చేసెను మ
42. ంగళ మహా శ్రీశ్రీశ్రీ.

# అనుబంధము - III

## సేకరించిన తాళపత్ర గ్రంథములు

| | | |
|---|---|---|
| **ఆవుల వలురాజు చరిత్ర** | : | కనకబండి హనుమంతరావు<br>భైరవుని పల్లి - గ్రామం<br>నేలకొండపల్లి - మండలం<br>ఖమ్మం (జిల్లా) - ఆం.ప్ర. |
| **దక్షిణకాండ / జన్నివాడకథ** | : | రాసూరి దశరథం<br>ముష్ఠిబండ - గ్రామం<br>దమ్మపేట - మండలం<br>ఖమ్మం (జిల్లా) - ఆం.ప్ర. |
| **పెద్దిరాజు కథ**<br>**పాపనూక కథ** | : | కనకబండి కొండయ్య<br>భైరవుని పల్లి - గ్రామం<br>నేలకొండపల్లి - మండలం<br>ఖమ్మం (జిల్లా) - ఆం.ప్ర. |
| **భట్టురాయబారము**<br>**పాపనూక కథ - 2** | : | కొమ్ముల వారు<br>ముష్ఠిబండ - గ్రామం<br>దమ్మపేట - మండలం<br>ఖమ్మం (జిల్లా) - ఆం.ప్ర. |
| **ఐల్లికురువ పోట్లాట** | : | మోడిచిన పాపయ్య, S/o. నాగయ్య<br>యర్రబాలెము - గ్రామం<br>దొనకొండ - మండలం<br>ప్రకాశం (జిల్లా) - ఆం.ప్ర. |
| **భక్తిరన్న కథ**<br>**యరగడ్డపాటి పోట్లాట** | : | మూక మదారయ్య<br>దనియాలగూడెం - గ్రామం<br>ముదిగొండ - మండలం<br>ఖమ్మం (జిల్లా) - ఆం.ప్ర. |
| **పోలురాజు యుద్ధం** | : | మోడి గంగయ్య, S/o. గురవయ్య<br>యర్రబాలెము - గ్రామం<br>దొనకొండ - మండలం<br>ప్రకాశం (జిల్లా) - ఆం.ప్ర. |

# అనుబంధము - IV

## జన్నివాడ కథ (అముద్రితము)

శ్రీ నీలకంఠుని శిత్తమున దలచి - బ్రమరాంభకు మదిని ప్రబారినం జేశి
పేతాళ్ల గంగను ప్రస్తుతి జేశి - పరమేశ్వరుని మదిని పార్వతిని దలశి
బొబ్బుల వీరాన్నను మదిన దలయించి - శనగల భసువాన్నకు శేయెత్తి మ్రొక్కి
కన్నెచిరుల గోత్రుండు కొంత్తి చెంద్రుండు - యెదువమిశ తిల్కుండు యాద్వగనూండు
వనీ ఁలచ్చి కనుకబాండి వమిశ వద ఁనూండు - కొండయ్య నందనూండు కులపావనూండు
శెలుమోప్పగాట్టయ్య చెప్పేనీకదయు - స్థిరముగా నిలశి ప్రక్యాతికెక్కి
దక్షిణ కాణ్యము తగ జెనులు మేచ్చ - శెప్పెద నీ కద శ్రేవణందముగాను
రఘురామచంద్రుండు కాటమరాజు - వాతఁగల మన్నీడు వలురాజు మనుమడు
పెద్ద భూపతి సుతుడు పేరు కల రాజు - నవ్వ తొమ్మిది గోట్లు నర్రావులు గల రాజు
పన్నెండు వేలు భషువ ముద్ర యెద్దులు గల రాజు - ఆరూవేలు గుత్తి కవ్వము అకిల సంప్పదాలు
యేడువేలు లింగ్గముద్ర యెద్దులు గల రాజు - దక్షిణ నెల్లూరికి తలిఁ ంచె కంపుటాము
వెన్నూని సంపదలు యాదవ బలము - గుడాలుఁఅందలాలు గొప్ప పల్లకీలు
రణబ్బేరి మోయించి తల్లెఁనారాజు
గాంగ్గకు జాతర కావించ్చి రాంత్త
మరునాడు నలనన్న మంచ్చిమూత్తఁమూన - పాంచ్చమా వాయిద్యములు బలువడి మ్రోవంగ్గను
బాగాదిరేవున పషుపతి కదిలెను - పద్మనాయుడు దానుచవుబలములతోను
గట్టి రేవుకి యపుడు కదిలెను దళములు - తన్నీరుద సూంట్ల తముటముయెడ్లు
దిగువతిరుపతి వలెను తిరుమంధుల వారు - వెలిగొండరేవున వేగాంబ్బేదాటెను
శివపూజె కవులావుశెలుశిముని జన్నావులు - పర్వతంభూలరీతిని పాలేరుదాటెనూ
చంక్కతూత కొమ్ములు సన్నావిరాణిలు - యిరువైయూరువేలు వీను గోడెగెలూను
గూడూరు రేవున పొలె(రి) గుర్రాలు దాటెను - అశ్వతురంగ్గములు అందెలు ఘడలు
ఆరెమానురేవున వారి అంధలాలు దాటెను - పాకనాటి రేవున పముజులు గదిలెను
శిరచానవెల్పుశిరి జన్నెఆవులు - శిలకలమర్రి రేవున బిగ్రాంబెదాటెను
జమమారిరేవున సకల సంపదలు గదిలెనూ - మోత్తమైనిలుమూకముస్తీదు తోను
మొసలకోటరేవున ముదమొప్పదాటెను - గోదావరి రేవున నారిగొడుగులు గదిలేను
చిచ్చుపిడుగులా వాంటి మచ్చలాపడ్డలు - సల్లుటావులనూంచ్చి జల్లులు గడులు
సాంగాపూరేవున ఆవులు సయ్యనదాటెను - వినని కాట్రనీ విధప సురబూలాను
పషుపతి దేనువలు పాలేరు దాటెను - మిన్నూమైలుకొండలు మేశినాయెట్లు
సముద్రము వెళ్లి విరిశినాయెట్లు సాగెకొంప్పటము - మిడతలు మింటికి వంకనెగిసినాయెట్లు
కొనాలు జూచ్చి కవులావులు మేశను - నలనన్న నాయునితోనటు విన్నవించెను

నాయుడాయినవోయి నాశిన్ని మరది - పాయరాని సంగ్గడము మరిధి పద్మనాయుడ
మా తండ్రి పోలురాజు ఉన్న లింగాల కొండకు - దగ్గిర వొస్తిమోయి వో పద్మనాయుడ
శాయవలె విన్నపము చాయవలె మనము - అయ్యలింగ్గమై ఇక్కడ వెలిశినాచోటు
పంచలింగ్గాల జూశి మనము భక్తి శేవించి - అయ్యఉన్నలింగ్గాల కొండ అచ్చోట మనము
పోవొవలె మనము నీ ప్రొద్దుటవేళను - పన్నుగాలింగ్గాల కొండ పడమట యంచ్చున
పట్టంచుగుడార్లు పదివేలుసాల - యెత్తించ్చవలెనయ్య వో పద్మనాయుడ
అనిన పద్మనాయుడు లెస్సెయనుసూ - మదగజములలాంట్టి మన్నీల బిలిశి
వల్లవగోత్రాంబు వమిళ చకరూల - సబియేడుగోట్ల సల్లుటెద్దులూను
యేడు మాందల బోడవులు యనభైవేల నర్రావులు - ధరికొని ఇరిమేల తల్లిఁ బంచుమనెను
మంచ్చిదని యాదవమన్నీలు దొరలు - నాయుని వక్యమునటు విన్నవించిరి
పన్నిన గుడాలుఁ బరకాల పూనిరి - నందులగుడాలుఁ నడిచెవేగాంబ్బే
తల్లక్కితముగా కద్దిలిరి తుదిమున్నగాన్ను - భేరిద్వనమోత్తలు పెల్లుకోని మ్రోయాంగ్గను
కంపటము భూమి కప్పుకొనిరావంగ్గను - అరిగిరిలింగ్గాల కొండ (1s)(కడకు) యాదవులు
లింగాల కొండదగ్గిర నిలశిరి యపుడు - ప్రకాటంబుగ లింగాల కొండ మరుమటమాంచ్చున
గనుడు తానెత్తించె కావి గుడార్లు - సూర్యపుటముగుడార్లు సూర్యాన్వమనీధు లేర్పరచిరి
యెత్తించె (..........) వమిశవధఁనూండు - వీనెలు దండెలు వింజామరమూలు
పన్నీరు యీభూతి పచ్చకర్పూరమ్ము - మల్లెలు జాజులు మంచి కురువేళ్లు
ముతఁ మున యెత్తించె ముత్యాల పందిరి - ముత్యాల పందిరి క్రింద రత్నాల తమకము
రత్నాల తమకము మీద రాజు రాఘవుండు - కూర్చుండిరి యాదవ గుణవిచాలుండు
ఆకూసుట్టి య్యాను అడవరాంగ్గేసు - పరగ పిన్నయ్యకు పాడగాపు చాయశ
వచ్చిన దెబ్బదివేడువైచో ........లతోను - మాంద్దకంపటీలు మరియాదవూలు
సురలు గోపాలులు సర్వ సన్నాయములతోను - సరగ భూషణంబ్బులు సొకట్లు పోగులు
ముంగమురుగులు ముత్యాలసరులు - రాంగ్గైన చెంగావి............పెదపట్లు
వుంగరంబ్బులు మొలతాళ్లు వురపుజారుఘాలు - బంగారు చెరుగుల పట్టుదట్టీలు
అంచ్చితంబుగా యాదవులు అయితపడిరి - బసవసముద్ర పడిగెలు బంతుల గడలు
పిగిలి..........పాటకములు బిరుదునేవళాలు - పురమైజల్లులుసోక శివగడలు
విల్లనంబులు పొదులు వీపున జల్లులు - పశళ్యాణ నీమళివరగ గూగ్గిలాలు
పుశ్వలు గంప్పలు పువ్వబంత్తులూను - కురి...........ళుమరవంపుల గల జామర్లెలూను
మారేడు పత్రి యుమాంచి అగ్గనాలు - శివగాంటశెంకులు శివశివయనుచు
ధరక్రక్కి.............టీలాంగ తలెఁ నారాజు - పావలు దొడిగెను పద్మనాయుడు దాను
కాలినడకతో వచ్చి......తమ అయ్యను కనుల జూశ - పంచలింగ్గాల కొండకు పరదక్షిణము దిరిగిరి
విరుగడల పెయ్యల యర్రయ్యనపుడు - [illegible]వట్టి వారి ఘనుడు యర్రయ్యాను

లింగముద్ర జడదారు లింగ్గము(2F)....యెద్దులు - అందముగా లింగ్గాల కొండ కేతెంచ్చిరి
ఘనుడు కాటమరాజు కరకాంటు నిదలశి - తండ్రి శిరసు అంటిజలాంబు దిచ్చి
బస్వాంగమునుదుట బాగోపుబెట్టిరి - మల్లెపువ్వులు మాంచి మారేడు పత్రములు
సకల పదార్తములు సమాప్పణంజేసి - వారబోశి నివ్వళి వరషతోనిచ్చి
తూపదీపెనైవ్విద్యములు తురుతుగానిచ్చి - యెద్దులు వేమారు యర్రయ్య మొదలు
సల్లుబెద్దులు మొదలు సట్టవారి వెర్రయ్య - తనతోను ముగ్గురు............గప్రధానులూను
రఘువంశతిల్కూండు రాజు రాఘవుండు - సాష్టాంగదణంబు సమాపణంజేశిరి
దరణీసునలనన్న తమ తండ్రితోననియె - గాంగిమైలావుల కరకాంటుని పూదించి
.................రములు గైకొన్న వల్లమ్మ సుతుడు - మల్లప్ప కృపచేత మహిమీదనీవు
లింగమై వెలసిన నీలకంతుండ - జంగాల కొరకునై నీవు సమరంబు జేసి
లింగమై వెలసిన బడుగుల రాజ - తండ్రి పగవాణ్ణి ధరత్రుంచి (వేయవ)లనని
వచ్చినాను నీకడకు వలరాజ సుతుడ - నాజన్మ పుట్టుక తండ్రితోను
చెప్పెదనని వచ్చినాను శంబుడా వినుము - తండ్రి తన జన్మంబుదాతనామ సంవత్సర
పాల్గుణ మాసము బహుళ పంచమి నా..........లెను తండ్రి - తండ్రిచెల్లిన రణభూములకు బోతిని
పద్మలుకుంబిళ్లు పాలించితినే తండ్రి - ఆర్లపెంట రణములో అయ్యను జూచి
అరిటాకు పల్లకిలో అయ్యనుబెట్టుకొని - దక్షిణరె..........కు తెస్తినే తండ్రి
మా తల్లిగి మా అయ్యను తగనొప్పగించితిని - విద్దరు గుండములోను ఇలయెల్ల వెరుగ
కుమిలిస్వర్గమునకు కలసి పోయిరివారు - కళ్యాణిన ఉండంగ కరకంటు (2S) భక్తుడు
యలమంచికి వచ్చెను యాడాది నాటికి - యాడాదినములు వెళ్లక తొలికే
పల్లికొండ మానూటగ పట్టాంగట్టెను - బసవన్న పంపున వీరకంకణము
పశువులలో గట్టిన పల్లికొండయ్య - తనతోను ముగ్గురు తగప్రధానులూను
మల్లుభూపతి సుతుడు మాల పిన్నయ్య - కటిల నందుల సింహము ఘనుడు పోలినీడు
తనతోని యాగంగ తరుణిపట్టంబు - సన్నాసి పట్నముల్ మాకుగట్టినారు.
ఆదివిష్ణుకు దెలసి ఆ మరునాడు - అవంతుడిచ్చిన త్రిశూలము అందుకొని తాను
బ్రహ్మ విష్ణువు త్రిమూర్తులు పరగసూపంగ - కాశిస్తళంబుకు కడువేగ వచ్చి
కాశిలో మోక్షములు కడువేగ జేసి - ఉత్తర దేశాన ఓతండ్రి వినుమా
డెబ్బైవేడు దేవదుర్గములు ధేనువులు మేపితి - ముప్పైవేడు కయ్యాలు గెలసి ముత్తాల పంపున
ఆరువైయారు కరపటాముల వార్నిఅతముగాజంపి - అక్కడ నతి ఘోర యుద్ధంబు జేసి
మారు భాషకత్రీడు మనెరాజును మహిమాద పొగిడించి - వరములూనైదూను వరుసతో నడిగి
సింహాద్రి రాజు పగవాణ్ణి చీరివేసినాను - పెద్దిరాజు పగవాణ్ణి బింకంబణసి
యరనూకరాజు పగవాణ్ణి యాపణంగించినాను - నలనూకరాజు పగవాన్ని నరికివేశాను.
వచ్చినాను నీకడకు పోలురాజసుతుడ - కయ్యానికి నీమీద నాడు కదిసినవార్ని

ఇక్కడ నీపగలు నీడేర్తు నాతండ్రి - విటలుతో కలసి యుద్ధము చేసినవార్ని
పల్లవాది రాజుల పడుమార్తునేతండ్రి - కయ్యనీకు ఎదురించి కదసి పొడిసినవార్ని
కల్లుగాజంపుదును కస్తూరి సిద్ధిరాజును - నరనాథ నీతోను నాడు వెదిరించిన వార్ని
నలసిద్ధి రాజును నడికల్లిలోద్రుంతును - బళ్లాలు మొనలు నామీదికి పంపినందులాకు
పాపశిద్ధిరాజును బారున పట్టింతునే తండ్రి - వెదరి కత్తుల యుద్ధము చేసినందులకు
యరసిద్ధిరాజును యేపణంగితునే తండ్రి - కూవలశిత్తూండు మం (3.F) దమీద అంపవర్షము కురిపించినందుకు
కొమారసిద్ధిరాజును కూల్తురణములోను - నీవు ( )నా రక్తంబు వుబ్బి పారినందులాకు
గండగోపాలరాజు శిరస్సునురణకల్లిలో ద్రుంతు - యేగురు శిద్ధిరాజుల శిరస్సులు రణకల్లులో ద్రుంచి
బాగాదిగంగకు నివ్వాళు పట్టింతునే తండ్రి - పోరాడి తిరుమందులను పొడసినందుకు
క్షేమాన యెద్దులావులకు సెలవిత్తునే తండ్రి - మూనాళ్ల శివరాత్రి ముందు ఉన్నాదనగ
మళ్లీవచ్చి యర్రగడ్డపాటను మదమణతునా తండ్రి - చిత్రభాను సంవత్సరము చేరి కొల్తునాతండ్ర
పల్లికొండతో నీవు పలికిన ప్రజ్ఞ - శేకొని యరగడ్డపాటిన చెల్లింతునే తండ్రి
గుగ్గిలపురాసులు గొబ్బునపోసి - మహిమీదసాక్షి గుగ్గిలము మరివేగనిచ్చి
పినతండ్రితో జెప్పి ప్రియములుబలికి - ప్రాకటంబుగ శిలకల మర్రి పరుమటనిలసిరి
పశుపతి పద్మనాయుడు **పాలకీ**లుదిగిరి - సింహాసనము మీద పరగకల గూర్చుండిరి
అప్పుడు జమజమాడిరి ఒకగడియనపుడు - ఆ ప్రొద్దునిద్రించిరి అమరునాడు
మాతండ్రి పోలురాజు మన్నెతిరుమందులు - ముక్కంటి చోడాని మూకలతోను
అడికె యుద్ధము చేసిరి అరిమారులెరుగ - యిడువక పోట్లాడి చెరుకూర వీరులైనారు
చెరుకూరికి బోయి శిలమంతులాజూచి - భక్తులున్న స్థళము బాగొప్పజూసి
సాలపాల తరములు సమార్పణజేసి - శ్రీమల్లికార్జుని చూచినాయట్లు
శిలామంతులాజూచి వారిదీవెనంది - శెరుగువాడకు పదమనె రాజు నలనన్న
గొనకొని యింద్రగోపు గుడార్లు బార్లు - నాగబండ్లపునించె నలనన్నతాను
సకల సంపదలు సమకూడినంత - బారులు పెట్టెభరణాల సొమ్ములు
వురపునకావిండ్లు వుంచిరి శెట్టెలు - కొమ్ములు సన్నాలు కో......................(3.s)
........సన్నాలు తిడివిష్ణునర్రలు - మందనుగలయట్టిమైలబోడావులు
పిక్కలుసన్నాలు బిరుదు మాగోవులు - చెరుకువాడకు గోకులంచేరేనాపాదు
లింగముద్ర గుడార్లునిండు( )డాలు౼యెత్తించెరాజు - తీరైన రథమల్లెతీగ గుడార్లు
అదివెరిగి ముగ్గురు ఆదిమూర్తులైన - శీలమంతుల జూచి సెలగప్రార్థించిరి
ముందు మీయయ్య (.............................) - యేలుసు చెరుకువాడవేగురు చిలమంతులు
కలియుగ శూరుని కావేరి వెట్టికి - పంపిన చిలమంతులు బాదలకు వెరసి
వెట్టిచేయలేక వేగంబె (...................) - పోలురాజు పొరుగు చొచ్చిరి వారు
పొరుగు చొచ్చిన వారిని మళ్లిపట్టియ్యక - ..............................................................

ఆమాటగా మా అయ్య అంపె శ్రీసైలాము - అటుగనుక వారి సుతులు( )మార్గు
కరుణతో దయవుంచి కాసి రక్షించుడ - అనిన భక్తులు మెచ్చి అతి వేడ్కుతోను
తలసిన మీ పనులు సంతోషమేను - శలగి మాదివ్వె నా శ్రీవిష్ణువెరు (................)
(..............)టిపగలు అతముచేయమనిరి - మేలుదీవెనలిచ్చి మెరసి ఇభూతి
దీవించి నోటను దరయించిరంత - అయ్యలకు కొట్లాట అభివృద్ధిగాపించిరి
అంచిత (.............) అచ్చోటనుండి - అరెమాలుశెలికె అండుగుల బైలు
పొందుగానిలచెను బోడలూను - శిల్లమాను మేరశిరిగల నత్రలు
యల్లావులమందలు యంచగల కమవులు (4.F) - (...............)నలగరాజు ఘనుడు
పసుపతి కవులావుల పదమనెపాకనాడు - భూనాదు కవులావులు భూములు నిండెను
తుడుములు అగాతుట శెశిసిరి తుదిముట్టగాను - అరువైఅరు తమాలు (...................)
(..................)టములు అవుల మందలో మ్రోగెను - ముప్పైమూడు భేరీలు ముని మందలో మ్రోగెనూ
ధరత్రక్క టిల్లాంగ కదిలెవారాజు - నల్లుదిక్కులు భేరీల్లు నాథులు గప్పి
(..................)రాలు పొసగ సన్నాయములు - కొమ్ములు ద్వానరించి కొలువులో మ్రోగెను
ఆనందమ్మెయ్యాడె అష్టదిక్కులూను - నాద్దుల్లు విన్నపడన్ను నలసిద్దిరాజుకు
నాయకులు ద్వారాలు (...................) - (.........................) (........................)
వినెను నలసిద్దిరాజు వీనులతోని - (...............)నలమోత పేర్కొని వినెను
అదియేమి శోధ్యముశింకర్ల భీమనా - సోదరుల బంపి తెలసి రమ్మనెను
పంపినవార (........................) - కంపింపగా కవులావుల ............అల్లంతట
చూచి ఆవుల మంద చోద్యంబుగాను - మగిడినలసిద్దిరాజు కొల్వుకు మరియునేతెంచిరి
పల్లవనలసిద్ది.............. - వినయముగా ఒకమాట వినుము చెప్పెము
పదివేల ఆవులు మంద పశువులు కదుపులు - భూమెల్ల గప్పుకొనెను భూనాదునిమంద
యన్న బ్రహ్మకునై........................ - శిద్దిరాజు ఆశీర్వామందెను
పన్నిద్దరు దళాముల ప్రధానుల బిలచి - బొమ్మినపతిమ్మనీడ మరియు భీమినీడ
గోవులగాశెటి గొల్లరాజు వకడు - కంచిబీళ్లు(4S) చెలికలకడ అగెను కొమ్ములు
అడ్డమాంతములేక ఆవుల మేపుసూ - పరగ మీ బలములతో పయనమైపోయి
మాను మొకము (..........) మరిజింక పిల్లలా - విద్రుల పందుల యారళ్లముగాను
యాటలాడుచూ మీరు వేగంబె పోయి - పశువుల మల్లదోళి పరగరమ్మనెను.
అంపిన వారంత అతి బలాధికులు - కంపింపగ వారంత కటమూతపడిరి
కనకంబ కాశెలు కట్టిరి వేగ - పటాకత్తులు బల్యాలు కొంత్త
చిల్లకోలలు మాంచి చిన్ని సురియలూను - వుక్కుశివగడలూను కోకబెదురులూను
కేకలు వ్రేయుసూ కెరలి పాడుతూను - మూకలు వేనూరు మొన యేరుపరసి
భీమినీడు యపుడు భేరిమోయించె - పన్నిద్దరు దళాములు పోట్లాట వెడలి

దరము ............వీడు దండి పలియగాము - తుడుములు అగాతులు తుదిముట్టగాను
పెళపెళ వచ్చి పేరేములు బామసు - అడవులలో మేసేటి ఆవులేగలాను
తడబడగా తరిమి తల్లణదోలిరంత - పోటుకూతలకు యపుడు బోడావులు
బోయగాలికి యవులు పోగులై నిలచెను - అశిపాన యెద్దులు దిమ్మెలు గట్టెనూ
కడుమాంచి గోకుళము - గముగూడి నిలిసెను
పొగరుబోయిన కోడెలు పో (................) - నల్రావులు బోడావులు నంది జల ఆవులు
కనిమాయలు వెల లశికవులవులు నివిష - నెల్లూరికి తూర్పు పరగ దక్షిణాన
పంచవన్నెల గుడార్లు పట్టు టెక్కమూలు - మురివేగ మంచి యఱ్ఱ పట్టు గుడార్లు
బాగుగా నెత్తించిరి పశువుల నడుమ - యల్ల గుడారుణమంచి (5. F)వేడ్కమీరంగ
ఇరువైఆరు స్థంబాల విష్ణుముద్ర గుడార్లు - త్రికూట గుడార్లు తిరుముందులు ఎత్తించిరి
అరువైఆరు స్థంబాల అమృతాల భారిగుడార్లు - నాడి మందలో నెత్తించె రాజు నలనన్న
లక్షకంపటము రాజు రాఘవుండు - రత్నాల తమకము మీద రాజు గూర్చుండెను
యఱ్రయ్య సట్టువారి వెఱ్రాయ్యని (...........) - (................) కాటమరాజుకు వేగంబె మ్రొక్కిరి
అన్న కాటమరాజ అతి పరాక్రమశాలి - సత్యలోక దీక్ష సంపూర్ణ చంద్ర
మలప్రాంతాల యందున మనదేనువుల మేయ - (......................) భీమినీడు మొదలు
కదలి వచ్చి యెద్దులావుల యేకంబు జేసిరి - బారమాకు సెలవిమ్ము మాదవునలనన్న
అనిన తమ్ముని మాటలకు అరుషంబు నొంది - ఇనవయ్య తమ్ముడ (..................)ను
పులినోట కండ పుచ్చుకోవలెను - కాలకోటివిషము (..................)గభణము అరించి
పాము కోరల విషముపట్టి త్రాగవలెను - కోపాంబు వేలను గుణ విశాలుండ
తోడుత నేనెట్లూ నీ తోడ రద్దివద్దు - అయ్యనాటి పగలు పాలేట అతము చాయవలెను
కలహపు విదొర్ధ పనులు కూడదుమీకు - తత్తరపడనేల తాళ్లుకోవలెను
వారిని పోషించి (....................) - కర్పూర విడియమిచ్చి కస్తూరి అలది
పాలమనిమిగా జెప్పి సంతోషపరచి - కడు వేడ్కతోముందు వెసకార్యమున్నది.
పద్మనాయుడు నీవు పర్వునేతెంచి - భమినీనికి బుద్ధులు జెప్పి
తోడుకొని రమ్మనెను తగు వేడ్కతోను - అనివిని పద్మనాయు (5.S) అరుషంబు నొంది
పైడి అనుల పాలకి పద్మనాయుడు ఎక్కెను - పాలకి విరుగడల (..........) నులుగొలవాంగ
యెలిమితో బలాఢ్యులు మూకలతొను - జల్లులు ఘడ పలూను సర్వచానలూను
విండ్లు అంబులు పొదులు పూనజల్లులు - ప్రాకారితిగా నాయుడు విరాపలియా ..............రమంతయూ
ముగ్గురు నాయకులు ముష్టి ముమ్మినీడు - భీమినీనిని నాయుడు ప్రియముతో జూచెను
అందలాలు పాలకీలు అచ్చలు దిగిరి - ముందుజేసిన చలము మొదలాంట వెలిగి
అనువతాణకు మని (...............) అపుడు మరునాడు - కలబందసాయము కలసి యుడావలు
అలనాతు సంగడము అట్టి పోయెననక - పిన్ననాటి సంగడము ప్రియము చేకొనుము

అనిన భీమినీడు అందలముదిగె - పన్నిద్దరు దళములు పాలకీలు దిగిరి
కడనుండి నిటసూండికడుమాందవించి - యేనాటి సంగడము నాయుడ యెరుగుట లేదు
విని పద్మనాయుడు అమషంబు నొంది - కూడియుండిన మనముగురుతు చెప్పెపదాను
గుత్తపుగుడివాడ కూడి యున్నాము - నిత్యము గాజుమజమాడుదుము నెరిదప్పకుండా
నకరేకల్లు మా తాత నాగినీడు వేలు - చల్లగుండ్ల విపల్ ≈ నాగినీడు వేలుకు
సాలగ్రాముతో సాలు గ్రహములు - మా తండ్రి పోతినీడు నయమొప్పవేలు
కటార్ల బొల్లారము కానాచిమాది - యేలూరు బెందులూరు యేలువడిమాది
భీమినీడు మనది శినావ పిన్ననాటి సంగడము - నిండు వెన్నెల గాయంగ నీవును నేను
పారుశిడులాడుదుము - బంతులా (6.F)డుదుము
పిల్లదీపులాడుము - పర్వులురుకూదూము
సంగడిలు మనము శాలురావుతనీడన - బొంగరాలు ఆడుదుము ప్రొద్దుట వేళ
వామనగంటలాడుదుము - వొడ్డుబిళ్లలూను
తండ్రిగాయాడుదుము తగవేడ్కతోను - వింతగా కూడియుంటిమి ఈ వేళ్ల భీమన
అనినాభీమినీడు అరుషంబునొంది - నాయుడా నీ భూమి నరులెవ్వరికి
అసాధ్యముగాదు సుమ్మీ సత్యము మాట - గారవంబున యిద్దరు కౌగిలించుకొనిరి
వొద్దని బోయిలకు బుద్దులు జెప్పెను - రమ్మని పిలసెను రాజు ప్రధాని
పన్నిద్దరు దళములు ప్రధానిభీమన - యాదవులు పద్మనాయుడు పరివారమంతయు
కొలువుతీర్చి కూర్చుండిరి గొబ్బున తివాశీల మీద - భీమినీడు నాయనితో ప్రియములు పలికెను
ఆవుల గాసేటి యివరమెట్లు నీకు - విచ్చేటకురాను కారణంబుయేమి
వెచ్చెను భూములు వెలుపలాతొల్లి - తల్లిదండ్రుల విడసి దాదుల విడసి
సుట్టాల బంధువుల సుతులను విడసి - ఘనుడ పశువులగాయ కారణంబేమి
యీ వార్తనాతోని విన్నవించినయడల - వినుభీమునీడ వృత్తాంతమంతయు
తొల్లి వరించి దేవతలపుడు - అటుగనుక మాతాత ఇప్పల ≈ నాగినీడు
గోహత్య ఒకకొంత కొలను చేసి ఉండెను - మా తండ్రి పోతినీడు మరియు కొన్నాళ్లకు
గోదావరి కృష్ణలోపల ఆవులదారబోసెను - అని యొక బ్రహ్మలకు అత్యబాసెకొడకు (6.S)
ఆవుల మందరాజుతోను యెత్తుపొత్తినాను - బోంచేస్తిని నేను వినియ కొన్నాళ్లకు
పట్టితిమోయి సంగడము ప్రధాని భీమున - చప్పన్నదేశముల్ సపురదుర్గములు
అక్కడ రాజులకు అప్పనము (............) - పశువుల మేపితిమి ప్రఖ్యాతి గాను
వుత్తర దేశమున సత్యానమేపి - వస్తిమి పాకనాడు వోశింకర్ల భీమన
మంధనావులకు కలత్త ≈ మా మాధవుడు నలనన్న - సన్నాసి పట్నాన స్వామిని జూసి
మల్లివత్తురుగాని తమరియు రమ్మనెను - ఆమాటకు భీమినీడు హర్షంబునొంది
వేరుషతా అందలాలు వైనాన యెక్కిరి - నాయుడు ముందురాచమాందులాకి

(............) అందలాలు యెక్కి వేతెంచిరి - పశుపతిని పాడాగాంచి పాలకీలు దిగిరి
కనిన మస్కారము జేసిరి కాటమరాజుకు - ఆ రాజు వర్ణాంబు అదియెట్లు దనిన
మిక్కిలి కళలందు మానరాజు - చక్కదనముగల సౌందర్య శాలి
చక్కని మొఖబింబము యారాజ చంద్ర - కాంతియు రాఘురాము కళలు గలరాజు
చంద్ర బింబముగల వింద్ర చంద్రుండు -కందారము చవుకట్లు కర్ణములు మెరియ
యింద్రనీలపు అజుడు యింపు సొంపైన - తరుపున జంజాంబు వుంగరాలూను
కమరమునకెంపులు దాపిన రత్నాల హారములు - లలను కిరీటంబు దగమెరియ
సుక్కలు దాపిన సూర్య కిరీటంబు - మక్కువతో కన్నులకు మరిమెరియగాను
(.............) కరములు చామపూ కడియములు మెరియ - బంగారు చెరుగుల పట్టు పచ్చడములు (7.F)
భుజ పరాక్రమశాలి బూరి వల్లభుండు - రత్నాల తమకము మీద రాజు కూర్చుండె
క్షేత్రాచ బలగములు చేరికొలవంగ - చెలి వింజామరలు సేవలు సేయ
యేటు రూమాలలు వింజామరమూలు - పాటించి (.........) అభిషేకము సేయ
అనంత దర్బదానము ఆవులగలరాజు - కాటకోటేశ్వరుండు కాటమరాజు
మన్నీల భీమినీణ్ణి మరియు చిమికిణ్ణి - తాను చేరబిలిచి దయతోడ పలికె
కర్పూర విడియములు యిప్పించె ఘనడు నలనన్న - పన్నుగా యీ భూమిని పష్యులకు మేపులు
కలువని చెప్పిరి గవిరీలు మాకు - గవిరీల మాటలకు కీడు దొడ్డిగుడిపి
విముక్తితోను యిక్కడికి వస్తిమి - యెద్దులావులకు గాను వెన్నెకతోధనము
యెంతగా వలసిన యిచ్చేముగానే -సన్యాసి పట్టపురాజును చప్పన చాయకుమీ
కొండంత ధనము ఇత్తుము గోవుల కొరకు - తప్పులేకుండ తగకమ్మలిచ్చి
పంపుడి మీకు మాకు పత్రికలిచ్చి - వారికి కట్నాలు వరుసతోయిచ్చి
తశిరీబులు గప్పించి సంతోషపరచి - అనిన భీమినీడు ఆరాజుతో ననియె
ఓరాజశేఖర ఒట్టుబద్ర - వినయముగా నామాటలు వినుకాటమేశ్వరా
ప్రొద్దుట వేళ్ల తర్ల పొయ్యేమురాజ - మావి పనులకు అన్నిటికి మేము
మందగోపాల మన్నీలాల కొంతమూకజేసి పంపించు- ఆపాటికి మేము మక్కువతో పోయి మాటలాడెదము
మరియు సంతోషించిమాదవుడు నలనన్న - పొమ్మని సెలవిచ్చె (7.S) భూనాథుడపుడు
మండల ధరుండు నందగోపాలుండు - యకార్ల యామన యల్లావుల సోదన
అనంతకోటి యాదవులు ఆ పద్మనాయుడు - పైనమై నెల్లూరు పట్టణముకు మీరు
సిద్దిరాజు పాడగాంచి బుద్ధిమంతులారా - అడిగినంత పుల్లరి అతనికి వప్పించి
మళ్లి రమ్మని వారిని మరియు నంపించె - మంచిదని చ్చిన మందకంపటీలు
విందులు బోంచేసిరి మందలోపలాను - అందలాలు యెక్కిరి యపుడు యాదవులు
పైడియంచుల పాలకి పద్మనాభుడు యెక్కెను - సొస్తవిడి పన్నిద్దరు బెస్తబోయలు మోయ
గాజు విల్లులలందెను ఘనుడు పద్మనాయుడు - మెనచేసి కదిలెను మూకల తోను

వెలలేని రణబేరి వేయించెనాయుడు - పుడమియావుల మందకు పుల్లాలు వప్పునూ
గొల్లలు ఎరువంకల గొలసి రాంగాను - తొమ్మిదివేల మూక దొరకొని నడువ
బల్యాలు విలుమూక బాకుజము దాళములు - కదిలేను మొనకత్తి కరవాలమూలు
విటెలు బల్యాలు యినుపరాగోలలు - పన్నిన జముదాళములు బలుకత్తులూను
కోకల దిండ్లూను కోరకావిళ్లు - పోకలు కట్నాలు ఆకులు మొదలు
యిరివి గదిలెను ఇంజామర మూలు - వుదయాద్రి నెల్లూరు పూరి ముందారాను
డెబ్బైయేడుటవైబోగములతో తేజముతో నాయుడు - తమకము సేవించే తమ బలములతోను
పొందుగా నెల్లూరు అందలాలు పొసగాంగనెక్కిరి - సూర్యాదిపతులతో సొచ్చిరి నెల్లూరు
అప్పుడు నెల్లూరులోన ఆ సిద్దిరాజు - నెమలిపురి కన్నూల నల్లమేడలోను
ముత్యాల గొడుగులు మొదమొప్ప(8.F) వేయు - అలావట్లమూలు అరువదివేలు
వింజామరమూలు వెలియు నొకలక్ష - పక్షిపద్దలవారు పదివేలు గవిరు
వెండి బద్దలవారు వేయి నొకలక్ష - పట్టపురాజు సరసన పాపసిద్దిరాజు
కోర్కెరాంగుల సవికెకొల్వుకూటమూలు - కొమార సిద్దిరాజు కొల్వుదీర్చి ఉంటేను
మనుమసిద్దిరాజు మండలాపతియు - దండిపరివారముతో తగకొల్వుదీర్చెను.
అప్పుడు పన్నిద్దరు దళవాయులతోను - ముందర బజంత్రీలు మూకలతోను
మెండుగా విద్యామూలు మోగాళ్లమూలు మ్రోయంగ - ప్రధాని భీమినీడు పర్యునేతెంచె
ఘనవేగరాజుకు కరములు మ్రోగని - నగయసూచిమాన నలసిద్దిరాజుతోననియె
భూపాల నలసిద్ది రాజ పట్టభద్ర వినుము - పన్ను గాయాదవులు పావరుగొట్లు
యాన్నవాని గోకుళము యేతెంచి మనభూమికి - శేషుఅదిపతులకు శీఘ్రమేనేడు
మెల్మిగా పైకాలు ముల్లెలు గలిగె - అనియిట్లు భీమన యారాజుతోననియె
వినయముతోడ పద్మనాయుడు వీరాపరివారము - వచ్చిరి నలసిద్దిరాజు వసుదీసుకొల్వుకు
అర్జునివలె పద్మనాయుడు తానిలచె - అగ్రువంచి చేతులు హస్తములు యెత్తక
(వెరిగొట్లుమూక) వెయ్యివేలు గూడి - కప్పిన గొంగళ్లు గొడ్డళ్లు భుజమున
కొండదుడ్డుకోలలు గుండ్లు పేరులూను - దొంటళ్లో వంకకత్తులు వడదొళ్లు మరియు
అరగపూ గొడ్డళ్లు అందరు మరియు - పూనిచేతి దుడ్డు కర్రలు పూనుకొని వంత
పలువారు సాదిరి నవ్వక (8.S) న్నులోను - తలను రుమాలలు దట్టి కోకలూను
అడ్డె కర్రలు మంచి గోరకయంబులూను - దొనకొని కంపటము దురితంబు జూచి
అవనీసు సిద్దిరాజు ఆడెనొకమాట - పరికింపలెనాటి ప్రగతులు (పరు)
అందలాలు దిగ్గైరి అర్రు వంచగైరి - పాలకీలు దిగి పాగసెరగులు విడిచి
రాచమ్రొక్కులు మ్రొక్కైరి మన ........కొల్వుకు రాగూడదువీరు - యేనాటి గొల్లరాజులు వెరగాంగ రాదు
ముందు మా తండ్రి ముక్కంటి ఈశ్వరుడు - పొలురాజు అనువాడు బోగదేవేంద్రుడు
అతనితో పోరాడి మా అయ్యలు చెల్లిరి - వారి వంశము అయితేను వద్దు మన భూమికి

చీమపారు సత్యము గద్దు చింకర్ల భీమన - భీమినీడు ఒకమాట తిన్నంగ సెప్పెను
అవును సిద్ధిరాజ అన వెరుతువుగాక - వెరుపు మరపులేక మనభూమి వీరు
నీ వెదుటికొచ్చినారు యెరుగక వారు - మన్నె గజపురాజ మనకెవ్వరెదురు
ధరయేలు యీ భూమికి దన్యుడవు నీవు - యెన్నంగ యీ భూమికి యెదురెవ్వరు మనకు
మరియు తిక్కన పెగుడు మండల విపుతోడ - మనవి నలసిద్ధి రాజుతో నిట్లనియె
చూచితే కనరాదు సుగుణాత్మతనము - మక్కువ వెర్రి గొల్లల మాటల తీరు
మలయసుభమూలు మందలు చేరి - అక్కడ భూములు ఆవుల మేపి
లెక్కలేక ధనము (వెలెక్క) ములు యిచ్చి - ఆదరించుకుందురు ఆవులనెల్ల
మొగులు పిడిగొల్లలు అగపడిరి మనకు - గొల్లమీది పుల్లరి గోగుమీది బచ్చలి
గొల్లని (9.F) మీది పుల్లరి కట్టిన పిండి పొట్టు - ఆకుమీద వ్రాత పడితె అప్పిదము పోరాదు
అనిన తిక్కన మంత్రి యాడుమాటలాకు - నలసిద్ధిరాజు యాపద్మనాయుని జూచి
యేసీమ యేకులముయే భూమి మీది - ప్రాకటంబుగ మాతోను పల్కుడీవేళ
నల్లసిద్ధి రాజుతో యాపద్మనాయుడు - బల్పుడ నలసిద్ధి రాజ పట్టాభిశేఖర
ఉత్తర కాశి భూమి ఉన్న స్థళంబు - శ్రీ విశ్వనాథుని సేవలు మేము
యన్న కాశిరామేశ్వరం యేలువడి మునుపు - ఉత్తర దేశంబు కాణాచి మాది
అక్కడ సేవించి ఆవుల మేపుతూనూ - కటకంబు నుండి గడ్డినీళ్లు గలవని
అక్కడ స్వామిని అతిభక్తి గొలచి - డెబ్బైయేడు దేవదుర్గములు దేనువుల మేపితిమి
అంబిట్ల కొనను ఆవుల మేపితిమి - ఆరుద్ర పురన్వసు అన్ని కార్తెలు వరుసను
మహాత్యమైన చంద్రకాలము ఆవుల మందమీద వచ్చెను - పరగ దక్షిణాదిని పశువులకు మేపులు
కలవని చెప్పిరి గవిరీలు మాకు - గవిరీల మాటలకు కంపటము మేము
వస్తిమీ నీకడకు వోసిద్ధిరాజా - కొండలు మలెలందు కొదవలేని పూరి
అడిగినట్లిచ్చేము అప్పెనము పుల్లరి - కొట్టడికి ఆవుల కోడెనిచ్చేము
పదిపుట్ల నెయ్యి పరగనిచ్చేదాము - ఆదరించుడి మమ్ము అదిమీకు మేలు
అనిన సిద్ధిరాజు అరుషంబు నొంది - పట్టుతివాసీలు పరిపించెనపుడు
వేదపురోహితుల విద్వాంసులాను - పండువెన్నెల వలెను పరివారమంతయు(9.S)
దండి చానలూను తగినట్లు ద్వరలు - నాయకులు ముగ్గురు నరపతులు కొంత
యాదవ కులజులు యాపద్మనాయుడు - పట్టుతివాసీల మీద పరగ కూర్చుండిరి
గంధం కస్తూరి కలిపి గిన్నెలూను - వైనాన అందరికి వరుసనిప్పించెను
తిక్కన మంత్రిని పిలిపించెనపుడు - పుల్లర్లు గట్టిచేయమని బలనాదుడనియె
అనిన తిక్కన మంత్రి అపుడేమనెను - వినపద్మరాఘవ విన్నవించేదామ
నిత్య ప్రసన్నుడు నీలకంఠుండు - కన్నులు మూడు కల్గిన స్వామి
మూడువేల వరాహాలు ముందుగా మీరు - అప్పెనము ఇవ్వగలర యాదవరాజ

మంచిదని పద్మనాయుడు మంత్రితో ననియె
మందను వున్నాడు మహా యిలవేల్పు
కవిలెనూ వ్రాయించు ఘనుడతిక్కన మంత్రి
బుద్ధులకు పెద్ద విద్యలకు గురువు
వడ్డికతో అరువేలు వరహాలు ఇవ్వగలర
కర్ణములు తెలుపు కరములు నలుపు
వడ్డికతో అరువేలు వరహాలు మేము
యివ్వగలము వ్రాయించు ఇది యంతలోది
మధురలో చణ్యూర మల్లులా బట్టి
మామగండమున బుట్టి మధురలోపలాను
పట్నము గ(10.F) ట్టిన పల్లికొండయ్య
పణిరాజు శేషయ్య - పవళించు ఘనుడు
పతపత్ర చాయమందు వైకుంఠపతియు
అడపాటలాడు మేటి విద్యా చావకు
పాతకానికి మీరు పెన్నెండు వేలు
కలకల నవ్వినాడు ఘనుడు పద్మనాయుడు
కపిలావుగన్న గరుడు బొల్లావు
ఆది విష్ణువు మూడు రూపులు ఆవై జన్మించెను
హరిభక్తులము మేము అవనెల్ల వెరుగ
అడగవోయి ఇది యంత అడిగియురాజ
కవివేలు వ్రాయించు ఘనుడ శిద్ధి రాజ
సంగమేశ్వరుండు స్వామి యున్నాడు
నిత్య జన్నావు కోడె మన్నల బసవన్న
ఆరువేలు వరహాలు అదియంత గనతి
గురుతు విరుగుల గుళ్లో స్వామీసుకు
పదివేల వరహాలు ప్రాతకనూకలివ్వగలర
కాపాడు సుందురు..............(10.S)
కస్తూరి శిద్ధిరాజు ఘనుడు ఇట్టనియె
దండి మందలకైన తరగదు పూరి
పిల్లిమీసం అలముకొల్లగా గలదు
యమాద్రి గలదు ఎందు చూసివాను
అదిమేయగద్దు మీ ఆవులు యిపుడు

- మూడు కన్నులు గలవాడు ముక్కంటి ఈశ్వరుడు
- ముందుగా నిత్తుము మూడువేల వరహాలు
- శివసంకమూర్తి శిద్ధగణేసు
- మద్దిల తాళలకు మాస్వామి యతడు
- అడిగిన నాయుడు అప్పుడేమనెను
- నచందటపు బొజ్జ నమ్మినాస్వామి
- గణాయక పూజకు ఘనుడ ఆరువేలు
- పల్లికొండ పెరుమాళ్లు ప్రత్యక్షవేల్పు
- సందుగొందులు వినగి తగజుట్టె యతడు
- కంసుని పరిమార్చి హుగ్రసేనునికి
- నందుని సుతుడైన గోవింద మూర్తి
- పద్నాల్గు వనములు పాదుకొని నిల్పనా
- సతనిత్య దేవుని సర్వేస్వరునకు
- గరుడు పాలకిసేవకు ఘనుడు పద్మనాయుడు
- స్వామికి కానుకలు సమర్పించగలర
- అయ్యెన యిలవేల్పు ఆది విష్ణుండు
- నరసింహ హనుమందు నారాయణుండు
- పాదములు జూచి పణిరూపుండును
- కొనియన్నరాదు కంపటము మాకు
- విదియంత ధనము యిచ్చేము రాజ
- మరియును శిద్ధిరాజు మండలేశ్వరుండనియె
- ఆరువేలు వరహాలు అర్పితము వ్రాయగలరని
- అభయమిచ్చి మమ్మునాదరించినాడు.
- కవిలెలు వ్రాయించు గనుడ శిద్ధిరాజ
- చిల్లల శక్తులకు చిద్ది స్థళాంబులాకు
- నూటొక్క శక్తులు వుర్వేసువి మంద
- అవియంత గనతయ్య అకునా వ్రాయించమనెను
- కొండల మీది పూరి కొదువలేదు రాజ
- వరుస మేపులు గడ్డి వున్నారీతి
- (..................) అలముకడగురుతులేదు
- కులగిరి గట్లు కుంటిణీయందు
- సద్దనిగియున్నాది సముద్రము వలెను

వద్దన లేదయ్య్య వోపినంత పూరి - పరుమట సముద్రము వలెను పరగమన భూమికి
కంచి శ్రీరంగము ఘనుడా మా వశము - దక్షిణ సముద్రము తగు శంకు బంధు
ఆడ మలమైను అవి మా వశము - మొవ్వగిరిపాల మొదలుకొని భూమిని
గుత్తిమేపగద్దు మా గోకులము నాయుడ - నిన్న మొన్న వర్షములు మహా మెరువగాను
కదు చెరువులు నిండి కైదొట్టినవి - నీళ్లకు యెద్దడి లేదు నీతోడు నాయుడా
పరుమటి కొర్రులు నిండి బైలెక్కి వున్నవి - దండి చెరువుల నీళ్లు తరగవు నాయుడ
నాయకమైన మానలశిద్ధి రాజుకు - నాలుగులక్షల పదివేలు పదార్థములు
యివ్వగలరా పద్మరాఘవేశ్వరా - నేను నా పతికి అరుషంబు నొంది
సక్కని మా నలనన్న సర్వభూషుండు - అక్కరపడ భూమికి అతడు వేతెంచి వొచ్చి
యున్నాడు యాదవ వంశ శేఖరూండు - సాలినంత ధనము సదా లక్షలైవా
తుల్యణముగా జూశూను తుదియందురాజ - కవిలెను (11.F) వ్రాయించు ఘనుడ తిక్కన మంత్రి
మరియును పద్మ నాయునితో ననియె - యరశిద్ధిరాజగు పుణ్యశాలి
పాలెలు, దుర్గముల్ పల్లెల యందు - మిట్టను గుంట్ల మిగులు చెర్వులూను
కట్టించిన యతడు ఘనపుణ్యశాలి - యనబై నూట తొంభైవేల వరహాలు
(..........) యివ్వగలర వెరసి శిద్ధిరాజుకు - అనుజుడు నలనన్న యారాజుకు తమ్ముడు
పేరైన కులజుండు పెయ్యల యర్రయ్యా - పన్నెండు వేలు బసవముద్ర యెద్దులు కలవాడు
పల్లిట్నాము (..................) బ్రబవీనవాడు - కంపటము ఒక అమాట కద్దులేదయ్య.
యంతమాత్రము అడిగితివి యరసిద్ధిరాజ - ఆకున వ్రాయించు అదియంత గనతి
పాపసిద్ధి రాజు అక్షోణి బలములకు కత - నిప్పు - అర్థముకు నీతి మంతుండు
పూర్వమందు అతడు మహా పుణ్యశాలి - పట్నంబు మీద ప్రజలు అతని వశము
కోట సంపద యందు కొదవలేని గనుడు - అలుసును కొర్రలు అత్తిముగ పండ్లు
(..................)దించిన యెట్టె సంగడవులూను - కొండల వయ్యాల్లి కొదువలేని పూరి
పదివేల వరహాలు పట్టగలరా కానుక - అదికుండు సట్టవారి అట్టెమారినీడు
మారినీడుకు పుత్రుండు మన (.............)యతడు - వడ్డె పెనుగులకు వైరి వసుమతి రాజు
సట్టవారి యర్రయ్య మహా సాహస గనుడు - అరుమూరు అనుమంతు మోరయెద్దులు అతని వశమువగలవు
సాలినంత ధనము యిప్పించగలడు - కమ్మలు వ్రాయించు ఘనుడ తిక్కన మంత్రి
గోపాలసిద్ధిరాజు గోగణమూర్తి - యాపతులతోను పోరాడ గలడు
నేపాళ భూపాళ (11.S) గ్గోపాళ సిద్ధిరాజుకు - లక్షమాడలు తెచ్చి రాశులు పోయగలరా
యంతలోది యీ మాట యంత గనమయ్య - రఘురాము తమ్ముడు రాజశేఖరుండు
వెలియ యాదవులు అతని వశమువ గలరు - కవ్వానిక ఒక మాడ కసుకలేదు.
అడుగుడి యంత తొడెము అడిగితివి రాజ - కుమారసిద్ధిరాజు కుంబిబేశ్వరుండు
మేడు లక్షల గుర్రాలు యేనుగులకు కర్త - అధికమైన భూమి అతడేలుచున్నాడు

ఆడి తప్పడు యతడు అతి పుణ్యశాలి - బొంకనియట్టి పరమ పుణ్యుండు
కొమారసిద్ధిరాజు కోరినంత ధనము - యివ్వగలర వక లక్ష యివ్వేళ్ల మీరు
పసుపతి రాజు అన్న బాలచంద్రుండు - నల్లవారి పిన్నయ్య సత్య చంద్రుండు
అతని వశమున చక్కని ఆవులు గలవు - వెంకటాద్రి అచ్యుతు వెలయి కోనేరు
అతని తమ్ములు నల్గురు అతి బలాధికులు - వెసగ నూరు వేలు యల్లావులు గలవు
యసగంగ ఒకలక్ష యంత మాత్రంబు - కవిలెను వ్రాయించుఘనుడ తిక్కన మంత్రి
భీమినీడు నాయినితో ప్రియములు బలికెను - రాక్షకరుణము తిక్కన రాజులకు మంత్రి
తిక్కన మంత్రి వచమున వీరుకరుణాలు - ఆరులక్షలిపుడు...........................
ఆకురాసే కరణానికి ఆరులక్షలిపుడు - యివ్వగలర పద్మరాఘవ యీ వేళ్లమీరు
బ్రాహ్మనుండు మాకు బహు చరిత్ర్యుండు - బ్రాహ్మణుండు మాకు భాగ్యముల కుప్ప
బ్రాహ్మణ దానాలకు బహు పుణ్యశాలి - బ్రహ్మయ్య వశమున పదివేల ఆవుల మంద
కలిగియుండును అతడు గనుడు బ్రహ్మయ్య (12.F) - తరతరము బ్రతుక మన దానంబు యిచ్చును
కవిలెలు వ్రాయించు ఘనుడ తిక్కన మంత్రి - బొడ్డుగల కోడెల భూదికి యిపుడు
అడిగినట్లు ఇవ్వగలర యాదవరాజ - అనివ విటునవ్వి యా పద్మనాయుడు
బొడ్డుగల కోడెలు పొసగ మీ సొమ్ము - నీళ్లను బుట్టిన పూరి నీ సీమలోను
మాదని పలికిరి మాంద కంపటీలు - కవిలెను వ్రాయించు ఘనుడ తిక్కన మంత్రి
అందుకు సిద్ధిరాజు ఆశ్చర్యముందెను - తల్లేగురు సిద్ధిరాజు తరుణులందరికి
యిపుడు పశువుల పాదికి ఇవ్వగలరా వనము (వరము) - రామచంద్రుని వంటి వాడు రాజు నలనన్న
సన్నాసి పట్నాము గట్టిన సతుల వర్జతుండు - అప్ప చెల్లెళ్లు రాజు సలను ఐదవులనేల్ల
అప్ప చెల్లెళ్లకు అరణము యిచ్చిన యట్లు - పదివేల వరహాలు పట్టుమని యిచ్చును
శెరశితి మరశితి మనకయనకటి బుద్దులు - మతియందు దలపోసి మనసున వుంచక
అడగవలసిన ధనము అడుగడామీరు - మా యేనుగుల కోనుణాలు మీ నగ్రావులు మెయ్య గద్దు
గుర్రాల కోనుణా న మీ నగ్రావులు మేయగద్దు - మేలని యిస్తిని మెత్తన పూరి
సవిటి అడిల నీళ్లు సముద్రము వలెను - తరముగాని చెరువులు తగపుడమి యందు
కొదువ యంతయు లేక గోకుళములకు మేత - కలదు పద్మనాయుడ కల్లమాటగాదు
పదివేల వరహాలు పంచిపెట్టగలర - వినుము సిద్ధిరాజ యిదియంత గనతి
కాక ఒక దొడ్డికి కానుకలేదు (12.S) - ఆకున వ్రాయించు అది ఎంత గనతి
మరియు నలసిద్ధి రాజు మన్నె నాయకులు - ఆమాట (..........) యాదవుల తోను
యిప్పలణా నాయుడా వినవయ్య మనవి - యనభై నూరు ఎద్దుల యర్రయ్యను యికను
గిరి వుంచకగాను కూడదు యనిరి - వినవయ్య అతని జన్మము విన్నవించెదము
పుట్టెను నున్న భూతేసు కృపాను - పెరిగెను బెజవాడ పెంపు మీరంగాను
లక్ష్మణార్యుల వంటివాడు రాజు తమ్ముడు యర్రయ్య - రాజు తమ్ముడు యర్రయ్య రాగూడదు యిక్కడికి

వెనుగుల రంతున యెద్దులకు గాదు - గుఱ్ఱాల గంతున నఱ్ఱావులకు గాదు
యఱ్ఱయ్య యెద్దుల యెడ బాయడయ్య - మరియావులు మంద పూరియావుల వలె వుండేవిగావు
పంపున యేనుగులపై నురకగలవు - గుఱ్ఱాలనన్నిటిని గుదులగా బొడిసి
మల్ల బడును ఆవులు మనుజులకైనా - యఱ్ఱయ్యను మా కోటలో గిరి వుంచితేను
నెలకు మూడు కూనీలు తప్పవు రాజులార - వుచితమై తెయెరిగి వుంచుకోమనెను
అంబువంటి వాని మనకు వద్దని పలికిరి - మీ మందలోని జాగిలాలు మంచివి యనుచు
గొప్పైన జింకలు కొమ్ము పందులూను - యేదుములు మనబోతులు యేగోలలూను
మా భూమిని గలవు మంచి మెకములూను - వెన్నంగ జాగిలాలు విడించుమనెను
పూర్వమందు జగిలాలు పుట్టుక వినుడు - ద్వాపర యుగమునాడు గోపిదేవమ్మ
గోవుల మేపు కొరకు వర్షాకాలముకు మ్రొక్కెను - అనిన దేవేంద్రుండు అపవిధ్ధగాను
వర్షములు గురిపించె వా(13.F) గులు దొల్లేను. - యేరులు క్రిష్ణ నదులు యేకమై పారెను
గోవులకు మేత కొదువలేకుండ - అమని గవిదించెను అపుడు దేవేంద్రుడు
ప్రబలి ఆవుల పితుక పాలువలసినయట్లు - గోపెమ్మ సంతోషించి వారి గోవులాలోను
యశోద దేవేంద్రునుకి యజ్ఞము గావించె - కావించినయపుడే కలిగె క్రిష్ణమ్మ
యిల వేల్పునై నేను యిట్లు వుండంగ - పరయెల్పులా కొలువ సవ్యంబు గాదని
అని కొల్లలాడించెను అరికృష్ణుడెల్ల - దేవేంద్రుని యజ్ఞము కొల్లలాడించెను
అలగి దేవేంద్రుడువారి యావులమీదను - యడలేక కురింపించే వర్షము యేడు గడియాలూను
కురిపించె వర్షములు వారి గోవుల మీదానూ - అరాత్రి కురిపించ రాళ్ల పిడుగుల వాన
దేవేంద్రుని మహిమ దెలసి కృష్ణమ్మతు - కినిసి గోవర్ధన గిరి పెల్లగించె
పూని బొటిమవేలుతో కొండగోడుగుగా యెత్తెను - పషువులు మృగములు గోవులానెల్ల
యలమితో దాసెను యేడు దినమూలూను - వైరము గల మృగములకు వైరము లేకుండా
శరభశార్దూల సింహములు మొదలు - యేనుగులతో నున్న యలమితో పులులు
ఘండాభేరుండా ఘనమృగమూలూను - పులులును జాగిలాలు పూని కుడువసాగెను
వాటి సాహసము జాగిలాలకువచ్చె రాజులాల - పులులు శౌర్యముగా కన్న పులిశౌర్యము యేపులు
మందనెడబాసిని మన్నీలనుర్మాడును - తురంగములనన్నిటిని తునకలుగా గరుసును
గజములనైననూ గడిసిపోనియ్యక - బంటును రాజులను నుర్మాడి సంపునూ
యీలాగే జాగిలాలు (13.S) యీ మందలోకి - పట్టి తెత్తురుగా మీ పరివారమును బంపుడి
నరనాదు సిద్ధిరాజు నాయుని జూసి - యీలాగు జాగిలాలు వేల యీ పురికి
వద్దనే శిద్ధిరాజు పెద్ద పిన్నలతోను - భరద్వాజ శిద్ధిరాజు పల్కియామనెను
అడిగితిమి పుల్లారి వొప్పితివి నీవు - అదుగురు మీరును అవిశంబు యీల
అనిన పద్మనాయుడు అరాజుతో ననియె - ధరయేలు శిద్ధిరాజు ధర్మము మీ సొమ్ము
కర్మవర్తన జనులు కలరు యందైన - తనవునా ధర్మంబు తప్పక మీరు

ఆడిన మాటలు ఆపితప్పకుండి - కోడెల ఆవులకు కటకొర్రు దిగినాగాని
కోరిన పుల్లరి కొంచ పోలేరు - ఆవుకాలు యెద్దుకాలు అతి భారమైతేను
మీరు అడిగిన పుల్లరి మేము యిచ్చేది లేదు - ధరణీశ మీ వల్ల ధర్మంబు దప్పిన
చాకవిండ్లవారు చెటికినా గాని - ధరపతీ పుల్లరి యడుగ ధర్మంబు గాదు.
వాగున జాలరి వలవెయ్యరాదు - మడియేలు రేవున మాందవీలు బెట్టిన
అరంతులకు ఆవులు అడవులకు వురుకును - సాలమందలు జడిసి సల్లుబెద్దులూను
నిలువవు అడవిలో నీళ్ల త్రాగవూను - మీకును మాకును మేధిని లోను
నదులు నిదులు సాక్షి నరసాక్షిగాదు - పారేటి పెన్ననది పల్లికొండ సాక్షి
సంగమేశ్వరుండు మల్లాపు బైరవుడు సాక్షి - విరుగులాసాని బాల సోమేసు సాక్షి
ధరదెవి ఆకాశ సూర్య చంద్రులు సాక్షి - పారేటి నదులు పల్కుటాసాక్షి
కమ్మలు రాయించు ధర్మంబుతోను - శ్రీ సంవత్సరాది వినము సరగా మాసంబు
కవులు పత్రికలు మాకు కడు వేగయిమ్ము(14.F) - అంతట శిద్దిరాజు అనుజునితోను.
నల్లమేడ నీడను నరనాదు బిలచె - పట్టంచు అందలాలు పాలకీలు యపుడు
భద్రగజ అశ్వములు బారులు నడువ - బూరలు దారలు పాసగ వాయిత్యమూలు
భేరి మృదంగములు పెల్లుకొని మ్రోయంగ - మురయునూ యాదవులు ముందర నడువ
పన్నిద్దరు దళవాయిలు ప్రదాని భీమన - పాసగంగ పాలకీలు యెక్కిరి విరుగడల
అనుజులు విరుగడల ఆత్మ బంధువూలు - పల్లకి ముందర పడి వారితేజీలు
యలమల సెట్లూను మలయనాయక ద్వారాలు - రాజు వెంట గదిలిరి రక్షమూకలూను
పల్లికొండ దేవళము పరుమట మొగ మండపమున - పల్లవ నల్లసిద్ధి రాజులు పాలకీలు దిగిరి
యాదవులు తూర్పుగాను అందలాలు దగిరి - బోజుదు నలసిద్ధి రాజు మొగ మండపమున
పట్టుజము కాళ్లములు పరిపించెనపుడు - జముకాళ్లముల మీద తమ్ములు నలసిద్ధిరాజు
కూర్చుండిరి యాదవ కొమర వర్గంబు - తరువాత యాదవ అతికె సూరులంత
సమద్రిష్టిగా కూర్చుండిరి సంతోషముగాను - తిరుమల దేవునకు దివ్యంబులెత్తించిరి
కంభాన దివ్వెలు ఘనతముగా యెత్తించిరి - స్వామికి అభిషేకంబు సమార్పణ జేసిరి
అందముగా సొమ్ములు అలంకరించిరి - తాళాలు వీణెలు దండి పాటలూను
స్వామికిసేవలు సొంపులతో చేసిరి - తగ వేద్యసిద్ధయ్య తనయుని పిలచిరి
మనసు నా తలపోసి మనవాది పుండు - ప్రియమున తిక్కన పెగుడుతో ననియె
మనవారి పందుమాట నిలకడాకు - తప్పక కమ్మలు తగవ్రాయమనిన
తగమే రాగ (14.S) రివుదర్మ మార్గమూగ - శీగ్రమే వ్రాయమనెను తిక్కన మంత్రిని
(..............) వియజనామ సంవత్సర చైతర బహుళ - పంచమి శుక్రవారము రోజు వరకు
మేధివిపై యాదవులకు మెర్వ్యకట్టు దప్పిన - పుల్లారిడిల్లును భూనాదుకనిరి
వ్రాసిరి పత్రికలు వైన వైనాన - ధర్మంబు నిలిపితే దక్కును సొమ్ము

పాలేటి పెన్న భైరవుని సాక్షి - సంగమేశ్వారుండు సదాశివుని సాక్షి
భూమి అకాశము బొంకను సాక్షి - హరహరాదులు దేవతలు అయిసాక్షిగాను
కమ్మలు వ్రాసి ధర సాక్షిగాను - దేవుని ముందరకు తెచ్చిరి కమ్మలు
తీర్థప్రసాదముల్ తెనుగొప్ప నందిరి - నిల్పుదూ సత్యంబు నిదిసాక్షిగాను
యాదవులకు వ్రాసిన కమ్మలు శిద్దిరాజు తానందెను - పద్మనాయునికి కమ్మలు పట్టుమనిచ్చెను
కమ్మలు అందుకొనిరి కడు వేగమూగ - మగిడి యాదవులు నాయుడు మందకు చనుదెంచిరి
నలసిద్దిరాజు మన్నె నాయకుల బిలచి - పేరుపేరున బిలసి ప్రియములు బలికేను
పటాని రౌతులను పరగాంగ బిలచి - చెంచు నాయకులాను చెలు మొప్ప బిలచి
గురికాళ బోయిల గొబ్బున బిలచి - చేరి విచారంబు చేసి యిట్లనియె
గోవులు మెయ్యగా గోవులు తోలినాను - సయ్యన బెదరించి సల్లుటెద్దులతోలిన
కయ్యము చేసినా గొల్లరాజు మనము కడుతేరలేము - సత్యము దప్పితిమైన పరియారము వినుడ
పుల్లరి కాసులు అడుగ గూడదు మనము - వారితో బాషించి వార్తలు జెప్పి
పల్లవ నలసిద్ది రాజు పట్నా (15.S)మున కరిగె - ముగ్గురూ నాయకులు ముష్టి ముమ్మినీడు
పెదవెల్లి ప్రేమాన పిమ్మసాని భీమన - అంగిరేకుల సాంగన అమృతపు శింతగ
యెంద్లనుజుల పల్లకీలు నాయకుడు యెక్కెను - అటువెనుక దిగనురికి రాజుకు మ్రొక్కిరి
నరనాధు అవులన్న నాయనింజాశి - భూమీసు వార్తాది అక్కడ పాడగన్న వార్త
పుల్లర్లు అడిగెను పూని విచారంబునాను - ఆశ్చర్యముగా నెల్లూరు రాజులు వార్తలు అడిగెను
అనివిని రాఘవుండు ఆ రాజుతోననియె - నలనన్న యిటువిను నా విన్నపంబు
మితి దప్పిన బాసలు పల్కిరి మేధినియందు - అర్దుగా నలశిద్ది రాజు మన యాదవులకు పుల్లరి
అడిగెను అబారతపూధనము అవులన్నా వినుము - పల్కునిజముగా నాడే పల్లవాది రాజులు
కాంచి విజయ నగరము కడు వేగ విరూపాక్ష - అనెగొంది మండలము అందు యిందు అనక
ద్రవిళ కొంకణి యెందు దన రాజ్యమూలు - చెంక్కు భందు రామేశ్వరము దాక
మనకు సెలవని పలికెను - బొడ్డుగల కోడెలా భూనాదుకిపుడు
చంకలేక యిమ్మనెనూ నలశిద్దిరాజు - నెను విన్నమిచ్చిన నేర్పులు వినుమా
ఇప్పుడు యీనె అవులు యిరువది లక్షలు - కట్టగల తరుపులు కడమేరలేవు
కట్టి యీనిన కోడెలు కదుపులు మియ్యి - అని వప్పింతిమి నలనన్న ఆవులకు పుల్లారి
నీళను బుట్టిన పూరి నేర్పుతో యడిగితేను - మంచిదని వొప్పెను మనమ శిద్దిరాజు
అనిన సంతోషించి ఆయావులన్న - చేతిలో చేయి వేసుకొని చెప్పుకొని నమ్మిరి
పుల్లరి వొప్పించినా భూపతులకపుడు - తశిరీబులు గొప్పించి తగు వేడ్కతోను
నాయుడ వినవయ్య నాచిన్న మరిది - వెండణుసుల పల్లశెలపతి రాఘవ
మంతనాల రామశిలక మరిది పద్మరాఘవ - విన్నపము చేసెను యినవోయి (అముద్రితము)

---

వొచ్చింది శిద్దిరాజుల వారికి మనకు - పొందులు సేసుకొని పోరాదు మనము

అమ్మ శిరిదేవి వద్ద నంగాను
పుల్లరి ధనము కొరకు భూమిలొప్పితిమి
దేవగణంబులు సాక్షులున్నారు.
పాలిలోపల మన సత్యము పాటి ఉండవలెను
వొప్పు తప్పులు లేకుంటె గాని వుచితంబు గాదు
సిద్దిరాజు మనము సత్యానవుంటేను
వరహాలు వకరాశి వంచించకపోసి
యడగలక చాతను వెన్నించవలెను
మా వద్ద పుల్లరి ధనము మీకు చెల్లిస్తిమి
నీరున బుట్టిన వాడవు నీవుగాను
నిన్ను నీరు చేయగక గాని నిల్వమీచోట
అందాక మేపుడిమన అవులచటను
కవులావుల చాతను (16.F.)
పశువుల వచ్చెనంటె భూమి పారిపోవలెను
యిచ్చినారు మనకు
కడచేసి పోదాము యీ భూమిని మనకవులావుల మేపుడి
మెయ్యనియ్యమని గోపాల్కులు మేలాయనని వచ్చిరి
నెల్లూరికి పరుములు గన్నవారమయ్య
యేపెలు యలగలవు యరగుడిపాడు
విదులాభిమారం యెలిముద్దపాడు
రాక్షగుండ్లపాడు రావులకొల్లు
మరుమట వెలిగొండ పంచలింగాల కొండ
ఆదూరి పెంట్రాల అన్నెబోయిన పల్లి మేరాగాను
అరెమాను చేతికే అచ్చోట త్రొల్లెను
పుడమెల్ల గప్పె భూనాధుని మంద
కడువేడ్కతో మందలు కదుపులు కదిలెను
ధరణి వనుకంగ త్రొల్లెను మందలు
దేశరాజు కవులావులు దేశములు నిండెను
చెదరి (.................)నాయట్లు (16.S)
అవనికుల గిరులకు అరిగినాయట్లు
యల్లావుల కదుకులు వెల్లివిరిసినాయట్లు
యిరువైఆరు కోట్లు విష్ణుముద్ర యెద్దులు
అనంత యర్బతము అవులామంద

- ఆవులు మనము అగర్వులై వస్తిమి వారి భూములాకు
- వొప్పి ఆ పెన్నలోపల కల్లలాడకుండ
- యెల్లదేశములో మన కథలు వన్నెగావలెను
- తగవు గెలిస్తే గాని మనకు ధర్మంబు గాదు
- పత్రాలు చించకగాని మనకు భావ్యంబు గాదు
- వారికి వడబడ్డ పుల్లారి ధనము వారికి వప్పించవలెను
- మాడలు ఒకరాశి మంచవ్వగాను
- శిద్దిరాజును బిలచి మనము చెయ్యిబుచ్చుకుని
- నీరున పుట్టిన పూరిని మాకిస్తివి
- నిన్ను కొనుకొంటిమి నీవు మా సామ్ము
- అని పగదెల్పి కయ్యంబు ముందర బల్మిచేతముగాని
- నెల్లూరు దాక కంద్దువతో మేపురోయి మన

- యేటి మీద అరునెలలు యడచేసినాము
- యడచేసి నాశరతు యాదాది వెళ్లెను
- చలగి యీభూమాంత చెలుసాగాను
- యెగవిడిసిరి కవులావుల యరాళముగాను
- పందుమనాగవారము
- మనుమాడురేమాడు మరిమల్లెపాడు -
- కోడిగుంపుల పల్లికోట్లాలపెల్లి -
- కంపమడుగుపాడు గండికోటపాడు -
- కరియెద్దు కురువస్తాంబ్బముదనరియె
- యగవిడిసిరి కవులావుల యారాళముగాను
- కదిలెను కంపటము కడు వేడ్కతోను
- నవ్వతికోటిమందలు నదులెల్ల గప్పెను
- ఆవుల మందరణ భేరి అంచున మ్రోగెను
- చెరువులు వెల్లివిరిపె చెదిరినాయట్లు
- మిడతలు ఆకాశము మీదికి వెగసి
- మింటికి ఆకాశము మెరయుచూ భూమి
- చంకతీత కొమ్ములు సన్నధారలు బట్టిరి
- తొంబైతొమ్మిదిగోట్లు దారముద్ర యెద్దులు
- సలుగుటెడ్లు ఒకలక్ష సంగడావులూను
- జడాదారి లింగముద్ర శంఖుచక్రాల యెద్దులు

పట్టాభిషేకం పరమేశ్వరుని నందుల బోలు - ముందుగా ధేనువులు మత్స్యకోట చేరుకొనెను
మేపెటు ధేనువలు మెత్తని పూరి - బంధుశిరోమణి బడుగులరాజు
వేనూరు గొడుగులు వెలియనొకలక్ష - పిలనగ్రోవులాడించి పెయ్యలు బిలచి
సట్టువారి యర్రయ్య సమయేడు మంధలు - ముందుగా పాకనాడు మెరశిన తురగాను
పెయ్యల యర్రయ్య ప్రిద్వీశ్వరుండు - పన్నుగా పదివేలు పలాకావిళ్లు
నందుల విరుగడలు నడిసె సంపాద్యాలు - సల్లవారి ఆవులు సరిసచిరుగడల
వేగమే కదిలెను వెల్లివిరిసిన రీతి - బీరినీని మందలు బారున కదిలెను
సర్వసన్నాయములు సంపదలు కదిలెను. - దొమలేరు మంచ్యలు మడిపరుపులు కదిలెను
సాలమేయు చిలుకలు - జాలింరెగలు కదిలెను
నేతి సిద్ధకావిళ్లు నేర్పుతో కదిలెను - బియ్యము గోనెలు పిగిలి బంతుగడలు
ప్రాబిలి దేనువులు కదిలెను పాకనాటి భూమికి - రాగిబిందెలుమంచి రత్నాకంబళ్లు
జగజుంపు గొడుగులు జల్లులు గడలు - అరువైయారు స్థంభాల ఆముర్తాల బారిగుడారు క్రింద
కుంభిణి మీద యెత్తించి క్రిష్ణమ్మ మనుమడు - ముదముతో ఎత్తించె ముత్యాల పందిరి(17.F)
తీరుగా శృంగారించిరి దేవేంద్ర ముఖము - రత్నాల తమకము మీద రాజు రాఘవుండు
పంతముతో కూర్చుండె పశుపతిరాజు - సొగటాలు యాడుసూ సొంపులూ మీరంగాను
నెలపది దినములు నెల్లూరు విరియేల - బలువైన యంత్రపొందు తీగెయలుము
పశువులమేపుచూ పశుపతిరాజు - అంతట నెల్లూరులోని అధికులందరూను
రస్సని కూర్చున్న రాజద్వారాలూను - అప్పుడు తలపోసిరి అవిశీర్యమందిరి
ఉత్తరకాశి అమరావతి పుర్వీశుండు - పాటైనదేను వల పదహారు గోట్లు
యమునికి నెరువని యేరాజుదిరులు - అవతారధీరుడు అతడు యాదవరాజు
సృష్టిలో కృష్ణమ్మాకు సాటి యవరచ్చును - యితని జన్మము చూడయీశ్వరుడెకాని
మనుజులుయంత వారికినైన మరివశముగాదనిరి - పచ్చిక కసువులు మేసి పసువులన్నియును
నందవాడ చెరువుకు నటుసాగెనీళ్లకు - మునుకొని దేనువలు ముంచి త్రాగంగాను
నన్నూరు మూకతోను నందవాడబేతినీడు - నీళ్లు త్రాగకుండ నిలచె తటాకము మీద
కోకబెదురులు పెట్టె కేకలు వేసిరి - బెదురు బెట్టి దేనువుల చెదర దోలంగ
నీళ్లుత్రాగక యెద్దులు నిలచి పోట్లాడ - ఆవులు గాసేటి అధిపతులెల్ల
యర్రయ్య సట్టవారి యర్రయ్య యపుడు - ఆవులన్న సముఖానికి అదిగొనివచ్చిరి
యర్రయ్యతా బలికె మహారాజతోను - మక్షమై సోమకుని మర్దించి యాదవులు
తెచ్చి బ్రహ్మకు యిచ్చిన దేముడవునీవు - వొడుగు రూపమున బాలునీ మూడడుగులడిగి
కూర్మావతార (17.S) మునకు దానంబు వీపున - నిల్చిన స్వామి వినీల వర్ణుండ
అట్టిదాసును బట్టి అహంకారముతోను - పట్టి చంపినయట్టి బాలుడవు నీవు
రాఘురామచంద్రుడా రాజునలనన్న - వినుయుముగానా మాట విని వుద్ధరించుము

యిలవేలునల శిద్ధిరాజు మనకు యిచ్చినాకవులు - ధర్మము తప్పనని మనకు తగకమ్మలిచ్చె
కవులిచ్చి తొప్పెను ఘనుండు శిద్ధిరాజు - సన్నూరు మూకతోను నందవాడ బేతినీడు
తటాకముపై నిలసి త్రాగనియ్యక నీళ్లు - కేకలు వేయించి అవులను గుట్టలకు దరిమెను
వేయివేలు మందలు వెరవక నిలిశెను - పోటువంకెలు వేశి పోటు కుదిరిగెను
మాకు సెలవిమ్ము మాదవులనలనన్న - గారవించి తమ్మునికి కస్తూరి అలది
తెగనాగ్నె చేయుమని సెలువిచ్చెరాజు - అనివిన్నవించినా ఆరాజుకు మ్రొక్కెను
కదలిరి యాదవులు ఘనకీర్తి వెలయ - సాహసఘనుండు సట్టవారి యర్రయ్య
మహోౙ కొని యాదవమన్నీలు నమవ - అగ్రుడై యర్రయ్య అప్పుడేమనెను
నలశిద్ధిరాజు మాకు యిచ్చినాకవులు - న్యాయంబు తప్పి చెరువునీళ్లు త్రాగనియ్యవేమి
నీళ్లును పూరినీ నీకేమి తగవు - సాలమేరాలు సల్కి సవాలక్ష కోడెలు
తామనవిగ చేసి తగ కమ్మలిచ్చెను - పంపుట యెరుగవా పల్లవాది రాజులు
నీళ్లను బుట్టిన పూరినీళ్లు మాసొమ్ము - కడకుబోవుట మంచిది కావరంబేల
పోతినీడు మహర్కొని పార్లదోలె యావుల - గోవుల తోలంగ గోపాల్కులు గదిలిరి
(..................) సట్టు వారి పెద్దపులియనగ - సట్టువారి యర్రయ్య అగ్రుడై మండి
నరికెను నందవాడ బేతినీన్ని అపుడు - నడుము రెండు తునియలుగా నరికిపడదోసెను (18.F)
నన్నుదుము కాంతనటు కోల్పోరి - నెత్తూరు వస్త్రములు నెల్లూరుకంపిరి
మందనావులు నీళ్లో మరిత్రాగెనంత - నెత్తూరు వస్త్రములు జూసి నెల్లూరి రాజులు
చెల్లును యాదవ చంద్రునికి యనిరి - అచ్చోటనుండకాయా మరునాడు
కంపటము పరుమట కదులమనె రాజు - పెన్నవెంట గోకులము పేరుసాగినడిచెను

# అనుబంధము - V

## శిల్పాలు - చిత్ర పటాలు



కాటమరాజు

గుండం చర్ల



గంగ
గుండం చర్ల



దీప స్తంభం
గుండం చర్ల



పెద్ద నీటితొట్టి

గుండం చర్ల



కాటమరాజు బావి

గుండం చర్ల



గంగ
గంగ దేవాలయం
గంగదొనకొండ



పాత రావిచెట్టు
రాజు గుడి
గుండం చర్ల



బడుగుల వంశ చిహ్నం
గంగదేవాలయ మండపం
గంగదొనకొండ



ఎద్దు - ఏనుగు పోరాటం
గంగదొనకొండ



యుద్ధవీరుడు
ఏనుగుతో పోరాటం
గంగదొనకొండ



సిరిదేవి పాపనూక
గంగ దేవాలయం
గంగదొనకొండ



యెద్దు ముమ్మయ్య శాసనం
గంగ దేవాలయం
గంగదొనకొండ



యుద్ధవీరుడు
గంగ దేవాలయం
గంగ దొనకొండ



మహిషాసుర మర్దని

గంగ & యుద్ధవీరులు

గంగదొనకొండ



మడి యేలమ్మ - మడి యేలయ్య

గంగదొనకొండ



సహగమన గుండం
గంగ దేవాలయం
గంగదొనకొండ



ఓరుగంటి బేతాళ
గంగదొనకొండ



శివ
గంగ దేవాలయం
గంగదొనకొండ



బొల్లావులు
కంచు మరియు కొయ్యతో చేసినవి
గంగ దేవాలయం
గంగదొనకొండ



గంగ దేవాలయం

గంగదొనకొండ



గంగ దేవాలయం వెనుకభాగం

గంగ దొనకొండ



మండపం
గంగ దేవాలయం
గంగదొనకొండ



దీప స్తంభం
గంగ దేవాలయం
గంగదొనకొండ



ప్రవేశ ద్వారము
గంగ దేవాలయం
గంగదొనకొండ



వీరభద్ర
శివుని గుడి
గంగ దొనకొండ



శివుని గుడి శిథిలాలు
గంగదొనకొండ



అగుమంచి బావి
గంగదొనకొండ



సుడి బండి చక్రం
గంగదొనకొండ



పాపనూక మేడ శిథిలాలు
గంగ దొనకొండ



కాటమరాజు కోటకు మార్గము
గంగదొనకొండ



కాటమరాజు కోట శిథిలాలు
గంగదొనకొండ



కాటమరాజు కోట వెలుపలి దృశ్యం
గంగదొనకొండ



రాజ భవనాల శిథిలాలు
గంగ దొనకొండ



మహిషాసుర మర్దని
గంగదొనకొండ



గంగ
శివుని గుడి
అర్ధవీడు



పోలురాజు
అర్ధవీడు



గొఱ్ఱెపోతుపై ఎక్కిన గంగ
శివుని గుడి
అర్ధవీడు



యుద్ధవీరులు
గంగదేవాలయం
పంచలింగాల కొండ



పోలురాజు అవతారం
పంచలింగాల కొండ



గుంటి గంగ
పాలేరు నది మధ్యలోని రాతి గుండు
పంచలింగాల కొండ



బీర్నీడు
పాలేరు నది మధ్యలోని రాతిగుండు
పంచలింగాల కొండ



కైలాస బండ శాసనం
పాలేరు నది మధ్య
పంచలింగాల కొండ



యరగడ్డపాటి యుద్ధ ప్రదేశం
యరగడ్డపాడు
పంచలింగాల కొండ సమీపం



కాటమరాజు కోట శిథిల స్థలం
యరగడ్డపాడు
పంచలింగాల కొండ సమీపం



గంగ
గంగ దేవాలయం
పంచలింగాల కొండ



గంగ దేవాలయం
పంచలింగాల కొండ



శివుని గుడి
పంచలింగాల కొండ



శివ లింగం
పంచలింగాల కొండ



తెర చీరె
యర్రబాలెం



తిరుమందుల తినుటిజిక శాసనం
గంగదేవాలయం
పంచలింగాల కొండ



పోతయ జియలిడు శాసనం
గంగ దేవాలయం
గంగదొనకొండ

# BIBILIOGRAPHY
# (గ్రంథముల పట్టిక)

## ప్రాథమిక ఆధారాలు
## తాళపత్ర గ్రంథములు :

### ఆవుల వలురాజు చరిత్ర :

మద్దులేటి కవి, పడరుప - ఆవుల వలురాజు చరిత్రను మద్దులేటికవి స్పష్టంగా వివరించాడు. ఈయన తాతపేరు మూలయ్య ; తండ్రి - పెద్దనార్యుడు. ఇంటిపేరు పడరుప. మద్దులేటి కవి ఎప్పటివాడో, ఎక్కడివాడో - పూర్తివివరాలు తెలియటంలేదు. ఈ తాళపత్ర గ్రంథంలో ఇరువది యేడు తాళపత్రములున్నవి. ప్రతి తాళపత్రము నలుబది సెం.మీ. పొడవు, నాలుగు సెం.మీ. వెడల్పు ఉన్నది. తాళపత్రానికి రెండువైపులా తొమ్మిది నుండి పది లైన్ల వరకు ఉన్నవి. తెలుగు ద్విపద సాహిత్యంలో రచన కొనసాగింది. ఇందులో ఐదారు తాళపత్రాలు విరిగిపోయి ఉన్నవి. కనకబండి హనుమంతరావు - సత్యనారాయణ, భైరవుని పల్లి గ్రామం, నేలకొండపల్లి మండలం, ఖమ్మం జిల్లా వారి సహకారంతో ఆవుల వలురాజు చరిత్ర తాళపత్ర గ్రంథాన్ని సేకరించడం జరిగింది. ఈ తాళపత్ర గ్రంథం ప్రతిని తెలుగు సంవత్సరం విరోధిలో వీరయ్య వ్రాసుకున్నట్లు చివరన తెలుపబడింది. శకసంవత్సరం ఇవ్వలేదు.

### పెద్దిరాజు కథ :

రచయిత పేరు తెలియదు. ఈ తాళపత్ర గ్రంథంలో ముప్పదిఐదు తాళపత్రములున్నవి. పొడవు ముప్పది తొమ్మిది సెం.మీ., వెడల్పు 3.5 సెం.మీ. తాళపత్రానికి రెండువైపులా ఆరు నుండి ఎనిమిది లైన్ల వరకు ఉన్నాయి. తెలుగు ద్విపద సాహిత్యం. ఇది చాలా జాగ్రత్తగా భద్రపరచబడిన తాళపత్ర గ్రంథం. విశ్వావసునామ సంవత్సర, వైశాఖ దశమి ఆదివారం నాడు కనకబండి రామచంద్రయ్య వ్రాసుకున్నట్లు చివరన వివరణ ఇవ్వటం జరిగింది. శక సంవత్సరం తెలుపలేదు. కనకబండి కొండయ్య, భైరవుని పల్లి, నేలకొండపల్లి మండలం, ఖమ్మం జిల్లావారు ఈ తాళపత్ర గ్రంథాన్ని ఇచ్చినారు. (1975).

### బల్లికురువ పోట్లాట :

రచయిత పేరు ఈ తాళపత్ర గ్రంథంలో లేదు. ఇందులో 56 తాళపత్రములు ఉన్నవి. 38 సెం.మీ.ల పొడవు, 3 సెం.మీ.ల వెడల్పు. ప్రతి తాళపత్రం వైపు ఐదు లైన్లు ఉన్నవి. ఇది తెలుగు ద్విపద సాహిత్యం. మోడి చినపాపయ్య, S/o. నాగయ్య, యర్రబాలెం, దొనకొండ మండలం, ప్రకాశం జిల్లా వారు ఈ తాళపత్ర గ్రంథాన్ని ఇచ్చారు.

### అగుమంచి కథ :

జరుగుపల్లి చన్నయ్య రచయిత. అరుంధతి వంశమువాడు. ఇతడు పూర్వకవి స్తుతిలో కాళిదాసుని తలచుకొన్నాడు. బాణావీరుల ప్రజ్ఞను మెచ్చుకొన్నాడు. జరుగుపల్లె గ్రామస్థుడని తెలుస్తున్నది. ఈ గ్రామము నెల్లూరు జిల్లాలో ఉన్నది.

అగుమంచి కథ తాళపత్ర గ్రంథము శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయము ఓరియెంటల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్, తిరుపతి లో ఉన్నది. నెం. : పి.ఆర్. 664. ఇందులో 37 తాళపత్రములు

ఉన్నవి. ప్రతి తాళపత్రము వైపు ఆరునుండి ఏడు లైన్లు ఉన్నవి.

**భక్తిరన్న కథ :**

వెంకట్రామయ్య; కనకబండి భక్తిరన్న కథను శోభకృత్‌నామ సంవత్సర ఆషాఢ శుద్ధ పంచమి నాడు పూర్తి చేసినట్లు ఉన్నది. శక సంవత్సరం తెలుపలేదు. ఇందులో 37 తాళపత్రములు ఉన్నవి. 36 సెం.మీ.ల పొడవు, 3.5 సెం.మీ.ల వెడల్పు. ప్రతి తాళపత్రము వైపు ఏడు లైన్లు ఉన్నవి. తెలుగు ద్విపద సాహిత్యం. నూకమదారయ్య, దనియాలగూడెం, ఖమ్మం జిల్లావారు 1978లో ఈ తాళపత్ర గ్రంథాన్ని అందించారు.

**జన్నివాడ కథ :**

**పోలురాజు యుద్ధం :**

కనకబండి గట్టయ్య రచన. జన్నివాడ కథను - దక్షిణ కాండ, చదరంగం కథ, దక్షిణాది ఆవుల మేపు అని కూడా పిలుస్తారు. జన్నివాడ కథ, తాళపత్ర గ్రంథంలో గట్టయ్యను గురించిన వివరాలు ఇలా ఉన్నాయి.

"కన్య సిరుల గోత్రుండు కాంతి చంద్రుండు యదువంశ తిలకుండు, యాదవఘనుండు, వారధి కనకబండి వంశవర్ధనుండు కొండయ్య నందనుండు కులపావనుండు సెలుమొప్ప, గట్టయ్య చెప్పెనీకథయు."

"ఆంధ్రకవి సప్తశతి" - బులుసు వెంకట రమణయ్య గట్టయ్య కవిని గూర్చి ఇలా వ్రాశారు. "ఈ తని నివాసము నిజాం రష్ట్రములోని నేలకొండపల్లియట! ఇతడు 170 ఏండ్ల క్రిందట నుండెనని గోలకొండ కవుల సూచికలో కలదు. ఈతడు యాదవుడట ఈకవి హరిశ్చంద్ర కథను ద్విపదగా రచించెను. మరియు కాటమరాజు కథను, పోలురాజు కథను రచించెను."

"హరిశ్చంద్ర కథ" - తాళపత్ర గ్రంథం చివరన ఇలా ఉంది.

"..................కొండపల్లి శిరిగల యాదవ..................... పుడమి లింగమాంబకు పుత్రుడనగాను వరపుత్రరత్నంబు వర్ధిల్లు జగతి ఘట్టయ్య హరిశ్చంద్ర కథ విన్నవించె. ఈతాళపత్ర గ్రంథంను నేను సేకరించాను. ఇది గట్టయ్య స్వయంగా తన ఘంటంతో వ్రాసిన తాళపత్ర గ్రంథం. చివరి తాళపత్రాన్ని పరిశీలించినచో ఈ విషయం స్పష్టంగా తెలియగలదు. గట్టయ్య కంసుని కథ కూడా రచించినట్లు తెలుస్తుంది.

జన్నివాడ కథ తాళపత్ర గ్రంథంలో 60 తాళపత్రములు ఉన్నవి. 32 సెం.మీ. ల పొడవు, 3 సెం.మీ.ల వెడల్పు, తాళపత్రం రెండువైపులా ఎనిమిది లైన్ల వ్రాత ఉన్నది. ఇది తెలుగు ద్విపద సాహిత్య గ్రంథం. ఇందు మొదటి 19 తాళపత్రములు పుల్లరి ఒప్పందానికి చెందినవి. తంగిరాల వెంకటసుబ్బారావు సేకరణలో ఈ తాళపత్ర గ్రంథం సంపూర్ణంగా లభించలేదు. అందువలన ఈ తాళపత్రాలు ఇంతవరకు ప్రచురణకు నోచుకోలేదు. ఇందు కాటమరాజు, నల్లసిద్ధి రాజుల మధ్య పుల్లరి ఒప్పందం ఎలా కుదిరింది, యరగడ్డపాడు యుద్ధానికి దారితీసిన పరిస్థితులు సవివరంగా ఉన్నాయి. అందువలన దీనిని అనుబంధము - IVలో చేర్చడం జరిగింది. జన్నివాడ కథ లేఖకుడు - ఈ తాళపత్ర గ్రంథం చివరన ఇలా వ్రాశాడు -

"పింగళినామ సంవత్సరం భాద్రపద మాసము వరకు జుజ్జవరపు ముత్తయ్య కుమారుండు, సుబ్బాయి వ్రాసిన జన్నివాడ కథ సంపూర్ణం. రాసూరి దశరథం - ముష్టిబండ గ్రామం, దమ్మపేట మండలం, ఖమ్మం జిల్లా వారు ఈ తాళపత్ర గ్రంథాన్ని 1979లో ఇచ్చారు.

పోలురాజు యుద్ధం తాళపత్ర గ్రంథంలో 35 తాళపత్రములు ఉన్నవి. పొడవు 30

సెం.మీ., వెడల్పు 3.5 సెం.మీ. లు తాళపత్రం ఇరువైపులా ఐదు నుంచి ఆరు లైన్లవరకు వ్రాత ఉన్నది. ఇది తెలుగు ద్విపద సాహిత్య గ్రంథం. ఇందులో రచయిత పేరు లేదు. కాని దీని రచనా విధానమును పరిశీలించినట్లైన కనకబండి గట్టయ్య జన్నివాడ కథ, పోలురాజు చరిత్ర వ్రాసిన పద్ధతిలో ఉన్నట్లు తెలుస్తుంది. మోడి గంగయ్య S/o. గురప్ప యర్రబాలెం గ్రామం, దొనకొండ మండలం, ప్రకాశం జిల్లావారు 1988లో ఈ తాళపత్ర గ్రంథాన్ని నాకు ఇచ్చారు.

**భట్టు రాయబారము :**

రచయిత పేరు తెలియదు. ఈ తాళపత్ర గ్రంథంలో 70 తాళపత్రములు ఉన్నవి. 31 సెం.మీ.ల పొడవు, 3 సెం.మీల వెడల్పు. ప్రతి తాళపత్రం ఇరువైపుల ఆరులైన్ల వ్రాత ఉన్నది. లేఖకుని తప్పులు కనిపిస్తున్నాయి. ఇందులో కొన్ని తాళపత్రాలు విరిగిపోయినవి. ఇవి వరుసక్రమంలో లేవు. రాసూరి శేషగిరిరావు, ముష్టిబండ గ్రామం, ఖమ్మం జిల్లా వారు కొమ్ముల వారి నుండి సేకరించి 1981లో నాకు ఇచ్చారు.

**పాపనూక కథ :**

రాంపాక వెంకురాం రచయిత. ఈ తాళపత్ర గ్రంథం చివరలో సాధారణ సంవత్సరం పుష్య బహుళ దశమి నాడు, సింగరాయపాలెం గ్రామస్థుడు రాంపాక వెంకురాం పాపనూక కథను పూర్తి చేసినట్లు ఉన్నది. కాని పాపనూక కథకు చెందిన మరొక తాళపత్ర గ్రంథంలో కదిరి మంగళంచిన బసవయ్య కుమారుడు శేష వాల్మీకుడు రచయితగా కనబడుతున్నాడు. ఇతని అసలు పేరు వెంకటాద్రి. శేష వాల్మీకుడు బిరుదు.

ఈ తాళపత్ర గ్రంథంలో 43 తాళపత్రములు ఉన్నవి. పొడవు 33 సెం.మీ., వెడల్పు 3.5 సెం.మీ. లు. తాళపత్రం ఇరువైపులా ఆరు లైన్ల వ్రాత ఉన్నది. కనకబండి కొండయ్య, భైరవునిపల్లి గ్రామం, నేలకొండపల్లి మండలం వారు పాపనూక కథ తాళపత్ర గ్రంథాన్ని 1975లో నాకు ఇచ్చారు.

పాపనూక కథ - మరొక తాళపత్ర గ్రంథం 1980లో ముష్టిబండ, ఖమ్మం జిల్లా, కొమ్ముల వారు ఇచ్చారు. ఇందులో 70 తాళపత్రములు ఉన్నవి. పొడవు 36.5 సెం.మీ., వెడల్పు 3 సెం.మీ. లు. తాళపత్రం ఇరువైపులా ఐదు లైన్ల వ్రాత కనబడుతున్నది.ఇది తెలుగు ద్విపద సాహిత్య గ్రంథం. కథా వస్తువులో తేడా ఏమీలేదు. ఈ తాళపత్ర గ్రంథం చివరలో సాధారణ సంవత్సర, శ్రావణ అష్టమి, శుక్రవారం నాడు కుందురు వులక్కి పూర్తి చేసినట్లు లేఖకుడు వ్రాసినాడు.

**కాటమరాజు కథ :**
**యరగడ్డపాటి పోట్లాట :**

రచయిత గంగుల పిన యల్లయ్య. కాటమరాజు కథ నెం. డి. 2945 - తాళపత్ర గ్రంథం శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటి ఓరియెంటల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్ తిరుపతిలో భద్రపరచబడింది. ఇందులో 96 తాళపత్రములు ఉన్నవి. ప్రతి తాళపత్రం వైపు ఆరులైన్ల వ్రాత ఉన్నది. దీనిలోనే భట్టురాయబారము, కోటపాటి తాటివృక్షము తెచ్చే కథ మరియు యరగడ్డపాటి పోట్లాట కథలు ఉన్నాయి.

గంగుల పిన యల్లయ్య రచించిన యరగడ్డపాటి పోట్లాట తాళపత్ర గ్రంథం - నూక మదారయ్య, దనియాల గూడెం గ్రామం, ఖమ్మం జిల్లావారు 1978లో నాకు ఇచ్చారు. ఇందులో 42 తాళపత్రములు ఉన్నవి. పొడవు 40 సెం.మీ., వెడల్పు 3.5 సెం.మీ. లు. ప్రతి తాళపత్రం ఇరువైపులా ఏడు లైన్ల వ్రాత ఉన్నది. దస్తూరి అందంగా ఉన్నది. ఇది ద్విపద సాహిత్య గ్రంథం. యరగడ్డపాటి పోట్లాట తాళపత్ర గ్రంథం రచయిత గంగుల పినయల్లయ్య వివరాలు ఇందులో కొన్ని ఉన్నాయి. ఇతడు విష్ణు భక్తుడు. కొమనాల గోత్రము - గంగుల పిన యల్లయ్య, పిన యల్లయ్య తండ్రి సర్వన పినయల్లయ్య సోదరుడు. ఇది తెలుగు ద్విపద సాహిత్యంలో ఉన్నది. కాటమరాజు కథ అవతరణికలో పినయల్లయ్య శ్రీనాథుని వచన పద్ధతిలో యదుశాస్త్రమంతా రచించినట్లు తెలియచేశాడు.

# Epigraphy

Andhra Pradesh Annual Report on Epigraphy 1900, 1919-'20

| | |
|---|---|
| Andhra Pradesh Government Report on Epigraphy for 1965, 1966. | Edited by **Dr. Venkataramanaiah,** The Government of Andhra Pradesh, Hyderabad, 1968. |
| Annual Report on Epigraphy, 1967. | Edited by **P.V. Parabrahma Sastry,** The Government of Andhra Pradesh, Hyderabad, 1975. |
| Copper Plate Inscriptions of Andhra Pradesh. Vol. 1 | Edited by **N. Rameshan,** Government Museum, Hyderabad, 1962. |
| Nellore District Inscriptions Part - I & II | Edited by **Alan Butterworth** and **Venugopala Chetty** Madras, 1905. |

## Kaifiyats (Local Records)


Pattapuravi Kaifiyat — Meckenzie Manuscripts R.No. 1126, Mauje Pattapuravi, Doguru Narsappannayanipeta, State Archives.

Rana Tikkana Kaifiyat — Descriptive Catalogue of Telugu Dvipada works Veturi Prabhakara Sastry State Archives.

Siddavatam Kaifiyat — Kumbagiri Siddavatam State Archives.


## Manuscripts


Agumanchi Charitra No. 1599 — Sri. Venkateswara University Oriental Research Institute, Tirupati, A.P.

Kariyavula Katamaraj Charitra No. 6702. — Sri. Venkateswara University Oriental Research Institute, Tirupati, A.P.

Valuraj Yuddam R.No. 642. — Sri. Venkateswara University Oriental Research Institute, Tirupati, A.P.


## Edited Works


Ekamranatha — Prataparudra Charitra. Edited by Dr. C.V. Ramachandar Rao, Andhra Pradesh Sahitya Akademi Hyderabad-4, 1984.

Ketana Kavi — Dasakumara Charitra. Edited by Chandramouli Sastry, Andhra Pradesh Sahitya Akademi Hyderabad-4, 1967.

